Vijnanavallika Grandhamala Series No. 19

# THE History of Vidyanagaramu.

*BY*

SEERIPI ANJANEYULU
Telugu Pandit
Govt. Secondary & Training School for Women,
&
Secretary, Upadhyaya Panditha Parishath, for Anantapur Dt.
ANANTAPUR.

with a preface by

P. NARAYANA GOWD, M., A. B. Sc. [Edin]
Lecturer, Ceded Districts College, Anantapur.

*Published by*
Vijnanavallika Grandhamala
ANANTAPUR.
1928.

Printed at Sri 'Sadhana' Press, Anantapur

 {Price Rs. 2




# ప్రధాన పోషకులు

1 ఇ. జేటి సీతారామరావు పంతులుగారు బి. ఏ., బి. ఎల్.,
ఎక్స్ దివాన్ పుంగనూరు; హైకోర్టు వకీలు మదనపల్లె.

2 రాయసం సాహెబు మిడతల హంపయ్యగారు గుంతకల్లు.

3 యస్. చిన్నపరెడ్డిగారు ఇల్లూరు.

4 కె. సుబ్బారెడ్డిగారు తంమెల

*5 కె. చిన్నాప రెడ్డిగారు పెద్దవడుగూరు.

*6 పాణెము తిరుమలప్పగారు గుత్తి.

7 పి. కృష్ణారెడ్డిగారు చీమలనాగపల్లె.

8 కరణము చిక్కణ్ణప్పగారు కల్యాణదుర్గము.

9 ఆవుల పెద్దకొండారెడ్డిగారు ఆత్మకూరు.

10 మారనేని చిన్న వేంకటపతి గారు నిడిగల్లు.

# అభిమానులు.

1 జి. లక్ష్మణరెడ్డిగారు ప్లీడరు గుత్తి అనంతపురము జిల్లా.

2 మాదాను పెద్దగంగప్పగారు తాడిపత్రి.

4 కనేకల్లు హుస్సేన్ సాహెబ్ మహమ్మదు హాషిమ్,
సాహెబుగారు కల్యాణదుర్గము.

4 పాటీల్ తిమ్మారెడ్డిగారు గుంతకల్లు.

5 లక్కా నారాయణరెడ్డిగారు కనేకల్లు, బళ్ళారి జిల్లా.

8 లక్కా వేంకటరెడ్డిగారు కనేకల్లు ,,

## ప్రకాశకుల విజ్ఞప్తి.

—(౦)—

ఈయేఁట మా గ్రంథమాలా పోషకవర్గమునఁ జేరి మమ్ముఁ బ్రోత్సహించిన శ్రీ యింజేటి సీతారామరావుగారికిని నభిమానులుగఁ జేరిన మద్దలచెరువు అ. వెంకటరామయ్య ప్రభృతులకును మేముఁ గృతజ్ఞులము.

అడుగుట తడవుగ తమకడనుండిన పంపాశిథిలముల చిత్రముల నొసఁగి తమ యవ్యాజవాత్సల్యమును సహాయౌదార్యమును బ్రకటించిన దేశనాయకచూడామణులును స్వరాజ్యపత్రికా సంపాదకులును నగు బ్రహ్మశ్రీ టంగుటూరి ప్రకాశము పంతులు యం. యల్. ఏ. గారికిని, బొంబాయి తెనుఁగుసమాచారపత్రికా సంపాదకులగు శ్రీ శంకరశాయన్న పర్షాగారికిని ( Sreejith Shankar Sayanna Parsha Garu, Editor, Telugu Samachar) శ్రీమాన్ యం. కె. రంగస్వామయ్యంగారు బి. ఏ. యల్. టి. గారికిని మా నిండుకృతజ్ఞతను దెల్పుచున్నారము.

మా యీకృషి యాంధ్రపాఠకమహాశయుల యభిమానమునకును నాదరాతిశయమునకును బాత్రమగునేని మేమెంతయు ధన్యులము.

ఇట్లు,
సీతమ, సావిత్రమ్మ.

ఈగ్రంథములోని పటములసూచిక.

——(౦)——

## —♦ పీఠిక ♦—

బాల్యమునుండి చరిత్రపఠనమున నాకుఁగలప్రీతి యగ్గలము. అందు విద్యానగరచరిత్రముఁ జదువుట యందును—అమ్మహాసామ్రాజ్యమున కొకప్పుడు రాజధానిగనుండి, సర్వసంపదలకు నిలయమై, ప్రపంచముననే యద్వితీయనగరరాజముగ వెలసి, యిపుడుగాపుమాసి యున్న శిథిలభాగములలో, నందందు శేషించియుండు నాఁటిశిల్పకళావైచిత్ర్యము నెఱుంగుటయందును—నెక్కుడుగఁ గుతూహలము గలవాఁడను. విజయనగరచరిత్రాంశములను మనన మొనర్చునప్పుడును ఖిలభాగములఁగాంచునప్పుడును దదీయసామ్రాజ్యచరిత్రము సమగ్రముగ మాతృభాషలో వ్రాసి, యాంధ్రలోకమునకు సమర్పింపవలయు ననెడు నుత్సాహము, నాలో నత్యధికముగఁ బెరుఁగుచుండినది. మొనమొన్న కీర్తిశేషుఁడైన యానెగొంది ప్రభుఁడు, శ్రీరాజారంగదేవరాయఁడు జీవించియున్న సమయమున (1916లో), నాన్నపుఁడు నాయీసంకల్పమెఱిఁగి నన్నుఁ బిలిపించుకొని, జీర్ణనగర సందర్శనసమయమునఁ బదిదినములు నాకుచితసౌకర్యములు గల్గించుటయేకాక, తనకడ నురుదుభాషలోనుండిన యానెగొంది రాయవంశజుల సంక్షేపచరిత్రమును నార్వీటివంశవృత్తాంతమును నాకనుగ్రహించియుండెను; కాని యనుకొనినట్టుల చరిత్రరచనమునకు మాత్ర ముపక్రమించినవాఁడనుగాను.

కడచిన డిసెంబరు సెలవులలో మా యున్నత పాఠశాలా విద్యార్థినులతోడను దత్పాఠశాలా ప్రధమోపాధ్యాయిని శ్రీమతి ఎ. కోటమ్మ బి.ఎ.,ఎల్.టి., గారితోడను సల్పిన నామైదవయాత్ర, వెనుకటి సంకల్పము నచిరకాలముననే కార్యరూపమున నుంపనన్నుఁ బ్రేరేచెను. అందుచేఁ గడచిన మకరమాసమున, నేను శృంగునిమల పవిత్రమునందలి యాంజనేయస్వామి కొండపై వసించి యున్న సమయమున, దీనివ్రాసి ముగించితిని. నా యీ చరిత్రరచనమున కచ్చటి పవిత్రప్రశాంతక్షేత్రావాస మెక్కుడు సహాకారమయ్యె ననఁదగును.

ఈచరిత్ర నిర్మాణమున శ్రీరాజారంగదేవరాయఁడు దయాపూర్వకముగ నొసఁగియుండిన యంశములు, నాంగ్ల చరిత్రగ్రంథములు, ౧౪—౧౬ శతాబ్దములలో విద్యానగరమున వెలసిన సంస్కృతాంధ్ర ప్రబంధపీఠికలు, చాటువులు, శాసనములుఁ, గొల్లలుగ నాకుఁదోడ్పడినవి. ఈసాధనసామగ్రితోఁ జరిత్రసౌధము నిర్మించుటలో దాని కొకచక్కని స్వరూప మేర్పఱచుటకంటె నేనతిశయముగసల్పిన కైంకర్యవిశేష మేమియునులేదు. ఆంగ్ల చరిత్రములందుఁ గొన్నింటిని గొన్ని కొన్ని పట్టుల సంక్షేపపఱచియుఁ, గొన్నితావుల విపులపఱచియుఁ,గొన్ని యెడల యథాతథముగ ననువదించియు, సీగ్రంథమున సందర్భానుసారముగఁ జొప్పించినాఁడను. చరిత్రపథమున నచ్చటచ్చట ముండ్లతొడుగులవలె నడ్డుదగులుచుండిన

కొందఱివిపరీతాశయములను నిర్దాక్షిణ్యముగ ఖండించులో, నేను త్రొక్కిన స్వేచ్ఛకై, వెనుకటిచరిత్రరచయితలు నను క్షమింతురుగాక.

ఈగ్రంథ రచనమున నాకుఁదోడైనట్టియు నేను కృతజ్ఞత తెలుపఁదగినట్టియుఁ బ్రబంధనామముల నాయా యెడలఁ జేర్కొనియే యున్నాఁడను. తత్కావ్యకర్తలకును ముఖ్యముగ నారచనమున కెక్కుడు మార్గదర్శకములైన గ్రంథనిర్మాతలగు ఎ. ఎచ్. లాంగర్ష్టదొర-డబ్ల్యు ఫ్రాన్సిస్‌దొర, పి. సూర్యనారాయణరావుగార్లకును, గడుఁగృతజ్ఞుఁడను. దీనిని సాకల్యముగ నొక్క పర్యాయము తిలకించి, యుచితములైన సలహాలనొసఁగిన నాబాల్య మిత్రులగు శ్రీమాన్ పి. రామాచార్యులవారి యెడలను, గ్రంథముద్రణమున నెక్కుడుగఁదోడైన శ్రీరాళ్ళపల్లె రామకృష్ణమాచార్యులవారి యెడలను, నీకృతినిఁ బరమాదర భావమున విమర్శించి భూమిక వ్రాసియిచ్చిన, శ్రీయుతులు పాణెము నారాయణగాడు ఎమ్. ఎ, బి. ఎస్‌సి (ఎడింబరో); గారియెడలను, నేనెంతయును గృతజ్ఞుఁడనయి యున్నాఁడను.

ప్రమాదము లెట్టివారికైన సహజమన నిఁక నా వంటికించిజ్ఞుని విషయమున నుడువఁబనిలేదు; గాన నుదారహృదయులగు విమర్శకు లట్టిపొరపాట్ల నెఱింగింతురేని, వానిని గృతజ్ఞతతో సవరించుకొన సంసిద్ధుఁడను.

గ్రంథకర్త.

# FOREWORD.

In placing this interesting book before the reader the author has done a real service to the Telugu speaking public and a valuable addition to Telugu literature. Until very recently it has been, more or less, a general practice with Telugu writers to select themes of idealistic import or mythological orgin and dwell upon them at length without paying much attention to historical accuracy or life's realisms. As a result we have a large collection of works, ranging from a mere prosaic novel type to one of subtle and sublime poetry, but very few of them can be rescued from the charge of historical inexactitude. This is mentioned here not with a view to deprecate the value or utility of these works, but only to point out that writings of any great historical value have not been forthcoming owing either to a lack of interest on the part of our authors to such works, or, which seems to be the more probable reason, to a more liberal interpretation of history as being "something really worth knowing, far more so than the scandals of courts or the butcheries of

nations". Whatever the reason the fact remains that historical works are few and far between in Telugu literature. This book, therefore, concisely dealing with the past history of the famous Vijayanagar dynasty and the present state of the ruins of the once renowned capital and its suburbs, comes in now as a new and desirable departure from the old and beaten track of literary writing.

Although living within the four walls of their once famous Vijayanagar Kingdom, the generality of the Telugus hardly know anything of the origin, the brilliant expansion and the rapid downfall of this "Never-to-be-forgotten Empire". The meagre description of some of the events that may be gathered from the writings of those days is not sufficient to give a comprehensive and connected historical survey The books written in English dealing with the fortunes of this Empire are within the reach of the English knowing populace only; while the records of contemporary courtiers and ambassadors, being in foreign languages, are much less useful to the man in the street. This gap which has so long existed, except for a short sketch by the late Mr. K. V. Lakshmana

Rao M. A, in his "Mahammadiyamahayugam", is now filled by this book, which essays to present the features characteristic to all the above writings and records in a condensed form within the space of 374 octavo pages.

Nor is this all. • The book being the result of a good deal of travel and labour embodies some distinct features of its own. It gives detailed information regarding the duration and succession of reigns, corrects some false notions hitherto held or expressed by interested writers, and generally presents a most plausible view of events and affairs of the day. On account of these peculiarities there is no doubt the book will amply repay reading even by High School and Collegiate students. It is particularly suited to High School classes not only because the adolescent youths may be expected to form their character in the light of the exemplary lives of the numerous heroes depicted therein, but also in view of the present day tendency to impart instruction and conduct examinations in the Vernacular.

**P. Narayana Gowd, M. A, B. Sc. (Edin)**
*Lecturer, C. D. College,*
ANANTAPUR.

# పండితాభిప్రాయము.

విద్యానగర సామ్రాజ్యమ్ము నిక్కంపుఁజరిత్ర మిప్పుడుగదా యాంధ్రలోకమున కబ్బినది. విజయనగరచరిత్రము నింతకుముందుఁ బలువురు పలుభాషల-యందు రచియించియున్నారు; కాని, విషయవిపులముల-య్యు నందుఁ బెక్కు లన్యభాషానిబద్ధము లగుటంబట్టి తెలుఁగువారల కందఱకు నందుబాటునందు లేకున్నవి. కొన్ని చాలవఱకు రచయితల యూహాకల్పితములగుట నాకాశహర్మ్యము లనఁదగియున్నవి. ఇంకఁగొన్ని పక్ష-పాత నీరదావృతములయి సత్యచంద్రికా ప్రసారమున కెడమీయకున్నవి. ఇట్టి లోదవిన కోదవలనెల్ల నీ చరి-త్రము తొలఁగించుచున్న దనుట యథార్థ కథనము.

శ్రీయుతులు సాహిత్యసరస్వతి సిరిపి ఆంజనేయులు గారు సమగ్రమగు సామగ్రిని సేకరించి సందిగ్ధవిషయముల

పట్ల సునిశితమగు తమ హేతువాదశక్తి నుపయోగించి, యుక్తియుక్తముగ సిద్ధాంతముల నేర్పఱచుచు రసోత్తరమగు నట్టిచరిత్రమును జతిగించిరి. ఇయ్యది సామాన్య దేశచరిత్రములవలె రాజకీయ సంస్థలు, యుద్ధ కారణములు, యుద్ధములు, యుద్ధరంగములు, పాల్గొన్న పక్షములు, నానాయుద్ధముల కాలములు, తత్పర్యవసానములు మున్నగువానిని మాత్రము వర్ణింపక, విద్యానగర సామ్రాజ్యమును బాలించిన రాజవంశ చతుష్టయమునందలి యొక్కొక వీరవరుని కాలమున సామ్రాజ్యమునఁ గల్గిన విశేష విషయములు, ఒక్కొక వీరవరేణ్యుని విక్రమవిలసితములు, సాహసౌదార్యములు, విద్యాగోష్ఠి, స్వాశ్రిత రక్షణము, స్వార్థత్యాగము మున్నగు సుగుణగణముల వెల్లివిరియించుచున్నది.

'మహనీయులజీవితములును, దేశచరిత్రములును బరస్పరావలంబనము'లని యభిజ్ఞులు వచింతురు. ఈ సూత్రము ననుసరించి శ్రీఆంజనేయులుగారు విద్యానగర వీరుల చరిత్రములతో సామ్రాజ్య చరిత్రమును మేళగించి యతిహృద్యముగ నీ చరిత్రమును సంతరించిరి.

దేశాభివృద్ధికి స్వదేశవీరుల చరిత్రములఁజదువ నత్యావశ్యకము. జపానుమున్నగు నితర దేశములందెల్ల స్వదేశ వీరచరిత్రములు విద్యార్థుల కాదినుండియు నభ్యసనీయములగ నుండును. మొన్న మొన్న శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు 'ఆంధ్రవీరుల చరిత్రము' రచించు వఱకు నాంధ్రదేశవీరుల సమాచారమే యాంధ్రులలో ననేకులకుఁ దెలియకుండె ననుట సత్యదూరము కాదు. స్వదేశ వీరవిక్రమ విలసితంబులగు నిట్టి పుస్తకములను బఠియించుటచే నాంధ్రవిద్యార్థుల మనముల నూతనోత్తేజము గలుగఁగలదనుటకు సందియము లేదు.

ఒక్క వీరవరుల చరిత్రమే గాక, ఆయాయి రాజేంద్రుల కాలమున విలసిల్లిన పండితులయు, కవులయు, చరిత్రములు నిందు మనోహరముగఁ బొందుపఱుపఁ బడియున్నవి. విద్యానగర సామ్రాజ్యకవులలో విక్రమార్క చరిత్రమును రచించి ప్రఖ్యాతివడసిన జక్కన సైతము చేర్చుటయుక్తము.

ఇందలిభాష సలక్షణమై, మంజుళమై, సుమనోహరమై, జాతీయములతో నిండి, గంగాఝరివలె ననర్గళ

విద్యానగర చరిత్రము.



ఆంధ్రభోజుండును రాజపరమేశ్వరుండునునగు శ్రీకృష్ణదేవరాయుండు.

# -• విషయసూచిక •-

## విద్యానగర
## సామ్రాజ్య చరిత్రము.
### పూర్వభాగము.

(క్రింది సంఖ్యలలో మొదటిది ప్రకరణమును రెండవది పుటను దెల్పును)

### I వనచర వంశము.



### II రాయలవంశము

## III సంగమ వంశము 29

## పరిష్కృత శిథిల భాగముల చరిత్రము.

### ఉత్తర భాగము.




౧౫వ శతాబ్దములో
దక్షిణ హిందూదేశము.

# విద్యానగర చరిత్రము.



## మొదటి ప్రకరణము.



### I. వనచరవంశము

#### కిష్కింధ - రామాయణయుగము

##### 1. ఆనెగొంది—విద్యానగరసామ్రాజ్య బీజము.

అతిత్వరితగతి నభివృద్ధిఁజెంది యచిరకాలముననే క్షీణదశనుగాంచి యస్తమించిన రాజ్యములలో విద్యానగర సామ్రాజ్యమొకటి. రమారమి మూఁడువందల సంవత్సరము లీరాజ్య మతివైభవమున మెఱసెను. జనశూన్యమై వనసత్త్వములకు నిలయమై జీర్ణమందిరములతోడను-రాచనగళ్ళ పునాదులతోడను-నేలసమములైన గృహవాటికలతోడను - మహారణ్యసదృశముగ నిప్పుడు కన్పట్టుచున్న విద్యానగర మాపేరున వెలసిన సామ్రాజ్యమునకు ముఖ్యపట్టణముగానుండి, యొకప్పుడు ప్రపంచమునందలి పట్టణరాజములలో నెల్ల సర్వవిధముల నగ్రగణ్యమై, కడుఁబ్రఖ్యాతిఁగాంచిన నగరావతంసము. ఈ

నగరమును నిందలి వివిధభాగములను వర్ణింపఁగడంగుటకుఁ బూర్వము, దీనియుత్పత్తికి మూలాధారమై కిష్కింధ యనఁ బ్రసిద్ధినొందిన యానెగొందినిగూర్చియు, ననంతరము వెలసిన విద్యానగర సామ్రాజ్యమును గుఱించియు సంక్షిప్తముగ ముచ్చటించెదము.

### 2. ఆనెగొంది—కిష్కింధ.

ఆనెగొంది, తుంగభద్రానది కుత్తరపుటొడ్డున, మాల్యవంత ఋశ్యమూక మాతంగాంజన పర్వతశ్రేణి కావలివైపున, నాగలాపురమున(హాస్పేట) కీశాన్యమున నేడుమైళ్ళ దూరమున, నైజామురాష్ట్రములో నున్నది. విద్యానగర నిర్మాణకాలమునాఁటికి దాదాపు మూఁడు వందల సంవత్సరములకుఁ బూర్వమునుండియు నీ యానెగొంది సంస్థానము ప్రబలవిఖ్యాతి నందియుండినట్లు చరిత్రము నుడువుచున్నది; కాని దీనిని నంద - చాళుక్య - విజయధ్వజాదిరాజులు రాజధానిగఁ జేసికొనుట కనేక శతాబ్దములకుముందే రామాయణకాలమునుండి,యిచ్చట నొక సుప్రసిద్ధ పట్టణము వెలసియుండెననుట, జనశ్రుతి వలనను బ్రాచీనకావ్యప్రపంచము వలనను దెలియ వచ్చెడుసంగతి. పంపకుసమీపమునఁ గిష్కింధయను నగరమొకటి సమస్త వస్తువితానమునకు సదనమయి యుండెను. ఇది, రామాయణమహాకావ్యమున వర్ణితములైన ఘట్టముల నాధారముగఁగొని, జనులందఱును విశ్వసించెడు విషయము. పైనఁ బేర్కొనిన యానెగొంది

పోలిదియే. ఆనెగొందియన నేనుఁగు(చొఱఁగల)సందు; అనఁగాఁ గిష్కింధాస్థానము.

### 3. వాలి పదోత్పత్తి.

రామాయణయుగమున వాలి సుగ్రీవు లనఁబడు వనచరనాయకుల పరిపాలనమునఁ గిష్కింధ యుండినది. వాలి, తనతమ్ముఁడగు సుగ్రీవునిభార్యను నాతని సర్వసంపదలను హరించి, పురమునుండి యాతని వెడలనడఁచుటయకాక, సోదరునిప్రాణములు గొనుటకుఁగూడఁ బ్రయత్నించెను. సుగ్రీవుఁ డందులకు వెఱచి, తనమంత్రి యగు నాంజనేయునితోఁ బాఱిపోయి, పంపాసరోవర సమీపమునందలి ఋశ్యమూకము చేరెను. భయంకర తపోసిధియగు మతంగమహర్షి యాశ్రమమునకుఁ జేరువనే యీ ఋశ్యమూకపర్వత మున్నది. వాలియొకప్పుడు 'దుందుభి'యను రాక్షసుని మల్లయుద్ధమునఁ బొలియించి యాతని కళేబరము దూరమునఁబడఁ గాలఁజిమ్మెను. ఆ కాయము వాయుపథమునఁ బోవునెడ దానినోటినుండి యురలిన నెత్తుటి తుంపరలలోఁ గొన్ని మతంగాశ్రమమునరాలినవి. మతంగుఁ డందులకుఁగినిసి, యాకళేబరము నిట్లు చిమ్మినవాఁ డీపర్వతమును సమీపించుట తడవుగ నుసురులఁదొఱఁగునని శపించెను. ఈ హేతువున నది వాలికిఁ జొఱరానిదయ్యెను; గాన నమాత్య భృత్యులతోడ సుగ్రీవుఁడందు సురక్షితముగనుండుట సంభవమైనది.

## 4. సుగ్రీవుఁడు పట్టాభిషిక్తుఁ డగుట.

శ్రీరాముఁడు సీతనుగోల్పడి, యామె నన్వేషించుచు, లక్ష్మణసహితుండయి ఋశ్యమూకపర్వతముఁ జొచ్చి, యాంజనేయునితోడ్పాటున నందు వసించియున్న సుగ్రీవునితోడఁ జెలిమి సలిపెను. లంకాధినాథుఁడగు రావణుఁడు జానకీదేవి నాకాశమార్గమున బలాత్కారముగఁ గొనిపోవుటయు సీత తన రత్నాభరణములనెల్లఁ బైటచెఱఁగున ముడిచి తామున్న యెడ దిగవిడుచుటయు, సూర్యపుత్త్రుఁడు శ్రీరామదేవునకుఁ బూసఁగుచ్చినట్లు విన్నవించుచుఁ, దాను గుహయందు దాఁచియుండిన యామూటను గుఱుతుచూపి, రామవిభునకు సమర్పించెను. ఆసందర్భముననే తాను రావణసంహారమునకుఁ దోడ్పడెదననియు దాశరథికి మాటయిచ్చెను. రఘువీరుఁడందులకుఁ గృతజ్ఞతాసూచకముగ నాయినతనూజునకుఁ బ్రబలవిరోధియగు వాలినిఁజంపి, కిష్కింధకా వనచరనాథుని (సుగ్రీవుని) రాజుగానొనర్చెను. పిమ్మట వనచరసేనతో సముద్రము దాఁటువఱకు శ్రీరాముఁడు మాల్యవంతాచల శ్రేణిలోని ప్రస్రవణపర్వతమున వేచియుండెను.

## 5. కిష్కింధయే యానెగొంది.

ఆనెగొందికిఁ జుట్టుప్రక్కలఁగల ప్రదేశ నామములు, రామాయణ కథాసరణిలోఁ గిష్కింధానగర పరిసరప్రాంతములఁ జేర్కొనిన స్థానములకు, గ్రామము

తప్పక సరిపడియున్నవి. అట్టి రంగములలో పంపాసరో వరమొకటి. ఇది నైజాముప్రాంతమున నానెగొందికిఁ బశ్చిమభాగమున నొకటిన్నర మైలు దూరమునందు, తుంగభద్రానదీతీరమున నున్నది. తుంగభద్రకుఁ బ్రాచీన వ్యవహారనామము పంపాప్రవంతియనుట సిద్ధము. ఋశ్యమూకముగూడ నైజాముమేరలోఁ బంపాసరస్సునకు సమీపముననే వెలయును. మాతంగము పంపాపుర మునకుఁ బ్రాగ్భాగమున సరమైలుదూరమున నుండు గోత్రరాజము. సుగ్రీవుఁడు వసించియున్న గవి యిందే కాననగును. రావణుఁడు చెఱఁగొనిపోవు సమయ మున నీగుహాద్వారమున సీతాదేవి పైఁటచెఱఁగు జీరా డినగుర్తు నేఁటికిని యాత్రాపరులు పరమభక్తితోఁ దిల కించుచు, రామాయణమునందలి విచారకరఘట్టమును స్మృతిపథమునకుఁ దెచ్చికొని, సంతప్తహృదయు లగు చున్నారు. జానకీ రత్నభూషణము లా కందరమునందే యుంపఁబడి యుండెనను జనశ్రుతి యిప్పటికినినున్నది. మాల్యవంతాచలమునకుదాఁపుననున్న నింబాపురమునందలి బూడిదకుప్ప నచ్చటివారు వాలి భస్మరాశియనియందురు. మాతంగగిరీప్రాంతముననే యంజనిపర్వతము నయిత మగుపడును. మాతంగాద్రికిఁ దూర్పున మాల్యవంత శైలమున్నది. దుందుభిచే మధువుహరింపఁబడి మహా నిష్పుటముగ వెలసిన 'మధువన'మను స్థల మీామల కుత్తర పార్శ్వమున నరమైలుదూరమునందు తిమ్మప్పగుట్టల వరు

సకును కాంపిల్యనగరమార్గమునకును నడుమఁ గన్పట్టును. ఇచ్చటి కొండము వలును - శోణముఖవానరములును - వాలి సుగ్రీవుల సంతతికిఁ జెందినవనుట యాప్రాంత వాసుల నమ్మకము. అందందుఁ గుప్పలు కుప్పలుగఁ బడియున్న తాలతిప్పలగమి, హనుమానుఁడు సేతుబంధనమునకై సేకరించియుంచిన శిలోచ్చయముల నిలువభాగమఁట. ముఖ్యముగ నాప్రాంతవాసు లాంజనేయుని నింటిదైవముగ నెంచి పూజింతురు. ఇచ్చటి జనులలోఁ బెక్కండ్రు హనుమంతునినామమే ధరించుచున్నారు.

---

# రెండవ ప్రకరణము.

## II. ఆనెగొంది రాయల వంశము.

జంబుకేశ్వరుడు

### 1. ఆనెగొంది పూర్వ రాజుల వృత్తాంతము.

జంబుకేశ్వరుని చరిత్రము గ్రహించుటకుఁ ముందుగ నాతని పూర్వులనుగూర్చియు వారితో ముఖ్యముగ సంబంధముగల మహమ్మదీయుల దక్షిణదేశ మాక్రమణమును గురించియుఁ దెలిసికొనుట యావశ్యకము.

క్రీస్తుశక మేడవశతాబ్దమునుండియే యానెగొంది యొక రాజాశ్రయస్థానమై వెలయుచుండెనని పారసీక దేశస్థుఁడగు ఫెరిస్తా తెల్పుచున్నాఁడు. నేఁటికి రమారమి తొమ్మిదివందల యేండ్లనుండి హిందూప్రభువు లానెగొందికి పాలకులుగ నున్నారు. మొన్న మొన్నటి దాఁక నానెగొందీశ్వరుఁడుగ నుండి, యావలఁ గీర్తిశేషుఁడైన రాజా రంగదేవరాయఁడు మా కొసఁగియుండిన రాయ వంశావళిని బట్టి, యానెగొంది పూర్వరాజుల వృత్తాంతమిందు వివరించెదము.

## ౨. మూఁడువందలయేండ్ల చరిత్ర.

౧. నందుఁడు— రాయలవంశము నందమహారాజుతోఁ బ్రారంభము నొందినది. ఇతఁడు క్రీ. శ. ౧౦౧౪ నుండి ౧౦౭౬ (శా. శ. ౯౩౬ నుండి ౯౯౮) వఱకు రమారమి యఱువదిమూఁడుసంవత్సరముల కాల మవిచ్ఛిన్నముగ రాజ్యపాలనము చేసెను. ఈతఁడు రాజ్యమును విస్తరముగావించి ధన మపరిమితముగఁ గూర్చుచుఁ,దనపేర 'నందగిరి'యను నొక నవీనపట్టణము నయితమునిర్మించెను.

౨. చాళుక్యుఁడు— నందరాజు కుమారుఁడగు చాళుక్యుఁడు మహాసమర్థుఁడై, క్రీ. శ. ౧౦౭౬ నుండి ౧౧౧౭ వఱకు నలువది సంవత్సరములకాలము నిరపాయముగఁ బ్రజలఁ బాలించెను. ఈపార్థివునకుఁ దన దేవేరివలన ముగ్గురుకుమారులు గల్గిరి. కల్యాణపురము నాక్రమించి, దానిని రాజధానిగ నొనర్చికొని రాజ్య మేలుచు, 'కల్యాణబిజ్జలుఁ'డని బిరుదుఁగాంచి, యచ్చట నొకవంశమునకుఁ గర్తయైన బిజ్జలమహారాజే చాళుక్యుని ప్రథమపుత్త్రుఁడే.

౩. విజయధ్వజుఁడు—ద్వితీయుఁడు తండ్రియనంతర మానెగొంది సింహాసనాసీనుఁడయి, ౧౧౧౭ నుండి ౧౧౫౬ వఱకు రాజ్యవ్యవహారములను మిగుల నేర్పుతో నిర్వహించిన విజయధ్వజుఁడు. మహమ్మదీయుల దండయాత్ర తఱచు సంభవ మగుచుండుటచే నీనృపుఁడు

౧౧౫౦ వ సంవత్సర ప్రాంతమున, తుంగభద్రానదికి దక్షిణపుటొడ్డున నవీననగరమొండు నిర్మించి, దానికిఁ జుట్టు నావరించియున్న పర్వతమాలికలతో బలాఢ్యము లును బరిపంథిరాజుల కభేద్యములును నగు నున్నతప్రాకారములను గట్టించి, యానూతన • నగరమునకు 'విజయ పట్టణ'మని పేరుపెట్టి దానినిరాజధానిగ నొనర్చుకొనెను. ఈపురికి తుంగభద్రానది యుత్తరపుటెల్లగ నేర్పడుట వలన, నుత్తర హిందూస్థానమునుండివచ్చు సుల్తానులకది యవిలంఘ్యమయ్యెను. ౧౧౫౦ లోఁ బుట్టిన యీ పుట భేదనము చాలఁ జిన్నదైనను, ౧౩౩౬ వఱకుఁ గొంత కొంతగఁ గ్రమాభివృద్ధి నొందుచునేయుండెను. విజయ ధ్వజుఁ డద్వితీయ పరాక్రమాన్వితుఁడై ముప్పది సంవత్సర ములు రాజ్యపాలనముచేసెను. చాళుక్యుని మూఁడవ కుమారుఁడగు విష్ణువర్ధనునిఁ గూర్చి గానవంశావళి యం దేమియుఁ గన్పడదు; కాని యాతఁడు తనజీవితకాలమున నగరజులవలన ధనరూపమగు సాహాయ్యముఁ గొంత పొందుచుండినట్లు, సూవెల్ - పెయిస్ - మెకంజి మున్నగు వారు నుడువుచున్నారు.

౪. నరసింహరాయఁడు—విజయధ్వజునకుఁ బి మ్మట నాతనిపుత్రుఁడగు వేమన సింహాసనమునకువచ్చి, ౧౧౫౬ నుండి ౧౧౭౬ వఱకు రాజ్యపాలకుఁడుగ నుండెను. అనంతర మాతని తనయుఁడు నరసింహదేవరాయఁడు ౧౧౭౬ వ యేఁట మూర్ధాభిషిక్తుఁడయి, ౧౨౪౬ వ సం

వత్సరమువఱకు నలువదియేడేండ్లు నిరంతరాయముగఁ బ్రజాపరిపాలనముఁ గావించెను. ఈతఁడప్రతిమాన వీరుఁడై పోయినచోట్లనెల్ల విజయలక్ష్మినే వరించుచు, బహుకాలము రాజ్యమేలుటవలనను, నప్పటిరాజ్యాంగ నియమములు క్రమపద్ధతి నుంచుటంజేసియు, నీతని కాలమున రాజ్యము మిగులవిస్తరించెను. ఈతఁడు నూతన రాజధాని నన్నివిధముల వృద్ధినొందించి, దాని నత్యంత శోభాయమానముగ నొనర్చిన ఘనుఁడు. ఈ రాజసింహుఁడు ప్రచండప్రతాపుఁడును ప్రతిభటభయంకరుఁడును నయి, యెదురులేని మగంటిమిచేఁ దనసామ్రాజ్యము నన్నికడల సమానముగ వ్యాప్తినొందించి, మింట నుంచిన దివ్వెవలె వెలింగెను. ఈ హేతువున నాతని రాష్ట్రము 'నరసింగరాష్ట్ర'మని పేర్వడసెను. ఇది కారణముగ ఖండాంతరవాసులు దీనికిఁబిమ్మట వెలసిన విద్యానగర సామ్రాజ్యమును గూడ నరసింగరాష్ట్రమనియే పేర్కొనిరి. అనుదినమిట్లు పెంపెసలారుచున్న యీ నరసింహరాష్ట్రాభివృద్ధిని గాంచియు, దాని వైభవగాంభీర్యసమృద్ధినిగుఱించియు,నన్యదేశీయులగు తురుష్కులిత్యాద్భుతసరణిఁ గథలుగఁ జెప్పుకొనఁ దొడఁగిరి. ఇట్లు విశేషప్రాభవమునను నైశ్వర్యమునను విజ్ఞానమునను శోభిల్లుచున్న విజయపురీరాజ్యరమను దురుష్కరాజులుగాంచి, తమకమునొంది, యెప్పుడెప్పుడు దానికించుకయొత్తిడిని గల్గింప దొరకొనిరి.

## 3 దక్షిణదేశ విభాగములు

పదుమూడు పదునాల్గు శతాబ్దముల మధ్యదినములలో దక్షిణహిందూస్థానమంతయు నెనిమిది ఖండములుగ విభజింపబడియుండెను. అవి, మహారాష్ట్రము-త్రిలింగ(కాకతీయాంధ్ర) సామ్రాజ్యము - హొయిసల (మైసూరు)దేశము — కర్ణాటకము(కుంతలము) — కటక రాజ్యము . తూర్పుతీరప్రాంతము — చోళపాండ్యరాష్ట్రములు. వీనికి వరుసగ దేవగిరి, ఓరుగల్లు, ద్వారసముద్రము, ఆనెగొంది, కటకము, ఉదయగిరి, కాంచీపురము, మధురాపురములు రాజధానులయి యుండెను. ఆ సామ్రాజ్యములలో మహారాష్ట్రమును రామదేవుడును, త్రిలింగమును ప్రతాపరుద్రదేవ చక్రవర్తియు, హొయిసలదేశమును బళ్ళాలరాజులును, కర్ణాటకము (కుంతలము)ను రాయవంశజులును, కటకమును గజపతులును, తూర్పుతీరప్రాంతమును రెడ్డిరాజులును, చోళపాండ్యరాష్ట్రములను చోళరాజులు పాండ్యనృపతులును పాలించుచుండ, పెక్కేండ్లు మహమ్మదీయ చక్రవర్తులను నర్మదానది కావలినైపుననే యడ్డగల్గిరి.

## 4. మహమ్మదీయాక్రమణము

౧. ముసల్మానుల హావడి— రమారమి ౧౩౧౦వ సంవత్సరప్రాంతమున దక్షిణహిందూదేశమునం దుపద్రవమును నత్యంతవిస్మయావహమునునగు పరిణామముగ నైను. ఇది దక్షిణాపథచరిత్రమునం బ్రధానములగు విషయ

ములలోఁ జాలఁ బ్రాముఖ్యముఁగన్నది. తత్పూర్వమే పెక్కేండ్లనుండి యుత్తరహిందూస్థానమునందు నానా ప్రదేశములనాక్రమించి, వానిని మహావిప్లవకరస్థితికి గురి చేసి, కలవరము నొందించుచుండిన మహమ్మదీయు లా కాలముననే, దక్షిణదేశమునఁగల హిందూ రాజ్యములపై దాడివెడలి, యందు మహాదారుణకృత్యములఁ గావించి, హైందవుల ధనధాన్యాది సంపదలను సర్వస్వమును జూఱలాడఁజొచ్చిరి.

౨. అల్లాయుద్దీను ప్రయత్న ప్రాబల్యము — ముసల్మానుల ప్రవేశము ధూమకేతుసందర్శనమువలె, దక్షిణాపథమునందలి హైందవరాష్ట్రములకెల్ల మిగుల నరిష్టసూచకమయి, యత్యంత సంతాపప్రదాయక మయ్యెను. ఢిల్లీశ్వరుఁడును ఖిల్జీవంశజుఁడును నగు నల్లాయుద్దీనుని పంపున, నాతని సేనానాయకుఁడు 'మల్లికాఫూ'రను నతఁడు ౧303 వ సంవత్సరమున నొక్కపర్యాయ మేఁబదివేల సైన్యముతో నోరుగంటి నెదిరించి పరాభూతుఁడై పఱచెను. అట్లు పరుగిడినవాఁడు మరలనచిర కాలముననే యసంఖ్య సేనతో వెడలి, తొలుత దేవగిరిని ముట్టడించి, తన్నగరాధీశుఁడగు రామచంద్రదేవునిఁ జెఱపట్టి ఢిల్లీకిఁబంపెను. వెనువెంటనే యోరుగంటి నెదుర్కొనినను రెండవమాఱుఁగూడ నగరప్రవేశము దుస్సాధ్యముగుటచే, మాలికాఫూరు స్వసైన్యముతో నింటిదారిఁ బట్టెను. అయినను యవనుల ప్రయత్న

మంత్రిటితో నాఁగినది కాదు. అల్లాయుద్దీ నపరిమిత మగు సైన్యమును సమకూర్చి, మాలికాఫూరునకు 'ఖ్వాజాహాజీ' యను సేనానిఁ దోడిచ్చి, యెట్లైన నాంధ్రసామ్రాజ్యము హరించికావలెనని యాదేశించి, మూఁడవసాఁడవ నాతని దక్కనునకుఁబంపెను. మహమ్మదీయు లాతరుణమునఁ దమకు గోచరించు పల్లెలనెల్లఁ గొల్లపెట్టుచుఁజని, మార్గమధ్యముననున్న శ్రీపురదుర్గముఁ బట్టుకొని, తన్నగరాధిపతిని దహించివైచిరి. వాహినీపతియగు మాలికాఫూరు తనసైన్యము నటనుండి చాల మెలఁకువతో నడపుచు, నర్ధరాత్రమున హఠాత్తుగ నోరుగంటినిఁ బ్రవేశించి, యందుఁ బరాకుననున్న సర్వసేనలను సమయించి, నగరము నువ్వెత్తు కబళించెను. ఈ పర్యాయ మాయవనసేనాని యోరుగంటినుండి ౩౧౨ ఏనుఁగులను నిరువదివేల గుఱ్ఱములను తొంబదియాఱువేల మణుఁగుల బంగారమును గొల్లలుగ రత్నములను హరించెను. హొయిసల రాజ్యమునకు రాజధానియగు ద్వారసముద్రమును ముట్టడించి, కోట భగ్నముగావించి, యందలి, సమస్తసంపదలను గొల్లలాడెను. హొయిసలులును యాదవులును బేరులేక నశించిరి.

3. ముబారక్ దురాగతము— ముసల్మానులు దక్షిణదేశముపై నడుగిడుటకుఁ బ్రారంభించిన పిమ్మటఁ బెక్కుపర్యాయము లందలిరాష్ట్రములఁ జెనకి, వానినొక్కటొక్కటిగఁ గబళించి, రాజ్యపాలకులను జిత్రి

హింసలకు గుఱిచేయుచుఁ, జివరకు దక్షిణాపథమంతయు నాక్రమింపఁ దవిరిరి. అల్లాయుద్దీను ౧౩౧౬ లో మరణింపఁగా నాతని నాల్గవకుమారుఁడు 'ముబారక్'అను నతఁడు ఢిల్లీసింహాసనమునకై పోంచియుండిన మాలికాఫూరును దన సోదరులనందఱనుఁ జంపి తాను చక్రవర్తియై, దక్షిణదేశముపై దాడిసాగించెను. ఈ ఘోరకార్యప్రియుఁడు, దేవగిరి ప్రభుఁడును రామదేవుని యల్లుఁడునునైన హరిపాలదేవునిఁ బట్టుకొని, ప్రాణములుండఁగనే నిలువున నతనిచర్మమొలిపించి, యానిచిలల నగరద్వారమున వ్రేలాడఁగట్టించెను. హృదయవిదారణమగు నిట్టి దారుణవిజృంభణములఁ గనఁజాలక, మూఁడవ బళ్ళాలదేవుఁడు తిరువన్నామలకుఁ బాఱిపోయెను.

౮. గ్యాస్ఉద్దీన్ దృక్పథము—దక్కనున దాడి సాగించిన తురుష్కులలో తుఘలకు వంశజుఁడగు గ్యాస్ ఉద్దీను తృతీయుఁడు. ఈతఁడు ౧౩౨౧ లో సింహాసనమునకు వచ్చినతోడనే తనదృక్పథము నోరుగంటివంక మరల్చి, తనకుమారుఁడగు నలూఫుఖానుని నాంధ్రసామ్రాజ్యముపై దండయాత్రసాగింప నియోగించెను. అలూఫుఖానుఁడు తొలుత పరాజితుఁడయ్యెఁ, దరువాత రెండునెలలకే, యపరిమితసేనతో నాకస్మికముగ నోరుగంటిపైఁబడి దాని నాక్రమించి, ప్రతాపరుద్రునిఁ జెఱపట్టి ఢిల్లీకిఁగొంపోవుచు, నగరమును సంపూర్ణముగ విధ్వంసమొనర్పఁ దనసేన కానతియిచ్చెను. అంతటితోఁ

గాకతీయ సామ్రాజ్యము రూపుమాసినది. సర్వ సంపదలకును దావలమై, శోభాయత్తమై తనరారుచుండిన ఓరుగల్లు, యవనుల సంస్పర్శమాత్రముననే గహన సదృశమయ్యెను. ఢిల్లీప్రభుఁడు ఆయమాంగల్యనగరికి 'సుల్తానుపుర'మను నామకరణ మొనరించెను.

౪. మహమ్మదుసంస్పర్శ — గ్యాసుద్దీనుని యగ్రపుత్త్రుఁడగు నాలఘ్‌ఖానుఁడు (మహమ్మదుతుఘలక్) ౧౩౨౬లో రాజ్యారూఢుఁడై దక్కనుపై దాడివెడలెను. సుల్తానుని ప్రతాపాగ్నికీలలచే దేవగిరియు, ౧౩౨౭ న ద్వారసముద్రమును గబళిపోయెను. పాషాణహృదయుఁడగు నీపాదుషా పాదమూన ప్రదేశములన్నియును బాడువడి, శ్మశానములు తాఁజొచ్చెను.

5. స్వాతంత్ర్య తృష్ణ

౧. జంబుకేశ్వరుని పాలన—ఈభయానక తీక్ష్ణాతపమే కుంతలమునఱకు వ్యాపించి, యానెగొంది గూడఁ గందించెను. ఆవిషయ మీదిగువ వర్ణింపఁబడును. నాఁటి దురదృష్టదేవతకు బలియైనవాఁడు, జంబుకేశ్వరుఁడు. ఈతఁడు పైనఁ బేర్కొనిన నరసింహరాయుని ప్రపౌత్త్రుఁడు. నరసింహదేవరాయనికిఁ దరువాత నాతని తనూజుఁడు రామదేవరాయఁడు ౧౨౮౬ నుండి ౧౩౨౧ వఱకును, ననంతర మాతనిసుతుఁడగు ప్రతాపరాయఁడు ౧౩౨౧ నుండి ౧౩౪౬ వఱకును రాజ్యమేలిరి. ప్రతాపరాయుని మరణానంతరము ౧౩౪౬ వ సంవత్సర

మున సింహాసనమునకు వచ్చినయాతఁడే ప్రతాపరాయుని పుత్త్రుఁడగు జంబుకేశ్వరుఁడు. ఈతఁ డానెగొంది ప్రభువులలోఁ గడపటిరాజు. కేవల స్వాతంత్ర్యప్రతాపలంబకుఁడై, ధర్మదీక్షాధురీణుఁడై, యేకాతపత్త్రముగ రాజ్యపాలనము గావించిన నృపవతంసము.

౨. ఆశ్రితావనదీక్ష—ఉత్తర హిందూస్థానమునను దానికిఁబిమ్మట దక్షిణదేశమునను మహమ్మదీయ సుల్తానుల నిష్కారణక్రోధదవానలమునకుఁ బయింబయి నుతిరై, సామ్రాజ్యములు భస్మీపటలము లగుచుండుటవలన, నాప్రాంతవాసులగు జను లాయువనదురంతములకోర్వలేక, ప్రాణాకాంక్షచే నందుండి దక్షిణదిగ్భాగమునకుఁ బరుగువాఱఁ జొచ్చిరి. ఇట్లు పరుగిడి వచ్చెడు హిందువుల కానెగొంది పెక్కుశతాబ్దములకాల మండయై, నిలువనీడనొసంగుచు, నార్తులను సంరక్షింపఁజాలియుండెను. నాఁటిరాజులు నుదారహృదయులై యాశ్రితుల ననురాగాతిశయమున భరింపఁజాలియుండిరి. ఇట్టి యాశ్రితావనదీక్ష నత్యంతానుతప్త హృదయమున సాగించిన నృపవర్యులలో జంబుకేశ్వరుఁడుమేటి. ధర్మాభినిరతిఁబూని రాజ్యపాలన మొనరించిన యానెగొంది రాజులలోనెల్ల నీతఁ డద్వితీయుఁడగు ఖ్యాతినిగడించి, ప్రజాహృదయమ్ము నాకర్షింపఁజాలిన మహనీయుఁడు.

౩. సమాదరణము—మోగల్ చక్రవర్తియగు మహమ్మదుతుఘలకు దక్షిణాపథమున నట్లు సాధించిన

రాష్ట్రభాగములకెల్లఁ దన మేనల్లుఁడగు 'బహాఉద్దీను' అనునాతనిఁ బ్రతినిధిగ నియోగించియుండెను. ఈరాజ ప్రతినిధి చక్రవర్తికి లోఁబడియుండక యాతని యాజ్ఞల ధిక్కరించుచు స్వేచ్ఛవహించెను. అందులకు మోగల్ ప్రభుఁడు క్రుద్ధుఁడై యాద్రోహిని గడతేర్పవలసినదని తన సామంతుఁడగు 'ఖాజాజహా' యను ఘూర్జరనాయకుని నియమించెను. చక్రవర్తి యాదేశానుసార మా సామంతరాజు విస్తారసైన్యముతో బహాఉద్దీనుని దాఁకెను. బహాఉద్దీనుఁ డావాహిని నెదిరింపఁజాలక, సంభవింపనుండు నుపద్రవమునుండి తప్పించుకొనుటకై రణరంగము విడిచి పాఱిపోయి, యానెగొంది రాజు శరణుజొచ్చెను. శరణాగతుఁడు ఢిల్లీప్రభుని జామాతయని తెలిసియు, జంబుకేశ్వరుఁ డావంతయును శంకింపక, 'స్వాశ్రితావన సమో నహి ధర్మః' యను వేదసూక్తినిఁదలంచి, యాదీనున కభయప్రదాన మొసఁగి యాదరించెను.

౮. న్యాయధీరత — తత్పూర్వమే పండ్రెండేండ్లుగ నానెగొందిపైఁ గన్నువైచి, దాని వశపఱచుకొనఁ బలుమఱు తలపడుచు, తనపట్టు వట్టిగొడ్డుతాకట్టగుడు విచారాతిశయమున మఱలిపోవుచు, సమయము పరీక్షించియుండిన ఢిల్లీశ్వరుఁ డిందుచేఁ దోఁకత్రొక్కిన కాలాహివోలెఁ గ్రోధవివశుఁడై, యానెగొంది నెటులైన సాధింప నిశ్చయించుకొని, మహాసేనతో బయలువెడలెను. ౧౩౩౨ వ సంవత్సరమున నుభయ సైన్యములకును

గాంపిల్యనగరసమీపమున ఘోరయుద్ధముజరిగెను. అవు డైనను దనకు జయముగల్గునని నమ్మకము లేనందునం, దనయల్లుని నొసంగినచోఁ దరలిపోవనున్నట్లు ఢిల్లీశ్వరుఁ డానెగొంది ప్రభునకుఁ దెలియఁజేసెను; కాని శరణాగత రక్షణధర్మమునకుఁ బిమ్మట సామ్రాజ్యమును సయితము తృణప్రాయముగనైనఁ దలంపని జంబుకేశ్వరుఁడు, మహామ్మదు కోరిక నిరాకరించి, శరీరమునఁ బ్రాణము లున్నంతవఱకు యుద్ధమే చేసెదనని వర్తమాన మంపెను.

౫. సుల్తానుని విజయము—మహమ్మదు రోషోద్దీపితస్వాంతుఁడై, జయముఁగొనుటయో లేక సమరాంగణమున మృతినొందుటయో జరిగికావలయునని, తన సైన్యమును దీవ్రశాసనమునకు గురిచేసెను. తురుష్కసేన హైందవవీరులతోఁ బ్రాణములకుఁ దెగించి పోరఁజొచ్చినది. ఎంత ప్రయత్నించినను మోగల్ ప్రభున కున్నత ప్రాకారవేష్టితమగు నగరము ప్రవేశసాధ్యముకాలేదు. ఆతనిసేన యపారముగనుండి తెక్కముకాడనీయక పెనఁగుచు, స్వసైన్యము నుక్కడంచుచుండుటచే, నానెగొందిరాజు స్థానమువిడిచి, 'యాన్యమతదుర్గము' ప్రవేశించెను. జంబుకేశ్వరుఁ డపాయమును శంకించుచుఁ తనకు జయాకాంక్ష నిక్కముగలేదని నిశ్చయించుకొని, భార్యాపుత్త్రికల దన కృపాణమునకు బలియొసఁగి, రాజధానియందు నిలువయున్న యేఁబదివేలసంఖ్యగల సేనలో నుక్కుతున్కలఁబోలు నైదువేల వీరులతోఁ గోటవెలు

వడి, యాకొన్నసింగ మాలమండలోవలె యుద్ధభూమినిఁ గల తురుష్కసైన్య సమూహమునఁ జొఱఁబడి, చెండి చకచకలాడుచు నసంఖ్యాకులగు పోటరులఁ బొలియించి, తాను రణరంగమున వీరమరణముఁ బొందె. ఆనెగొంది యోధులెల్లరుఁ బెల్లడరి తమనాయకుని ధర్మమే యనుసరించుచుఁ, దమ యాంధ్రతేజము వెలయ స్వీయ రక్తధారలచే వెల్లువలు పాఱింప, కుంతలరాష్ట్ర మాత కాత్మార్పణముఁ గావించిరి. హతశేషులగు వృద్ధులార్వురు ఢిల్లీశ్వరుని యంగీకారమువడసి, తమఱేని కళేబరము నగరిలోనికిఁ గొనిపోయి, పరమభక్తితోఁ బారలౌకికక్రియ లాచరించిరి. ఆనెగొంది, మోగల్ ప్రభుని యధీనమయ్యెను. అంతనాతఁడు నల్లేరుపై దండిగఁ బురముసొచ్చి, రెండేండ్లకాల మందువసించి, పొదుగుఁగోసి పాలుద్రావినట్లు పట్టణముఁ బెక్కండ్రను వధించి, యందలి సర్వస్వముఁ గొల్లగొనెను.

### 4. మహమ్మదీయ ప్రతినిధి.

ఢిల్లీశ్వరుఁ డానెగొందికి 'మల్లిక్ నబీ' యను పేరు గల ప్రతినిధిని నియోగించి, హతశేషులగు సరదారుల నార్వురను జీవగ్రాహులుగఁ గొని, తనబలఁగముతోఁ ౧౩౩౪ వ సంవత్సరమున నిజరాజధానికేఁగెను. సుల్తాను స్వరాజ్యమునకు మరలఁగానే యానెగొంది ప్రజయును - కుంతలరాష్ట్ర జనులును - నాయకులును - మహమ్మదీయ ప్రభు పాలనమునొల్లక చెలరేఁగిరి. ప్రతినిధి, ప్రజల

స్వాతంత్ర్యేచ్ఛను గ్రహించి, యవనులపరిపాలన మిచ్చట సాగనేరదని నిశ్చయించుకొని, యావిషయము వివరించుచుఁ జక్రవర్తి కొకయుత్తరము వ్రాసి పంపెను.

## 6. ప్రతిక్రియ.

మోగల్ ప్రభుఁడు, మల్లిక్‌నబి పంపిన సందేశపత్రి మందికొని, తోడనే తనప్రధానులతో నావిషయమై యోజించెను. మండలాంతరమున మహమ్మదీయ ప్రతినిధులతోఁ బనిసాగించుట దుష్కరమనియు, నానెగొంది రాజవంశజులలో నొక్కనిని బ్రభునిగ నేర్పఱచుట కార్యసాధనమున కుచితమార్గ మనియు మంత్రులు సుల్తానునకుఁ దెల్పిరి. తానంతదనుకఁ జెఱలో నుంచి యుండిన సరదారులనార్వురను సుల్తానురప్పించి, యందు రాయలవంశమునకుఁ జెందినవా రెవ్వరును లేనందున, నావఱకు నానెగొందియం దమాత్యపదవిలో నుండిన 'హరియప్ప'ను రాజుగను నాసంస్థానమునఁ గోశాధికారిగనుండిన 'బుక్కప్ప'ను మంత్రిగను, దక్కిన నలువురను గొప్పనాయకులుగను నియోగించి, వారు తన కంకితులై వర్తింపునట్లు కట్టడఁగావించుకొనిపంపి, మల్లిక్‌నబీని వెనుకకుఁ బిలిపించికొనెను. నాయకు లార్వురు నానెగొంది చేరునప్పటి కది చాలవఱకుఁ బాడువడి యుండెను. ప్రజాసంఖ్యయు మిగుల క్షీణించియుండినది. ఉన్నవారు సారమెడలి దైన్యదశ ననుభవించు చుండిరి. పట్టణమెంతయును గళావిహీనముగఁ గన్పట్టుచుండెను.

## ఆనెగొంది రాయల వంశము. (౧౦౧౪–౧౩౩౨)



# మూఁడవప్రకరణము.



## విద్యానగరనిర్మాణము: క్రీ. శ. ౧౩౩౬

### 1 హరిహరుఁడు రాజ్యనాథుఁడగుట.

బంధవిముక్తులై ఢిల్లీనుండివచ్చిన సరదారులలోఁ బ్రముఖ్యముఁగనిన 'హరియప్ప' - 'బుక్కప్ప'యను నాయకులిరువురును సోదరులు. ఒక సుప్రసిద్ధ నగరమునకు నిర్మాతలై యొకానొక మహాసామ్రాజ్యమున కంకురార్పణముగావించిన కార్యశూరులు. వీరలే చరిత్రలోకమున హరిహరరాయఁడు బుక్కరాయఁడు నన విలసిల్లి, కర్ణాటాంధ్రప్రపంచములఁ బ్రబలతర విఖ్యాతినిగాంచిన మాన్యచరిత్రులు. ఈయన్నదమ్ములు తొలుత నోరుగంటిసామ్రాజ్యమునఁ గోశాధ్యక్షులుగ నుండి మహమ్మదీయు లోరుగంటిని విధ్వంస మొనర్చిన పిమ్మట నానెగొందిప్రభువు నాశ్రయించి ఈ యిరువురు నాసంస్థానాధీశునికడ నమాత్యకోశాధికార పదవులనంది తమ బుద్ధివైభవమునను గార్యకౌశలమునను జేసి ప్రీతివిశ్వాసములకుఁ బాత్రులైరి. తదుపరి తురుష్క ప్రభుచండాంశుఁ డానెగొందినగర ప్రాభవచంద్రికను మాయించి, యుద్ధరంగమునవిలిచిన యోధు నాద్వయను బంధీకృతులనుగ ఢిల్లీకిఁ గొంపోవుటయు, నానెగొంది ప్రజలు తిరుగుబాటుసల్పఁగ మోగల్ చక్రవర్తి చెం

# విద్యానగర చరిత్రము.



హజార రామాలయము.

(పైలోక దృశ్యము)



మంత్రాలోచన మందిరము.



**తాతి తొట్టి.**

(ఈ పటముల స్వాతంత్ర్యము శ్రీ యం. కే. రంగస్వామయ్యంగారికి చెందినది)

లోని నాయకులను విడిచిపుచ్చుటయు, గత ప్రకరణ విషయమువలనఁ దేలినసారము. ఢిల్లీనుండి వచ్చిన యనంతరము హరిహరుఁ డానెగొంది సింహాసనమును బుక్కరాయఁడు మంత్రిపదమును నలంకరించిరి.

## 2. నగరనిర్మాణావసరము.

ఈ సందర్భముననే ప్రాచీన రాజవంశమునకుఁ జెందిన సుల్తానులును, ప్రతినిధులును, సర్దారులును, సామ్రాజ్యాధిపత్యమునకయి యొండొరులతోఁ బోరుచుండ, నుత్తరహిందూస్థానమున నరాజకస్థితి యేర్పడెను. సేనానులును సైనికులును బట్టణములపైఁబడి, మదోద్వృత్తి వలనను ధనాశచేతను నందలిజనులఁ జిత్రహింసలపాల్గావించుచు, స్వేచ్ఛగ వారి ధనమానప్రాణములను హరింపఁజొచ్చిరి. ఈహేతువున జనపదము లనేకములు సర్వశూన్యములైన యరణ్యములుగఁ బరిణమించినవి. ఈ భయంకరసంక్షోభము నోర్వలేక తండోపతండములుగఁ బాఱివచ్చెడు జనవితానమునకెల్ల నానెగొంది యాశ్రయస్థాన మయ్యెను. ఇట్లది దినదినాభివృద్ధి నొందుచుండుటచే, రాజధానికయి సువిశాలప్రదేశమున నూతననగరనిర్మాణమున కవసరమేర్పడినది. ఉత్తరహిందూస్థానమునందు మహమ్మదీయ ప్రభువుల వలనిహానివడి నానాఁటికినతిశయించి దుస్సహమగుటయు, దానితో నాయుపద్రవ దవానలము క్రమక్రమముగ నుత్తరదేశమంతయు నావరించి దక్షిణాపథముఁగూడ

దహింపఁదీవురుటయు గమనించుకొలఁదిని, హరిహర రాయ బుక్కరాయలకు దక్షిణదేశమున నెటులేని స్వ తంత్రరాజ్యస్థాపన మొకటి యవశ్యము గావింపవలయు ననుత్సాహ మెచ్చఁజొచ్చెను; కాని యందులకుఁ దొలు దొల్త నభేద్యములగు ప్రాకారులతోడను, బలాఢ్యములైన కొత్తళములతోడను జక్కని నగరనిర్మాణముఁ గావింప నాసోదరులు కృతసంకల్పులై యందుల కనుకూలస్థానము నన్వేషించుచు, దక్షిణదేశ భాగములను మెల్లమెల్లఁగ లోఁగొనుచు, స్వాతంత్ర్యసంస్థితికివలయు రాజ్యబలమును కోశబలమును విరివిగ సమకూర్పఁదొడఁగిరి.

### ౩. వేఁట—విద్యారణ్యునియాదేశము.

నూతననగరస్థాపనమున కర్హప్రదేశముల నారయుచు, హరిహరరాయఁ డొకనాఁడు తనయవరజుఁడగు బుక్కరాయని వెంటఁగొని, మృగయాప్రియత్వమునఁ దుంగభద్రానదినిదాఁటి, దక్షిణపు టొడ్డునఁగల కాంతారముఁ బ్రవేశింపఁగాఁ, జుట్టును బర్వతమాలికలచే నావృతమయిన విశాల సుమనోజ్ఞప్రదేశ మొండు గోచరింపఁ, దానందు వనసత్త్వములను వేఁటాడుచుండ, నందలి కుందేళ్ళుకొన్ని దర్పాతిశయమున వేఁటకుక్కలనే మార్కొనుట సందర్శించినది. ఆయన్నదమ్ము లీయపూర్వ విచిత్రసంఘటనముఁగాంచి కొంతవడి రాపడి నిలిచిపోయిరి. వారచ్చటనుండి వెనుదిరిగి పోవుచు, విరూపాక్షేశ్వరాలయ సమీపమునఁ దమకుఁ బ్రసన్నుఁ

దైన విద్యారణ్యయతీంద్రున కెఱిఁగి, జరిగినయుదంతమంతయు నాయతిరాజునకు విన్నవించిరి. 'అపృష్టోపి శుభంభూయాత్' అనుట నీతికోవిదుల మతముగాన, విద్యారణ్యుఁడందులకు సమాధానమొసఁగుచు, నయ్యది వీరక్షేత్రమనియు,నూతనరాజధానీ సంస్థానమున కదియే యోగ్యమగుస్థానమనియు, నందు నగరనిర్మాణ మొనర్చినచో నది చిరకాలము బహుళవిజయోపేతముగ వర్ధిల్లఁ గలదనియుఁ దెల్పెను. ఈ కథాంశములు నెల్లూరి మండల దానశాసనముల ప్రథమభాగమున ౧౦౯ వ పుటయందు కాపలూరిశాసనమునఁ వర్ణింపఁ బడినది.

## 4 నగర నిర్మాణము.

౧. నిర్మాణక్రమము — తరువాత హరిహరుఁడు విద్యారణ్యునిచే శంకుస్థాపనము గావించి, శా. శ. ౧౨౫౮ వ ధాతృనామసంవత్సర వైశాఖశుక్ల సప్తమీ తిథిని పుష్యమీనక్షత్రమున సింహలగ్నమునందు, విద్యాచక్రానుసార మాయతిసత్తముఁడు నిరూపించిన మేర నతిక్రమింపక, బలవత్తరములగు నున్నతప్రాకారముల నేడింటిని నిర్మించెను; వెండియు నందా యోగివర్యుఁడు నిర్ణయించిన స్థానములలో రాజభవనములను సభారంగములను రక్షకనిలయములను దుర్గములను నెలకొల్పి, విస్తృతములగు నంతరములను వీథులను నమర్చెను. హరిహరుఁడీమ్మెయి నాదుర్గమారణ్యసీమ ననతికాలముననే మహాపుటభేదనముగ మార్చివైచి, విద్యారణ్యుస సంకల్ప

శక్తికిఁ దనక్రియాశక్తి తుల్యమైనదిగ ధ్రువపఱచెను. ఇట్లీనగరము శ్రీవిద్యారణ్యుని ప్రోత్సాహమున నిర్మింపఁబడి, 'విద్యానగర'మని విఖ్యాతిఁజెందెను.

౨. సామ్రాజ్యాంకురము— మహమ్మదీయుల యరాజకసంక్షోభకారణమున నుద్భవమై, పిమ్మట రెండుశతాబ్దములవఱకు సముద్రతరంగములవలెఁ బొంగి పొరలివచ్చుచున్న మహమ్మదీయ సేనాప్రవాహమునకుఁ జెలియలికట్టయై, తనపేరున వెలసిన మహాసామ్రాజ్య వృక్షమున కంకురప్రాయముగఁ బొలిచి, పెక్కుశతాబ్దముల కాల మామహాసామ్రాజ్యమునకుఁ బ్రధానపట్టణముగ నుండిన పుటభేదన మీవిద్యానగరము.

౩. నగరవైశాల్యము: వర్ణనము— పండ్రెండవ శతాబ్దారంభమున నానెగొందికి పాలకుఁడుగనుండిన విజయధ్వజుఁడు, క్రీ. శ. ౧౧౩౦ వ సంవత్సరప్రాంతమున నెలకొల్పిన విజయపట్టణము, విరూపాక్షేశ్వరాలయ సమీపమున వ్యాప్తిఁజెందియుండి విద్యానగరమునఁ గలియుటచే, నయ్యది ౨౫౬ చదరపుమైళ్ళ వైశాల్యముగల మహానగరముగ మాఱిపోయినది. సంగీతసూర్యోదయమున నీనగరవర్ణన మీవిధముగఁ గలదు.

శ్లో॥ కార్ణాటాహ్వయదేశ సౌఖ్యజననీ । శ్రీతుంగభద్రావృతా
మారం గోన్నత మాల్యవత్ క్షితి ధర । శ్రీహేమ కూటాశ్రితా
పంపాధీశ్వర విట్ఠలేశ్వరకృపా । దృష్టి ప్రభామండితా
శ్రీవిద్యానగరీ విభాతి ధరణీ । ధమ్మిల్ల మాణిక్యవత్.

---

# నాల్గవ ప్రకరణము.

## III ప్రథమ (సంగమ) వంశము.

### మొదటి హరిహరుఁడు: క్రీ. శ. ౧౩౩౬–౧౩౫౦

#### 1. సంగముని సంతతి.

శా. శ. ౧౨౫౮ (క్రీ. శ. ౧౩౩౬–౩౭) వ సంవత్సరపు దానశాసనమున హరిహరుని వంశాదికములను గూర్చి విశదముగఁ గలదు. చంద్రవంశమున యదువు మొదలగువారు గల్గిరనియు, నావంశమున నుద్భవించిన బుక్కరాజునకు మంగాంబికవలన సంగముఁడు జన్మించెననియు నది తెల్పెడిని. ఈసంగమునకు మేళాంబిక వలన హరిహరుఁడు కంపఁడు బుక్కరాయమహీపతి మారప్ప ముద్దప్ప యను కుమారులైదుగురు పుట్టిరనియు, నందుఁ బ్రథముఁడగు హరిహరుఁడు కళింగాది రాష్ట్రములను జయించి 'కుంజరకోన' (ఆనెగొంది)లో రాజ్యపాలనము సేయుచుండె ననియు, నాశాసనము రూఢిగఁ బల్కుచున్నది.

ఎపిగ్రాఫికా కర్ణాటికా జి. డి. ౪౬ వ తామ్రశాసనముఁ జూడుఁడు.

అస్తి కౌస్తుభ మాణిక్య కామధేను సహోదరః,
రమానుజః కళానాథః క్షీరసాగరసంభవః. ౪
తదభూదన్వయే తస్య యదుర్నామ మహీపతిః,

పాలితా యత్కులీనేన వాసుదేవేన మేదినీ. ౫
తత్కులే బుక్కనామా యః కీర్తి శౌర్య విచక్షణః,
మంగాంబికాఽభవ ద్రాజ్ఞీ లక్ష్మీరివ హరే ర్యథా. ౬
అభూ త్తస్య కులే శ్రీమా నభంగుర గుణోదయః,
అపాత్త దురితాసంగః సంగమో నామ భూపతిః. ౭
మాలాంబికాఽభవద్రాజ్ఞీ తస్య రాజ్ఞః శచిస్మితా,
దమయంతీ నలస్యేవ ఇంద్రస్యేవ యథా శచీ. ౮
ఆసన్ హరిహరః కంపో బుక్కరాయ మహీపతిః,
మారపో ముద్దప శ్చేతి కుమారా స్తస్య భూపతేః. ౯

దీనివలన హరిహరుఁడు చంద్రవంశజుఁ డనుట విస్పష్టము. కాని సూవెల్ దొర యాతనిఁ గురుపవంశము నకుఁ జెందినరాజని వ్రాసెను. అందుల కాతఁడు తనకు లభించిన యాధార మెద్దియో, తెలిపియుండ లేదు.

హరిహరుఁడును నాతనిసోదరులు నలువురును వారి జీవితకాలమంతయుఁ బంచపాండవులవలెఁ బరస్పరము ప్రాణముగా ప్రాణముగ నుండిరనియు, తమ్ములు సంగ్రామశూరులును విశ్వసనీయులును నయి, జ్యేష్ఠభ్రాతను బితృసదృశునిగ నెంచి, యాతనియడుగులకు మడుఁగులొత్తుచు, నాభ్రాతృవత్సలుని కనుసన్నలలో మెలఁగుచుండిరనియు, శాసనములవలనఁ దెలియవచ్చెడిని. సంగముని పుత్త్రపంచకమున మధ్యముఁడైన బుక్కభూపతి, ప్రచండవిక్రముఁడును పాండవమధ్యముఁడును నగు నర్జునునివలెఁ, బ్రబలవిఖ్యాతి నందెనని కూడ పై తామ్రశాసనము మూలమున వ్యక్తమగుచున్నది.

పంచానాం మధ్యగ స్తేషాం ప్రఖ్యాతో బుక్కభూపతిః,

ప్రచండః క్రమో మధ్యే పాదనానా మిన ధ్వజః.

## 2. సామ్రాజ్యస్థాపనము—పాలనము.

ఆనెగొందిరాజు లంతరించిన యనంతరము మహామ్మదీయప్రతినిధి పరిపాలనమువలనఁ గుంతలరాష్ట్రమునందంతటను నరాజకము ప్రబలినను, నది యెంతో కాలము నిలిచియుండలేదు. మరల భారతక్షత్రియవంశసంభవుఁడగు హరిహరుఁ డనతికాలముననే యానెగొంది సింహాసనమునకు వచ్చుటచే, రాష్ట్రమునఁ గొంత శాంతిచేకూరెను. ద్వారసముద్రాధీశుఁడగు బల్లాలదేవుని స్థానభ్రంశముతో హొయిసలులు చరిత్రరంగము నుండి నిష్క్రమించినపిమ్మట, నానెగొందిప్రజలు ధర్మస్వాతంత్ర్యమునకై విజృంభించియుండని యెడల, దక్షిణహిందూదేశ మచిరకాలముననే తురుష్కసామ్రాజ్యముగఁ బరిణమించియుండవలసినది. హరిహరుఁ డానెగొందిలో నడుగిడిన పిమ్మటఁ దమ్ముఁడు తనకుఁ దోడునీడయయి యుండఁ, బరిసరప్రదేశములనున్న చిన్నచిన్న రాజ్యముల నన్నింటినిఁ గ్రమక్రమముగ లోఁగొని, రాజధాని నానెగొందినుండి విద్యానగరమునకుమార్చి, క్రీ. శ. ౧33౬నఁ దానందు పట్టాభిషిక్తుఁ డయ్యెను.

తథా హరిహరేశ్వరస్య విరచయ్య తచ్ఛాసనం
నృపాసన మహాస్థిరోచ్ఛ్రితసితాతపత్రోజ్జ్వలః,
విధాయ ఖలు షోడశ ప్రతిగ్రధీ విదానా స్వహో
స్వరాజిత విశాలకీర్మ్ని నగరే హి విద్యాభిధే [వత్సరే] ...
అష్టపంచయుగశైల సంఖ్యయా (౧౨౫౮) సంయుతే నృపశకస్య

పట్టాభిషేకోత్సవతః పరస్తాత్ పంపావిరూపాక్ష మహేశ్వరస్య
— నెల్లూరిమండల దానశాసనముల మొదటిభాగము ౧౦౫ పుట.

హరిహరుఁడు విద్యానగరపీఠమునకుఁ బ్రథమ ప్రభుఁడే కాదు; దక్షిణదేశమునందలి యద్వితీయమగు నొక హిందూసామ్రాజ్యమునకుఁ గర్తయును. ఈ యధిపుఁడు బల్లిదుఁడగుట ఢిల్లీశ్వరున కంకితుఁడుగనుండ నిష్టపడక యచిరకాలముననే స్వతంత్రుఁ డయ్యెను. ఈతనిరాష్ట్రము మీఁతిబాధా రహితముగ వెలసినది. జనులు పరరాజభయముడిగి నిగపూలు చుట్టిరి.

## ౩. సోదరుల జైత్రయాత్ర.

హరిహరునితమ్ములారంభమున విద్యానగర సామ్రాజ్యమునకుఁ గోశాధిపతులుగను దండనాయకులుగను మంత్రులుగను నుండిరి. కొంతకాలమైనపిమ్మట హరిహరుఁడు తన సోదరులలో నొక్కొకనికిని విశేష సైన్యము నొసంగి, సామ్రాజ్యమింకను విస్తరింపఁజేయుటకును, రాష్ట్రభాగములు సంస్థాపించి వానికిఁ బాలనాధిపతులుగ నుండుటకును, వారలను నలుగడలకుఁబంపెను. ప్రథమసోదరుఁడగు కంపభూపతి తూర్పుమండలమునను జయించి, యాభాగమునకెల్ల నుదయగిరిని రాజధానిగఁ జేసికొని, విద్యారణ్యుని సోదరుఁడును వేదములకు భాష్యకర్తయు నగు సాయన మంత్రిత్వమున, నుదయగిరి రాజ్యమునకు పాలకుఁడై, సుకరముగ దానినిఁ బాలింపఁ దొడఁగెను. సామ్రాజ్య ముఖ్య సేనానాయకుఁడును,

మంత్రియు, యువరాజును, పెనుగొండ చంద్రగిరిగుత్తి రాజ్యభాగములకుఁ బ్రతినిధియు నయి విలసిల్లినవాఁడు, ద్వితీయుఁడగు బుక్కరాయఁడు. మారప్ప మైసూరి ప్రాంతములకు దండు వెడలి, మొట్టమొదట నందు శివమొగ్గ, యుత్తరకన్నడము మొదలగుమండలముల నన్నింటిని నాక్రమించెను. పిదపరి వానికి 'అరగమలై రాష్ట్ర' మని నామకరణమొనరించి, యావలకు కదంబరాజ్యము నకు రాజధానిగ నుండిన వనవాసిని నవ్యములగు చంద్రకూటము (చంద్రగుత్తి) గోవాలను నూతనరాష్ట్రముతోఁ జేర్చికొని, గౌడబ్రాహ్మణుఁడగు మాధవ మంత్రి సాయమున దానిఁ గీర్తివంతముగఁ బాలించిన ఘనుఁడాతఁడు. ముద్దప్పపాలుఁడు తన భుజతేజము మెఱయఁ దెక్కలినాఁడు (మొలవాయి) రాజ్యము నాక్రమించి యందుల కేర్పడిన పాలనకర్త. ఈసోదరుల నలుగురివశముననున్న రాష్ట్రములు నాఁటనుగాక విద్యానగర సామ్రాజ్యమునకుఁ జెందిన యట్టి రెండు ఖండములలో, బరకూరు మంగళూరు భాగములు చేరిన తుళువ రాజ్యము హరిహరగౌడరాజు పరిపాలనమునను, రాజగంభీరరాజ్యము కుమారకంపరాయని (బుక్కరాయని కొడుకు) ప్రాతినిధ్యమునను నుండెను.

4 సామ్రాజ్యస్థితి.

హరిహరుఁడు పరేంగితజ్ఞానముగల ప్రభుఁడు. ఆతఁడు తనప్రజకుఁ బరరాజులమూలమునఁ గల్గెడు నాక

స్మిక్తోపద్రవముల నెఱిఁగి, వానిఁదొలఁగించుటకై తొలు దొల్త సైనికబలము విశేషముగ హెచ్చించెను. అతఁడు శత్రురాజులవలన దేశమునకుఁగల్గెడు నొత్తిడులను వారించి, విస్తారముగ నైశ్వర్యము గడింపఁగల్గుట దాని మూలముననే. ఉత్తరహిందూస్థానపు నవాబులవలె దక్షిణదేశమునందలి హిందూరాజులుఁగూడ నొండొరులతోఁ గలహించుకొని రాష్ట్రభాగములను విప్లవకర స్థితికిఁ దేఁబూనిరి. అట్టిపాలకులను లోఁగొని, వారి రాష్ట్రముల నాక్రమించుటకయి ఢిల్లీశ్వరుఁడు యత్నించియు, నప్పటికే విద్యానగరసామ్రాజ్యము బలవత్తమ దశకు వచ్చియున్నందున నంతటితో నుడిగెను. హరిహరుఁ డాహిందూప్రభువులను జేరఁదీసి వారిలో నైకమత్యభావము పాదుకొలిపి, వారిరాజ్యముల యం దెల్లెడల నతిశయించియున్న యరాజకత్వముఁ దొలంచి, యారాష్ట్రములఁ గ్రమపథమున నునిచెను. అతఁడు సింహాసనమునకు వచ్చిన రెండేండ్లకు ననఁగా ౧౩౩౮ వ సంవత్సరమునాఁటికే విద్యానగరరాజ్యము పశ్చిమ సముద్రతీరమువఱకు విస్తరించినది. పడమటి సముద్రతీర ప్రాంతమున నున్నతవంశమునకుఁ జెంది, హొన్నూరుపుర నాయకుఁడుగనుండిన యొక పాదుషా, హరిహరునకుఁ బాదాక్రాంతుఁ డయ్యెను. ఆతీరమునందలి మండలేశ్వరులు మఱికొందఱు హరిహరునకు లొంగిపోయిరని యెఫిగ్రాఫికా కర్ణాటిక (సం, ౯ - పుట ౩౯) తెల్పెడిని.

కర్ణాటకరాష్ట్రమునందలి జైనరాజు లీవిద్యానగర చక్రవర్తి కంకితులైరి. బాదముకోట జీర్ణోద్ధారముగావించిన దీపప్రభుఁడే. హరిహరుని యాదేశానుసార మాతని మండలేశ్వరులలో నొక్కఁడగు చామన్నపాలుఁడుదానిఁ గట్టించెననుట యిండియనాంటిక్వేరి (సం ౧౦-పుట ౬౩) మతమును. బంగాళముమొదలుకొని సేతువువఱకుఁగల పూర్వతీర మంతయు నీరాజవర్యుని వశమయ్యెను. దక్కనునం దనేకరాజ్యములును, ఓరుగల్లు దేవగిరి ద్వారసముద్రము కొంకణము మున్నగు రాష్ట్రములభాగములు స్వాధీనమగుటచే, 'అధికస్య అధికం ఫల' మనువచనము హరిహరునియెడ సార్థకమునొందినది. ఇంతటి సామ్రాజ్యమున కధినాయకుఁడగుటచేతనే యీనృపచంద్రుఁడు 'పూర్వపశ్చిమ సముద్రాధీశుఁ'డను ఖ్యాతినిఁబడసెను.

5. గుణకీర్తి.

౧. ధర్మపరిరక్షణము— ఈ రాజవరేణ్యుఁడు తన సామంత ప్రభువులపైఁ దఱచువిజృంభింపవచ్చెడు విరోధులగు సుల్తానులనుదాఁకి, వారికజేయుఁడై మెలఁగుచు, సామ్రాజ్యమునందలి పాలకులయుఁ బాలితులయు నార్షధర్మములఁ బరిరక్షింపఁ దివిరెను. స్థానబలమును ధనబలమును సైనికబలమును నపరిమితముగఁబొందె. మిగుల బలాఢ్యుఁడగుటచే నీసామ్రాట్టు తన్నెదిరించిన ఢిల్లీశ్వరుఁడగు తుఘలకునిఁ బెక్కుతడవ లోడించె. యొక్క పర్యాయ మాతనిసేనను రెండేండ్లకాలము కోటవెలుపల

నే యడ్డగించి, చివరకుఁ బరాభూతముగ నొనర్చెను.

౨. తుఘలకుని యున్మత్తచేష్టలు — మహమ్మదు దక్షిణదేశమునుండి యట్లు తిరిగిపోయిన తర్వాత, నుత్తర హిందూస్థానమున నాతని స్వేచ్ఛాచరణమును జిత్రచర్యలును ఘోరరూపముఁ దాల్చినవి. ధనార్జనమునకై యతఁడు పలుదెగల పన్నులువిధించి ప్రజలను బాధించెను. బీదనేలలలోఁ బసులు మేపుకొనుటకును పూవులమ్ముటకును బ్రత్తియేకుటకును జివరకు వంటచేయుటకునుగూడఁ బన్నులేర్పఱచెను. కొన్నియెడల నేలపన్నువిలువ వెనుకటికంటెఁ బదిరెట్లు నిరువదిరెట్లు సహితము హెచ్చించెను. రైతులీపన్నులభారము మోయలేక సేద్యము చాలించుకొని, పంటభూములను గాఁపున్నయిండ్లను గొడ్డుగోదలను విడిచి, దక్షిణమునకుఁ బరుగువారిరి. చక్రవర్తి, మహమ్మదీయ మతప్రవిష్టులుకండని హిందువులను నిర్బంధించుచు, నందులకుఁ దప్పెడువారిని బహుభంగుల బాధింపఁజొచ్చెను. అత్యల్పమైన తప్పిదమునకుఁగూడఁ గనుగ్రుడ్లు పెఱికించుట, కాలుసేతులు నఱికించుట, శూలములపై దగవేయుట, ప్రాణములుండఁగనే చర్మములొలిపించుట మున్నగు ఘోరశిక్షలకుఁ బ్రజలను గుఱిచేయసాగెను. బీదలనందఱినో నిష్కారణముగ వేఁటాడించిచంపెను. ఈభయంకరయాతనలకుఁ దాళలేక వేలకొలఁది జనులు దక్కనుకుఁబఱచి, యందలి యాంధ్ర కర్ణాట విద్యానగరరాజ్యములలోఁ దల

దాఁచుకొనఁగడంగిరి. తనసామ్రాజ్యమునుండి యట్లు పరుగిడెడు జనులకు విద్యానగర కర్ణాటాంధ్రరాజు లాశ్రయ మిచ్చుచుండుట తెలిసి, మహమ్మదు మిక్కిలి యలిగి, యారాజుల నున్మూలించి వారిరాజ్యముల నపహరించుట మాత్రమేకాక, తన్మూలమున దక్షిణదేశ జనులనెల్ల స్వమతప్రవిష్టులఁ గావించుటకును, నటుగాని చో నందలి రాజ్యములనన్నింటిని విధ్వంసమొనర్చి మృత్యుదేవతకు విందుఁ గూర్చుటకును దీర్మానించుకొని, తొలుదొల్త నోరుగంటినిఁ దాఁకుటకై క్రి. శ. ౧౩౪౪న గణనాతీతమగు సైన్యముతోఁ గదలెను.

౩. ఆతని కడపటిదండయాత్ర—రెండవ ప్రతాపరుద్రుని యనంతర మోరుగంటి సింహాసనముఁబొంది, యందలి క్షీణరాజ్యములను బాలింపఁదొడఁగిన ప్రతాపరుద్రుని కుమారుఁడగు కృష్ణరాజు, ఢిల్లీశ్వరుఁడు తనపై నెత్తివచ్చుచున్నాఁడను పిడుగువంటివార్త విని, హరిహరుని సాయము వేఁడెను. హరిహరుఁడావఱకె తురుష్కుల దురాగతములను దురాశయములను నెఱింగినవాఁడగుటచేతను, నట్లైన మహమ్మదుసుల్తానులనుండియు వారిమతమునుండియు దక్షిణదేశజనులను-వారి సనాతనాచారధర్మములను - హిందూజాతీయతను - స్వాతంత్ర్యమును- గాపాడి, దేశసౌభాగ్యము నెల్లవిధములఁ బెంపొందించుటకు దీక్షవహించియున్నవాఁడగుటచేతను, నమ్మహాసామ్రాట్టు తమ్ముఁడగు బుక్కరాయుని తోడను విస్తారసైన్యము

తోడను విత్తముతోడను వెళ్ళి, కృష్ణరాజు - బళ్ళాల దేవుఁడుఁ - బెక్కండ్రు రెడ్డిరాజులు - బాసటయైనిలువ యవనసైన్యమును మార్కొనెను. తన భుజాటోప గరిమఁ బరిపూర్ణముగ నెఱపఁదగిన చక్కనితఱి తనకు లభించినందులకై బుక్కరాయఁ డుప్పొంగి, తురుష్కసేనఁజొచ్చి, రణోత్సాహముచే జయజయనాదములు సలుపుచు, వీరావేశమున నున్మత్తుని మాడ్కిఁ దురకమూకలనెల్ల దునుమాడి, వాని క్రొన్నెత్తుటివాఁకలచే సమరాంగణముఁ జిత్రవిచిత్రసరణిని గయిసేసెను. అంత హతశేషులగు మసలిమానులు పరువులువెట్టుటఁ దిలకించి, బుక్కరాయఁడు వెనుదగిలి వారిఁ దఱిమితఱిమి వధించెను. కర్ణాటక మంతయును హిందువుల వశమైనది. ఓరుగల్లు పూర్తిగను - నాప్రాంతమునందలి మిగిలినభాగము లన్నియును - మహమ్మదీయుల యాధిపత్యమునుండి తొలఁగెను. దక్కనున నొక్క దేవగిరి తప్ప మఱెద్దియును మహమ్మదీయులకుదక్క లేదు.

### 6. అల్లాయుద్దీను హసన్ - హసనగంగుఁడు

విద్యానగరసామ్రాజ్య మిట్లు సక్రమాభివృద్ధి నొందుచుండఁ, గొంతకాలములోనే దానికిఁబ్రతిస్పర్థిగ నుత్తరమున భామినీ రాజ్యమొకటి నెలకొనెను. దాని సంస్థాపకుఁడు 'హసన్‌గంగూ భామినీ' యను తురుష్కరాజు. తొలుత నితఁడు ఢిల్లీ సుల్తానునికడ దళవాయిగ నుండిన శూరుఁడు. అందు వీరావతంసమని పేరొంది

కొలఁదికాలములోనే చక్రవర్తివలన దౌలతాబాదు రాజ్యమునకు నియోగింపఁబడిన ప్రతినిధి. తదుపరి ఢిల్లీశ్వరునకు వశుఁడయి యుండనొల్లక యాతనిపైఁ దిరుగఁబడి, చక్రవర్తి యల్లుఁడగు 'ఇమాద్ ఉల్ ముల్క్' అనువానిని వధించి, దౌలతాబాదు వదలి గుల్బర్గా పట్టణమును రాజధానిగఁ జేసికొని, దానిఁ బాలింపదొరఁకొనిన స్వేచ్ఛాచారప్రియుఁడు. గుల్బర్గా యందిట్లు క్రీ. శ. ౧౩౪౭లో నితనిచే నవీనముగ నెలకొల్పఁబడిన రాష్ట్రమే భామినీరాజ్యము. ఆరాజ్యసంస్థాపనానంతర మీవజీరుఁడు నూతనముగ ధరించిన నామము 'అల్లాయుద్దీనుషాహ' యనునది. ఈ యల్లాయుద్దీనుషాహ యనతికాలముననే దక్షిణమునఁ గృష్ణానదివఱకుఁ దన రాజ్యమును విస్తరింపఁజేసి, మెల్లమెల్లఁగ విద్యానగర సామ్రాజ్యము సమీపించి నిలిచిన, ప్రక్కలోని బల్లెము. ఆసామ్రాజ్యాభివృద్ధిని గాంచి కనుఁగుట్టుటచే నీతురుష్కపాలకుఁడెటులేని దానినిహరింప నువ్విళులూరఁ జొచ్చెను. విద్యానగరాధీశుఁడగు హరిహరుఁడును, నాతని సోదరులును, సామ్రాజ్యాధిపత్యమునకై పరస్పరకలహమున కేమాత్ర మవకాశమొసఁగియుండినను, నందువలన నీ నవాబునకు మహత్తర ప్రయోజనమే పొసఁగియుండెడిది. ఆసుల్తాను క్రమక్రమముగ విద్యానగర రాజుల గొప్పగొప్పరాష్ట్రములను నగరమునుగూడ నాక్రమించి తదీయ సామ్రాజ్యవృద్ధి కొక్కమరణప్రహారము వైచి

యుండెను. హరిహరాదు లొకవైపున నల్లాయుద్దీను సాహతోఁ బోరాడుచుండియు, నింకొకవంక నితర రాజ్యములను గెలిచి సామ్రాజ్యము వృద్ధినొందింపఁగల్గుటకు, వారిలోని ప్రగాఢమగు నైకమత్య దీక్షయు నన్యోన్య భక్తివిశ్వాసములునే ప్రబలతరకారణములు. హరిహరుఁడు రాష్ట్రపుఁ బొలిమేరలను శౌర్యధనులగు వీరభటుల సంరక్షణమున నునిచి, యాపార్శ్వముల శత్రువులు గలయెత్తకుండున ట్లొనర్చెను.

7. అభివృద్ధికిఁ గారణములు.

దండయాత్రలలో సోదరులు నలువురుఁ శౌర్యనిధియగు నళియబాలప్పయు నన్యులగు రెడ్డిరాజులును విశేషించి తోడ్పడినను, ముఖ్యముగ రెండవతమ్ముఁడగు బుక్కరాయని బలదర్పమే హరిహరుని సర్వజయములకుఁ గేంద్రస్తంభమువలె నాధారభూతమైన దనవచ్చును. ఈబుక్కరాయఁడు ద్వారసముద్రము మొదలు నూఱుపట్టణములను శత్రుముఖమునుండి తప్పించి, తమరాజ్యముతోఁ జేర్చెను. సామ్రాజ్య మంతయు నాఱుఖండములుగ విభజించి, వానిని గేంద్రపట్టణముతో సంబంధపఱచుటకుఁగావించిన యాతని ప్రయత్న మత్యధికమైనది. బుక్కరాయఁడింతటి బాహాటోపప్రచండుఁడును గార్యదక్షుఁడును నగుట, హరిహరునియనంతరము ద్వితీయుఁడగు కంపభూపతి, తాను న్యాయరీతిని సామ్రాజ్యమునకుఁ జక్రవర్తి కావలసియుండినను, నప్పటి రాజకీయ

కల్లోల పరిస్థితులను గమనించి, యట్టి ప్రమాదకర సమయమున రాజ్యవ్యవహారమును నిర్వహించుటకుఁ, దన కంటెఁ దనతమ్ముఁడగు బుక్కరాయఁడే సర్వవిధముల సమర్థుఁడనితలఁచి, తా నుదయగిరిదుర్గ పరిపాలనతోడనే సంతృప్తిఁజెందెను.

## 8. సామ్రాజ్యసూత్రధారి

హరిహరుఁడిట్లు బలాఢ్యులగు రాజులనుజయించి, యేకవిధమునఁ దనరాజ్యమును వృద్ధినొందించుటకును, బలహీనులగు సామంతప్రభువులకుఁ దోడై వారియాత్మ గౌరవాదులను సంరక్షించుటకును, ఈకార్యకలాపముల కెల్లఁ బ్రధానపరికరము లనఁదగిన యమితైశ్వర్యము-నపారమగుసైన్యము-శాత్రవదుర్లంఘ్యములగు కోటలు-వీరభట సురక్షితములైన దుర్గములు-సమకూర్చుటకును, సోదరులయు దండనాధిపతులయు శౌర్యవిస్ఫూర్తి ప్రధానకారణమనుట నిస్సంశయము; కాని వీనియన్నింటి కిని మార్గదర్శియగుచు మహాధీవిశారదుఁడై, హరిహరునకుఁ గులగురుఁడును నమాత్యపుంగవుఁడును నయి, ముఖ్యములగు రాజ్యవ్యహారములలో నెల్లఁ బ్రవేశము గల్గించుకొని, రాజున కన్నివేళల సక్రమాలోచనలఁ దెల్పుచు, విద్యానగరసామ్రాజ్యాభివృద్ధికొఱ కత్యంతము పరిశ్రమించి, క్రమపథమున దానిని నడిపింపఁ జాలిన సూత్రధారి యొకఁడుండెను. అతఁడే—

## విద్యారణ్యస్వామి

౧. జననము-సోదరులు — ఈతనిది బోధాయన సూత్రము; యజుర్వేదశాఖ; భారద్వాజ గోత్రము. ఇతనితండ్రి మాయణాచార్యుఁడు; తల్లి శ్రీమతి. ఎనిమిదవ శతాబ్దమునుండియుఁ బ్రసిద్ధివహించిన శంకరాచార్య పీఠమునకుఁజెందిన పురుషుఁడీతఁడు.

"శ్రీమతీజననీ యస్య సుకీర్తి ర్మాయణఃపితా;
సాయణో భోగనాథశ్చ మనోబుద్ధి సహోదరౌ
యస్య బోధాయనంసూత్రం శాఖాయస్యచ యాజుషీ;
భారద్వాజకులం యస్య సర్వజ్ఞః సహిమాధవః"
—పరాశరమాధవీయము.

పూర్వాశ్రమమున నీతనిపేరు మాధవుఁడు. పీఠాధికారముఁ బొందినతరువాత 'విద్యారణ్యుఁ'డన వెలసెను.

విద్యారణ్యుని సోదరులలోఁ బ్రథముఁడు సాయనయు, ద్వితీయుఁడు భోగనాథుఁడును. సాయన నెల్లూరియందు వసించుచు కంపభూపతికడను పిమ్మట రెండవ సంగమునియొద్దను ముఖ్యామాత్యుఁడుగ నుండియున్నవాఁడు. భోగనాథుఁడు క్రీ. శ. ౧౩౩౧వ సంవత్సరమున శ్రీవిద్యాతీర్థస్వామిచే శృంగేరీపీఠమునకు నియమింపఁబడి, యాదిమొదలు 'భారతీతీర్థ' యనఁబడి, తన జీవితకాల మంతయు సరస్వత్యారాధనముననే కడపి, యేఁబది సంవత్సరములకుఁ బిమ్మట ౧౩౮౦ వ యేఁట సిద్ధినొందెను.

౨. గురుత్రయము— మాధవ విద్యారణ్యుఁడు 'అస్మాకం ముఖ్యగురుఃపాతు విద్యాతీర్థ మహేశ్వరః' అని తన యనుభూతప్రకాశికలోఁ జెప్పికొనియుండుటచేఁ బయినఁదెల్పిన విద్యాతీర్థస్వామి యీతని ప్రధానగురుఁడని స్పష్టమగుచున్నది. మఱియు నీమాధవునకు భారతీతీర్థస్వామియు శ్రీకంఠుఁడును ద్వితీయ తృతీయాధ్యాపకులుగ నుండియున్నట్లు ప్రసిద్ధి. విద్యారణ్యుఁ డీయాచార్యత్రయమును గూర్చి తన గ్రంథములయం దిట్లు వ్రాసికొనెను.

'.........శ్రీభారతీతీర్థతో
విద్యాతీర్థ మపాశ్రయన్ హృదిభజే శ్రీకంఠ మవ్యాహతమ్'
'సభావ్యాద్భారతీ తీర్థ యతీంద్ర చతురాననాత్' — భారతీతీర్థ.
'శ్రీకంఠశ్చ గురుః పరోఽపి గురవో లోకత్రయే వ్యద్భుతమ్'
—మహాగణపతి స్తవము.

ఇందలి శ్రీకంఠుఁడు మాధవవిద్యారణ్యున కేకాక యాతని సోదరులగు సాయనభోగనాథులకుఁగూడ నాచార్యుఁడయి యుండెనని తెలిసెడిని. మాధవుని ప్రథమ గురుఁడగు విద్యాతీర్థస్వామి ౧౩౩౩ వ యేఁట సిద్ధి నొందెను.

౩. భాషాసేవ— యవను లొకవైపునుండియు జైను లింకొకవైపునుండియు స్వమతవ్యాప్తిగావించుచు, నార్షధర్మక్షయమునకు దారితీయుచుండుటచే నీ యఖండ ధిషణాధురంధరుఁడు, పూర్వపరాశ్రమముల

యందుఁ దన జ్యేష్ఠానుజుఁడగు సాయన సాయమున, ననేకవిషయములలో లోకోత్తరములగు గ్రంథములను బెక్కింటిని రచించి, వైదికధర్మాభివృద్ధికి మిక్కుటముగఁ దోడ్పడెను. ఇందుతో గీర్వాణభాషాయోషకు నయిత మిమ్మహనీయుఁ డత్యనుపమానమైన సేవ యొనర్పఁగలి గెను. ఈతఁడు వేదభాష్యకర్తయు పరాశర మను స్మృతులకు వ్యాఖ్యాతయును; వెండియు కాలమాధ వ్యము-వ్యవహార మాధవ్యము-నిత్యాది గ్రంథసంతతికి నీవిద్యాసాగరుఁడు పిత. ఈతని వేదాంతగ్రంథములలో జీవన్ముక్తిప్రకాశము- పంచదశి- సుప్రసిద్ధములు.

౮. నగరనిర్మాణము— శ్రీమాధవవిద్యారణ్యుని శాపమే వెనుకటి యానెగొంది రాయవంశ వినాశము నకుఁ గారణమయ్యెనని కొందఱుచరిత్రకారులు నుడివిరి. జంబుకేశ్వరుని యనంతర మారాష్ట్రమున నరాజకము ప్రబలుటవలన నీయతీంద్రుఁడు విరూపాక్షక్షేత్రమునకు విజయముచేసి నవీన నగరనిర్మాణమునకు హరిహరునిఁ బ్రోత్సాహపఱిచెననుట సువ్యక్తము. తరువాత నూతన సామ్రాజ్యమున కా రాజోత్తముని నాయకునిగ నభి షిక్తునిఁజేసి, తదభివృద్ధికిఁ బెక్కుభంగులఁ దోడ్పడెను.

౯. తపశ్చర్య— నగర నిర్మాణకాలమునాఁటికే యీమహాపురుషుఁడు సన్న్యాసాశ్రమముస్వీకరించి పదు నేనేండ్లయియుండెను. ఈనిర్జితేంద్రియుఁడు కేవల సాత్త్వి కోన్నతిచేఁ బెక్కేండ్లు తపస్సుచేసి, లక్ష్మీసాక్షాత్కా-

రముఁ బొందెననియు, శ్రీభువనేశ్వ ర్యనుగ్రహమున నూతన నగరమునందు ౩౹ గడియలకాలము కనకవృష్టిఁ గురియించెననియుఁ బ్రతీతి.

తే॥ "సకల విద్యాప్రవీణుఁడై ♦ జనవరేణ్య
యమ్మహామాని శ్రీలక్ష్మి ♦ ననుసరించ
మహిత చింతామణీ మంత్రి ♦ మక్కు మెఱఁగ
సార్వభౌమోన్నతిఁ బెక్కేండ్లు ♦ జపముఁజేసె.

వ॥ అమ్మనీందిరి చంద్రుండు......తనకు నమ్మహాదేవి తోడుగావలయు నని... ..

తే॥ అమ్మహాదేవితోడ ని ♦ ట్లనియె నతఁడు
వేడ్క మీఱంగ నా పేర ♦ వెలయునట్టి
పురముఁ గావింపవలయుఁ ద ♦ త్పురమునందుఁ
జెలఁగి సంతతమును నీవు ♦ నిలువఁదగను.

చం॥ అనవిని యిందిరారమణి ♦ యమ్మునిచంద్రునితోడఁబల్కె నో
వినుత గుణాఢ్య! నీదు వెను ♦ వెంటనె వచ్చెదఁ బొమ్మ
ముంగల ......"  —కృష్ణరాయవిజయము.

౬. మంత్రిత్వము—విరూపాక్షరాయఁడు విద్యానగరసామ్రాజ్యమునకుఁ గిరీటధారియగు పర్యంతము విద్యానగరరాజులయొద్ద మాధవవిద్యారణ్యుఁ డమాత్యశేఖరుఁడుగనుండి, రాజకీయ వ్యవహారముల ననాయాసముగ నిర్వహించెను. ఈ మహామహుని దివ్యసమర్థతయుఁ బ్రతిభాప్రకర్షయునే విద్యానగరాభివృద్ధికి ముఖ్యహేతువులుగ నుండెను. ఈ యతీంద్రుం[illegible] [illegible]న మొన బదవయేఁట శృం[illegible]పీఠము నధిష్ఠించి, [illegible] లో[illegible] మెనుబడియైదవ సంవత్సరమున సిద్ధినొందెను.

9. సామ్రాజ్యపాలకులు.

అనేకశతాబ్దములవఱకు బలాఢ్యులగు హైందవ ప్రభువులే విద్యానగర సామ్రాజ్యమును బరిపాలించుట సంభవించెను. ఈహేతువున నుత్తరహిందూస్థానము నందలి సుల్తాను లధికారముఁగొఱకును రాష్ట్రసమాక్రమణార్థమును రెండుశతాబ్దములకాలము దక్షిణాపథము వంకఁ దలయెత్తి చూచుటకుఁగూడ సాహసింపరైరి. విద్యానగరపాలకులు ధనరాసుల నపరిమితముగఁగూర్చి, వానిని బర్వతబిలములలో దాఁచుచుండెడివారు. ఈ విషయ మారాజులకును వారియాప్తులగు నమాత్య మండలికినిఁదప్ప, నన్యులకుఁ దెలియుచుండలేదు. ఆ రాజుల యిలువేలుపు విరూపాక్షేశ్వరుఁడు. మత సహనము విద్యానగర ప్రభువుల కొక స్వభావగుణ మయి యొప్పెను. చాళుక్యులకువలె నాన్నృపతులకుఁ గూడ వరాహరూపము సామ్రాజ్యచిహ్నము. విద్యానగర రాజధాని కర్ణాటకదేశమున నెలకొనినను తదీయ సామ్రాజ్యాధినాథు లాంధ్రులగుటచే మాతృభాషాభిమాన తత్పరులై యాంధ్రకవులను పండితులను జేరఁదీసి గారవించుచుఁ, దన్మూలమునఁద్రిలింగభాషను బోషించిరి. ఈవిషయము మున్ముందు విపులముగవివరింపఁబడును.

10. హరిహరుని దానశాసనములు.

విద్యానగరమునకు వందలకొలఁదిమైళ్ళ దూరముననున్న శృంగేరికి సమీపమునందలి 'కాపలూ'రను

నామాంతరముగల హరిహరపురిని, హరిహరుఁడు కేశవ భట్టు కుమారుఁడగు ననంతసూరికి దానముచేసినట్లు, క్రీ. శ. ౧౩౩౬ వ సంవత్సరపు శాసనమొకటి నుడువుచున్నది. ఈమహారాజునకుఁ బరమభక్తుఁడును చంద్రవంశజుఁడును నగు బాయన్న, 'హిరిగందసి' (మైసూరు) దగ్గఱ నొకచెఱువును నగ్రహారమును నిర్మించి, యగ్రహారమునకుఁదనతల్లిజ్ఞాపకార్థము 'మంగపట్టణ'మను పేరు పెట్టి, ప్రభుని గౌరవార్థమై వానిని బ్రాహ్మణులకు దానము చేసినట్లు క్రీ.శ. ౧౩౪౩వ (స్వభాను)సంవత్సర శాసనమునఁ గలదు. దక్కనునందలి పెక్కురాష్ట్రములను సాధించుటలోఁ దన నిరుపమాన దోర్వీర్యము వెలయ, రణరంగమున ఘోరముగఁబోరి వీరశయనముఁబొంది, తన నిష్కళంకమైన ప్రభుభక్తినిఁ బ్రకటించిన కొండటి రెడ్డి రాజుల జ్ఞాపకార్థమై హరిహరుఁడు 'వీరకల్లు' సంస్థాపించినట్లు హొస్సూరుశాసనము (౧౩౪౬) వ్యక్తపఱచెడిని. హరిహరుఁడును, నాతనితమ్ములు నలువురును, నళియ బాలప్ప దండనాథుఁడును, కుమార సోమన్నయొడయరును, రాజ్యపాలనము సేయుచున్న కాలమునఁ, బశ్చిమమునుండి తూర్పుసముద్రమువఱకు నుండు రాష్ట్రముల నన్నింటిని జయించి, యందులకు గౌరవసూచకముగ భారతీతీర్థ శ్రీపాదులవారి శిష్యమండలికిఁ-నలువదిమంది బ్రాహ్మణులకును-హరిహరుఁడు నవగ్రామములను దానపూర్వకముగ సమర్పించినట్లు, క్రీ. శ. ౧౩౪౬ (శా. శ.

౧౨౭ పార్థివసంవత్సర ఫాల్గుణబహుళపాడ్యమి) నాఁటి శృంగేరి శాసనము ప్రకటించుచున్నది. హరిహరుని తమ్ముఁడగు బుక్కరాయఁ డావఱకే విద్యానగర సామ్రాజ్యమునకు యువరాజయి యున్నట్టుకూడ, నీ దానశాసనమువలనఁ దెలియనగును. ఈ దానశాసనములు హరిహరుని దిగ్విజయమునుగూర్చి చాటుటతో, నాతఁడు మైసూరిరాష్ట్రమంతయు నాక్రమించినవిషయమును, ప్రభునియెడఁ బ్రజకును బ్రజయెడఁ బ్రభునకును గల భక్తి విశ్వాసాతిశయములను, దృఢపఱచుచున్నవి.

హరిహరుఁడు విశేషవిత్తముతో మహాసామ్రాజ్యమును బుక్కరాయని యధీనముచేసి, క్రీ. శ. ౧౩౫౦ వ సంవత్సరమునఁ గీర్తిశేషుఁడయ్యెను.



# అయిదవ ప్రకరణము.



## మొదటి బుక్కరాయఁడు ౧౩౫౦-౧౩౭౭.

### 1. భామినీరాజుల ప్రతిఘటనము.

హరిహరుని వెనుక నాతని తమ్ముఁడగు బుక్కరాయఁడు సింహాసనము నధిష్ఠించెను. విద్యానగర పట్టణము నిర్మించుటలో హరిహరుఁడే ప్రాధాన్యము వహించియున్నను, దానిని నెలకొల్పుటయందును - సామ్రాజ్యమును విస్తరింపఁజేసి రాష్ట్రభాగముల నేర్పుటలోను - బుక్కరాయఁ డత్యధిక ప్రయాస వహించియున్నందున, నీతఁడు కిరీటధారి యగునప్పటికి విద్యానగరసామ్రాజ్య మత్యంత బలవత్తమస్థితి నందియుండెను. రాయఁడు శౌర్యధనుఁడగు రాజగుటచే నగ్రజునియేలుబడి సమయముననే యాతఁడు తురుష్కులను దఱిమి, తుంగభద్రానదికి దక్షిణముననున్న రాష్ట్రమంతయును, దూర్పున నోఢ్రకళింగదేశములను జయింపఁగలెనని పాఠకులు గ్రహించియున్నారు. రాయఁడు బళ్ళాలరాజులకును నోరుగంటి ప్రభువులకును దక్కిన సామంత నృపతులకును నండయై, వారి యున్నతినిఁ బోషింప నన్నివిధములఁ బ్రయత్నింపఁజొచ్చెను. దక్షిణదేశమునందలి రాజు లందఱును గల్పకమువలెఁ దమకు

రక్షకముగనుండెడి యీ విద్యానగరపాలకుని పురోభివృద్ధి యే నిరంతరము నభిలషించుచుండిరి. బుక్కరాయుని సమయమున నుత్తరహిందూస్థానము 'ఫిరోజు' అను వాని పరిపాలనమున నుండెను. ఆపాదుషా తనపినతండ్రి (మహమ్మదుతుఘలకు) నిర్మించిన కఠోరశాసనముల నెల్లఁ దొలఁగించి, ప్రజాహితమున కత్యవసరములగు కైంకర్యముల నెన్నింటినో కావించి దొడ్డరాజని పేరొందినను, నాతని మతవిద్వేషముమాత్రము హిందువులకు దుస్సహమయ్యెను. హిందువుల మతగ్రంథములను వారి దేవసదనములను విగ్రహములను ఫిరోజు పాడొనర్చుటయే కాక, యాతఁడొక్కొక హిందువునకును జుట్టుపన్ను విధించెను. దానిఁజెల్లింపలేక యెందఱో ప్రాణములను గోల్పోయిరి; కాని పాదుషా పన్నుగ్రహించుటమాత్రము మానఁడయ్యెను. నాస్తికమత మవలంబించుట లంచములు గ్రహించుటనువలె నపరాధముక్రిందఁ బరిగణించి, యట్టివారికి శిక్షవిధించుచుంటినని, ఫిరోజు స్వీయచరిత్రమున వ్రాసికొనెను. హిందువులు నాస్తికు (కాఫరు) లనుట మహమ్మదీయులభావము. ఇట్టి నిరంకుశాధికారము తీవ్రబాధాకరమగుటచే, మతాభిమాన నిరతులగు హిందువులనేకు లభిజనమువీడి, శాంతికర జీవనమునకై బుక్కరాయని కాలముననువిద్యానగరమునకు రాఁదొడఁగిరి. వైదికమతావలంబులకు మాత్రమేకాక మతాంతరుల సుస్థిర సుఖజీవనమునకును విద్యా

నగర మాధారమై వెలసెను. ఒకవంక విద్యానగర సామ్రాజ్యమిట్లు వృద్ధినొందుచుండ, వేఱొకవంక భామినీ రాజు లీర్ష్యఁగొని దానియున్నతి నడఁగఁద్రొక్కుటకై ప్రబలతరప్రయత్నములు గావించుచు, నిష్కారణ కల హములఁ గల్పించుకొని, తఱచు విద్యానగరముపై దండెత్తుచుండిరి. భామినీసుల్తానుల యీవిద్వేషతుపాగ్ని ౧౮౦ సంవత్సరములకాల మేకసరణినిబొగయుచుండినది.

## 2. మహమ్మదుషాతో యుద్ధము.

బుక్కరాయఁడు భామినీ సుల్తానులతో రెండు పర్యాయములు పోరవలసి వచ్చినది. ఇందు మొదటి పోరాటము ౧౩౬౬లో మహమ్మదుషాతోను, రెండవది ౧౩౭౫లో ముజాహిదుషాతోను, సంభవించెను. భామినీ రాజులు విద్యానగరముతో జగడము పెట్టుకొనిన యీ రెండు తడవలును బొందిన ప్రయోజనము కానుపీసమేని గలుగదయ్యెను. వారు విస్తారమగు సైన్యముఁ గో ల్పోయి విశేష వ్యయప్రయాసములకుఁ గూడ లోనైరి. రెండవవాఁడగు ముజాహిదుషా రెండుమాఱులును దన తెగువకుఁదగిన పరిభవమే పొందెను. ఈయుద్ధములను రెండింటిని గూర్చి ఫెరస్తావిషయభాగములను బట్టియిట సంగ్రహించెదము.

౧. బుక్కరాయనిఁజెనకుట—ఒకనాఁటి సాయం కాలమున నానం దారామము నుండి, యపుడపుడే బహిర్గతమగు నూత్న వసంతసమయ సాంధ్యరాగప్రభ

లు గండభాగములఁ జుంబించి, సుల్తానుని వదన బింబమున శోకసమీరతేజముఁ గూర్చుచుండ, నాతఁడు తన విశ్రాంతి భవనమునందున్న మెత్తపై సుఖోపవిష్టుఁడై యిరుగడల నంగనామణు లొసంగెడు నాసవమందుకొని దాని మనసార సేవించుచు, సంతోషసాగరమగ్నుఁడై మదోన్మత్తతచే నొడలెఱుంగక యున్న తఱి నిరువురుగాయకు లరుదెంచి, తత్కాలోచితములును మానసోల్లాససంజనకములును నగు గీతముల శ్రవణపేయముగ గానమొనర్చి, ప్రభుని బ్రహ్మానందపరవశునిఁ గావించిరి. తోడనే మహమ్మదుషా యా గానకళా ధురంధరులకుఁ బారితోషిక ద్రవ్యము విద్యానగర ధనాగారము నుండి యీయవలసినదని, యాప్రభున కుత్తరువుచేసెను. ఒడలెఱుఁగక పాదుషా పంపిన యాసందేశపత్రము నిండుకొలువులోనున్న బుక్కరాయుని కందినది. ఆతఁడు దానిఁగాంచినంతనే క్రోధఘూర్ణితనయనుఁడై, యాలేఖఁ గొనివచ్చిన తురుష్కభటుని నొకగార్ధభముపై నునిచి, విద్యానగరమునం దంతటను నూరేగించి యహమద్ నగరమునకు సాగనంపి విడిచెను. అంతియకాక రాయఁడాగ్రహావేశమునఁ ముందువెనుక లాలోచింపక, విశేష సైన్యముఁ గూర్చికొని కృష్ణాతుంగభద్రా సంగమస్థలమునకుఁ బశ్చిమమునఁగల రాయచూరి మండలములోని ముద్గల్లుప్రవేశించి, యా పురవాసులను దననిశితాసిధార కాహుతిచేసెను.

౨. హిందూసేనల యుద్రేకము — ఈవృత్తాంతమువినిన మహమ్మదుషా విశేషరోష విషాదాక్రాంతస్వాంతుండై, యాదుఃఖవార్త తెచ్చిన నిజసేవకుని నాయుత్తరక్షణమే తనశాతఖడ్గమునకు బలియొసంగెను. హైందవు లొనర్చిన యీఘోరాపచారమునకుఁ బ్రతీకారముగ నొక లక్షసంఖ్యగల కాఫర్లను గడతేర్చుదనుకఁ గత్తినొఱఁనుంచుట లేదని పాదుషా ప్రతిజ్ఞసల్పి, తన సేనతోఁ గృష్ణానదిని దాఁటి, విద్యానగర సైన్యమును బాఱఁదోలి, డెబ్బదివేలమంది పురుషులను స్త్రీలను శిశువులను విశసనమొనర్చెను. పిమ్మటఁ గొన్ని నెలల కాయెఁటనే బళ్ళారితాలూకాయందున్న సిరిగుప్పసమీపమున తుంగభద్రానదిని గడచి, మహమ్మదుషా విద్యానగరమును ముట్టడింపనేఁగెను. అతఁడిట్లు దండెత్తి వచ్చుచున్నవార్తవిని, బుక్కరాయఁ డామహమ్మదీయప్రభుని దారిలో నడ్డగించుటకై, తనసేనానాయకులలోఁ బేరొందిన మల్లినాథుని ౧౩౬౬వ సంవత్సరము జూలై నెల ౨౩వ తేది మహావాహినిఁదోడిచ్చి పంపెను. ఆదవని తాలూక కౌతాలము నొద్దనున్న విశాలమైన నల్లరేగడ బయలులో, హిందూమహమ్మదీయ సేనలు తారసిల్లినవి. ఇరువంకలవారి ఫౌజులు తెల్లవాఱినది మొదలు సాయంకాలము నాల్గుగంటలవఱకు, సముద్రతరంగములవలె నేకముఖముగ నొండొంటిని ఢీకొనుచుఁ, బెల్లుగఁ బోరుసల్పెను. మొట్టమొదట విద్యానగరవీరులు మిగుల

విజృంభించి, మహమ్మదీయ భటుల వేఁటికెత్తుటి ప్రవాహమును వెడలించిరి. తురుష్కదళము ఛిన్నాభిన్నమై దశదిశలఁ బరుగువాఱుదొడఁగెను. జయలక్ష్మి విజయనగరయోధవర్గము నే వరించెనని యెల్లరును విశ్వసించిరి; కాని యదృష్టదేవత మూర్ఖాగము వైచెను.

3. మహమ్మదీయుల విజృంభణము— ఒకవంక నుండి మహమ్మదుషా పాఱిపోవుచున్న బలఁగముఁ బురికొల్పికొని మూఁడువేల సంఖ్యగల గుఱ్ఱపురౌతులతో వచ్చుచుఁ, గొంతమూలబలము నొసఁగి ముక్రీబుఖానుని ఫిరంగులను గాల్చుటకై వేఱొకదెసఁగా రాఁబనిచెను. ముక్రీబుఖానుఁడు హైందవానీకము పై నగ్నిగోళప్రవర్షముఁ గుంభద్రోణముగఁ గురియించి, శత్రువాహినిని జీకాకు పఱుపఁజొచ్చెను. ఇంతలో మహమ్మదీయ సేనలోని సమరమదకుంజర మొక్కటి ఘీంకారము సల్పుచు హిందూసేనా సరోవరముఁ జొచ్చి, స్వేచ్ఛగ దానిఁగలంపఁ గడంగెను. ఈభీకరసంక్షోభదశలో విద్యానగరపు గమికదుంగడుఁజలించి చెల్లాచెదరై పోయెను. ఇంతలో మల్లిదండనాథుఁడు గాఢమగు ఘాతమునొంది సమరస్థలినుండి నిర్గమించెను. యవనుల సైన్య మదిగని, ద్విగుణీకృతోత్సాహమునఁజెలరేఁగి విద్యానగర యోధవర్గమును నేలకుగోలకుఁదెచ్చెను. తురుష్కవీరనిచయము హృదయవిదారణమగు మారణకర్మమున నుపక్రమించి, తల్లియురమునఁ బాల్గుడుచు శిశువులను, నానిసుఁగులకై చేతులఁ

జాఁచు మాతలను, నిండుచూలాండ్రను, జెఱకుగడలవలె ఛేదింపఁదివిరెను. క్రమక్రమముగ మహమ్మదుషా బుక్కభూపతినిఁగదిసి, ససైన్యముగ నాతని నొకచోటనుండి వేఱొకచోటికిఁ దఱుముచుఁ, దనకెదురగు హిందువుల నెల్ల నఱుమాడుచు వెంబడింపఁగా, బుక్కరాయఁడు విద్యానగరముఁ జొచ్చెను. మహమ్మదుషా యానగరమును ముట్టడించి దుర్గప్రవేశ మొనర్చుటకై నెలదినములు ప్రయత్నించెను; కాని యది సాధ్యముకాలేదు. చివరకాతఁడు హతాశుఁడై వెనుదిరిగిపోయెను.

౮. ఫెరస్తా నిరాధారపు వ్రాఁతలు—విద్యానగర సైన్యము లాసమయమున భామినీ సుల్తానుని మరల వెంబడించెననియు, మహమ్మదుషా యాసేనను గ్రమ్మఱ వెనుకకుఁ దఱుముకొని వెళ్ళి, యైదులక్షల హిందువులను వధించెననియు ఫెరస్తావ్రాసెను. ఇంత శౌర్యాడంబరము జూపిన పిమ్మటఁ గూడ నాయకులకుఁ బారితోషిక ద్రవ్యమొసఁగినచో మరలిపోయెదననియు, మున్ముందు యుద్ధప్రయత్నములు చేయననియు మహమ్మదుషా బుక్కరాయని కెఱింగించెనఁట! బుక్కరాయఁ డాయొడంబడిక ననుసరించి సంధిగావించుకొనెనఁట! మహమ్మదుషా హిందువులకుఁ బ్రబలవిరోధియనుట నిస్సందియము. ఆహేతువుననే యాతఁడోరుగంటిపైఁబడి, యందలి రాజులను దఱుమకాఱియ వెట్టుట తటస్థమగుచుండెను. ఓరుగంటిప్రభుఁడగు వినాయకదేవుఁడీతని దౌష్ట్యములకాఁ

గలేక విస్తారధనమును-మూఁడుకోట్ల రూప్యముల విలువ గలరత్న ఖచితమగు కనకాసనమును-గోల్కొండదుర్గమును-నిచ్చివైచెనఁట! ఆయోరుగంటి ప్రభునకు బుక్కరాయఁ డాశ్రయ మొసఁగుటకై, మహమ్మదుషాను నిగ్రహించి యాతనితో నప్పటప్పుడు తలపడవలసి వచ్చినది. అట్టి సమయములలో హిందువులు తురకలను తురుష్కులు హిందువులను బరస్పరము కసితీఱ వధించుకొనియుండవచ్చును; కాని మహమ్మదుషా బుక్కరాయుని నాతని సేనతో నొకచోటనుండి వేఱొకచోటికిఁ బలుమాఱు తఱిమెననియు, నైదులక్షలమంది హిందువుల నొక్కమ్మ వధించెననియు, నింతటి ప్రయాసవహించియు రాష్ట్రసంపాదన దాహ బాధితుఁడై జయోపేతుఁడైన యాతురుష్కరాజు, పరాభూతుఁడైన హిందూప్రభువునుండి గాయకుల బహుమతికానుకలఁ గొనుటతోడనే తృప్తినొంది విద్యానగరముతో నింకెప్పటికిని బోరు సలుపుట లేదని దివ్యమెత్తి వెళ్ళెననియు నుడివిన నుడువులెంత సత్యబద్ధములో యూహించుట సులభము. ఫెరిస్తా తురుష్కుఁడై మహమ్మదీయుల ప్రాద్బలమునఁ గట్టువంకఁ బ్రొయ్యి దీర్చినట్లు చరిత్రవ్రాసిన వాఁడగుటవలన, విద్యానగర ప్రభువులు మహమ్మదీయ సుల్తానులతో యుద్ధముచేసిన పట్టులు వివరించిన సందర్భములయందెల్ల నాతఁడిట్టులే తకపికలు సేసియున్నాఁడు. దక్షిణా పథమునందలి వీరాధివీరులలోనెల్ల నొక్కఁడై వీరబుక్కమహీపతియున

విరాజిల్లిన యీమహారాజును, ఫెరిస్తా పరమభీరువుగను కేవలదుర్బల హృదయునిఁగనుజిత్రించెను.

3. ముజాహిదుషాతో యుద్ధము

౧. ముజాహిదుషా తమకము— మహమ్మదుషా ౧౩౭౫వ యేఁటగతించెను. అతనియనంతరము రాజ్యారూఢుఁడైనవాఁ డాతని కుమారుఁడగు ముజాహిదుషా. ఫెరిస్తానుడివినట్టి యొడంబడిక నీతఁడువీటఁబుచ్చి, రాజ్యపు మేరలఁ గూర్చినవివాద మొకమిషగ నంచికొని, విద్యానగరముపై యుద్ధము ప్రకటించెను. తమపరి నాతఁ డపారబలముఁ గొని నదినిదాఁటి సేననాదవనిముఖము వఱకు నడపెను; కాని బుక్కరాయఁడు నగరమున లేఁడనియు నసైన్యముగ సొండూరు కొండలకు వెళ్ళెననియు గ్రహించి, యాతని వెంబడించుటమాని, విద్యానగరమును స్వాధీనము గావించుకొను నాసచే నువ్విలేక ముప్పందుముఁ దాఁవఁ బ్రయత్నించెను.

౨. బుక్కరాయఁ డాతనిఁ జిక్కులఁబెట్టుట— ముజాహిదుషా విద్యానగరపు ముట్టడివలన విఫలమనో రథుఁడై, వేఱొండుదారవుఁ గానక బుక్కరాయుని నిర్బంధించు తలంపునఁ, దనసేనను సొండూరి కొండలవంక మరల్చెను. అందలిచిక్కుత్రోవలు నవాబునకుఁ దెలియనివగుటచే, నాతని నాపర్వత సానుతటములలో నలయింపనెంచి, బుక్కరాయఁడు శత్రుసేన కగపడకుండ, నా సొండూరిదుర్గము కాంతార ప్రదేశములలో, నొక

యడవినుండి వేఱొకయరణ్యమునకును, నొకగుట్టనుండి మఱొకగుట్టకును, నొకలోయనుండి యింకొకలోయకును ద్రిప్పి, రమారమి యాఱునెలలకాలము సుల్తానుని నాతని సేనను మిగులఁ జీకాకునొందించి, చివరకు రాజధానిఁ బ్రవేశించెను. తురుష్కప్రభుఁ డాభూధర మాలికావళులలో నమ్మహాటవీప్రదేశములనడుమఁ దిమ్మదిరిగి యసురసురయ్యు, నాతిప్పటవలనఁ దనకును దన సైన్యమునకును గలుగుచున్న దుస్సహామగు కష్టమును నష్టమును విధిలేక సైచి, బుక్కరాయని వెన్నంటి తఱుముచునే విద్యానగరమును దాఁకి, కొండపిండిగొట్టఁ దివిరెను. హైందవయోధు లల్పసంఖ్యాకులయ్యును బెట్టనికోటలై మార్తురఁ జెండిచెండాడిరి. సుల్తానుని యోధవర్గ మపారమగు నష్టమునకు గుఱియైనది. చివరముసలిమానుఁ జేని పూన్కి యందనిమ్రానిపండ్లకఱ్ఱులుసాఁచుట యయ్యెను.

3. విపరీత విషయములు—సుల్తాను యుద్ధము చాలించుకొని యంతటితో నూరకుండక, తన సైన్యము నాదవసదుర్గమువంక మరల్చి, దానినాక్రమించుటకై తొమ్మిదిమాసము లెడతెగక ప్రయత్నించి, యచ్చటను ముక్కుఁ గోఁతలకు లోనయ్యెను. పరాభవానల దందహ్యా హృదయుఁడగు నాపాదుషా ముట్టడినివదలి, మార్గమునఁ జిక్కినవారినెల్లఁ జెఱఁగొని స్వదేశమునకుఁ బోయెను. బుక్కరాయఁ డీరెండుదండయాత్రలలోను మిగులగాసిఁ జెందెనని ఫెరస్తా తెల్పెను. కాని యట్టిబాధ నొందఁ

దగిన ప్రమేయమెద్దియును బుక్కరాయనికిఁ గలుగలేదు.

౮. శాసనములేమి చెప్పుచున్నవి?—ఎపిగ్రాఫికా కర్ణాటికా (౨౫౬ సంపు-౫౩౦ పుట) చూడుఁడు; అందే జీ. డి. ౮౬వ సంఖ్యగల తామ్రశాసనము సయితము బుక్కరాయుని విక్రమమునుగూర్చి యిట్లు తెల్పుచున్నది.

"బుక్కరాయో భవక్ష్మామా భుజార్జిత పరాక్రమః,
మేదినీవ ప్రజాయేన స్వపుత్రా ఇవ రక్షితాః. ౧౩.
రాజరాజభుజంగో యం పరరాజభయంకరః,
హిందురాయ సురత్రాణ ఇత్యై తైరుపశోభితః." ౧౪.

హిందూరాజ శిరోమణియనియు, తీవ్రశాసనుఁడనియు, శత్రురాజ హంతకుఁడనియు, నసత్యవాదులపట్ల యమసదృశుఁడగు నాయకుఁడనియు, ప్రాక్పశ్చిమ దక్షిణ మహాసముద్రాధీశుఁడనియుఁ, బ్రాచీనశాసనములే ప్రతాపాధ్యునిఁ గూర్చి నుడువుచున్నవి.

మఱియు నీతఁడప్రతిబద్ధమగు ధైర్యసాహసౌదార్యనిధియనియు, సంగ్రామరంగమున రోషాధీన మానసుఁడై యకుంఠితబాహువిక్రమము నెఱపు వీరాధివీరుఁడనియు, నాహవక్షోణిఁ గాలాంతకుని వోలె విజృంభించుచుఁ బరిపంథియోధుల నెదుర్కొనినపు డాతని తీక్ష్ణప్రతాపాగ్నికిఁ దురుష్కసుల్తానుల వదనాబ్జములు వాడివత్తలగుచుండుననియు, విరోధిరాజులు ముఖావలోకన మాత్రముననే వడఁకిపోవుచుండిరనియుఁ దెల్పు నాధారము లెన్నియోగలవు. అందొక్కటి—

భంగాః కళింగా మిత కార్యవృత్తే,
వంగా విభిన్నాంగ విఘూర్ణనేత్రాః,
ఆంధ్రాశ్చ రంధ్రాణి విశంతి యస్య
బాహాగ్రఖడ్గేన నిరస్యమానాః॥ ౧౧.

తురుష్కాశ్చ పుష్కవరవాః పాండ్యభూపాః పలాయితాః
స్వభుజార్జితవీర్యేణ తస్మిన్ రాజ్యం ప్రశాసతి. ౧౨.

ఇట్టి వీరవతంసమునకు, ఫెరిస్తా రచించిన భామినీ సుల్తానులచరిత్రమున, శూరులకను వైనచోటఁ దావు లేక పోవుట విపరీతవిషయముగాకుండునా? బుక్కరాయఁ డాంధ్ర కాంభోజ కొంకణ ఘూర్జర తురుష్కరాజులకు పోటుబల్లెమై యుండెను; కళింగరాజు నోడించెను.

## 4. మంత్రులు.

బుక్కరాయునికడఁ గేవలము సూక్ష్మబుద్ధిగల సమర్థులైన మాధవాచార్యుఁడు - మాధవమంత్రి - బచ్చరాజు - ముద్దప్ప - బసవదండనాథుఁడు - అనంతసాగరుఁడు మొదలగు మంత్రులు పలువురుండిరి.

౧. మాధవమంత్రి—విద్యారణ్యస్వామియని ప్రసిద్ధినొందిన మాధవాచార్యుఁడు నీమాధవమంత్రియు నొక్కరేయను నటయను నేకులభ్రమ; కాని మాధవాచార్యుఁడు వేఱు. మాధవమంత్రి వేఱు. ఇరువురకును దండ్రులు వేఱు. వారి శాఖలును గోత్రములును వెవ్వేఱు. మాధవమంత్రియు విద్వాంసుఁడే యైనను మాధవాచార్యునకుఁ దుల్యుఁడు గాక రెండవతరగతిలోని వాఁడై కన్పట్టును. మాధవమంత్రి సారస్వత శైవబ్రాహ్మణుఁడని తెలియుచున్నది.

ఈతఁడు క్రియాశక్తిపండితుని శిష్యుఁడఁట. ఇతఁడు మారభూపతి యొద్దసహితము మంత్రిగ నుండినవాఁడు. ఈయమాత్యవరుఁడు చంద్రికూటమును (చంద్రగుత్తిని) రాజధానిగఁ జేసికొని, పదునెన్మిది మండలముల రాష్ట్రమగు నాగరఖండమును, రాజప్రతినిధివోలెఁ బరిపాలించెను. ౧౩౮౭వ సంవత్సర ప్రాంతమున నీవీరుఁడు గోవానగరమును (మహమ్మదీయులను దఱిమి) వశపఱుచుకొనెను. కేవలము రాజ్యాంగ వ్యవహారముల యందేకాక యాతఁ డాధ్యాత్మిక విషయములయందును నిపుణుఁడు; కావుననే యుపనిషద్ధర్మపాలన కుశలుఁడై వేదపండితుఁడన విలసిల్లెను. ఈయశోవంతునకు భువనైక వీరుఁడనియు, నుపనిషన్మార్గ ప్రవర్తకాచార్యుఁడనియు బిరుదములున్నట్లు, ఎపిగ్రాఫియా కర్ణాటికా (సం.౮ సంఖ్య ౭౬గల) తీర్థహళ్ళిశాసనము నుడువుచున్నది. ఈతని శైవామ్నాయసారము-మాధవనిదానము - నేఁటికిని మనదృక్పథమునఁ బడుచున్నవి.

౨. అనంతసాగరుఁడు—ఈతఁడును బేరొందిన ప్రధాని. పెనుగొండకు బలాఢ్యమైన దుర్గమునునిర్మించినవాఁడు. బుక్కరాయని యాఱవకుమారుఁడగు భాస్కరరాయఁ డీమహాప్రధానిపేరుననే యనంతసాగరమను తటాకమును ద్రవ్వించెను.

౩. బచ్చరాజు—మంత్రులలో నత్యంత ప్రభుభక్తిగలిగి స్వామికార్యనిరతుఁడును భగవదారాధన త

త్పరుఁడునునయి కీర్తివంతముగ దేశసేవయొనరించిన ఘనుఁ డీబచ్చరాజు. ఈమహాభాగుఁడు, బుక్కరాయ సముద్రము కీర్తిసముద్రము మాలవ్వచెఱువు నాగవ్వచెఱువు బచ్చప్పచెఱువు మొదలగు తటాకములను నిర్మించి, చౌడప్ప కాలువను ద్రవ్వించెను. ఇట్టి ఘనకార్యముల వలనను, 'బచ్చన్న' 'కంపన్న' యను నామములతో నారామములు వేయించి వాని నభివృద్ధినొందించుటచేతను, నీతఁడు మిగులఁ బ్రసిద్ధినొందెను. ఈయశోధనుఁడు మల్లికార్జునస్వామి ప్రతిష్ఠ చేయించి, రెండవహరిహరుని కాలమున ౧౩౮౨ లోఁ, దనధర్మపత్నితోడ తుంగభద్రానదీతటమున స్వర్గారోహణ మొనరించినట్లు తెలియుచున్నది.

దూరదృష్టిగలిగి స్వధర్మములను జాలఁ బాటవముతో నిర్వహించుచు, వాసికెక్కిన మంత్రులలో ముద్దప్ప యొక్కఁడు. అందఱిలోను బ్రముఖుఁడు మాధవాచార్యుఁడు. రాయఁడు, రాజకీయ సారస్వత విజ్ఞాన విషయములందును, బరిపాలన వ్యవహారములయందును, ముఖ్యముగ సీమాధన విద్యారణ్యుని యభిప్రాయమే శిరసావహించుచుండెను.

## 5. బుక్కరాయని రాజ్యవ్యాప్తి.

ఫెరిస్తా రాయనిసంతటి సత్త్వహీనునిగఁ జిత్రించినను, రాయఁడు తనరాజ్యము నలుదెసలకు వ్యాపింపఁ జేసెననియు, నాఁటికాలమున విద్యానగరరాజ్యము భామినీ రాజ్యమునకంటె సర్వవిధముల నుత్కృష్టదశయందుండెను.

ననియు నాతఁడంగీకరించుచున్నాఁడు; మెండియు నోరి న్సా కొలంబో మలబారు రాష్ట్రములయు సింహళము మొదలగు ద్వీపములయు నృపు లీప్రభున కనుకూలము లైన కానుక లేటేటఁ బంపుచుండిరని కూడ నాతఁడు వ్యక్త పఱుచుచున్నాఁడు. సమకాలికులగు ప్రభువులందఱిలోను బుక్కరాయఁడెల్ల విధముల నద్వితీయుఁడై విలసిల్లెను.

## 6. రాజ్యాంగ పరిస్థితులు.

బుక్కరాయఁడు దక్షిణదేశమునందలి కలహ శీలురగు రాజుల నెల్లరఁ దొలఁగించుచు, నారాష్ట్రము లను బ్రధానరాజ్యముతోఁ జేర్చికొనుచు, సామంత ప్రభువులఁ గ్రమపద్ధతిలోఁ ద్రిప్పుచుండెను. ఈతఁడు తనసోదరులను - మేనల్లుండ్రను - బుత్త్రులను - సమీప బంధువులనుమాత్రమే ప్రధానోద్యోగములకు నియోగిం చుచుండెను. రాజ్యపరిపాలనమున కొకసుస్థిరస్వరూపమే ర్పడినది యీప్రభుని కాలముననే. ప్రజాపాలనమును స్వసైన్య వ్యవహారములను మిగుల సమర్థతతో నిర్వ హించుటలోఁ బేరొంది, యావిషయమున భారతప్రపంచ మునకే యాదర్శప్రాయుఁడైన నాయకుఁడితఁడు. ఈ తని దొరతనమున సామ్రాజ్యమునం దంతటను బావులు చెఱువులు గొప్పగొప్ప కాలువలు వంతెనలు నసంఖ్యా కములుగ విస్తరిల్లెను. ఎందుఁజూచినను వ్యవసాయాభి వృద్ధికిఁదగిన సౌకర్యములను విరివిగఁగల్పించి, కృషిని సర్వవిధముల వృద్ధినొందించి కాఁపులకెల్ల నోముఁపంటమై

యీ మహారాజు విలసిల్లెను. ఉత్తరహిందూస్థాన
మునఁ బెక్కుతటాకములను కాలువలను వెలయించి,
వానిసాయమున నచ్చటివ్యవసాయమును బెంపొందించు
టలో, ఢిల్లీశ్వరుఁడగు ఫిరోజుతుఘలకునకు, విద్యానగ
రాంధ్ర రాజ్యములయందలి తటాకములు కాలువలు
వానివలని యుపయోగములునే మార్గదర్శకములయ్యెను.
తత్పూర్వము ఢిల్లీప్రాంతమునఁ గాలువల నిర్మాణపద్ధ
తియే లేకుండినది. అందుమూలమున వ్యవసాయము
నకుఁగలుగు ప్రయోజన మచ్చటివారు బొత్తిగ నెఱుంగ
కుండిరి. విద్యానగర సామ్రాజ్యమునఁ బంటనేలలకు
భూస్వభావము ననుసరించి, 'తరము' లేర్పఱుపఁబడి
నవి. రైతులు శ్రమ లేశమేనిలేక పన్నులనొసఁగు
చుండిరి. సామ్రాజ్యమునఁ బ్రజాసంఖ్య సమృద్ధిగ
వెలసెను. జనులందఱు నిత్యకల్యాణముఁ బచ్చతోరణ
మునై తామరతంపరగా నుల్లసిల్లుచుండిరనియు, వారు
సక్రమ న్యాయపరిపాలనమునకులోనై, యేవేళను దల
పూవాడక యానందకరజీవనమున సంతృప్తులై మెలఁగు
చుండిరనియు, న్యూనిజ్ ఫెరస్తా మున్నగు చరిత్రకారుల
వ్రాఁతలు తెలుపుచున్నవి. రాజుపేరను నాతని సన్ని
హితబంధువులలో నొక్కొకరి పేరునను సర్వసాధారణ
ముగ నంతటను ననంఖ్యాకములగు కుంటలు గ్రామ
ములు పట్టణములు హెచ్చెను. రాయని యేలుబడి
యందాతనిరాష్ట్రమున నైహిక విద్యకేకాక, యాధ్యా



విద్యానగర రాజుల కాలమునాఁటి యొక గ్రామతటాకము.

త్మిక విద్యకుఁగూడఁ బెక్కుపాఠశాలలు నెలకొనెను. విద్యానగరము గణనాతీతములైన సౌధముల కిక్కయై, హిందూదేశమునఁ గేంద్రవర్తకస్థానమై, వాణిజ్యమున నన్నిరాజ్యములతోడను మిక్కుటమగు సంబంధముఁగలిగించుకొని, మహోత్తరాభివృద్ధినిఁ బొందెను. మఱియు నది సమస్తవస్తువులకును స్థానమై, సర్వసంపదలకును సదనమై, భరతఖండమున నన్నివిధముల సిగబంతియై చెలువారుచు, ముఖ్యముగ మహమ్మదీయ సుల్తానుల దృష్టిని సమాకర్షించెను.

7. మతము.

బుక్క-రాయఁడు వైదికసిద్ధాంతములయెడఁ గేవల విశ్వాసతత్పరుఁడైనను మతాంతరులను సమదృష్టినారసెను. తాను శైవుఁడయ్యుఁ, దన రాష్ట్రమున వైష్ణవులయు జైనులయు మతవ్యాప్తికి, ధారాళముగ నవకాశమొసఁగెను. తన్నాశ్రయించిన మహమ్మదీయుల నందఱను బహుమానాదరభావమునఁ జేరఁదీయుచు, వారిని స్నేహభావమునఁ గాంచుచుండెను. క్రీ. శ. ౧౩౬౮ లో జైనులకును వైష్ణవులకును గలిగిన మతవివాద సందర్భమున నీప్రభుఁడు మతనాయకుల నెల్లర నాహ్వానించి, వారి చక్కట్లుదిద్ది, తన హితోపదేశమువలన వారిని శాంతశీలురనుగనొనర్చి, సామ్రాజ్యమున నెవ్వరును జాతిస్పర్థల కెడమీయక వర్తింపవలసినదని శాసించెను.

## 8. సారస్వతము.

బుక్కరాయని పరిపాలనమున సంస్కృతాంధ్ర భాషలకు రెంటికిని సమానముగు నాదరణముండినది. ఈమహాప్రభుఁడు సాయనమాధవులను బ్రోత్సహించి, స్వీయనామాంకితముగ వారిచే వేదములకు భాష్యములువ్రాయించెను. ఇవి సాయనవేదభాష్యము లను పేరున భారతలోకమున మిగుల విఖ్యాతిఁగాంచినవి. మాధవమంత్రియు నీభూజాని యాదరణమువలననే పెక్కు కృతులు రచించుట.

బుక్కరాయనికాలమున సుప్రసిద్ధాంధ్రకవియగు నాచనసోముఁడు విద్యానగరముననుండి యనేకాంధ్ర ప్రబంధములను విరచించెను. పెంచుకలదిన్న దాన శాసనమువలన నీకవి యాపస్తంబసూత్రుఁడనియు, భారద్వాజ గోత్రుఁడనియు యజుశ్శాఖీయుఁడనియు, సకలాగమ వేదియనియు, అష్టాదశ పురాణాభిజ్ఞ తార్థ వేదియనియు, భావకవిత్వనిర్మాణ ధౌరేయుఁడనియుఁ దెలియుచున్నది.

"పంపాయాం భాస్కరక్షేత్రే విరూపాక్షస్య సన్నిధౌ,
ఆపస్తంబ శాఖ్య సూత్రాయ భారద్వాజాన్వవాయినే. ౧౯.
యాజుషాణాం వరేణ్యాయ సకలాగమవేదినే,
అష్టాదశపురాణానా మభిజ్ఞాతార్థవేదినే ౨౦.
అష్టభాషాకవిత్వ శ్రీవాణీ విజిత సంపదే.
సోమాయ నాచనాంభోధే. సోమయామిత తేజసే." ౨౧.

ఈతఁడు నియోగి బ్రాహ్మణుఁడగు నాచన

కుమారుఁడు. సోమనాథుని వాసస్థానము 'నెల్లూరి మండలమునందలి యేదోయొక గ్రామముగఁ దోఁచుచున్న' దని శ్రీ వీరేశలింగముపంతులు వ్రాసెను; కాని బుక్కరాయనివలన నాచనసోముఁడు పొందిన యగ్రహారములనంతపుర మండలమునందలి గుత్తి పెనుగొండభాగములకు సంబంధించిన వగుటచే, నీకవి నెల్లూరిమండలమునకుఁ జెందినవాఁ డనుటకంటె, ననంతపురమండల వాస్తవ్యుఁడుగ నుండునని యూహించుట కెక్కుడువీలున్నది. బుక్కరాయఁడు గుత్తి ప్రాంతమునంగల 'పెంచుకల దిన్న' యను గ్రామమునకు 'బుక్కరాయపురము' అని పేరుపెట్టి, దాని నీకవికిని మఱియైదుగురు బ్రాహ్మణులకును నొసంగినట్లు పై దాన శాసనము నుడువుచున్నది.

"గుత్తి దుర్గాభిధే రాజ్యే కోడూరాఖ్యమహీతలే,
పెన్నానగాణి విఖ్యాతే సర్వసస్యైప శోభితే. ౧౧.
కోడూరు నాగనల్లాఖ్యదిన్నాభ్యా మపి పశ్చిమం,
గ్రామోత్త మాద్వేలుమంకూరోః ప్రాగ్యాద్దిశి సమన్వితం, ౧౨.
ఊరచింతిలనామ్నశ్చ గ్రామా ద్దక్షిణసంస్థితం,
వంగలూరోక్కడు తాళాభ్యా ముత్తరాశాసుపాశ్రితం. ౧౩.
పినాకినీతటే పెంచుకలదిన్నాహ్వయం పురా,
బుక్కరాయపురాఖ్యాత ప్రతినామ్నా చ శోభితం, ౧౪.
నిధినిక్షేప సంయుక్తం జలపాషాణ సంయుతం,
అక్షిణ్యాగామి సహితం సిద్ధసాధ్యసమన్వితం. ౧౫.
అష్టభోగమిదం సర్వస్వామ్య మాచంద్రతారకం,
సహిరణ్య పయోధారాపూర్వకం దత్త వాన్ముదా. ౧౬.
శ్రీమన్నాచన సోమాఖ్య మహాకవి వరో ప్యథ,
రాజాన మాశిషం చైవ చిరజీవీ భవత్వితి." ౧౭.

సోమన, కవితాపటిమ తళుకొత్త, నుత్తరహరి వంశము ప్రౌఢశైలిని రచించెను. వసంతవిలాసాది ప్రబంధచంద్రికలనుసయిత మీకవిరాముఁడు వెలయించి నట్లు తెలియుచున్నది. 'సర్వజ్ఞుఁ'డను బిరుద మీబుధ వర్యునకుఁగలదు. ఉత్తరహరివంశమునుండి శైలికి—

శా॥ ఓరీదానవధూర్త! నీదువచనోద్యోగంబు లెక్కింగరా
రారా! ఇంకిట నేమి సేసెదవు రాక్రౌర్యంబు శౌర్యంబు స
ద్వీరత్వంబును గర్జ నేని దనుజా తెల్లంబుగాఁజూపు మం
చా రాజీవ విలోచనుండు వచః వ్యాపార పారీణతన్.

9. చరమదశ.

క్రీ. శ. ౧౩౩౬లో విద్యానగరము పునరుద్ధరింపఁబడిన సమయమున బుక్కరాయఁడు కౌమారదశలో నుండి, సేనానాయకత్వము వహించి, శౌర్యనిధియై, సామ్రాజ్యసంస్థాపనానంతరము నలువది సంవత్సరములకుఁబైననే వీరవరుల కుచితమగు నుత్కృష్టజీవనముఁ బొందెను. స్వర్గస్థుఁడగునప్పటికీ నృపాలుఁడు కడు వృద్ధుఁడు. ఈదీర్ఘకాలములో నీతఁ డొకదండనాథుఁడుగనుండి, తొల్లి చిన్నరాష్ట్రముగనుండిన విద్యానగరము నేఁటేఁట వృద్ధినొందించి, కోటానకోట్లద్రవ్యమాదాయమువచ్చు మహాసామ్రాజ్యముగ మార్చివైచెను. ఈప్రభుచంద్రుఁడు క్రీ. శ. ౧౩౭౭ వ యేఁట ఫిబ్రవరినెల చివరనో, మార్చినెల మొదటనో యస్తంగతుండయి యుండవలయును.

---

ఆఱవ ప్రకరణము.



## రెండవ హరిహరరాయఁడు ౧౩౭౭-౧౪౦౪.

### 1. హరిహరుఁడు నాతనిసోదరులు.

బుక్కరాయనికి వేర్వేఱుభార్యలవలన హరిహరరాయఁడు, కుమారకంపరాయఁడు, చిన్నకంపరాయఁడు, సంగముఁడు, విరుపన్న, భాస్కరుఁడు, మల్లినాథుఁడు ననుకుమారు లేడ్వురుండిరి. ఇందు కుమారకంపరాయఁడు ప్రసిద్ధుఁడు. బుక్కరాయని కీతఁడు దేవాంబిక యను భార్యవలనఁగలిగిన కుమారులలోఁ బ్రథముఁడు. ఈతఁడు తెక్కలినాటికిఁ బ్రతినిధిగనుండి, తండ్రియాదేశానుసారము ౧౩౬౧ వ సంవత్సరమున దక్షిణదేశమున దండు వెడలి పెక్కురాజ్యములను జయించెను. ఆ ప్రాంతమున తుండీరమండలమునకు నాథుఁడై చండబలుఁడని వాసిఁగాంచిన సాంపరాయని, విరించిపురము నొద్ద జరిగినయుద్ధములోఁ బొలియించి, వానిరాజధాని యగు రాజగంభీరదుర్గముఁ బట్టుకొనెను. ఈ మహావీరుఁడు తండ్రిజీవించియుండఁగనే స్వర్గారోహణ మొనరించెను. బుక్కరాయనికి, గౌరాంబికవలనఁగలిగిన పుత్త్రుఁడగు హరిహరుఁడు, తండ్రియనంతరము విద్యానగర సామ్రాజ్యమునకుఁ జక్రవర్తియయ్యెను. ఈహరిహరుని సోదరులలో విరుపన్న పశ్చిమభాగమునకును, మల్లి

నాథుఁడు మైసూరికిఁ బ్రాగ్దిశనున్న రాష్ట్రములకును చిన్నకంపన్న మైసూరికి దక్షిణప్రాంతమునందలి రాజ్యమునకును పాలనాధికారులైరి.

2. సేనానులు-యుద్ధములు.

హరిహరునకు, దండనాథులయు సమర్థులైన మంత్రులయుఁ దోడ్పాటు మెండుగనుండెను. అతని వాహినీపతులు, శౌర్యధనులనవెలసిన ముద్దప్ప ఇరుగప్ప గుండప్ప విట్టన్నయొడయఁడు మొదలగువారు. ఇందు ముద్దప్ప ముఖ్యుఁడు. ఇరుగప్ప, మహాప్రధానియనియు రాజప్రతిపాలకుఁడనియు బిరుదావళులఁ గొన్నవాఁడు. ఈమేధావి బైచసేనానిపుత్త్రుఁడు; జైనుఁడు; నానార్థరత్నమాలా నిఘంటు రచయిత.

"ఇతిజగదుపకారుణ్యా ఇరుగపదండనాథ విరచితాయామ్,
అవ్యయపదకాండోzయం పూర్ణో నానార్థరత్నమాలాయామ్"

అని తన గ్రంథాంతమునఁ జెప్పికొనెను. విద్యానగరమున 'గానిగిత్తి'యను జైనాలయము నిర్మించెను. దీనివర్ణన యుత్తరభాగమునఁ గననగును.

రాయని యమాత్యవర్గమున సాయనాచార్యుఁడు, మాధవమంత్రి, ప్రసిద్ధులు. ౧౩౭౦ వ సంవత్సరమునఁ దురుష్కసేనయొకటి హఠాత్తుగ నాదవనికోట ముట్టడింపఁగా, మల్లిదండనాథుని కుమారుఁడగు చెన్నప్ప యొడయఁడా తురకమూకనుదటిమి, యాదవని దుర్గమును ప్రభునకునర్పించెను. విద్యానగరసైన్యము ౧౩౭౪

లో నోరుగంటికి వెళ్ళియుండఁగాఁ దురుష్కులది యదనని తలఁచి, క్రొత్తకొండను ముట్టడించి విఫలప్రయత్నులైరి. 'విక్రమకేసరి' యని వినుతిఁగన్న సాళ్వగుండప్ప ౧౩౯౭లోఁ దన వీరప్రతాపానలమునఁ దురుష్కులను నాంధ్రులను శలభములక్రియ మ్రగ్గించెను. అతఁడు కేరళ తాళవ కుంతల కాంధ్రుల నోడించి, వారిసర్వస్వముఁ గొల్లగొని విభునకు నివేదించిన ప్రభుభక్తి తత్పరుఁడు. ఉత్తర హిందూస్థానమునందలి యనేక రాజ్యములను గెలిచి, యపారమగు ధనమును గొనివచ్చి, దానిచే సామ్రాజ్య కోశాగారములను నింపిన దేశాభిమాని. ఏఁబదియాఱు దేశములనుజయించి, గుల్బర్గా 'గంగాసాలా'రను మహమ్మదీయునిచే ధ్వంసమొనర్పఁబడిన, మైసూరిప్రాంతమునందలి బేలూరిదేవాలయపు సింహద్వారమునొద్ద, జయస్తంభమునిలిపెను. హరిహరుని పుత్త్రులలో నొక్కఁడగు విరూపాక్షరాయఁడుగూడ, పాండ్య చోళాదిరాష్ట్రములనుగెలిచి, వానిని దండ్రికి సమర్పించెను.

### ౩. రాయని విక్రమము—రాజ్యవ్యాప్తి.

ఇట్లు హరిహరుఁ డఖండవిజయములనేపొందుచు, రాజ్యపరిపాలన సౌకర్యమున కనువగు మార్గములను పెంచించెను. గూఢచారులవలన నేనృపతి, శత్రురాజుల మాయామర్మములనుగ్రహించి, యందులకుఁదగిన ప్రతీకారము లొనర్చుటలోఁ గడుంగడు దక్షుఁడు. అత్యున్నత దశయందుండిన భామినీసుల్తానులతోఁ గత్తికట్టి, యఖండ

విజయములఁబడసిన శూరవరుఁ డీహరిహరుఁడు. తాను రాజ్యమునకువచ్చిన యచిరకాలముననే, గర్వగ్రంథులై మన్నుమిన్నుఁగానకవర్తించుచుండిన మహమ్మదీయ పాలకులను గోవానుండితఱిమి, బచ్చప్పయొడయరను తన యమాత్యపుంగవుని నచటఁ బ్రతినిధిగ నియోగించెను. ఈ విక్రమసంపన్నుఁడు తురుష్కులను బరిపూర్ణముగఁ బరాజయమునొందించి, యందు బలువురను జీవగ్రాహులనుగఁగొని, యరిభీకరుఁడై యెసఁగెను. ఓరుగంటి పాలకుఁడగు రాచసింగమనాయఁ డీరాజేంద్రుని పాదాక్రాంతులలోనొక్కఁడు. పరరాష్ట్రములనుండియు స్వరాజ్యమునుండియు హరిహరునకువచ్చెడు నరి నిరవధికముగ నుండెను. ఈతఁ డదృష్టవంతుఁడగు చక్రవర్తి యనవచ్చును.

ఇంతవఱకు విద్యానగరమును బాలించిన ప్రభువులందఱును 'ఒడయఁడు' 'మహామండలేశ్వరుఁడు' అను సామాన్యబిరుదములను మాత్రమే వహించియుండిరి; కాని రెండవహరిహరుఁడు 'రాజాధిరాజ' 'రాజపరమేశ్వర' 'మహారాజాధిరాజ' యను నుత్కృష్టగౌరవచిహ్నములనుగూడ ధరించెను. ఇందువలన నీతఁడు రాజాధిరాజైనట్లు వ్యక్తమగుచున్నది. మైసూరు ధార్వాడ కాంచీనగరము చెంగల్పట్టు తిరుచినాపల్లి మున్నగు ప్రదేశములలోఁగల యీతని శాసనముల మూలమున నీరాజన్యుని రాజ్యవైశాల్యము గ్రహింపవచ్చును.

## 4. మతము - భాష.

కమలాపుర సమీపమునంగల గానిగిత్తి దేవాలయమునందలి జైనస్తూపముమీఁది హరిహరునిశాసనము వలన, నన్యమతములయెడ నీప్రభునకుఁగల సమదృష్టి విదితము కాఁగలదు. ఈతనిపాలనమునఁ బ్రజల మనశ్శాంతియు, సంతోషమును, సౌఖ్యమును, దమంతవృద్ధి నొందినవి. శాంతియుత రాష్ట్రములలో హరిహరుని సామ్రాజ్యము మిన్నయనఁదగియుండెను. ఇతఁడు పుణ్యక్షేత్రములలోనెల్ల షోడశమహాదానముల విరివిగ నొనరించిన భక్తుఁడు. హొయిసలుల రాష్ట్రముననున్న 'జంబూ'గ్రామము నీతఁడు తనతల్లిస్మరణార్థమై బ్రాహ్మణులకొసఁగెను. దీనిని, నిట్టిశాసనములను మఱికొన్నింటిని బట్టిచూడ, హరిహరునిరాజ్యము కందనోలుమండలము నందలి కృష్ణానదిమొదలు, తంజావూరు మండలములోని కుంభకోణమున కింకను గ్రిందిభాగమువఱకుఁగూడ విస్తరించి యుండెనని గ్రాహ్యమగుచున్నది. హరిహరుఁడు కర్ణాటాంధ్ర సాహిత్యములకుఁ బోషణకర్త. సంగీత విద్యయం దీనృపుఁడు కడుఁగుశలుఁడు.

## 5. వృద్ధదశ.

౧. భామినీసుల్తాను నెదుర్కొనుట—హరిహరుఁడు తనవృద్ధదశలో కుమారుఁడగు రెండవ బుక్కరాయని సామ్రాజ్యాధీశునిగఁ జేసెనని ఫెరస్తా తెల్పుచున్నాఁడు. భామినీరాజ్యపు సరిహద్దులలోఁ బ్రాముఖ్యము గడించి

యున్న రాయచూరు, ముద్గల్లు దుర్గముల నెటులైనను లోఁగొని, యాసుల్తానులవలని యకారణ కలహములకుఁ దావులేకుండఁ జేయవలయునను తీవ్రసంకల్పము వృద్ధదశలో నాతనికిఁబొడమినది. ఇట్లుండ కలుబరిగియం దంతఃకలహములు రేఁగినవి. హరిహరుఁ డదిసందుచేసికొని, క్రీ.శ. ౧౩౯౮వ సంవత్సరము హేమంతర్తు ప్రారంభమునఁ దనకుమారులలో నొక్కఁడగు దేవరాయనివెంటఁగొని, మదమాతంగ తురంగ సంకులమగు యూథముతోడను, నసంఖ్యేయములగు కాల్బలములతోడను వెడలి, మహోత్తుంగ తరంగాకులమై దుస్తర వేగమునఁ బ్రవహించుచుండు, కృష్ణానదికి దక్షిణపుటొడ్డునవిడిసెను. భామినీ రాష్ట్రాధీశుఁడగు ఫిరోజిషా యీవృత్తాంతమువిని, పరిపంథిసైన్యము నెదుర్కొనుటకై పరిమిత పరివారముతో కలుబరిగినుండికదలి, కృష్ణానది కావలిదరిని నిలిచెను.

౨. ఫిరోజిషా సమాలోచనము—కృష్ణానదీ దక్షిణతటమునఁ, గనుచూపుమేరదాఁటి మైళ్ళకొలఁది నెంతో దవ్వు, నేల యీనినచందమునఁ దండోపతండములుగఁ గ్రిక్కిరిసి విస్తరించియున్న, రాయలసేనా మహార్ణవముఁ గాంచి, ఫిరోజిషా జడిసి, రాయనిసేనను మార్కొను విషయమై యోజించెను. అపారముగనున్న రాయని సైన్యమును న్యాయపథమున నెదురించుట యసాధ్యమనియు, నేదేని మాయోపాయమువలన దానిఁ దరలించుట యుచితమనియు, దండనాథులు పాదుషాకెఱింగించిరి. ఫిరోజు

కడ 'సిరాంజీ' యనుకొను చతురుఁడగు ఖోజీ యొక్క
యుండెను. పాదుషా యాతనితో రహస్యాలోచనము
సలిపి, రాయనిశిబిరమునకుఁ బంపెను. తురుష్క
సైన్యము నదీతరణమునకై యనుకూలములైన పడవ
లను సిద్ధముచేయుచుమాత్ర ముండెను.

3. సిరాంజీ కపటజాలము—సిరాంజీ తన యా
ర్వురుమిత్రులతోఁ ఋషివేషముఁదాల్చి, నదినిదాఁటి,
సైన్యప్రవాహముఁ దరించి, సాయంసమయమున హరి
హరుని పుత్రుఁడగు దేవరాయని శిబిరముఁ జేరెను. అట
నాతఁడు రాయనినాట్యాంగన యొకర్తుకతోఁ దన నేర్పు
వలన గాఢమగు చెలిమిసలిపెను. ఆ సుందరి యాసమ
యముననే యమూల్యాంబరాభరణాదులు ధరించి రాజ
నందనునివిడిదికి వెడల సంసిద్ధయై యుండెను. అదిగని
సిరాంజీ తమ్మొడఁబాసి చనవలదని యాఁజవరాలిని బ్రా
ర్థించెను; కాని తానురాకుమారుని సభ కరుగక తీర
దనియు, గానకళావిదులకుఁదక్క నన్యులకందుఁబ్రవేశింప
వీలులేదనియు, నాప్రోడ నిర్వచించెను. తదుపరి సిరాం
జీయు, నాతనియనుచరులును సమసంగీతకళాభిజ్ఞత నామె
యెదుటఁ బ్రకటించి, యాయతివయామోదము వడసి,
యామెసాయమున స్త్రీవేషములతోఁ దేవరాయనివిడిదిఁ
జొచ్చిరి. అచ్చట నటశేఖరులు పెక్కండ్రు తమతమ
యభినయకౌశలముఁ బ్రదర్శించుచుండిరి. నాట్యాంగన
తానును దన నెచ్చెలులలో నిరువురును, విద్యా

ప్రతిభఁ గనఁబఱచుటకై, రాజసూనుని యంగీకారము వడసెను. స్త్రీవేషధరులై యున్న సిరాంజీయు, నాతని మిత్రుఁడును, మనోజ్ఞదరహాసచంద్రికలు వదనమండలములనుండి నలుగడలఁబర్వ ముందునకువచ్చి, తమసమ్మోహనదృగ్జాలమున దేవరాయునినలరించి, లలిత మధురమగు తమపంచమస్వరమును వీణాశ్రుతితోడ లీనమొనరించి, నృత్యగీతాభినయ విలాస విశేషమున రాజతనూజుని నానందపారవశ్యునిఁ గావించుచు, నడుమఁ గటారుల దూసి దక్షిణదేశపుఁ బెల్లాటకత్తియల చందమున, హాయలుమీఱఁ దమతమ చిత్రవిద్యాప్రౌఢిమ వెలయించుచు నల్లనల్లన నృపసూనునిసమీపించి, చివాలున దేవరాయునిపైఁబడి, తమకటారులచే నాతనిఁబొడిచి చంపిరి. అనంతర మా టాక్రోటుకాండ్రు వెల్గుచున్న దీపికల నార్పి, యందున్న కతిపయపరివారముపై నుఱికి, చిక్కిన వారినెల్లఁజక్కాడి తక్కిన సంగడీండ్రతోఁ బలాయనులైరి.

౮. శిబిరమున నలబలము—శిబిరమం దెచ్చటను నల్లరులుఁ గేకలు హెచ్చెను. శత్రుసేన శిబిరమధ్యముఁజొచ్చి యెల్లరఁ బెగటార్పఁ దివురుచున్నదని, యొకవైపునుండి ఘోషపుట్టెను. సుల్తానుని సేనానాయకుఁడొకఁడు, పండ్రెండువేల సంఖ్యగల వీరభటులతో హాడాతుంగ నదినిదాఁటి, రాయని నాతనిపుత్త్రునిఁ దునిమెనని, వేఱొకవంకనుండి యఱపుహెచ్చెను. ఆనిశీథరాత్రమున దమారమి పదిమైళ్ళవఱకు విస్తరించియున్న రాయని

వాహినీమధ్యమున నచ్చట నేమిజరిగినదియు, జరుగుచున్నదియు, నెవ్వరికిని దెలియుచుంటలేదు. సైనికులలోని యార్తనాదములుమాత్ర మాకసమంటుచుండెను. వేర్వేఱు స్థానములనున్న సేనాధీశు లా కాళరాత్రిలో నీయలబలమునకు వాస్తవమగు కారణము నెఱుఁగఁజాలక యాయుధపాణులై, యెవ్వరెవ్వరిఁబట్టుల వారు కాపుండుటతోఁ దనివినొందిరి. ఈసందర్భమున నాల్గువేల సంఖ్యకు మించిన సుల్తానునిబల మతి శీఘ్రముగ నదిని దాఁటి శిబిరముఁజొచ్చెను; కాని యందు రేఁగుచున్న పెనుసందడికిఁ దురుష్కులఫౌఁజు భయపడి నానాముఖములఁజెదరి పాఱిపోయెను.

౫. ఫిరోజిషాయుద్ధము-సంధి—ఫిరోజిషా సూర్యోదయాత్పూర్వమే సమస్తపరివారముతోడను రాయని సైన్యముపైఁ గవిసెను. శతవృద్ధుఁడగు హరిహరుఁడు దుర్భరమగు పుత్త్రశోకమున నుత్సాహముసెడి, కేవలము నీరసహృదయుఁడై తనయునుంగుపట్టి మృతకళేబరముఁగొని, యాటనుండితొలఁగెను. సుల్తాను, విడిదియుందున్న సర్వస్వముహరించి, యాతనిసేనను విద్యానగరము వఱకుఁ దఱిమెను. మార్గమధ్యమునఁ దురుష్కవీరులు వివిధవిధ చిత్రసంఘటనములఁ గావించిరి. విద్యానగర సామ్రాజ్యమునఁగల దక్షిణమండలములఁ గొల్లగొన్ని వాసిని నాశనమొనర్చుటకై, ఫిరోజిషా తనతమ్ముఁడగు నహమ్మదునుబంపెను. అహమ్మదుషా యాభాగములను

దోచి, బ్రాహ్మణుల ననేకులను జెఱఁగొనెను. ఆ నిర్బంధితులను విడిపించుటకై హరిహరుఁడు ఫిరోజిషాకుఁ గొంత సొక్క మీయవలసి వచ్చెను. ఈ రెండురాజ్యముల యొండొంటిపరిస్థితులలో నీ సందర్భమున నింతకంటె నట్టివిశేషపరిణామమును బొడఁగలేదు. పొలిమేరలవివాద మెప్పటియట్లే నిలిచిపోవుటవలన, నాయుభయ రాష్ట్రాధిపతులకును వైరము తనంతఁ గాలుద్రొక్కకొనయే వచ్చుచుండెను.

౬. కడపటి యుద్ధము—భామినీసుల్తాను మఱల ౧౩౯౯ వ సంవత్సరమున విద్యానగరముపై యుద్ధమునకు వెడలెననియు, రాయఁడపార సేనతో నాతనిఁదాఁకుటచే సుల్తాను తనకుఁ బరాజయప్రాప్తి సిద్ధమని తలంచి, యేఁటేఁట రాయనికిఁ గొంతకప్పము చెల్లించునట్లొడంబడిక చేసికొని సంధిగావించుకొనెననియు, 'బర్హానీమాసిర్' తెలుపుచున్నాఁడు. ఈసంధికార్యము నడచిన యల్పకాలముననే, యనఁగా ౧౩౯౯వ యేఁట అక్టోబరు నెల యయిదవ తేది, హరిహరుఁడు పరమపదించెనని సూవెల్ వ్రాసెను. ౧౪౦౧లో నాపృథుఁడు మృతినొందినట్లు 'డాక్టర్ బర్నెల్' వచించుచున్నాఁడు; కాని చరిత్రప్రపంచమునకుఁ బ్రబలాధారములగు శాసనములు, క్రీ. శ. ౧౪౦౪ వ సంవత్సరము సెప్టంబరు నెల చివర హరిహరుఁడు స్వర్గారోహణ మొనర్చెనని, రూఢిగఁ బల్కుచున్నవి.

# ఏడవ ప్రకరణము

---

## రెండవ బుక్కరాయఁడు ౧౪౦౪-౧౪౦౬.

### 1 బుక్క రాయఁడును సోదరులును.

హరిహరునిపుత్త్రులలోఁ బ్రథముఁడు బుక్కరాయఁడు. తక్కినవారు చిక్కరాయఁడు విరూపాక్షరాయఁడు దేవరాయఁడు సదాశివరాయఁడు చిక్కదేవరాయఁడు ననువారు. తండ్రిచనిపోయిన సమయమున బుక్కరాయఁడు రాజ్యాంగవ్యవహారాసక్తుఁడై మండలాంతరమున నుంటచే, విరూపాక్షరాయఁడు కొంతకాలము ప్రతినిధియై సింహాళమునకుఁగల ప్రాగ్భాగమంతయుఁ బాలించెను. చిక్కరాయఁ డస్తాచల ప్రాంతమునందలి 'అరగ' రాజ్యమునకుఁ బ్రభుఁడైనవాఁడు. బుక్కరాయఁడు తనవ్యవహారములు నన్నింటిని ముగించుకొనివచ్చి, శా. శ. ౧౩౨౮ (క్రీ. శ. ౧౪౦౬)వ విజయ సంవత్సర జ్యేష్ఠమాసమున సామ్రాజ్యాధిపత్యము వహించెను.

బుక్కరాయఁడనునది దేవరాయని నామాంతరమని కొందఱి యభిప్రాయము; కాని హరిహరునకుఁ బంపాదేవివలనఁ గలిగినవాఁడు బుక్కరాయఁడు. దేవరాయఁడు మల్లదేవికొడుకు. హరిహరుని సుతులలో

నీ దేవరాయఁడు నాల్గవవాఁడై యుండును. సిరాంజీ తంత్రమువలన నసువులుగోల్పోయిన దేవరాయఁడు కడఁగొట్టువాఁడు.

2. పరిపాలనలు.

బుక్క రాయనికడ హెగ్గప్ప విట్టన్న జయన్న సిద్ధన్న మొదలగుమంత్రు లుండినట్లును విట్టన్న తూర్పు ప్రాంతము దాభోలు గోవాలనుజయించి, పశ్చిమసముద్ర తీరము (బరకూరు మంగళూరుల) వఱకుఁగల కర్ణాటక సామ్రాజ్యమును బాలించినట్లును దెలియుచున్నది.

3. నగర శృంగారము.

విద్యానగరము నిర్మింపఁబడినచోటు రాతినేల యగుటచే జలవసతి కనువైనదిగాదు. పౌరులు త్రాగుటకు వలసిన మంచినీరు చాలదూరమునుండి తెచ్చికొనవలసి యుండెను. నగరమున నందందుఁ గొన్ని నీటిపట్లు లున్నను నందలియుదకము పైరుల కుపయోగార్హముగ నుండలేదు. బుక్కరాయఁడు సుందరతమములగు నారామములను వెక్కంటిని వేయించి, విద్యానగరమును సర్వోత్కృష్టమైన పట్టణముగఁ జేయింపనెంచి, యాపురికిఁ బదునైదుమైళ్ళ కావల తుంగభద్రానది కొక గొప్ప యానకట్టకట్టించి, పెక్కు సొరంగములచే నొక పెనుగుంటి త్రవ్వించుకొనిపోయి నదికడ్డముగఁ ద్రోయింపఁగఁ, బ్రవాహము రాజాజ్ఞానుసారము పురములోనికిఁ బరుగిడెనఁట. అదియే 'తురుత్తు' కాలువ. దానినుండి పిల్లకాలువల

మూలమున వలయు ప్రదేశములకు సమృద్ధిగ నీరు ప్రవహించుచుండెను. ఈ జలాధారములవలన నగరమునందంతటను వివిధములగు వృక్షవాటికలు-లతాకుంజములు-గులాబి వనములు-ద్రాక్షారామములు- నారికేళ తోఁటలు-నితరవిధములైన ఫలవృక్షములు-తామరతంపరగా నెసంగినవి. వ్యవసాయ మిందుచే మూఁడుపూవు లాఱు కాయలుకాఁగా, రాజునకు సాలుకు పదునాలుగులక్షల రూపాయల యాదాయము వచ్చెనఁట. ఈప్రభుఁడు పట్టణమునఁ బెక్కు ప్రాకారములను, గోత్తడములను, రమణీయములైన భవనములను వెలయించి, నగర శృంగారాభివృద్ధికై తనతండ్రి సంపాదించిన ధనమంతయు వెచ్చించి మిగులఁబాటుపడెను. ఈతనిపరిపాలన మొక్క సంవత్సరముతోనే యంతరించినది.

## 4. విస్సారావు.

బుక్కరాయనికి విస్సారావనుపుత్త్రుఁ డుండెననియుఁ దండ్రికిఁదఱువాత నాలఁ డాఱేండ్లు రాజ్యపాలనము చేసెననియుఁ గొందఱు నుడువుచున్నారు; కాని యది నిరాధారము.

# ఎనిమిదవ ప్రకరణము.



## మొదటి దేవరాయఁడు ౧౪౦౬-౧౪౨౨.

### 1. సామ్రాజ్యాధికారము-ప్రతినిధులు.

బుక్కరాయనికిఁదరువాత నాతనిసోదరుఁడు (మల్లదేవివలనఁ గలిగినపుత్త్రుఁడు) దేవరాయఁడు, ౧౪౦౬ వ సంవత్సరము నవంబరునెల ౫ వ తేది సింహాసనమునకు వచ్చెను. ఈతనికాలమున సామ్రాజ్యమంతయు నెనిమిది ఖండములుగ విభజింపఁబడినది. వానిలో నుదయగిరిని రామచంద్రరాయఁడును, భవానివిట్టలదుర్గ ప్రాంతములను హరిహరరాయయొడయఁడు వీరమల్లనలును, చంద్రకూటమును మహాప్రధాని - మల్లనయును, బరకూరును శంకరదేవయొడయఁడును, గుత్తిని విరూపన్నయును, తెక్కలినాటిని నాగన్నయు, నరగడదుర్గమును విట్టన్న దండనాయకుఁడును, పాలించుటకు నిర్ణయింపఁబడిన ప్రతినిధులు.

### 2. భామినీరాజులతోడి పోరాటము.

కలుబరిగి సుల్తానులతో భయంకరయుద్ధమునకుఁ గడంగినవారిలో దేవరాయఁడొకఁడు. ౧౪౦౬వ సంవత్సరమున భామినీరాజగు ఫిరోజిషాతో జరిగిన పోరాటమున రాయఁడు పరాజయమందె ఫిరోజిషాకుఁ దన

కుమారైనిచ్చెనని తెలుపుచు, ఫెరిస్తా యందులకుఁ గార ణముగఁ గ్రిందికథ నుదాహరించుచున్నాఁడు.

భామినీసుల్తానుల యధీనముననున్న ముద్గల్లు పురమున నొక కాఁపువానికిఁ జక్కనికొమార్తె యొకతె యుండెను. సంగీతవిద్యయం దామె యందెవేసినచేయి. దేవరాయఁ డాజవరాలిని వివాహమాడఁగోరెను; కాని రాజునకుభార్యయై స్వేచ్ఛనుగోల్పోయి తలిదండ్రులను వదలి యభ్యంతరమందిరమున వసించుట కాసుందరి యిష్టపడలేదు. రాయఁడది తెలిసి యాకన్యను బలా త్కారముననైనను గొనివచ్చుటకై యొక యాశ్వికదళ మును ముద్గల్లునకుఁ బంపెను. ఈవాలఁకువ యెట్లో యాకన్య తన తలిదండ్రులతో నెందో పాఱిపోయెను; ఫిరోజిషా దేవరాయని దౌర్జన్యవృత్తికిఁ గుపితుఁడై విద్యానగరపైనిడుల నెదుర్కొనుటకై తన గుఱ్ఱపు రౌతుల నంపి, తానుగూడ నాశ్వికసేనతో విద్యానగ రముఁజుట్టి, దాని బహిఃప్రాకారము నాక్రమించెను. కర్ణాటకవీరులు తురుష్కులలో ననేకులను మడియించి, యవశిష్టసైన్యమునుడఱిమి ఫిరోజిషాను బరిభవించిరి. ఆతనిచేతిపై బలమైన గాయమొకటి తగిలెను. తదు పరి ఫిరోజిషాసేన తరలిపోవుచు పరిసరముననున్న రాష్ట్ర ములను బాడొనర్చెననియు, బంకాపురము నాక్రమించి యం దఱువదివేలమంది హిందువులనునిర్బంధించెననియు, నదిగని దేవరాయఁడు సంధికియ్యకొని నష్టపరిపూర్తికై

ఫిరోజిషాకుఁ దనకొమార్తె నొసఁగుట కామోదించుచు, కర్ణాటకరాష్ట్రమునందలి యొకదుర్గ మెప్పటికిని ఫిరోజిషావశమునను౦చుట కంగీకరించెననియు, ననంతరము ఫిరోజిషా కాఁపుకన్యను గొనిపోయి తన కుమారునకు వివాహము గావించెననియు, ఫెరిస్తా వచించుచున్నాఁడు.

### 3. చరిత్రకారుల మతము.*

౧. విద్యానగరరాజుల ప్రాభవవైభవములు—విద్యానగరము ప్రాభవ వైభవాదులలో మూఁడు శతాబ్దములవఱకు నభివృద్ధి నొందుచునే యుండెను. ఆ సామ్రాజ్యాధీశులకు మంగళూరు గోవా మున్నగు రేవు పట్టణములయొద్ద సమర్థములైన నావికబలము లుండినవి. దేశాంతరములందలి సింహళము పారసీకము మున్నగు రాష్ట్రపాలకులు విద్యానగరప్రభువుల కనర్ఘములైన కానుకల నేఁటేఁటను బంపుచుండిరి; వెండియు నీ యధిపతుల పరిపాలన ప్రతిభవలనను వ్యవసాయాభివృద్ధి వలనను విద్యానగరమునకుఁ బ్రతిసంవత్సరము కోటానకోట్లుగ నాదాయము వచ్చుచుండెను. ఈ ప్రభువులైశ్వర్యాతిశయమునందును సేనావిశేషమునను - రాజ్యవిస్తీర్ణమునందును - హిందూదేశమునఁగల తక్కినరాజులందఱికంటె నుత్కృష్టదశలో నుండిరనుట, చరిత్రకారులందఱు నంగీకరించినవిషయము. దానముల నొసఁగుటలోను, నౌదార్యసూచకములగు ఘనకార్యములను

* The Never to be forgotton Empire.

నిర్వహించుపట్టునను, నపారముగ ధనము వెచ్చించుట యందును, భరతఖండమున నేరాజును విద్యానగర పార్థివులతో నేమిటను దుల్యుఁడు గాకుండెననుట సర్వజనాంగీకృతాంశము.

౨. అనుకూలహేతువులు—విద్యానగర రాజ్యమున కుత్తరదిశనున్న మహమ్మదీయులు తఱచుగ నానగరముపై దండెత్తుచున్నను, దానిపాలకు లేయుద్ధమునఁ గాని యెప్పుడును దామితరులకు లొంగిపోవునంతటి దుస్థితికి లోనయిరనుట కొక్క ఫెరస్తావ్రాఁత తప్ప, నాధారేతరము లెవ్వియుఁ గానము. భామినీసుల్తానులతో యుద్ధములు చేసినపుడెల్ల, విద్యానగరాధీశు లేదియో కొంతప్రయోజనమే పొందుచుండిరి. ఫెరస్తా వివరించిన యపజయములన్నియు హిందువుల కనుకూలప్రదములుగను, వారిశత్రువులగు మహమ్మదీయులకుఁ బ్రతికూలములుగను, బరిణమించినవి. ౧౩౬౬లో మహమ్మదుషా యంతటి మహోద్ధృతితోఁ గావించినయుద్ధము, విద్యానగరమున కెట్టిలొంపయుఁ గల్గింపకయే యంతరించెను. ౧౩౭౫లో ముజాహిదుషా, తన యుద్ధమువలన నెట్టి ప్రయోజనమును బొందలేదు; సరిగదా పైఁగా కర్ణాటకరాష్ట్రజుల యొత్తిడివలన నాతఁడటమరించి, చాలి నంతపరిభవమే పొందెను. ౧౩౯౮వ సంవత్సర ప్రాంతమున భామినీ విద్యానగరరాజులకుఁ గల్గినపోరాటమున నముఖ్యములగు ప్రయోజనము లెవ్వియును దేలలేదు.

మేరలవివాదము యథావిధముననే యుండినది.

మొదటిదేవరాయని కాలమువఱకు విద్యానగరమును బాలించిన రాజులందఱును సంగ్రామసింహులే కాని యందుఁ బిఱికిపంద యొక్కఁడును గానరాఁడు. ఈతని కాలమున విద్యానగరపుబలము సుస్థిరముగ నెలకొనుటతో సిపాయీలసైన్యమును మిగుల నభివృద్ధి నొందినది. విద్యానగర దండనాథపతుల శౌర్య విస్ఫూర్తినిగూర్చి, తురుష్క సేనాధిపతులే కొనియాడుచుండిరి. ఇట్టి ప్రబలతరస్థితిలోనున్న విద్యానగరప్రభువుల నోడించుటకై భామినీసుల్తానుల కెట్టియనుకూలములైన నుండెననుట యనుచితము నసంబద్ధమునై తోఁచును.

3. హైందవరాజుల క్షాత్రతేజము—ఇట్టి పరిస్థితులలో శత్రువునకంటె నన్నివిధముల నుత్కృష్టదశలోనున్న క్షాత్రతేజోనిధియగు చంద్రవంశ చక్రవర్తి యొకఁడు, తన మతాచారధర్మములకు వ్యతిరేకముగ గర్భశత్రువైన యొకముదుసలి ముసలిమానుతేనికిఁ దన కొమార్తెనిచ్చి వివాహముచేసెననుట, యెంతమాత్రమును విశ్వసనీయముకాఁజాలదు. ఈసంధాన మాతని యనుపమ క్షాత్రధర్మమునకును, మహోత్కృష్ట సామ్రాజ్యపదవికిని, వర్ణాశ్రమ ధర్మరక్షాదీక్షకును, సనాతన రాజకులగౌరవమునకును, గేవలము కళంకదాయకమును-పరిభవకరమును నగును. పవిత్రక్షాత్రవ్రతావలంబకులగు హిందూరాజులు ప్రాణరక్షణమునకంటె

మానసంరక్షణమే ముఖ్యవిధిగ భావించుచుండిరి. వారు ప్రాణములు గోల్పోవలసివచ్చిన సమయములఁ, దమ భార్యాపుత్త్రులు శత్రువుల కరసంస్పర్శచేఁ గళంకితులు గాకుండుటకై, ప్రప్రథమమున వారిని స్వహస్తముల తోడవధించి, యావల వీరక్షేత్రముల కుఱుకుచుండిరి. మహమ్మదు తుఘలకుతో నొనఁగూడిన యుద్ధసందర్భమున నానెగొంది నాథుఁడగు జంబుకేశ్వరుఁ డీమార్గమే యనుసరించెను. ఇదియిట్లుండ నసంఖ్యేయమగుబలము సఱిచేత నిడికొనియున్న యొక హిందూమహాసామ్రాజ్యాధీశుని, నల్పసేనా పరివృతుఁడగు మహమ్మదీయసుల్తానొంటిగఁదలపడి జయముఁగొనెననియు, నా హిందూ చక్రవర్తి క్షీణకాముఁడగు మ్లేచ్ఛరాజునకుఁ దనకుమారి నొసఁగి వివాహముచేయ సాహసించెననియు వ్రాసిన ఫెరిస్తాకథ, కాధారమేకన్పట్టదు. ఇట్టిసుప్రసిద్ధ వివాహముఁగూర్చి, పెయిస్ న్యూనిజ్ కమాలుద్దీన్ అబ్దుర్ రజాకు మున్నగుచరిత్రకారు లొకమాటయైనను వ్రాయలేదు. విద్యానగరబహిఃప్రాకారము నాక్రమించిన ఫిరోజిషాను కర్ణాటక దేశజులు తఱుముఁగొట్టి యవమానించిరని ఫెరిస్తానుడివినది పరమసత్యము. ఫెరిస్తా సాక్ష్యము వలన విద్యానగర సైనికప్రచండ ప్రతాపతీక్ష్ణాగ్నిలో ఫిరోజిషా కాల్బలములును - సిపాయీల దళములును - శుష్కకాష్ఠము లయ్యెనని స్థిరపడినది. స్వసంరక్షణార్థమానవాబు తనసేనతో బహుదూరము పాఱెను.

## 4. స్వప్నగాథ.

దేవరాయని వివాహమాడనిష్టపడని కాఁపువెలఁది ఫిరోజుశామారుని పెండ్లియాడెనని ఫెరిస్తా తెలిపెను. కేవల స్వాతంత్ర్యప్రియమగు నాకాఁపుకన్య, యందుల కొకింత యవకాశముగలజాతిలో, నొక హైందవరాజవర్యుని వివాహమాడనొల్లక, ఘోషాపద్ధతిలో స్త్రీలను మీఁదుమిక్కిలి బానిసలనుగఁ జూచుకులమున, నొక తురుష్కరాజపుత్త్రునిఁ జేపట్ట సమ్మతించెననుట, ఫెరిస్తా కల్పనా చమత్కృతికిఁ బరమనిదర్శనమగు విషయము. వెనుకటి చరిత్రకారులలో నెవ్వనిస్మృతిపథమునను దవులని యీయపూర్వగాథ, యొక్క ఫెరిస్తాగ్రంథమునుమాత్రమే యలంకరించెను. ఆతఁడహమ్మదునగర రాజమందిరములవసించి, యందలి మహమ్మదీయుల ప్రోద్బలమున భామినీసుల్తానుల చరిత్ర వ్రాసినవాఁడగుటచే, నిట్టిపుక్కిటిపురాణములకు హేతుభూతములైన స్వప్నగాథల నెన్నింటినో గ్రహించెను.





కడలైకల్లు గణేశాలయము.



హేమకూట పర్వతమునందలి
జైనాలయములు.



మాతంగ పర్వతము.



విరూపాక్షేశ్వరాలయము

ఈ పటముల స్వాతంత్ర్యము శ్రీ యం. కే. రంగస్వామయ్యంగారికి జెందినది).

## తొమ్మిదవ ప్రకరణము.



### రెండవ దేవరాయఁడు క్రీ. శ. ౧౪౨౩-౧౪౪౭.

#### 1. వీరవిజయరాయఁడు.

రెండవ బుక్కరాయనికిఁ బిమ్మట నాతని సోదరుఁడు దేవరాయఁడు భామినీసుల్తానులకుఁ బిడుగు వలె పదునాఱు సంవత్సరములు విద్యానగరమును బాలించి ౧౪౨౨లో నస్తంగతుఁడయ్యెను. ఈ దేవరాయనికి విజయరాయఁడు హరిహరుఁడు మల్లన్న యను కుమారులు ముగ్గురుండిరి. ఆతనికి దేమాంబికవలనఁ గలిగిన పుత్త్రుఁడు వీరవిజయరాయఁడు. ఈ వీరవిజయరాయనికే విజయ బుక్కరాయఁడనియుఁ బేరు. తండ్రికిఁ దరువాత నీ వీరవిజయుఁడు క్రీ. శ. ౧౪౨౨ న రాజ్యాభిషిక్తుఁడయ్యెను. సామ్రాజ్యాభివృద్ధికిఁగాని, నగరాభివృద్ధికిఁగాని, యీ నృపతి యే ఘనకార్యమును జేసినట్లు కాన్పింపదు. ఈతనికాలపు చరిత్ర యంతవిస్పష్టముగ లేదు. ఈప్రభుని పరిపాలనమునఁ బ్రధానులు లంచగొండులై, సామంతులకడఁ బారితోషికరూపమున విస్తారముగ ధనము గ్రహించుచు, సామ్రాజ్యమునందలి గొప్పగొప్ప రైతుల నేపాద్దు జలగలవలెఁ బీల్చుచుండిరి. ఇందులకుఁ దోడుగఁ గాటకముసయితము

చాఁపరించుటవలన, జనులబాధ మేరమీఱెను. జీవిక దుస్తరమగుటచే రైతులు తమతమగృహములను పంట వలంతులనువిడిచి, దేశాంతరము పోవుచొచ్చిరి. పాలకుల యెడ భక్తివిశ్వాసములు నశించుటవలన, నాయూవృత్తుల వారు, తమకు నియోగింపఁబడిన కైంకర్యముల నొనర్ప మానుకొనిరి. వీరవిజయరాయఁ డిది తెలిసి, మంత్రుల నుండి యీదుష్టపద్ధతిని నిర్బంధముగను నితాంతముగను తొలఁగించెను. ఈతఁడు ప్రజాపాలన మొనర్చినది యల్పకాలముమాత్రమే.

## 2. దేవరాయుని బాల్యము.

వీరవిజయునితమ్ముఁడు హరిహరుఁడుఁగూడ నపుడపుడు విద్యానగరమును బాలించుచుండి, విస్తారముగ దానముల నొనర్చినట్లు, శాసనములు తెలుపుచున్నవి. విజయరాయఁడు కొన్ని నెలలుమాత్రము రాజ్యపాలనముచేసి, తన కుమారుఁడగు దేవరాయఁడు శైశవ దశయందున్నట్లే గతించియుండును. తమ్ముఁడగు హరిహరుఁడు పరాక్రమ ధురంధరుఁడును రాజ్యవ్యవహార విశారదుఁడును నగుటచే సోదరునియనంతరము తానే రాజ్యకార్యములు నిర్వహించియుండును. ఆ సమయమున, దేవరాయఁడు బాలకుఁడై, తనపినతండ్రి పోషణమున నుండియుండును. ఈ దేవరాయనికిఁ బర్వతదేవ రాయఁడను తమ్ముఁడును, హరమ్మ యను చెల్లెలును నుండిరి. పర్వతదేవరాయఁడు ౧౪౨౪వ సంవత్సర

ప్రాంతమున విద్యానగరసామ్రాజ్యమునందలి 'తెరకనంబి' యను ఖండమునకు పాలకుఁడయ్యెను. హరమ్మ చంద్రవంశజుఁడును సాళువగోత్రరాజు పుత్త్రుఁడును మహావీరుఁడునునగు సాళువ తిప్పరాజును జేపట్టెను.

3. నామాంతరములు-బిరుదములు.

రెండవదేవరాయఁడు ౧౪౨౩ వ సంవత్సరమున సామ్రాజ్యభారము వహించెను. ఈతనికిఁ బ్రౌఢదేవరాయఁడనియు - ఇమ్మడిదేవరాయఁ డనియు - వీరదేవరాయఁడనియు - వీరప్రతాపదేవరాయఁ డనియు - గజబెంటె దేవరాయఁ డనియు - నామాంతరములు. 'గజబెంటెరాయఁ'డనఁగా నేనుఁగులను వేటాడుటయందు నిపుణుఁడని యర్థము. ఈతనికి 'చతుస్సముద్రాధీశుఁ'డను బిరుదమున్నట్లు తంజావూరియందలి ౧౪౪౮వ సంవత్సరపు శాసనము తెల్పుచున్నది. మొదటి దేవరాయని వలెనే యీతని మనుమఁడగు నీ రెండవదేవరాయఁడు సయితము, విద్యానగరాభివృద్ధికిని-వ్యవసాయాభివృద్ధికిని సైనికబలాభివృద్ధికిని - సత్యుత్తమమైన సేవయొనరించి, తనయొక్కయు తన సామంతనృపతులయొక్కయు పలుకుఁబడి, నాంధ్ర కర్ణాటాది రాష్ట్రములలోఁ జక్కఁగ వెలయించెను.

4. సేనానాయకులు.

రెండవ దేవరాయనికడ సంగ్రామ శూరులును, శత్రుసంహార కార్యదక్షులును, త్యాగశీలురును నగు

దండనాథులుండిరి. అందుముఖ్యుఁడు చామన్నృపాలుఁడు. ఈతఁడు శివభక్తుఁడనియు, సింహప్రతాపుఁడనియు, శిష్టజనరక్షకుఁడనియు, సామదానభేద దండోపాయములఁ జతురుఁడనియు, శాసనము లుగ్గడించుచున్నవి. మొదటి దేవరాయనికాలమున, బల్లరాజుచే హరిహరదేవునకుఁ బ్రీత్యర్థముగ నిర్మింపఁబడిన, 'హరిద్ర'యను నానకట్ట భిన్నమై నిరుపయోగముగనుండఁగ, నీచామనృపాలుఁడు విస్తారధనము వెచ్చించి దానిని బునరుద్ధరించి, వ్యవసాయాభివృద్ధికి దోహదముఁగల్పించెను.

### ౬. ముసల్మానులతోడి యుద్ధము.

రెండవదేవరాయఁడు భామినీసుల్తానులతోఁ జాల నిగ్రహించెను. మహమ్మదీయులను బలపూర్వముగ నోడించి, వారిఘాతుకకర్మలకుఁ దగిన ప్రతీకారముఁగావింప నీతఁడు కృతసంకల్పుఁడై, యుక్కుతున్కలఁబోలు పోటరులఁ బెక్కురనుగూర్చుకొని, విజాపురరాష్ట్రముమీఁద దాడివెడలెను. అవలకే విద్యానగరముపైఁ గత్తినూరుచుండిన యవనప్రభుఁడిది తెలిసి, విస్తారమగు బలముతో రాయనిసేన నెదుర్కొనెను. విద్యానగర వీరులు దర్పోద్ధతులై పరిపంథివాహినిని జీరికిఁగొనక సాహసమునను బౌరుషమునను దాఁకి, యందలి యోధుల మస్తకములచే నాహవరంగమున నున్నతవేదికలను నిర్మించిరి. ముసలిమానులదళము విఱిఁగి నలువలంకులకుఁ బాఱెను. హైందవశూరులు కాందిశీకులగు మహమ్మదీయసైనికు

లను వెన్నంటి యుచ్చకొలఁదివచ్చుచు, సుల్తానుని నాతని రాజ్యములోనికిఁ దఱిమిరని ఫెరస్తా నుడువుచున్నాఁడు. వారారాష్ట్రమును గత్తితోడను నిప్పుతోడను ధ్వంసము చేసిరి. పెక్కు స్థానములను వశపఱుచుకొనిరి. అనేక సంవత్సరములనుండి ధనధాన్యసమృద్ధిచేఁ దనరారుచుండిన విజాపురరాష్ట్రము సర్వశూన్యమయ్యెను. ఇట్టి దౌర్భాగ్యదశను గాంచి, ఫిరోజషాయా విచారముతోడనే మృతి నొందెను. .

## 6. సైనికబలాభివృద్ధి.

మహామ్మదీయ సైన్యమునఁ బ్రశస్తమైన యశ్వబలమును— రౌతులయు విలుకాండ్రయు దళములును— సమృద్ధిగనుండుటగమనించి, దేవరాయఁడు సజాతీయము లైన యుత్తమాశ్వములసంఖ్య మిక్కిలివృద్ధినొందించెను. బలాఢ్యులును నేర్పరులును నగు ధానుష్కులను హెచ్చించుచు దేశమున మహామ్మదీయులలో నధికసంఖ్యాకుల నాంధ్రకర్ణాటక సైన్యమునఁ జేర్చుటకును, వారలకుఁ బ్రత్యేకముగ గ్రామములనొసంగుటకును, వారి యుపయోగార్థము విద్యానగరమునఁ బెక్కుమసీదులను గట్టించుటకును, మహామ్మదీయుల నెవ్వరు నేవిషయమునను బాధింపకుండుటకును నియమములఁగావింప నాప్రభుఁడు నాయకుల కాదేశించెను. సంస్థానాధీశులు, హిందూసైనికులలో దృఢాంగులగు ధనుర్ధారులను—గుఱ్ఱపురౌతులను — పలువురను సిద్ధముచేసిరి. అందుచే విద్యానగర రాజ్య

మునఁ గొంతకాలమునకే లక్ష్యయుక్తులైన రెండువేల మంది మహమ్మదీయులును, నలువదివేల హిందువులును ధనుష్మంతులుగ నేర్పడుటయు, నెనుబదివేలయాశ్వికులును పదాతులగు రెండులక్షలయిరువదిమూఁడువేల సైన్యము ప్రోగుపడుటయును సంభవించినది.

7. రహస్యవిప్లవము.

దేవరాయని పరిపాలనాంతసమయమున క్రీ. శ. ౧౪౪౨ వ సంవత్సరము నవంబరునకును ౧౪౪౩వ యేఁట నేప్రిలునకును మధ్యకాలములో, దేవరాయనితమ్ముఁడు తన యన్ననుజంపుటకై, యొకానొక యద్భుతావహమగు తంత్రము నడిపెను. ఆసంవత్సరమున విద్యానగరమును సందర్శించుటకై వచ్చియుండిన 'కమాలుద్దీన్ అబ్దుర్ రజాకు' కల్లికోటలో బసచేసియుండి, యీ యాశ్చర్యకర చర్యనుగూర్చి విన్నదివిన్నట్లుగా వ్రాసియున్నాఁడు.

౧. రచనావిధానము—దేవరాయఁ డొకప్పుడు తనసోదరుఁడు పన్నిన ప్రాణాపాయకరమగు వ్యూహము నుండి తప్పించుకొనఁగల్గినవిధము చిత్రమైనది. ఆసోదరుఁ డీమారణోపాయక్రమమును మిగులఁ గుశాగ్రబుద్ధితోడనే సాగించెననఁదగును. రాయనితమ్ముఁ డొకనాఁడు తన నూతనగృహ ప్రవేశోత్సవసమయమున, రాజును నగరమునందలి మండలేశ్వరులను వాహినీపతులను రాజకీయోన్నతోద్యోగమండలిని విందున కాహ్వా

నించెను. తంత్రిజ్ఞులగు నందలిగృహసేవకులు ద్వారముఖమున నిరీక్షించియుండి, యతిథుల నొక్కొక్కరి నిగ భోజనశాలలోని నియమితస్థలములకుఁ బంపుచుండిరి. లోనికి వెళ్ళిన యొక్కొకయతిథియు నచ్చటనియోగింపఁబడియున్న తలవరుల కరవాలముల కెరయగుచుండెను. మందిరాంతర్భాగమున నడిచెడు నిరపాయమారణ వ్యాపార మెట్టిధ్వనిమూలమునైన నించుకంతయు బయల్పడకుండునట్లు, ద్వారపార్శ్వభాగముల భేరీభాంకార నినాదములకుఁ జక్కనియనువు గల్పింపఁబడి యుండినది. ఆమహాఘోషమున లోన నేమినడచునదియు వెలుపల నున్నవారి కిసుమంతయును దెలియుచుండుటలేదు. ఈ విధమున రాజధానియందలి సామంతులు నమాత్యులు దండనాధిపతులు రాజమందిర రక్షకులు పురప్రముఖులు నొక్కొక్కరుగ మందిరముఁజొచ్చి, యకాలమరణమునకు గుఱియగుచుండిరి.

౨. రాయనిఁగూల్చుట—రాయఁ డెంతసేపటికిని రాకుండుటచేఁ దమ్ముఁడే దేవరాయనిసౌధమున కరిగి, తనసూనుభవనము నాతని చరణరజోలేశమునఁ బావన మొనర్ప, సవినయముగఁ బ్రార్థించెను. ఏహేతువు ననోగాని ప్రభుని నకస్మాత్తుగ ననుమానపిశాచము పీడింపఁజొచ్చెను. అందువలన నాతఁడు తానురాఁజాలమికి నేమియోయొక సాకుచెప్పి యందులకుక్షమింపవేఁడెను. తనవ్యూహ మీచందమున భగ్నమగుటతలపోసి, తమ్ముఁ

డాగ్రహావిష్టుఁడై క్రూర విష మదృష్టులఁ బఱపుచు నన్నుపైఁబడి, యొకబల్లెమున రాయనిశరీరమంతయుఁ - జిల్లులువడునట్లు పొడిచెను. ఆతఁడు రాజమందిర రక్షక భటులను విందుఁగుడుపునెపమున భోజనశాలకుఁ గొని పోయి యావఱకే వధించియుండుటచే, నిట రాయనికిఁ దోడుపడువారొక్కరును లేకపోయిరి. హఠాత్తుగ నింతటిప్రమాదము సంభవించునని రాయఁడు తలంచియుండ లేదు. తమ్ముని దారుణఘాతములవలన దేవరాయఁడు స్మృతితప్పి, తాఁగూరుచుండియుండిన గద్దెనుండి వెనుక కొరగి పడిపోయెను.

3. హంతకుని చిత్రవధ—ఇఁక రాయనిశిరస్సు ఛేదింపవలసినదని తననుచరున కాజ్ఞాపించి, యాతఁడు మరణించెననుసంతసమున హంతకుఁడు రాజమందిరద్వార మంటపముఁ జేరి, యచ్చటనున్నవారికి దానుసల్పిన దుండగ మునుగూర్చి యెఱింగించి, యింకనుండి విద్యానగర సామ్రాజ్యనాథుఁడను నేనేయనుచు, సింహాసనము నధిష్ఠించుతమకమున నేఁగెను. ఆతనిచే నియోగింపఁబడిన కింకరుఁడు రాయనిసమీపించి, యాభూభుని యుత్తమాంగము నుత్తరించుటకై కత్తియెత్తునంత, దేవరాయఁడు సింహాసనము నండఁగాఁగొని లేచి, తన కృపాణముచే నొక్కవ్రేటున నాద్రోహి ప్రాణములఁబాపెను. ఆ వఱకు భయమునవడఁకుచు సందొకమూలనణఁగియున్న నిజభృత్యుఁడు ప్రభుఁడుసురులతోనుంటఁగని, రక్షణ

మునకై యాతనిఁ దారసిల్లెను. రాయఁడా సేవకునిఁ దోడుచేసికొని వేఱొకమార్గమున సభాగారముఁ జొచ్చి, యందు సింహాసనాసీనుఁడై యందున్నవారికి స్వీయప్రభుత్వ విధానమునుగూర్చి ప్రబోధించుచుండిన తన తమ్ముని చందముఁగాంచి, యచ్చటిప్రజలీన నా కలుషచిత్తునిఁ గడతేర్పుఁడని గభీరముగ నొక్క కేకవైచెను. అందుఁ గూడియుండినజనులు తేని యులివునాలించి, ప్రభుఁడు జీవములతో నుండుటగ్రహించి, సింహాసనస్థుఁడగు నా హీనమానవుని పైఁబడి, యాతనియొడలుచీల్చి కడికండలు చేసివైచిరి.

౪. సర్వసేనాని యాగమము— అనంతరము రాయఁడు ధననాయకులను మంత్రులను మండలేశ్వరులను బంధువులను గొలువునకుఁదోడితేర భటుల కాజ్ఞాపించెను; కాని యెల్లరు నప్పటికే నవీనగృహమున మృతినొందియుండిరి. ప్రభుఁ డీ భయానకకర్మమును గూర్చి విని, మిక్కిలి వెఱఁగును విషాదమును బొంది, యాఘోర మారణవ్యాపారముతో సంబంధముగల యొక్కొకని కుటుంబమును గూల్చెను. సింహళముపై దాడివెడలి యున్నవాఁడగుటచే, నొక్క సర్వసేనానిమాత్రమే యీ గండమునుండి తప్పించుకొనఁ గల్గెను. అచ్చటినుండి వేగమరావలసినదిగనా వాహినీపతికి సందేశపత్రము వెళ్ళినది. ధననాయకుఁడు నగరప్రవేశ మొనర్చి, చక్రవర్తికి సాగిలపడి యాభయంకర గండమునుండి ప్రభునిఁ

దప్పించి యనుగ్రహించిన జగత్ప్రభునకు, మనఃపూర్వక మగు కృతజ్ఞతను సమర్పించెను.

8. అల్లాయుద్దీనుతోడి వైరము.

దేవరాయఁడు క్షతగాత్రుఁడై యపాయకర స్థితిలో నుండుట భామినీరాజు విని, విద్యానగర కోశాగారమునుండి విశేషముగ ధనములాగుటకును నటుగానిచో నగరమునఁగల సైన్యమును జాలవఱకు నాశముగావించుటకును నది దాఁటినఁ బ్రయాసమని తలంచి [illegible] కేసు లక్షలవరహాలంపవలసినదనియు, లేకున్న నగరము ధ్వంసమొనర్చెదననియు రాయనికిఁ జెప్పెను. దేవరాయఁడు తీవ్రతమాఘాతమునకు వశుఁడయ్యు నించుకైన వెనుదీయక, సుల్తానునియిష్టముఁదీర్ప నిరాకరించి, యాతని దర్పోద్ధతికుచితమగువిధమున ధిక్కారపూర్వకమగు ప్రత్యుత్తరమంపుచు, యుద్ధమునకు సంసిద్ధుఁడయి యుండెను. అనంతరము రాయచూరిదుర్గమునొద్ద నుభయ సేనలును డీకొనెననియు, రెండు నెలలలో మూఁడుయుద్ధములు జరిగెననియు, నికమీఁద విద్యానగరమునకొక్క త్రిడిగల్గింపనిచో నేఁటేఁటఁ గప్పమంపుచుండుటకు దేవరాయఁ డంగీకరించెననియు, నానియమానుసార మిరువైపులవారికిని సంధి పొసఁగెననియు, ఫెరిస్తా వాకుృచ్చుచున్నాఁడు. ఇందుచే సుల్తానునకు దేవరాయఁడు లొంగిపోయెననుట సిద్ధము; కాని యీ దండయాత్రనుగూర్చి సమక్షముచూచిన 'అబ్దుర్ రజాక్' ఇట్లువ్రాసెను.

"విద్యానగరమున దేవరాయని నాతని మండలేశ్వరులను నమాత్యులను హత్యగావించుటకై జరిగిన ప్రయత్నమునుగూర్చియు, నందు సేనానులు పెక్కండ్రు నిహతులగుటనుగుఱించియు, కలుబరిగిరాజ్యపాలకుఁడగు సుల్తాన్ అల్లాఉద్దీన్ అహమద్షా విని, తనసైన్యము నెఱిపుటకు మంచియదను లభించెనని సంతసించి, తోడనే యేఁడులక్షలవరాలంపవలసినదనియు, లేనిచో విద్యానగరరాజ్యమును భస్మముచేసెదననియు; హిందూమతమునే రూపుమాపెదననియుఁ దెలిపెను. సుల్తానుని గర్వోక్తులకు రాయఁడు రోషోద్రిక్తచిత్తుఁడై యాహవముఖముననే యహమ్మన్నగరరాజ్యమును నాశనమొనర్చి నావేఁటకాండ్ర కొసంగెద'నని పలికి, రాయబారిని బరిభవించిపంపెను. ఉభయ సైన్యములును పొలిమేరల యొద్దఁ గలిసికొని పోరాడి దేశమును బాడొనర్చినవి. విద్యానగర సామ్రాజ్య సర్వసేనాని (ధననాయకుఁడు) కలుబరిగిరాజ్యముపైఁబడి యభాగ్యులగు సైనికులను జీవగ్రాహులనుగఁగొని, విజయలక్ష్మితో విద్యానగరమునకు మరలివచ్చెను."

ఈవాక్యములవలన దేవరాయనికే విజయము కలిగినట్లు వ్యక్తమగుచున్నది. భామినీరాజ్యపు మేరలోనున్న దుర్గములను గొన్నిటిని హిందువులాక్రమించుకొనఁగా నాస్థానములనుండి యల్లాయుద్దీనువారినిదఱిమి, స్త్రీలను-శిశువులను-నతినిష్ఠురముగ వధించెననియు, నటు

పై విద్యానగరవీరులు చెలరేఁగి, యాతని నేవిధముననైన సమయింపఁబ్రయత్నింప, పాదుషా యది తెలిసి కలుబరిగి నుండి పాఱిపోయి, దానికుత్తరమున నూఱుమైళ్ళ దూరముననున్న బెడందకోటను రాజధానిగఁ జేసికొనెననియు, నాంగ్లచరిత్రకారులు నుడువుచున్నారు.

### 9. విదేశీయ విమర్శకులు.

రెండవ దేవరాయనికాలమున నిద్దఱు విదేశీయ విమర్శకు లాతనిసామ్రాజ్యముఁ జూడవచ్చిరి. ఇందుఁ బ్రథముఁడు ౧౪౨౦ వ సంవత్సరమున విచ్చేసిన నికోలో డెయికొంటియను నిటలీదేశస్థుఁడు. ద్వితీయుఁ డీవఱకే మనకుఁబరిచయుఁడైన 'కమాలుద్దీ అబ్దుర్ రజాక్'అను తురుష్క రాయబారి. ఈ యిరువురును విద్యానగర ప్రాభవవైభవాదులనుగూర్చి చక్కఁగ వివరించియున్నారు. అందలిముఖ్యాంశములు విద్యానగర జీర్ణభాగములను వర్ణించుటకుముందు సంగ్రహముగఁ దెలుపఁబడును. ఈ విమర్శకులలో నికోలోడెయికొంటి దివాలా తీయువారియాస్తి ఋణదాతలకుఁ జెందెడువిధమును సహగమనాచార విధానమును, మరణదండన మున్నగు విషయములనుగుఱించియు వ్యక్తపఱిచెను. అందు సంవత్సరాది దీపావళి కామదహనము నీపర్వత్రియము నాతఁడు చక్కఁగ వర్ణించియున్నాఁడు. రెండవవాఁడైన యబ్దుర్ రజాకు పారసీకదేశ వాస్తవ్యుఁడు. తన ప్రభుఁడగు 'షహారుఖు'ని యాదేశానుసారము హిందూస్థానమునకు

రాయబారముపూని, క్రీ. శ. ౧౪౪౧ (హిజరాశకము ౮౪౫)వ సంవత్సరము జ్యేష్ఠమాసమున నొక పవిత్ర దినమున సముచితములగు కానుకలతోఁ బారసీకము నందలి హోర్మాజు రేవువిడిచి, దారిమధ్యమునఁ బెక్కు కడగండ్లకులోనై చివరకెట్లో కళ్ళికోటచేరికొని, రాజ సందర్శనార్థ మచ్చటనాఁగెను. ఈతఁ డీభారతభూమిని నడుగువెట్టినదిమొద లీదేశమువిడిచిపోవుదనుక నిందలి వివిధభాగములను సందర్శించి, నాఁటి దేశపరిస్థితులు నాచారధర్మములు తో సంబంధముఁగనుఁగొనిన నానావిషయములు తనప్రభువుల రాజ్యపాలనము మొదలగు వానిని యథాక్రమమున వర్ణించుచుఁ, బారసీకభాషలో నొక మహత్తరమగు చరిత్రగ్రంథమువ్రాసెను. దానిపేరు

'మత్లా-ఉస్-సఅయిదైన్.'

ఈ గ్రంథరాజమువలన విద్యానగరసామ్రాజ్యమున రెండవ దేవరాయనికాలమునాఁటి యనేకాపూర్వ విషయములు గ్రహింపవీలగుచున్నది. ఆతఁ డందువివరించిన చరిత్రాంశములలో నీసందర్భమున కుచితములగు ముఖ్యవిషయములుమాత్రమే యిందు సంక్షేపించెదము.

౧. సామ్రాజ్య విస్తీర్ణము—ఒక్కమాఱు ప్రయాణముసల్పవలెనన్న మూఁడునెలలకాలమునకుఁ దీఱని వైశాల్యముగల ప్రదేశము విద్యానగరసామ్రాజ్యము. మంగళూరు సింహళప్రాంతములు దాని దక్షిణపుమేరను సూచించు టెక్కెములు. ఉత్తరమునఁ గలుబరిగి

రాజ్యమువఱకు దీనివ్యాప్తి. ఏవంకఁజూచినను వేయి యామడలదాఁక విస్తరించి యున్నట్లున్నది. పూర్వపశ్చిమములయందు సముద్రములే దీనికిహద్దులు. కళ్ళికోటమొదలగు సుప్రసిద్ధములైన నౌకాకేంద్రములు మూఁడు వందలు విద్యానగరచక్రవర్తి యధీనములు. ఈ నౌకాశ్రయముల మూలమున ఖండాంతర మండలములతోఁ జక్కనివ్యాపార మీ సామ్రాజ్యమునకుఁగలదు. ఇంతటి విశాలప్రదేశ మంతయు వివిధవిధసస్య పరిశోభితము. సామ్రాజ్యమునందలి జనసంఖ్య గణనాతీతము. ఏజన పదముచూచినను ప్రజాసముదాయముచేఁ గిటకిటలాడు చుండును.

౨. నౌకాశ్రయములు - తదధికారులు—విద్యానగర సామ్రాజ్యమునకుఁజెందిన సముద్రతీరము లన్నియు విశ్వాసపాత్రులగు శుల్కాధికారులచేఁ బరిరక్షితములు. అన్యదేశపునావయేదని తప్పిజారి తమ రేవులఁజేరుచో బాధ్యతగల యితరనావలవలెనే దానినిగూడ నిరపాయముగ సంరక్షించుట నౌకాశ్రయాధికారుల విధియగును. వెండియు నీ యధికారు లాయాతీరములయందుఁబ్రోగగు వివిధవిధ వస్తుసంచయమును భద్రముగఁగాపాడి, వానిని యజమానుల కప్పగించువారు. విదేశములనుండి దిగుమతియగు సరకులలో విక్రయింపఁబడిన వస్తువులవెలపై నూటికి రెండువంతున శుల్కముక్రింద గ్రహించుట దొరతనపు నియమ మయియున్నది.

3. సప్తప్రాకారములు— విద్యానగర మేడు కోటలచే నావృతమయిన దుర్గమగుపట్టణము. ఈ సప్తప్రాకారములు దాఁటినఁగాని రాజమందిరము ప్రవేశించుటకుఁగాదు. ఇందు మొదటికోట యున్నతశిఖరాంతరమున దృఢములగు గండశిలలచే వలయాకృతిని నిర్మింపఁబడియున్నది. దీనికి బలాఢ్యములగు సింహద్వారములు నాలుగుగలవు. అందు దుర్గరక్షకులగుభటు లహోరాత్రము కొండ లెల్లఁగనులుగల్గి కావలికాయుచు, నాగంతుకులనుండి హెచ్చరికతోఁ బ్రవేశశుల్కముఁ గొనుచుండువారు. ఈ వెలికోటయందలి యొకగవనునుండి దానికభిముఖముగనున్న మఱొకద్వారమువఱకుఁగల యంతరము రెండామడలు. మొదటి రెండు ప్రాకారముల నడుమ పుష్పోద్యానములు ఫలవృక్షములు బావులు నందందు మనోజ్ఞములైనభవనములు గన్పట్టును. ఈ ప్రాకారములనడుమ నుత్తర పశ్చిమద్వారముల మధ్యమున వనగజములను మచ్చికపఱుచుటకును మదేభముల నాడించుటకును నేనుంగుపిల్లలఁ బెంచుటకును ననువగు వసతులు కల్పింపఁబడినవి. మూఁడవకోటమొదలు లేడవ ప్రాకారమువఱకు రాజమార్గముల కిరువంకలఁ గ్రిక్కిఱిసియున్న గృహవాటికలు నంగడులు నారామములు వెలయును. ఏడవప్రాకారికి వెలుపల నేఁబదిగజముల వైశాల్యముగల విహారణరంగ మున్నది. ఈ కోటలోపలనే రాజసౌధములును సభారంగములును సుందర మందిర

ములును నొప్పును. ఇంచు సువిశాలములు సుమనోజ్ఞ ములు నైన నాల్గురాజమార్గము లొండొంటి కభిముఖ ముగ నగరివాకిటికెదురుగఁ గలిసికొనుచున్నవి.

౪. వాడలు - వర్తకము - నాణెములు.— విద్యానగరమునందలి ప్రధానవీథులన్నియు మిగులవెడల్పైనవి. అందిరుప్రక్కల నంగళ్ళును, వానిముందు పలుచకముల సరకుల నుంచుకొనుటకై వర్తకులు నిర్మించుకొన్న చప్పడములును, నాచప్పరముల పురోభాగమున సుగంధద్రవ్యవిక్రేతయుఁ బుష్పలావికులయు వస్తునిచయమును, పలయునంతస్సల మాక్రమించుకొనియున్నను, నడుమఁ బాదచారుల గుఱ్ఱపురౌతులు నేనుఁగులు నందిళ్ళములు నెడవిడకపోవునంత విశాలవంతములుగ నారాజమార్గము లొప్పును. ఒక్కొక్కవాడ నొక్కొక్కరకపు సరకు మాత్రమే యమ్మఁబడును. ఇందమూల్యములైన రత్న ములు ప్రవాళములు మేలుజాతిముత్తెములు వజ్రములు నడివీథులలో రాసులుపోసికొని, బహిరంగముగ విక్రయించుచుందురు. 'వరహా*' 'ప్రతాపము' 'పణము'అను త్రివిధములగు నిష్కములను 'తరము'లను వెండిటంక ములును 'జత'లను రాగినాణెములును నిచ్చట చెల్లుబడి

* నాఁటినాణెములకు రమారమి క్రిందిమూల్యము తుల్యమనఁదగును. జత రెండుదమ్మిడీలు. తర మరణా. పణము మూఁడణాలు. ప్రతాపము రూ. 1—14—0. వరా రూ. 3—12—0 లు. వరాయన నించుమించు సాల్టుకూప్యములు.

యగును. ఇవెల్ల విద్యానగరరాజధానియందలి టంకశాలయందే ముద్రింపబడును. మూడుజత లొకతరమునకును, నాలుతరము లొకపణమునకును, పదిపణము లొక ప్రతాపమునకును, రెండుప్రతాపము లొకవరాహకు సమానము.

౫. పాతాళపుగొట్టులు - బంగారపు గట్టులు—రజాకువ్రాతవలన రాయలరాజ్యము ధనాధిదేవతకుఁ గడుఁ బ్రియముగూర్చు క్రీడారామముగ నుండెననవచ్చును. విద్యానగర సామ్రాజ్యమునందలి పిన్నలు పెద్దలు నెల్లరు రత్నభూషణాద్యలంకారసంశోభితులుగ నుండిరఁట! రాయలధనాగారమునఁ బాతాళపుగొట్టులెన్నియో యుండెను. వానిలో వెండి బంగారము గట్లు పోసియుంచుట యాచారముగనుండినది.

౬. నగరరక్షకులు—ఒక్క విద్యానగర సంరక్షణమునకు మాత్రమే పండ్రెండు వేల భటులుండిరి. వీరి వేతనమునకై వేశ్యావాటికలనుండి దినమునకు పండ్రెండు వందలవరాలు (౨౧౦౦౦ రూపాయలు) సుంకమువచ్చుచుండినది. రక్షకభటులు చాల మెలఁకువతో నగరముఁ గాపాడుచు, పుర ప్రాకారముల నడుమ నెచ్చట నెపుడేమినడచినను దక్షణమే నగరపాలకునకుఁ దెల్పుచు, నేరములుజరుగకుండఁ జూచుకొను చుండిరి. ఏచోట నేపాటిసొమ్ముపోయినను, నాప్రాంతమునకు నియోగింపఁ బడిన భటులు తమ చక్కనిపరిశోధనమువలన దానిఁ

గనిపెట్టి, జాగు లేక యజమానున కాసొమ్ము చేర్చు చుండవలయును. లేనిచో దండవిధాయివిధించు నప రాధధన మచ్చుకొనవలసియుండుట భటులకువిధి.

౭. నగరపాలకుని కర్తవ్యము— ఘన నాయకునిఁ గటకపాలుఁడనియు నగరపాలకుఁడనియు దణాయిరునియు దండనాధిపతియనియు నందురు. ఈతఁడే సర్వసేనానియు మంత్రియును. ఈతని యాస్థానమండపము టంకసాల కెదురుగా నుండును. ఇతఁడనుదినము నియమితవేళ సభామందిరమునకరిగి, ప్రభుతోద్యోగులును చోపుదారు లును బలసికొలువ, నభియోగవిచారణలకుఁ గడంగును. అభియోక్త మండపప్రవేశ మొనర్చి, భక్తిభావపురస్సర ముగ దండనాయకునకు సాగిలపడిలేచి, కాన్కయిడి, కృతాంజలిపుటుండయి, భయవినయములుదోఁప శిరము వంచి నిలుచుండును. తదుపరి దండనాధిపతి సముచితభంగి నపరాధవిచారణలుసల్పి తీర్పుచెప్పును. ఈతనితీర్పునకుఁ బై తీర్పు లేదు. ఇట్లు రాజకీయకార్యకలాపములు నిర్వ ర్తించుకొని, దండనాధిపతి కొలువుచాలించి, సభారంగ మునుండి వెలువడును. వెంటనే మంగళరవంబు లెసం గును. సేవకులు వింతవింతవన్నెలుగల గొడుగుల నేడింటినిఁబట్టి యధిపుని వెంబడింతురు. కొందఱు చామర ములు వేయుచుందురు. చోపుదారు లిరుగడలఁ బరాకుఁదెల్పుచు ముందు నడతురు. వారి పురోభాగ మున శంఖకాహాళాది శోభనతూర్యములు మోగ్రియు

చుండును. కటకపాలుఁ డింతటివైభవముతో రాజమంది రమువఱకునడచి సప్తప్రాకారములు గడచును. ఒక్కొక ద్వారమున నొక్కొక ఛత్రమువంతునఁ జాలింపఁబడును. చివర దణాయియొక్కఁడుమాత్రమే నిరాడంబరవృత్తి నంతిపురిఁజొచ్చి, చక్రవర్తిసమ్ముఖమున నాఁటివృత్తాంతముసమస్తము నివేదించును. పిమ్మటఁ బ్రభునియాజ్ఞవడసి రాజనగరమునకు వెనుకనున్న నిజమందిరమునకుఁ దరలును.

౫. వేశ్యాజనసమాశ్రయము—నగర ప్రాకారములనడుమ నందందు వేశ్యలవాడ లధికముగనుండినను, టంకసాలసమీపమునందలి గణికాజన సమాశ్రయము మాత్రము, కడుంగడు రామణీయకముగ నుండెనఁట! ఆభాగమున వరుసలుతీర్చి సాలంకృతములుగ నిర్మింపఁబడిన హర్మ్యములు పుష్పలతాకుంజపరిశోభితములగు సౌధప్రాంగణములు సర్వజన హృదయాకర్షకములనియు, నామందిర పురోభాగములఁ జెలువొందు చంద్రకాంత శిలావేదికలపై సాయంసమయములయం దుపవసించెడు విలాసినుల యంగసౌష్టవముఁగూర్చియు సౌందర్య విశేషములను గుఱించియు వర్ణించుట యశక్యమనియు, రజాక్ నుడివెను. అట్టివర్ణన నుపక్రమించుట మీఁదు మిక్కిలి తనమనశ్చాంచల్యమునకే కారణమని యాతఁడు వాక్రుచ్చెను.

౬. గజపోషణము—ఏనుఁగులవేఁట దేవరాయనికిఁ జాలఁ బ్రీతికరమగు నాటయయి యుండెఁగాఁబోలు.

నిరంతరమాతఁడు వన్యవారణ విహారప్రదేశములుసుట్టి, గజగ్రహణలీలలఁ గాలము వెడలించు చుండినటులు తోఁచెడిని. ఈ వన్యమదోత్కటములను మిగుల నేర్పున బంధింపఁగల చతురులగు మావటీం డ్రితనికడనుండిరి. రాయఁ డీమార్గమున సాధించిన పర్వతములఁబోలు మాతంగములు విద్యానగరమున వేలకొలఁదిగనుండినవి. అం దత్యుత్తమములైన భద్రకుంజరములఁ గొన్నింటిని మాత్ర మాప్రభుఁడు ప్రత్యేక గజశాలయందుంచి, వాని పోషణమున కుచితమగు వసతి వేఱుగఁగల్పించియుండెను. మావటీం డ్రానాగములను మిగుల హెచ్చరికతోఁ బెంచు చుండెడివారు. అనుదిన ముదయాస్తమాన సమయములయందు, రెండేసి పణుఁగుల భారముగల పాయసపు ముద్దలను నేతిలో ముంచియెత్తి, యొక్కొక యేనుఁగునకును దినఁబెట్టుట, వారినిత్యకృత్యములలో నత్యావశ్యకమగు నియమమయియుండెను. ఈయాహార మాయేనుంగుల యెదుటనే పచనముశేయుట వారికివిధి. అట్టిచో నందుఁ బదార్థములుపయోగించుటలో నేమాత్రము పొరబాటుజరిగినను కరులూరకొనక యాకింకరులఁ జంప దొరఁకొనునఁట. గజరక్షణమున నేభటుఁడైన నావంత ప్రమాదమున కెడమిచ్చినను రాయఁ డాబంటునకుఁ గ్రూరశిక్ష విధింపక విడుచుచుండినవాఁడు కాఁడు. ఎవ్వఁడేని రాయనికాగ్రహము గల్గించునంతటి నేరముఁ గావించినచోఁ బ్రభుఁ డాయపరాధి నీమదవ్యాళముల మ్రోలఁ

ద్రోయ నియోగించుచుండును. అవి వానినిబట్టి నేలకుఁ ద్రొక్కి దంతములతోఁగ్రుమ్మి తొండములతోఁ జీల్చి చమరివేయుచుండెనఁట. ఈభద్రేభములలో నొకటి యైరావతమువంటి తెల్లయేనుఁగు. మావటీఁ డీసామజము నరుణోదయాత్పూర్వమే ప్రభునిసన్నిధికిఁ గొని పోవుటయు, శుభప్రాప్తికై ప్రభుఁడు దానినిదర్శించుటయు సంభవ మగుచుండెను.

౧౧. అంతఃపుర విశేషములు—రాణివాసాభ్యంతర మందిరమునఁ బురుషప్రవేశమున కవకాశమే లేకుండెను. పదేండ్ల యీడుదాఁటిన బాలుఁడు నయిత మంతిపురిఁ జూచుటకు వీలుండినదికాదు. రాయని కేడు వందలమంది భార్యలుగాక యుంపుడుకత్తెలును ప్రేమాస్పదలగు యువతులును నా యవరోధభవనమున నుండిరఁట. మఱియు దాసదాసీజను లెందఱో యుండిరి. అంతఃపురస్త్రీజన మింతయున్నను నిద్దఱు రాణులుఁగాని యుంపుటాండ్రుగాని యిద్దఱు యువతులుగాని యొక గదిలో నివసించుచుండినది లేదఁట. ఒక్కొకరి యునికికిని బ్రత్యేక వసతు లేర్పడియుండినవి.

౧౧. శిల్పము—రజాకు కళ్లికోటరాజగు 'సామూరి' మన్నన వడయలేదు. అతఁడచ్చట నాలుమాసముల కాలము గౌరవహీనమగు నిరుద్యోగవృత్తిలోఁ గడపి, యనంతరము విద్యానగరప్రభుని యాహ్వాన మందికొని, ౧౪౪౩వ సంవత్సరము మార్చి నెలలో మంగ

ఘూరినుండి మెట్టదారినిఁ బ్రయాణము సల్పుచు, విద్యానగర సామ్రాజ్యమునఁ దాఁజూచిన దేవనిలయములలో నుత్కృష్టములగు వానిని రెండింటిని వర్ణించి యున్నాఁడు. అందొకటి మంగళూరికి ముప్పదిమైళ్ల దూరమునను౦డిన నాల్గంతస్థులుగల కాంశ్యమయ దేవాలయము. ఇది పది గజముల చదరము నైదు గజముల యున్నతముఁగల్గి, ప్రపంచమునం దద్వితీయముగ వెలయుచుండెనని యాతఁడు వ్రాసెను. ఇందుఁ జివరయంతస్థున నిలువెఁడెత్తుగల స్వర్ణవిగ్రహ మొకటి యుండెననియు, నావిగ్రహములకుఁ బ్రకాశమానములైన కెంపులు నయనాకృతినిఁ బొదుగఁబడి యుండెననియుఁ, గేవలము కంచుతోఁ జేయఁబడిన యీ దేవాలయమంతయు మిగుల రామణీయకమైన శిల్పకళలచేఁ జెలువారుచుండెననియు, నాతఁడు తెల్పుచున్నాఁడు. బేదనూరి నగర మధ్యమున, నొకవిశాలమంజుల పుష్పోద్యానాంతరమునఁ జంద్రకాంత శిలామండప పూర్వకముగ నిర్మితమయి, యపూర్వ శిల్పనిర్మాణములచే సంశోభిల్లుచుండిన దైవమందిరము రెండవది. ఆఱువది యడుగుల వెడల్పును, తొంబది యడుగుల పొడవునుగల నాల్గేసి యంతస్థుల గోపురములు నాల్గు, ఈ యాలయమునకు నలుప్రక్కల వెలయునఁట. దాని మహత్తర సౌందర్యగరిమ నభివర్ణించుట చాలఁగష్టమనియు, నా యాలయపు ప్రాభావికస్థితి యున్నదున్నట్లు వర్ణించినను నతిశయోక్తి యను

నిందకు గుఱికావలసి వచ్చుననియు, రజాకు నుడివెను. ఆ నిలయ పురోభాగమునఁగల చంద్రకాంత శిలామండపమున రాళ్లొకటితో నొకటి పొందించిన తీరు శ్లాఘ్యతరముగ నుండెననియు, అట్లువాని నొండొంటితో సమర్చిన జాడ యేమాత్రము నగపడక మండపమంతయు నేకశిలామయమా యను సంశయమునకు సయిత మవకాశమీయఁగల్గియుండెననియు నాతఁడు తెల్పెను. ఈమండపమధ్యమున నల్లరాళ్లతో నొక దేవాలయము కట్టఁబడియుండెననియు, నాలయకుడ్యములపై నొకటి దిగువ నొకటి మూఁడువరుసలుగఁ జెక్కఁబడిన మానవప్రతిమలవంటి యాకృతు లెంతటి సమర్థుఁడగు చిత్రకారుఁడేని బాగుతోనైనను గీయఁజాలఁడనియు, నాతఁడు నిర్వచించెను.

౧౨. రాయబారుల సత్కారము—విజాతీయులును విమతస్థులునగు రాయబారులు దేశాంతరమునుండివచ్చి, యాస్థానమున రాయని సందర్శించునెడలఁ, గర్పూరతాంబూలాదులతో వారిని సత్కరించుట, సంస్థానపు మొదటి యాచారమయి యుండినది. ఆరాయబారులు విద్యానగరమునుండఁ దలఁచుచో వారు రాజధానియందుండు నంతకాలము సామ్రాజ్యగౌరవమునకుఁ దగినట్లు రాయబారుల గ్రాసవాసముల కనువేర్పఱుచుట ప్రభుసముఖ్యధర్మముగ నుండినది. అబ్దుర్ రజాక్ తాను మొట్టమొదట చక్రవర్తిసందర్శనము చేసిన సందర్భమున,

నైదువందల పణములు - సుగంధద్రవ్యములు - నిరువది దీనారములయెత్తు పచ్చకర్పూరము - రెండుకట్టల తమల పాకులు బంగరుపళ్లెరమున నునిచి యాతని కొసంగఁబడె నఁట. పిమ్మటఁ దాను రాజధానియందున్న దినములలో వారమునకు రెండుపర్యాయములు రాయని సందర్శనము చేయుచుండినట్లును, నాసందర్భములలో నెల్లఁ బైవిధమగు సత్కారమే తనకుజరిగినట్లును నాతఁడు తెల్పుచున్నాఁడు. రజాకు విద్యానగరమున వసించుచుండినయంతకాల మా తని దినవెచ్చమునకై యొకమేఁకయు నేయి-యొకమణుఁ గుపంచదార - రెండుగోనెలు - నెనిమిదికోళ్ళు - రెండు వరాలు ననుదినమాతని విడిదికిఁ బంపఁబడు చుండెనఁట. దేవరాయఁడు దయార్ద్రహృదయుఁడనియుఁ జాలనుదా రుఁడనియు, సుగుణములపుంజమనియు, గాంభీర్యదాక్షిణ్య సూచకములగు భాషణములను నెఱపు సదాత్తచిత్తుఁడ నియు, రాజపరమేశ్వరుఁడనఁదగిన వ్యక్తియనియు రజాకు నుడువుచున్నాఁడు. అందుల కొరాయబారి నిదర్శనముల నన్నింటినో చూపెను. ముఖ్యముగఁ జక్రవర్తి మహా మ్మదీయులకు బద్ధవిద్వేషియయ్యు నాతెగకుఁజెందిన తన యెడ నాపఱకుఁదా నెందును గనివినియెఱుంగనంతటి యపారప్రేమయే కనఁబఱిచెననియుఁ, దన దేశమునందలి యమరఖండము షిరాజు మొదలగు ప్రధాననగరవిశేష ములఁగూర్చియు సుల్తానుని కుశలాదికములనుగుఱించి యుఁ దఱుచుఁ బ్రశ్నించుచుండెననియు, నాతఁడు తెల్పెను.

విద్యానగరమున రజాకునకుఁ గల్గుచుండెడు గౌరవాదరములఁగాంచి సైఁపనోపని, హార్మజునివాసులు కొందఱాతఁడు నిజముగ సుల్తానుషరూఖుని రాయబారికాఁడనియు వేషధారియనియుఁ బ్రకటించిరి. ఈవిషయమును దేవరాయఁడు ముఖ్యామాత్యునియాలమున గ్రహించిన తెరువాతను దఱుచు రాజమార్గమున నూరేఁగుతఱిని దానెదురగుచోఁ దోడనే మదాపళముసాఁపి, రుచిరదరహాసచంద్రికలు ముఖమండలమున నటియింప, దయామృతవృష్టిఁగురియు వీక్షణముల నెఱపి, తన యోగక్షేమములను రాయఁడాకర్ణించుచుండెనని రజాకు తెల్పెను.

## 11. కలవు-కప్పము.

సుల్తాను విద్యానగరమును దాఁకి తిరిగిపోయినప్పుడును, మఱుపటి సంవత్సరమునను, కలుబరిగియందుకు అవుపీఁటపెట్టి ప్రజల నలయించెనని, ఫెరిస్తా వ్రాయుచున్నాఁడు. దేవరాయఁడు భామినీరాజుల కైదుసంవత్సరముల కప్పమీయవలసియుండియు, నీయక తిరస్కరించినందున, నల్లాయుద్దీను తన సోదరుఁడగు మహమ్మదుఖానుని బలాఢ్యమగు సేనతో విద్యానగరముపైకిఁ బంపెననియు, మహమ్మదుఖానుని సైన్యములు రాష్ట్రమున ఘాతుకకర్మముల నెన్నింటినో యొనర్చెననియు, నందుచే రాయఁడాతనికి రెండువందలమంది బానిసలను-పెక్కేనుంగులను-విశేషధనమును-నిచ్చుటకియ్యకొని సంధిగావించుకొనెననియు, ఫెరిస్తా తెల్పుచున్నాఁడు. ఈతఁడు ౧౪౩౫వ

సంవత్సరము విద్యానగరమునకును గుల్బర్గాకును యుద్ధము పొసఁగెనని సూచించెనే కాని, తత్పూర్వము ౧౪౨౫వ సంవత్సరమునుండి యంతవఱకు దాదాపు పదునేడేండ్లకాలము విద్యానగర వ్యవహారమునుగూర్చి యొక్కటి యనువ్రాయక మౌనముద్రవహించెను.

## 12. శత్రుజీవిక-సామ్రాజ్యవృద్ధి.

౧. పరాక్రమస్ఫూర్తి— దేవరాయఁడు లక్షలకొలఁది వీరులకు వేతనములనొసఁగి, వారలనుసంరక్షించుచుండెను. నాలుగువేలకుఁదక్కువకాని శూరవరులెప్పుడు నీతనికడ సిద్ధముగనుండిరి. చివరకీ సేన యేడులక్షలవఱకుఁబెరిఁగినది. పంటమైలారెడ్డియుఁ దెనుఁగురాయఁడును సానుచరులుగనుండ నీవీరుఁడు వినుకొండ, కొండవీడు రాజ్యములను గెలిచి, రెడ్డిరాజులను బద్మనాయకవీరులను దనకంకితులనుగ నొనర్చుకొనెను. ప్రబలప్రతాపాఢ్యులగు రాజులు పెక్కండ్రీప్రభువునకు శత్రువులగుటచేఁ జిరకాలమీతఁడు రణకేళియందేకడపి, యరాతిసేనా మహార్ణవమును సంక్షుభితమొనర్చుచుఁ బరిపంథి నృపతులకు సింహస్వప్నముగనుండెను. కన్యాకుబ్జ కాంభోజ నేపాళదేశముల ప్రభువు లీచక్రవర్తి కనుసన్నలలో మెలఁగుచుండిరి. క్విలన్ (తిరువాన్కూరురాష్ట్రములోని మంచివర్తకస్థలము), సింహళము, పులికోట (తూర్పుతీరమున నిప్పటిచెన్నపురికి సమీపముననుండిన నౌకాశ్రయస్థానము), స్థానేశ్వరము (ఢిల్లీనగరమున కుత్తరమున

యమునకును సట్లెజ్ నకును మధ్యభాగమునఁ బ్రసిద్ధి నొందినది) మొదలగు రాష్ట్రపాలకులు, విద్యానగర సింహాసనమున కంకితులగుట కీరాజసింహుని యద్వితీయ మగు పరాక్రమస్ఫూర్తియే కారణము.

౨. శాసనవిశేషములు—"దేవరాయఁడు యుద్ధము చేయఁగా కన్యాకుబ్జదేశజులు ధైర్యముఁ దొలఁగిరి. కొంకణులు భీతిల్లిరి. తురుష్కులు కళావిహీనులైరి. కళింగులు విఱిఁగిరి. ఆంధ్రులు పరిసరపర్వతములకుఁబాఱిరి. అంగ వంగ కాంభోజ నేపాళ ప్రభువు లాతనికి ఛత్రచామరములఁబట్టు కింకరులైరి. అంగవంగ కళింగ దేశాధీశులెల్లరు చివరకు నాతని బాహుబలము పైననే యాధారపడిరి." అని పెక్కుశాసనములు స్పష్టపఱుచుచున్నవి.

౩. కోశవృద్ధి—నిరంతరమిట్లు సమరార్ణవమునఁ గ్రుంకులిడుచున్నను సుఖానుభవముమాత్ర మీప్రభుఁడు కోల్పోవలేదు. అంతఃపురసౌధముల యలంకరణమునకును, రాణివాసస్త్రీల యమూల్యములగు వస్త్రాభరణాదికములకును, నీతఁడువినియోగించుచుండిన ద్రవ్య మపారము. సైన్యాభివృద్ధికై ధనము వెచ్చించినట్లే ప్రజాసౌఖ్యమునకుఁగూడ నిస్పృహవతాసము ధనరాసులను విరివిగఁ గ్రుమ్మరించుచుండెను. ఇఁక నీతఁడొనర్చినదానములకు లెక్కలేదు. ధనమిన్నివిధముల వెచ్చించినను నీ ఖజాని 266 కోట్లకు మించినరొక్కమే బొక్కసమున

నిలువయుంచెను. పైఁగా రత్నములో యాగణితములు. క్విలన్ సింహళము పులికోట మున్నగు దేశముల రాజులు ఒక్క రీతినిఁ జక్రవర్తిగ నంగీకరించి యేఁటేఁటఁ గప్పము లంపుచు, నీ రాజేంద్రుని యాందేశములను శిరసా వహించుచుండిరి.

౪. సామ్రాజ్య భాగములు—విద్యానగర సామ్రాజ్యము, అరగడ-గోవా-గుత్తి-మంగళూరు-బరకూరు-తెరకమంచి-ఆర్కాడు నను మహాఖండములుగ విభజింపఁబడి, సమర్థులగు ప్రతినిధులపాలనమున నుంపఁబడియుండెను. ఇందుఁ గొన్నిటికి రాజేంద్రునిసోదరులే పాలకులుగ నుండిరని తెలిసెడిని.

## 13. సాహిత్యవిజ్ఞానము.

దేవరాయఁ డాంధ్రకవులను గాఢాభిమానమున నాదరించి యుచితరీతిని సత్కరించుచుండెను. ఈతనియాస్థానమునఁ బేరుగాంచిన విద్వాంసుఁ డరుణగిరినాథుఁడు. ఈతఁడు యోగానందప్రహసనాది గ్రంథములు రచించియు, వాదప్రౌఢిమ నద్వితీయుఁడయి వెలసియు, డిండిమమునాధరించి 'డిండిమకవిసార్వభౌమ' బిరుదముఁ బొందియుండెను. రాజసన్మానము గోరి వచ్చెడు పండితులందఱితోడ నీడిండిమకవి వాగ్యుద్ధమున కుపక్రమించి, తన వాక్చమత్కృతిచేఁ బ్రతివాదుల నోడించిపంపుచు, మిగులవిఖ్యాతిఁగాంచుచుండెను. అట్టి సందర్భమున సకలవిద్యా సనాథుఁడును - కవికుల నాథుఁడును-

నగు శ్రీనాథుఁడు విద్యానగరమునకు రాఁ దటస్థించెను. రాయఁడు నివాసస్థల మేదియని ప్రశ్నింప నా కవియిట్లు నుడివెనఁట.

సీ. వరరాజ్యగిరిదుర్గ ♦ పరవైభవ శ్రీలఁ
గొనుకొని విడనాడు ♦ కొండవీడు
పరిపంథి రాజన్య ♦ బలముల బంధించు
కొఱరుమించిన బోడు ♦ కొండవీడు
ముగురు రాజులకును ♦ మోహంబు పుట్టించు
గుఱుతైన యుటితాద్రిదుః ♦ కొండవీడు
చటులవిక్రమకళా ♦ సాహసంబొనరించు
కుటిలాత్ములకుఁగాదు ♦ కొండవీడు.

గీ॥ జనసఘోటక సామంత ♦ సరస వీర
భటనటానేక హాటక ♦ ప్రకటగంధ
సింధురారవ మోహన ♦ శ్రీలఁదనరు
కూర్మి నమరావతికిఁ జోడు ♦ కొండవీడు.

తమపరి డిండిమకవిసార్వభౌమునకును శ్రీనాథునకును సాహిత్యచర్చ జరిగినది. ఆయుద్దండవివాదమున పండితకవినాథుఁడగు శ్రీనాథుఁడు గెలిచెను. ప్రౌఢదేవరాయఁడు శ్రీనాథుని పాండిత్యగరిమకు మిగుల హర్షించి, యాతనికిఁ దనముత్యాలశాలయందు నిండుకొలువునఁ గనకాభిషేకముఁ గావించి, కవిసార్వభౌమ బిరుదమొసఁగి సత్కరించెను. శ్రీనాథుఁ డీ విజయస్మృతికై యరుణగిరినాథునకంచుఢక్క పగులఁగొట్టించెనఁట. ఈకవిసార్వభౌముఁడు సర్వజ్ఞసింగమభూపాలుని సభకు వెళ్ళుచు, సరస్వతి నిట్లుధ్యానించెను.

సీ. దీనార టంకాల ♦ దీర్థమాడించితి
దక్షిణాధీశు ము ♦ త్యాలశాల
పలుకుఁదోడై తాంధ్ర ♦ భాషా మహాకావ్య
నైషధగ్రంథ ♦ సందర్భమునకుఁ
బగులఁగొట్టించి యు ♦ ద్భట వివాద ప్రౌఢి
గౌడ డిండిమభట్టు ♦ కంచుఢక్క
చంద్రభూషక్రియా ♦ శక్తిరాయలయొద్దఁ
బాదుకొల్పితి ♦ సార్వభౌమబిరుద
గీ. ఎటుల మెప్పించెదో నన్ను ♦ నింక మీఁద
రావుసింగమహీపాలు ♦ దీవిశాలు
నిండుకొలువున నెలకొని ♦ యుండి నీవు
సరససద్గుణనికురంబ! ♦ శారదాంబ!

ప్రౌఢదేవరాయభాస్కరుఁడు సుకవిచంద్రులనిట్లు పోషించి, యాంధ్రసాహిత్యవిజ్ఞానము నెంతయును వర్ధిలఁ జేయుట కాతనికులగురుఁడగు శ్రీచంద్రభూషక్రియాశక్తి యొడయరు మిక్కిలి సహకారిగనుండెనని తెలిసెడిని.

### 14. రాయని యోగ్యత-చరిత్రకారులమతము.*

౧. రాయనిధైర్యౌదార్యములు - దేవరాయనికిఁ గల 'గజబెంటకర' యను బిరుదమువలనను, దక్కన శాసనాధారములమూలమునను, నీతఁడు లక్ష్యసమన్వితుఁడును - ధైర్యశాలియు - నగుయోధుఁడని తెలియుచున్నది. అసహాయదశలో సోదరుఁడు తన్నెదుర్కొని నపుడీరాజేంద్రుని మనస్థైర్యము వ్యక్తమైనది. దేవ

* The never to be forgotton Empire.

రాయని సోదరుఁడాతనిఁ జెనకినసందర్భమునసే, గుల్బర్గా యందు సుల్తానునిసోదరుఁడుఁగూడ సుల్తాను నెదిరించి, రాయనిసోదరుఁడు పొందినఫలమే పొందెను. దేవ రాయని సైన్యాధిపతుల బలవద్విజయము లన్యరాజుల గర్వమడంచి సామ్రాజ్యకోశము నభివృద్ధి నొందింపఁగల్గి నవి. ఈపార్థివచంద్రుఁడు చేసినదానము లితఁనిసామ్రా జ్యము నందంతటను ముఖ్యముగ మధురకుమిగులదక్షిణ భాగమునను నోఢ్రత్రిలింగముల యుత్తరప్రాంతముల యందును నగపడుచున్నవి.

౨. కప్పములగాథ—విద్యానగరరాజులు కలు బరిగి సుల్తానులకుఁ గప్పము లిచ్చుచుండిరని వ్రాసిన ఫెరిస్తావ్రాఁతకును, నాప్రాంతమర్మములు చక్కఁగవిచా రించి గ్రహించివ్రాసిన, యబ్దుల్ రజాక్ నూనిజ్ పెయిస్ చరిత్రకారుల వ్రాఁతలకును, సంబంధమే లేదు; కనుక మొదటిది కేవల మూహకల్పితమును నిరాధార మునునయి యున్నది. భామినీసుల్తానులు యుద్ధము చేయుట సందర్భించినపుడెల్ల, కప్పము లడిగియుండినను బలవంతులగు విద్యానగర ప్రభువు లంగీకరించియుండు రనుటకల్ల. విద్యానగరపాలకులు భామినీసుల్తానుల కేడు లక్షలవరహాలు కప్పముక్రిందఁ జెల్లించియున్నట్లు ఫెరిస్తా తెల్పియున్నాఁడు. పరమదరిద్రులైన భామినీసుల్తాను లకును మహాధనాఢ్యులగు విద్యానగరచక్రవర్తులకును బోల్చిచూచినపుడు, వారెట్టికప్పమునైన భామినీసుల్తా

నుల కిచ్చియుండురనుట త్రుణీకరింపఁదగిన విషయము. కృష్ణానది మొదలు కన్యాకుమారి వఱకును, తూర్పుసము ద్రమునుండి పడమటి సముద్రమువఱకును విస్తరించి యున్న మహాసామ్రాజ్య మొక యల్పరాజ్యమునకుఁ గప్పముచెల్లించుచుండె ననుటలో సర్థము లేదు. భారత ప్రపంచమున బహుదూరముననున్న రాష్ట్రపాలకులు, విద్యానగరచక్రవర్తులకుఁ గప్పములు చెల్లించుచుండిరని నిర్ణయించెడు శాసనాధారములను, న్యూనిజ్ వ్రాతలు ధ్రువపఱచుచున్నవి. రెండవ దేవరాయఁడు తన పొరు గుననున్న భామినీరాజ్యము నడఁచియుండిననేతప్ప, పర రాజులనుండి కప్పముఁగొనుట యాతనికి సుసాధ్యము గాదు. రాయఁడు తా నితరరాజులనుండి కప్పములు గ్రహించుట కపరిమితసేనాబలముఁ గలిగియుండుటయు గాక, యాతఁడు తనకును బొరుగురాజులగు భామినీసుల్తా నులకును బొసఁగినయుద్ధములందు శత్రువులకజేయుఁడయి యుండియుండవలయును. హిందువులు జయముపొంది నవుడెల్లను ఫెరిస్తా భామినీసుల్తానులకు విద్యానగరిపాల కులు కప్పములు చెల్లించెడికథయే యెత్తుకొనుచున్నాఁడు. ఒకవేళ ఫెరిస్తావ్రాసినట్లు భామినీసుల్తానులే జయసిద్ధిని బొందియుండిరేని, సంధినియమములన్నియు వేఱువిధ ముగ నుండెడివి. మహమ్మదీయులు విజయోపేతులే యయియుండినచో, నత్యాశాధురంధరులగు నాముసలి మానులు విద్యానగరపాలకులిచ్చిన యేడులక్షలవరహాం

తోడనే తృప్తినొందియుందురనుట సత్యమునకు భిన్నము. తమరాజ్యపుఁ బొలిమేరలో బలాఢ్యమైన హిందూసామ్రాజ్య మొకటియుండుట కలుబరిగిసుల్తానుల కెప్పటికిని ప్రమాదకరమే కదా. హిందువులు సారహీనులేయయి యుండిరేని, నా హిందూరాజులు భామినీసుల్తానులకుఁ గప్పములు చెల్లించియుండకతీఱదు; కాని సందర్భమట్లుండ లేదు. అపారమైన హిందూసైన్యము నెదుర్కొనఁజాలక, భామినీసుల్తానులు కపటజాలములఁ బ్రయోగించిరని ఫెరిస్తాయే సాక్ష్యమిచ్చియున్నాఁడు. నాఁటి సంగ్రామ పరిస్థితులలో శత్రువుచే నపజయముఁబొందుట మొదటి రాజ్యమునకొక చావుదెబ్బవంటిదిగ నుండెను. అపుడోడినవాని సర్వస్వము జయశాలిహస్తమున నుంటయే కాక, యాతఁడనుగ్రహించిననేతప్ప, పరాజితునకు బ్రతుకుఁదెరువు లేకుండెను. భామినీసుల్తానులెప్పుడైన గెల్పొందియుండిరేని, విద్యానగరముపైఁ జిరకాలముగ నకారణద్వేషముపూని, యొక్కగ్రుక్కలో నా సామ్రాజ్యము సర్వస్వము మ్రింగివేయ నువ్విళులూరుచు, నిరంతర మందులకు నిరీక్షించియుండిన తురుష్కులమ్మహారాష్ట్రమును దమరాజ్యములోఁ జేర్చికొనియుండకపోవుట యాశ్చర్యకరమగు విషయము.

## 15. నిర్యాణతిథి.

రెండవదేవరాయఁడు ౧౪౪౪ వ సంవత్సరము మరణించెనని సూవెల్ వ్రాయుచున్నాఁడు; కాని

యీ ప్రభువునకుఁ బిమ్మట రాజ్యమునకువచ్చిన మల్లికార్జునుఁడు, ౧౪౪౭వ సంవత్సరము రాజ్యపరిపాలనమొనర్చుచుండినట్లు, హొయిసలరాష్ట్రమునందలి 'హగళహాళ్ళి' దానశాసనము తెల్పుచున్నది. రెండవదేవరాయఁడుమరణించినాఁడను ౧౪౪౪వ సంవత్సరమునకును, దానికిఁబిమ్మట మల్లికార్జునుఁడు రాజ్యముచేయుచుండినట్లుతెల్పెడు ౧౪౪౭ వ సంవత్సరమునకును నడుమ, నెవ్వరు రాజ్యముచేసిరో తెలిసికొనుట కెట్టియాధారమును లేదు. ఈప్రభుఁడు ౧౪౪౬ వ యేఁట మేనెల ౨౩వ తేది స్వర్గస్థుఁడయ్యెనని కొందఱువ్రాయుచున్నారు. అందులకు నాధారము లగపడదు.

---



సతీ స్మృతి చిహ్నము.
మూసలమ్మ కట్ట: అనంతపురము.



నాటి యొక గ్రామ [తాడిపత్రి] దేవాలయము.
చింతలరాయని యాలయము.

## పదవ ప్రకరణము.



### ప్రథమవంశపతనము.

1. బలాఢ్యులగు రాజులు.

పదునైదవశతాబ్దమధ్యమున దక్షిణాపథమునందలి ప్రభువులలో ముఖ్యముగ నశ్వపతులు గజపతులు నరపతులునను ముత్తెగలవారుండిరి. ఇందు భామినీసుల్తానులశ్వపతులు. వీరరబ్బీ పారసీక సింధుదేశముల గుఱ్ఱముల నధికముగఁగొని వానినిఁ జక్కఁగఁబోషించి, యాయశ్వబలమున శత్రురాజుల నోడించువారు. గజపతులు కళింగదేశాధినాథులు. కళింగరాష్ట్రకాంతారభూములందలి మదగజములను బట్టితెచ్చి, వానితోడ్పాటునఁ బరిపంథినృపతులఁ బరిమార్పఁగడంగువారు. కాల్బల మధికముగఁగల కర్ణాటకభూధవులు నరపతులన వెలసిరి. విద్యానగరసామ్రాజ్యమున కశ్వపతులుబహిశ్శత్రువులును, గజపతులు కర్ణాటకులునంతశ్శత్రువులును, నయియుండిరి. అశ్వపతులు విద్యానగరమునేకాక, గజపతులను వారి రాష్ట్రమునుసయితము రూపుమాపుటకు సదా సంసిద్ధులయి, యుండిరి.

2. విప్లవకాదశ.

ప్రౌఢదేవరాయనియనంతరము రమారమి వలువదేండ్లకాలము విద్యానగరచరిత్ర చాలనుపద్రవకర

దశలోనుండెను. రాజులు, దుర్బలులును-దుస్తేజులును-దురహంకారప్రియులును-నలక్ష్యభావపూరితులును నయియుండిరి. ఆసందర్భమున బెడందకోట (బీదరు)సుల్తాను తొలుత కళింగరాజ్యమును స్వాధీనముగావించుకొని, యావల విద్యానగరము నాక్రమింప సుస్థిరసంకల్పుండయ్యెను. కళింగభూపతియు భామినీరాజగు రెండవ మహమ్మదుషాయును గూడ, విద్యానగరముం గబళించుటకె వేచియుండిరి. విద్యానగర సామంతనృపుండును బ్రబలతరవీరుండును చంద్రగిరి రాజ్యాధీశుండును నగు సాళువ గుండ నరసింహరాజు సామ్రాజ్యప్రభువులకుం గప్పముంపుటమాని, వీలగుచో విద్యానగర సింహాసనమునే కైవసమొనర్చుకొనుటకుం జూచుచుండెను. పాలొల్లనిపిల్లియుండునే? ఇట్లు విద్యానగరసామ్రాజ్యపరిస్థితు లెటుచూచినను గడుంగడు విపన్నావస్థలో నుండినవి.

### 4. మల్లికార్జునరాయుఁడు (౧౪౪౮-౧౪౬౫)

రెండవ దేవరాయనితరువాత నాతనికిఁ బొన్నల దేవివలనఁగల్గినకుమారుఁడగు మల్లికార్జునుఁడు సామ్రాజ్యపీఠము నధిష్ఠించెను. ఈతనికే యిమ్మడిదేవరాయఁడనియుఁ బేరు. తిమ్మన దండనాయకుఁ డీతని యమాత్యుఁడు. ఈ ప్రభునికాలమున యుద్ధప్రసక్తి పూర్తిగ మానెను. తన సామ్రాజ్యమునందలి యుదయగిరి కొండవీటిదుర్గములు గజపతులు గైకొన్ననుగూడ, వానిని రాఁబట్టుకొనుట కీరా జెట్టిప్రయత్నమును సలుపలేదు.

మతగురువులయెడ నీతనికి భక్తి మెండు. ఈతఁడు గోకర్ణ క్షేత్రాదులందుఁ బెక్కు దానములు చేసి, రమారమి యిరువదేండ్లు ప్రశాంతముగఁ బ్రజాపరిపాలనము గావించి, ౧౪౬౫ వ సంవత్సరమున మృతినొందెను.

4. విరూపాక్షరాయఁడు (౧౪౬౫-౧౪౮౫)

మల్లికార్జునునకుఁ దరువాత నాతని సోదరుఁడు (దేవరాయనికి సింహళదేవివలనఁ గలిగిన) విరూపాక్ష రాయఁడు రాజ్యపదముఁబొందెను. ఈతని పరిపాలన మేమాత్రమును స్వారస్యమైనదికాదు. తులసివనములో గంజాయిమొక్క మొలచినట్లు యశోభరితమైన సంగమ వంశమున నీపతిమత్తచిత్తుఁడు జన్మించెను. ఈభూజాని కేవలము భోగలాలసుఁడై నిరంతర మంతఃపురవాసము ననే కాలము గడపుచుండెను. ఏనాఁడు నాస్థానమునకు వెళ్ళియెఱుఁగఁడు. తన రాజ్యముపైఁ జీటికిమాటికిఁ బడెడుపరరాజులకుఁ గోశాగారమునుండి విరివిగ విత్త మొసఁగుచుండెను. 'అర్థస్యపురుషోదాసః' అను ననుభవ విదులమతము సార్థకముగాఁగ, విరోధులు నంతటితోఁ దని వొంది మరలుచుండిరి. బుద్ధిపెడతలఁబట్టుటచేత విరూ పాక్షరాయఁడు తన తండ్రితాతలార్జించి యుంచిపోయిన ధనమును - సామ్రాజ్యప్రతిష్ఠను - బలమును - నీచంద మునఁ గ్రమక్రమముగఁ గోల్పోవుచుండ, రాజకీయ పరిస్థితులు పొగచూర నారంభించినవి. చమూనాథు లందులకుఁ జింతిల్లి సముచితమార్గమునుగూర్చి తేనికి

నిశ్శంకముగ మనవిచేసికొనిరి. తన కట్టిహితము బోధించిన వాహినీపతులలో పెక్కు అనాతఁడు తలగొట్టించెను. ప్రభుఁడెప్పుడును మదిరాపానమత్తుఁడై శుద్ధాంతమందిరమునుండి వెలువడక, తన్నుఁజూడవచ్చెడువారి కేరికిని దర్శనమీయ నిరాకరించెను. అమాత్యవరు లందులకుఁ జింతించిరి. సేనానులు నిరుత్సుకులైరి. సామంతనృపులు కప్పములంపుటమానిరి. ప్రజలు పాలకునియెడఁబరిపూర్ణముగ విరక్తహృదయులైరి. గోవాపురమునందలి తురుష్కులరబ్బీ పారసీక దేశ హయములను రాయనికి విక్రయించుట మానిరి. ఆపై విరూపాక్షరాయఁ డలిగి తన సేనానిని గోవాపట్టణమునకుఁబంపి, పదివేలమంది తురుష్కులనునఱికించి, పట్టణము స్వాధీనముగావించుకొనెననియు, భామినీరాజ్యపుమంత్రి 'ఖాజాఖాజగవాను' గోవాను జయించెననియుఁ దెలిసెడిని. మహమ్మదీయులాపైఁజెలరేఁగి కొన్నికోటల నాక్రమించికొనిరి. ప్రభుఁడందుల కేమియుఁ జేయఁజాలక మిన్నకుండవలసివచ్చెను. సాళువనరసింహరాజు, గండికోట పెనుగొండదుర్గములు వశపఱుచుకొని విద్యానగర రాజుల బలగౌరవాదులు క్షీణించుకొలఁదిఁ దాను వృద్ధినొందుచు, సైన్యాధిపతుల తోడ్పాటున శత్రుకోటిక జేయుఁడై వెలసెను.

### ౬. పతనకారణములు.

౧. రాజుల బలహీనదశ— విరూపాక్షరాయనికి రాజశేఖరరాయఁడు నిమ్మడిప్రౌఢదేవరాయఁడు నను

కుమారు లిరువురుండిరి. తనతండ్రి దుష్కృత్యములఁ గాంచియు సామ్రాజ్యసమాకాంక్షఁ దవిలియుఁ బ్రథమ పుత్త్రుఁడగు రాజశేఖరరాయఁడు జనకునిఁజంపించి తాను రాజ్యముఁగొనెను. తరువాతఁ గొంతకాలమునకే, పితృహంతకుఁడగు నగ్రజుని నాతనితమ్ముఁడు హత్యయొనర్చి సింహాసనము నాక్రమించెను. కేవలము రాజకీయాందోళనమువలనను బ్రతిపక్షుల యలజడివలనను గాక, ప్రాచీనరాజకుటుంబమునందలి పురుషులిట్లు సామ్రాజ్యతృష్ణవలని వైషమ్యభావమున, నొండొరులఁ జంపుకొనుటచే రాజ్యమొకరినుండి మఱొకరికిఁ బయింబయి మాఱెను. విద్యానగర చక్రవర్తులిట్లు తమబలమును ధనమును గ్రమక్రమముగఁ గోలుపోయి, యొండొరుల హత్య గావించుకొనుచు బలహీనదశలోనున్నను, భామినీ సుల్తాను దానిఁజెనక సాహసింప లేకపోవుటకుఁ గారణము తా నావఱకు విద్యానగర యోధులవలనఁ బెక్కుతడవలు బెట్టిదముగ గాసినొందియుండుటచే నానగరమున నింకను నేమిబలాధిక్యమున్నదో యని తలఁచియుండుటయే.

౨. అన్యులచొఱవ— ఇమ్మడిప్రౌఢదేవరాయఁడన్నివిధములఁ దన తండ్రిమార్గమే యనుసరించెను. భాతృహంతకుఁడగు నా దురాచారప్రియుని పాలనము జనులకుఁ గంటకప్రాయముగ నుండుటవలన సేనానులును సమాత్యులును నాతనితోఁ బొత్తుసలుపరైరి. సాళువనరసింహరాయుని దళవాయియగు తుళువనరసరా

జీ కీలకముగ్రహించి, యా సామ్రాజ్య పరిస్థితులిట్టు లాఱు మూఁడగుట మహమ్మదీయు లెఱింగినచో, తదీయ రాజ్య సమాక్రమణమున కెట్టి వ్యూహములనైనఁ బన్నుదురని యెంచి, దానినేవిధముననైన ముసలిమానుల బారికిఁబడనీక సంరక్షించుటకును, సనాతనార్షధర్మములను యథావిధమునఁ బోషించుటకును నిశ్చయించుకొనెను. ఆతఁ డావిషయములనన్నింటినిఁ బూసగ్రుచ్చిన విధమునఁ దన ప్రభుఁడగు సాళువ నరసింహభూపతికిఁ దెల్పి, బలహీనుఁడగు విద్యానగరనృపాలుని సింహాసనమునుండి తొలఁగించుటకై తేనియంగీకారముఁగోరెను. ఆయొడయఁడు తన సేనానాయకుని యుద్దేశముతో సుళువుగ నేకీభవించెను. నరసరా జొకనాఁడు తగిన సేనతో హఠాత్తుగ విద్యానగరము ముట్టడించి సముచిత పారితోషికములఁబంపుటతో నగరమునందలి దండనాథులను మంత్రులను దదితర పాలకవర్గమును స్వవశము గావించుకొని, ప్రతికూలు రెవ్వరును లేకపోఁగాఁ దన సేనతో నాతఁడు నిరంతరాయముగ నగర ప్రవేశమొనర్చెను. ఇట్లు నరసరాజు రాజమార్గమున నంతఃపురమువంక నడచుచుండ, నాసంగతి చారుఁ డొకఁడు పరుగిడిపోయి ప్రభునకుఁ దెల్పెను. రాయుఁ డా యుత్తరక్షణమే నిర్భాగ్యుఁడైన నిజసేవకునితలఁ జెండివైచెనఁట!

౩. రాయుని పలాయనము—సాళువనరసరాజు నిర్భయముగ - నిరాటంకముగ - రాజసౌధము చేరనే

చేరెను. ప్రౌఢదేవరాయఁడు వంటయింటి కుందేలయ్యెను. ఆతఁడు తనకురానున్న విపత్తుఁదలఁచుకొని, మనసు కారాకూరమయి కళవళమునొంద నింకేది మార్గముదేవుఁడాయని తత్తఱిల్లి యవరోధమందిరమునందలి దిడ్డిదారినిఁ దప్పించుకొని, పులికాటుతప్పిన లేడి చందమునఁ బ్రాణములుదక్కఁ జాలుననుచు నుఱికెను. అట్లు పరుగిడుచున్న యిమ్మడిదేవరాయని నరసరాజు పట్టి బంధింపఁజూచెను; కాని పిచ్చుకపై బ్రహ్మాస్త్రమనుచితమని యాయుద్దేశము మానెను. ఇంతటితోఁ బ్రథమవంశమంతరించెను.

---

## సంగమవంశము (౧౩౩౬—౧౪౮౫)




హరిహరుఁడు 2
(౧౩౭౭—౧౪౦౪)
బుక్కరాయఁడు 2
(౧౪౦౪—౧౪౦౬)
చిక్కరాయఁడు
విరూపాక్షరాయఁడు 1
దేవరాయఁడు 1
(౧౪౦౬—౧౪౨౨)
సదాశివరాయఁడు
చిక్కదేవరాయఁడు
వీరవిజయరాయఁడు
(౧౪౨౩)
హరిహరుఁడు 3
మల్లన్న
దేవరాయఁడు 2
(౧౪౨౩—౧౪౪౭)
పర్వతదేవరాయఁడు
హరిమ్మ
మల్లికార్జునరాయఁడు
(౧౪౪౭—౧౪౬౫)
విరూపాక్షరాయఁడు 2
(౧౪౬౫—౧౪౭౮)
రాజశేఖరరాయఁడు
ఇమ్మడిప్రౌఢదేవరాయఁడు

## పదునొకండవ ప్రకరణము.



## IV. తృతీయ (సాళువ) వంశము.

### సాళువ నృసింహరాజు—౧౪౮౬-౧౪౯౦.

#### 1. నృసింహరాయని పూర్వులు.

జైమినీభారత గ్రంథకర్తయగు పిల్లలమర్రి పిన వీరభద్రుఁడు ఈ వంశమునుగూర్చి చక్కఁగ వర్ణించెను. బాహుబలధౌరేయుఁడగు సాళువ గుండశౌరి చంద్రవంశజుఁడు. అతనికి గౌతన వీరయాంబయందు మాదయ్య గుండబమ్మయు సాళ్వమంగు సావిత్రియంగు నను పుత్రు లుద్భవించిరి. అందు—

సీ. దురములో దక్షిణాధీశు నదలించి
  కొనివచ్చి సంపరాయనికి నిచ్చె
సామ్రాజ్యమున నిల్పి 'సంపరాయస్థాప
  నాచార్య' బిరుద విఖ్యాతిఁ గాంచె
శ్రీరంగభూభుజబలగర్వమడంచి యుర్వది వేలు
  మాదలద్దేవు నమ్మడికి నొసఁగె
మధురానగరంబు ముట్టడించి 'పంపత్తి
  సాళువ' బిరుదంబు జగతి నిలిపె

గీ. గర్బితవమునఁ దేజమొసంగంబు గట్టి
తతిమి నగరంబు గవకుంజములఁ గోట్రీ
ఈను శ్రీవిసగారు సుద్దవిడిఁదెచ్చె
సాహసంబున నప్పాంగు సాళ్వమంగు. ౧-౩౭

సాళ్వమంగయకు సింగవిభుఁడు గుండప్రభుఁడు గౌతరాజు సావడినృపుఁడు హనుమక్షితీశుఁడు మల్లినాథుఁడు నను తనయులార్వురు పుట్టిరి. వారిలో గౌతరాజు నకుఁగల్గిన మహావీరులు, గుండవిభుఁడు సాళువనృపుఁడు బొప్పరాజు తిప్పయ యనువారలు.

ఉ. వీరిలలోన నగ్రజుఁడు◆ విక్రమకేసరి గుండధారుణీ
ధారుఁ డుదారుఁ డాతనిప్ర◆తాపము దిక్కులఁ బిక్కటిల్లు దు
ర్వార విరోధివీర నగ◆రంబులకున్ వెఱఁగంటిముట్టై
వైరినృపాలసైన్య వన◆వాటికి దావకృశానుపంక్తులై ౧-౩౬

కడమవార లాహవకేళీవిలాస చతురులేయైన నందు–

క. గుండనృపాలుని తిమ్మఁడు
దండిరిపురాజి సాళ్వ◆ధరణీశ్వరుఁడు మహి
మండలి కాధారంబగు
కుండలి కాధారమయ్యె◆ గురుభుజశక్తిన్. ౧-౩౭

జ్యేష్ఠుఁడగు గుండవిభునకు మల్లాంబికవలన సమర సేనాభిరామమూర్తులగు కుమారవరు లిరువురు, 'శ్రీమదహోబలేశ్వర నృసింహునియంశమున' నృసింహవిభుఁడును దిమ్మరాజును నుద్భవమందిరి.

## 2. నారసింహ.

సాళువ వంశజులు తొలినుండియు విద్యానగర సార్వభౌములకడ నున్నతపదవులలోనుండి, యాచకర్తలకు బహుభంగులఁదోడ్పడి, కటారిసాళువవారనియు మీసరగండవారనియు–పంచఘంటానినాదమువారనియు బిరుదములఁగన్నవారు. సాళ్వమంగయ, మొదటి బుక్క

రాయని పుత్రుఁడగు కుమార కంపరాయని కడ సేనా- నాయకుఁడుగ నుండి, దక్షిణ జైత్రయాత్రలో రాయనికిఁ గుడిభుజముగఁ దోడ్పడి, తన యఖండ బాహువీర్యకారణమున సంపరాయాది పరిపంథిరాజులను గెల్చి, 'పరపక్షి సాళువ' వాది బిరుదములను బొందెను; మఱియు బవరమున సంపరాయని సేనల నెల్ల బ్రుంగించి, యాతనిఁ బొలియఁ జేసి తదీయరాజ్యముఁ గొనియుఁ, బరాజితుఁడు శరణు వేఁడుటచే మరల నాతని రాజ్యసంస్థాపకునిగ నొనర్చిన యీవీరునకుఁ గల 'సంపరాయస్థాపనాచార్య' బిరుదము దెల్పెడిని. ఈతని మనుమఁడును గౌతరాజుపుత్రుఁడును నగు తిప్ప విభుఁడు, సంగమవంశమునకుఁ జెందిన రెండవ దేవరాయని తనయ (హరిమ)ను వివాహమాడెను. ఈతఁడు తన తీక్ష్ణప్రతాప కిరణజాలము దశదిశలకుఁ బ్రసరింపఁ జేసి, సాళువవంశమున కపారమగు కీర్తి చేకూర్చిన శూరుఁడు.

సీ. అమితవైభవముచే నపమానవైభవ
        కులిశాయుధుల నద్రిగుహల కనిచె
    దోఃప్రతాపంబుచే దళితప్రతాప దా
        వానలాప్లుష్ట నరేంద్రవనులఁ ద్రోచె
    వినుతధైర్యంబుచే విఖ్యాతధైర్యమం
        థాద్రులను సముద్రముల ముంచె
    ఘనకీర్తిచే సముత్కటకీర్తిచంద్రులఁ
        గడలేంద యావలి చీఁకట్లఁ గలిపె

గీ. సార మీసరగండ కఠారిసాళ్వ
    కంచఘంటానిశాదాదిక ధ్వజబిరుద
    సాహసారాద సంపాదికంపితారి
    దీపకుఁ డీ సాళువతిప్పశౌరి. ౧-౪౦

ఈతని యగ్రసోదరుఁడు గుండరాజు, రెండవహరి హరునికడ సమాత్యశేఖరుఁడుగను ముఖ్యదండనాథుఁడుగను నుండి, 'విక్రమకేసరి' యనవిలసిల్లి, కొంత రాజ్యసంపాదనముఁగూడఁ గావించెను. ౧౩౯౭ వ సంవత్సరమున సితఁడు కేరళతాళవాది రాష్ట్రములపై దండువెడలి చిచ్చుఅపిడుగువోలె సహితప్రపంచమును దగ్ధమొనరించి, యపారధనముఁదెచ్చి విద్యానగర కోశాగారము నింపెనని, యీవఱకే తెల్పియున్నాము. ఆ వీరాగ్రణి యనయుఁడు—

## నృసింహరాజు.

౧. అభివృద్ధి—తొలుత విద్యానగరమునకు సేనానిగనుండి, మహమ్మదీయులయుక్కడంచి యాంధ్రకర్ణాటకరాజ్యములలోఁ గడుంగడు ఖ్యాతినిఁగన్నఘనుఁడు. భామినీప్రభుఁడగు రెండవ మహమ్మదుషా గండికోటను ముట్టడించి నప్పుడును, పురుషోత్తమగజపతి కాంచీనగరమునుదాఁకిన సందర్భమునను, నృసింహరాజాప్రబలతరవైరుల ననాయాసముగాఁ బాఱఁదోలి, దుర్గములను గాపాడెను. నారాయణవనమును రాజధానిగఁజేసికొని యందువసించుచు, చంద్రగిరిరాజ్యమునకుఁ బ్రతినిధియై, తుళువనరసరాజు తోడ్పాటునఁ బెక్కురాష్ట్రములను జయించిన విక్రమవంతుఁడీతఁడు.

౨. ప్రధానులు — ఈతని ముఖ్యప్రధాని తుళువ నరసరాజు. ప్రతిభాధ్యుఁడగు నాదిండ్ల చిట్టిగంగన

కూడఁ గొంతకాల మీరాజునొద్ద నమాత్యశేఖరుఁడుగ నుండెను. ఆతని యనంతరము నరసరాజు పలుకుఁబడి వలన మంత్రిపదముఁ బొందినవాఁడు, గంగనామాత్యుని శిష్యుఁడు తిమ్మరుసు. నరసరాజు విద్యానగరము నాక్రమించిన పి. శ., ౧౪౮౬ సంవత్సరమున నృసింహరాజే సామ్రాజ్యసింహాసనమున నభిషిక్తుఁడయ్యెను.

సీ. హరిహర త్రియుండయ్యె సామ్రాజ్యము
గొనుచుఁ జేసిననాఁటి కడమయొకటి
యాగీంద్రవంద్యుఁడయ్యెను నగ్రసేనుని
నోలగించిననాఁటి యొచ్చె మొకటి
భువనైకవీరుఁడయ్యె విభాకరతనూజు
దఁబుగొనిననాఁటి పక్క మొకటి
యాదిత్యనాథుఁడయ్యెను బలిదైత్యు
నడుగఁబోయిననాఁటి హైన్య మొకటి
తే. తలఁచి మూర్ధాభిషిక్తుఁడై ధరణిపగుల
గొల్వ నసహాయశూరతఁ వెలసి దాన
శక్తి నవతార మెత్తఁ జాలి గాక
క్షితిపమాత్రుండె సాళ్వ నృసింహవిభుఁడు ౧-౪౪

తనపరిపాలనమున కడ్డువగులు రాజబంధువులను వారి యనుచరులను—నృసింహవిభుఁడు చంద్రగిరి పెనుగొండ ప్రాంతములకుఁ బంపివైచి, గడుసరుల నుద్యోగములనుండి తొలఁగించి, నగరము నిష్కంటకముగ నొనర్చెను.

3. సాహిత్యరచన—ఈరాజేంద్రునకు గీర్వాణాంధ్రభాషలయెడఁగల యభిమాన మత్యనుపమమైనది.

సంస్కృతమున స్వయముగ రామాభ్యుదయమను కావ్యము రచించుటచేతను, నాంధ్రభాషయందు మహోత్తమములగు కృతులను వెలయింపఁ జేయుటచేతను, నుభయ భాషలయెడఁ దనకుఁగల యాదరాతిశయముఁ బ్రకటించెను. ఈ సుకవిపోషకుఁడు తన్నుఁ గొలిచియున్న పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని——

"క. నామది నిరతము భారత
రామాయణకథలఁ బ్రేమ రంజిలు నందున్
జైమిని భారత మనఁగా
భూమి నపూర్వముఁ బురాణముల గణియింపన్.

"తే. ఆపురాణంబుఁ గనఁ దెనుఁగన్న నేని
చెప్ప నేర్చిన కవియుఁ బ్రసిద్ధుఁ డేని
తెనుఁగు నుడికారమున మించుఁ గవియు నేని
కుందనము కమ్మవలచిన చందమగును. ౧-౧౪,౧౫.

"......హృద్యానవద్యగద్యపద్యానుబంధంబుగాఁ బ్రబంధం బంధ్రభాషను జైమినిభారతమునం దశ్వమేధపర్వంబు నిర్విఘ్నంబుగా రచింపుము......"

అని నియోగించెను. పినవీరభద్రుఁడందుల కియ్యకొని, నెలదినములలో వ్రాసితెచ్చెదనని వెళ్ళి, గడువు దినముదనుకఁ గావ్యరచనమున నుపక్రమింపలేను. ఇఁకఁ జక్రవర్తివలనఁ బ్రమాదముపుట్టునని తనయన్నయు వదినెయుఁబ్రబోధింపఁగాఁ గడనాఁటిరేయి తనయింట నొంటరిగ నొకగదిలోఁగూరుచుండి——

"క. సాళువ నరసింగ మహీ
పాలుని నవద్యాంతకుఁ గృపాలుని ననువ్రా

శ్వేత నగరిపశ్య
శ్వాతాంబి నాచేయుశ్రుతిఁడుబుఁ గావి సుఁగ'

అనుచు నృసింహామహీధవున కంకితముగ నాపరిభువర్యుని యాభిమతానుసారము 'అల్లనవిచ్చు చెంగలువలందు రజంబను కప్పురంబు పైఁజల్లఁగఁ జల్లనైవలచు సౌరభముల్ వెదఁజల్లుభావము'లతో, నొక్క రాత్రిలో నెనిమిదియాశ్వాసములమహాకావ్యము రచించెనఁట! అతఁ డమ్మహా ప్రబంధము నమ్మఱునాఁడు రాజాస్థానమునకుం గొంపోయి యామూలాగ్రముగఁ బఠించి, దానిఁ దనరేనికి సమర్పించునపుడు 'వాణినారాణి'యని చెప్పికొనెనఁట!

'క. పిల్లలమఱ్ఱి పినవీరన
కిల్లాలఁట వాణి యట్టులే కాకున్నన్
దల్లముగ నెక్కు రాతిం
దెల్లఁగఁ దెలనాఁగవటుఁ దేఁగలఁ దెఱ్ఱితిన్'

౮. సైన్యసన్నాహము — ఈ యొడయని కాలమున గజపతులు నశ్వపతులుఁ బ్రబలతర విరోధులుగ నుండిరి. అందు భామినీసుల్తాను కోలారుమండలమునందలి మూలూరికోటను ముట్టడింపఁగాఁ, దగినసైనికబలము నగరమునలేనందున నీరాజు సుల్తానుతో సంధి గోరెను; కాని సుల్తాను నృసింహరాజును విశ్వసింపలేదు. వెండియు విద్యానగర సామ్రాజ్యమునఁగల కాంచీనగరము నాక్రమించి, యందలి దేవాలయము దోఁచెను. అశ్వపతులను గజపతులను గృష్ణానదిని దాఁటిరానీయక యాఁపుటకును, నుదయగిరి రాయ

చూరు కొండవీడు దుర్గములను సాధించుటకును, నృసింహ రాజును బ్రేరేచినది భామినీసుల్తానుని యుద్యమంకగమే. అశ్వబలాభివృద్ధికై రాయఁడు విశేషధనము వ్యయము చేసి, యరేబియానుండియు పారసీకదేశము నుండియు నుత్తమతురంగములనుదెప్పించి, నగరమున నిలువయుంపఁ జొచ్చెను. ఆతఁడొక్కొక్కమూఁడేసిగుఱ్ఱములకు వేయి వరహాలువంతున మూల్యమీయఁబూనుటచే, బుడతకీచు (Portuguese) వర్తకులును మహమ్మదీయ వ్యాపారులును మూరులును నీపృథ్వీవరునికే విఁవిగనశ్వముల సమ్మి ధనాఢ్యులుగాఁజొచ్చిరి. నరసింహరాయఁడు డీ మార్గముఁగూర్చిన యాశ్వికబల మపారము. ఆతఁడు నగరమున నందందు శిథిలమైయుండిన కోటలను జక్క పఱిచి, బురుజులను మఱింత వృద్ధినొందించెను.

౫. అవసానదశ — ఈ ప్రయత్నములు జరుగుచున్నట్టే నరసింహరాజు కాలధర్మమునొందుట సంభవించినది. ప్రాణనిర్యాణసమయముననాతఁడు సేనాధిపతియు నమాత్యవరుఁడును నగు తుళువనరసరాజును దనయొద్దకుఁ బిలిపించుకొని, కుమారులసిద్ధతిని సామ్రాజ్యకోశమును నాతనిహస్తమునను నిచ్చి, యగ్రుఁడగువానిని మూర్ధాభిషిక్తుగ నొనర్చి, యాతనికి బాసటయయి యుండవలసినదనియును, దానుసంకల్పించివిడిచిన కార్యములు పూర్తిగావింపవలసినదనియును దెల్పి, నరసరాజు నుండిమాటఁగొని, యసువులఁ ద్యజించెను.

# పండ్రెండవ ప్రకరణము.

---

## ద్వితీయ వంశపతనము.

### 1. ఇమ్మడి నరసింహరాయలు.

తుళువ నరసరాజు, నృసింహరాజునకుఁ బిమ్మట నాతని మొదటికుమారుఁడగు తిమ్మరాయుని సింహాసనమున నునిచి, యాతఁడు బాలుఁడగుటచేఁ దాను సయి కాఁపయి రాజ్యవ్యవహారములఁ జక్కఁబెట్టఁదొడఁగెను. నరసరాజున కయాచితముగఁ గల్గిన యీ గౌరవముఁ జూచి యోర్వఁజాలని యొకసరదారుఁ డాబాలరాజు నెట్లో చంపి, సామ్రాజ్యాశచే నరసరాజే యీ విద్రోహకర్మమున కొడిఁగట్టెనని యపవాదముఁ గల్పించెను. నరసరాజీయపనిందఁ బాపుకొనుటకై, నృసింహరాజు ద్వితీయపుత్త్రుఁడైన రెండవనరసింహరాయని రాజ్యాధిపతిగ నొనర్చెను. మొదటిబాలునిఁ దునిమినదళవాయి తనప్రయత్న మీరూపమున వికటించుటచే నెట్టులైన నరసరాజునే తుదముట్టించుతలంపున, మెల్లమెల్లఁగ రెండవనరసింహరాయునిఁ జేరి, యాతని యనుగ్రహము పొంది, తేనెలుట్టిపడునట్లు తన వేలినుడికారముచేతను—దంత్రవిశేషమునను—గ్రమక్రమముగ నాచెలిమి ధ్రువపఱుచుకొని నరసరాజు నధికముగ నిగ్రహించుచు, నావీరుని దెగటార్చుమార్గముల నన్వేషించుచుండెను.

## 2. ప్రతీకారము.

తుళువ నరసరాజు సరదారునిప్రయత్నము గ్రహించి, భ్రాతృహంతకుఁడగు నాదళవాయినిఁ జేరఁదీయ వలదని నరసింహారాయనికి హితవుబోధించెను; కాని యాబాలకుఁడుమూర్ఖుఁడై మంత్రివర్యునిహితోక్తులు పెడ చెవినిఁబెట్టి మిన్నకుండెను. నరసరాజాతని తలవెట్టి కాశ్చర్యమునొంది యావిషయమై తిమ్మరుసుతో మోజించి, యొవిధముననైన నాతనిమార్గమునకుఁదగుమందు వేయఁదలఁచి, యేదియొకనెపమునఁ బెనుగొండకు వెళ్ళెను. ఆతఁడు కొన్నిదినము లందువసించి, వలసినంత దండుగూర్చుకొనివచ్చి విద్యానగరము ముట్టడించి, రాజద్రోహియైన సరదారుని శిరచ్ఛేద మొనరించుటయా లేక రాజ్యమువిడిచిపోవుటయా యని రాజునకు వర్తమానమంపి, యాఱుదినములవఱకు ముట్టడి విడువకుండెను. తనకు సాయపడువారు నగరమున నెవ్వరు నగపడనందునఁ జేయునదిలేక బాలరాజు సరదారుని తలఁ దఱిగి, దానిని నరసరాజుశిబిరమునకుఁ బంపెను. అంత నరసరాజు పురముఁజొచ్చి, బాలరాజునకుఁ దగువిధమున బుద్ధిచెప్పెను. నరసింహరాయఁ డప్పటికినిదసపెంకెతన-ము వీడనందున సముచితరక్షకవర్గముతో నాతఁడు పెను గొండదుర్గమునందు నిర్బంధమున నుండవలసివచ్చెను.

## 3. భామినీరాజ్యభ్రంశము.

ఈసందర్భమునఁ గలుబరిగియందలి రాజ్యాంగపరి

స్థితి తలక్రిందయ్యెను. ౧౪౮౭ నుండి నలువదేండ్లకాలములో నారాజ్య వ్యవహారములెల్లఁ, బరిపూర్ణముగ మొక్క మొలచిపోయెను. భామినీవజీరుని విపరీతచర్యలకు సైఁపలేక, సామంతు లెదురుతిరిగి తమ తలమీఁదివారినిఁ జెవులుపట్టియాడింపఁ దీరిరి. ఆ హేతువున నారంభరహితులగు భామినీరాజవంశ నృపులు కొంతకాలము నామకార్థప్రభువులుగనుండియుఁ గ్రమక్రమముగఁ దమ బల మంతరించుటచే, విధిలేక సామంతరాజులకే లొంగి పోయి, చివరకుఁ దమకు నిలిచియున్న యల్పరాజ్యమును గూడఁ బోఁగొట్టికొనిరి. ౧౩౪౭ వ సంవత్సరమున 'హసన్ గంగూబహమనీ'చే స్థాపింపఁబడి, నూటనలువది యైదేండ్లకాలము హైందవరాష్ట్రములకెల్లఁ గంటక ప్రాయముగనుండిన యీరాష్ట్రము, ౧౫౨౦లో స్వజాతిజనులవలననే నిరాకరింపఁబడి భగ్నమునొందెను. అనంతర మది తదితర మహమ్మదీయరాజ్యముతోఁ గలిసి, 'ఆదిల్షాహి - ఇమాంషాహి - కుతుబ్షాహి - నిజాంషాహి - బెరూదుషాహి' అను నైదుచీలికలుగ వీడిపోయెను. వీనికిఁ గ్రమముగ విజాపురము - గావిల్గడము - గోలకొండ - అహమ్మద్నగరము - బేదరు (బెడందకోట) పురములు రాజధానులయ్యెను. వానికి వరుసగ 'ఆదిల్షాహ - ఫత్తేఉల్లా ఇమాంషాహ - కూలికుతుబ్షాహ - అహమ్మద్షాహ - కాసింబెరీదు' అనువారు సంస్థాపకులైరి.

---

## సాళువవంశము (౧౪౭౫—౧౫౦౩)



## పదుమూఁడవ ప్రకరణము.

---

### V. తృతీయ (తుళువ) వంశము.

### తుళువ నరసరాజు ౧౪౯౦-౧౫౦౪.

1. వంశము - [illegible]ము.

నరసరాజు చంద్రవంశమునకుఁజెందిన తుర్వసుని సంతతివాఁడు. ఆ తుర్వసుని వంశమే తుళువాన్వయ మయ్యెను. మనుచరిత్రచూడుఁడు.

"క. ఆతని (యయాతికి) యదుతుర్వసులను
సుతు లుద్భవమొందిరి హితసూదనులు కళా
న్వితమతులు వారిలో వి
శ్రుతకీర్తివహించెఁ దుర్వసుండు గుణనిధియై. ౧-౨౧
తే. వానివంశంబు తుళువాన్వవాయ మయ్యె..."

అందు నరసరాజు, తిమ్మనదండనాథునిపౌత్రుఁడు. సుప్రసిద్ధతేజోనిధియగు నీశ్వరరాజునకుఁ బుత్త్రుఁడు.

2. విజయములు.

సాళువనృసింహరాజు చంద్రగిరి రాష్ట్రాధీశుఁడుగ నున్నకాలమున, నాతనియొద్ద నీ నరసరాజు విఖ్యాతసేనాధీశుఁడై, నృసింహరాజునకుఁ జేదోడు వాదోడుగనుండి, యాతని కార్యములనెల్ల గట్టెక్కించుచుండె ననియు, విద్యానగరసామ్రాజ్య మధోగతికి వచ్చుచుండుట తెలిసి, దానినాక్రమించి తనప్రభునకుసమర్పించెననియు, నీవఱకే

సూచించియుంటిమి. తదుపరి సాళువనృసింహరాజు గతించుటయు, నాతని ప్రథమపుత్రుని నొకానొక దండనాథుండు హరించుటయు, ద్వితీయనందనుఁడగు రెండవ నరసింహరాయఁడు సామ్రాజ్యమువహించుటయుఁ బాఠకులకు విదితమె. నరసరాజు రెండవనరసింహరాయనిఁ బెనుగొండదుర్గమున కనిచిన పిమ్మట, విద్యానగరమున నాతనికిఁ గొందఱు ప్రతిస్పర్థు లేర్పడిరి. నరసరాజు విప్లవకారులనెల్ల గుత్తి చంద్రగిరి ప్రాంతములకుఁబంపి, తాను రాజ్యభారమువహించి, పాపములు శమించునట్లు యశస్కరముగఁ బ్రజాపాలనము గావించెను.

"క. అందు నరసప్రభుఁడు హార
చందన మందారకుంద చంద్రాంశు నిభా
స్పంద యశస్తుందిలది
క్కందరుఁడై ధాత్రియేలెఁ గలుషము లడఁగన్"

ఇట్టితఱి విజాపురప్రభుఁడగు నాదిల్షాకును బెడందకోట సుల్తాను కాసింబరీదునకును విరోధముపొసఁగినది. నరసరాజు తనసాయము వేఁడిన కాసింబరీదునకుఁదోడ్పడి, ముద్గల్లు రాయచూరు దుర్గములఁ గైకొనెను. తిరుచినాపల్లి ప్రతినిధి కోనేరినాథ మహామండలేశ్వరుఁడు తాను శైవుఁడగుటచే, శ్రీరంగమునందలి వైష్ణవధర్మకర్తలను గష్టపెట్టుచుండుట నాలించి, నరసరాజు తనప్రథమపుత్రుఁడగు వీరనరసింహరాయనితోడను, ననుపమాన పరాక్రమాన్వితుఁడగు నాగమనాయనితోడను వెడలి, కోనేరినాథునిపొగరు మాన్పుటయు నాసందర్భమునన్.

ఈపరిపంథిభయంకరుఁడు పూర్వరాజులుగోల్పోయిన చేర చోళ పాండ్యరాజ్యములు జయించినట్లును, మధురాధిపతికి గర్వభంగము గావించినట్లును, మ్లేచ్ఛుల మర్దించినట్లును, గజపతిరాజులను విధ్వంస మొనర్చినట్లును, ననేకశాసనములవలనఁ దెలియుచున్నది. దక్షిణమున సింహళమువఱకుఁగల రాజులందఱు నీ ప్రభునకుఁ బాదాక్రాంతులైరి. ఈతఁడు రామేశ్వరాది పుణ్యక్షేత్రములలో షోడశమహాదానములఁ గావించిన దాత. ఈవీరుని విజయపరంపరలఁగూర్చియు దానములను గుఱించియు పారిజాతాపహరణ మిట్లు నుడువుచున్నది.

సీ. కుంతలేశ్వరుఁడు చిక్కుపడంగ విద్యాపు
రంబుగైకొని నిజప్రౌఢి మెఱసెఁ
బాగసీకునకు దుర్భర మానవత్వంబుఁ
దొలఁగించె మానవదుర్గసీమఁ
జోళవల్లభునితో సురవధూ మధురాధ
రములిచ్చి మధురాపురంబుఁ గొనియె
శ్రీరంగపట్టణసీమ ఖడ్గనటీ వి
నోదంబు హావసేన్యమునకుఁ జూపె

గీ. నతఁడు మతికెక్కు రామసేత్వంతరాళ
కలిత షోడశదాన విఖ్యాతయశుఁడు
మండలీకరమేఘ మార్తాండబిరుదుఁ
డీశ్వరాధిప నరస పృథ్వీశ్వరుండు.

నరసరాజు దర్పగ్రస్తులగు ప్రతిపక్షుల మద మడంచుటకై దక్షిణదేశమున సంచరించుచుండుట నా-

దిల్లా తెలిసికొని, తానావలకుఁ గోల్పోయియుండిన ముద్గల్లు రాయచూరిదుర్గముల నాక్రమించెను. ఆసందర్భమున విద్యానగరసామ్రాజ్యమునకుఁ బ్రతినిధిగనుండిన తిమ్మరుసు, సుల్తానుకిమరల్చుటకై నరసరాజుతమ్ముఁడగు తిమ్మరాయనిఁ గొంతసేనతో రాయచూరికిఁబంపినను, తురుష్కసైన్య మపరిమితముగనుండుటఁగాంచి, తిమ్మరాజు దానినెదిరింప సాహసించినవాఁడుకాఁడు. నరసరాజు రాజధానిఁబ్రవేశించి, దుర్గములు పరాధీనములయినందులకుఁ జింతించి, వానినెట్లైన సాధించుతలంపున గజాశ్వకోశబలములఁ బెంపొందింపఁ దివిరెను.

### 4. భాషాసేవ.

ఈపార్థివుఁడు సమరసాహితీసంపన్నుఁడు మాత్రమేకాక, యాంధ్రభాషాసాహిత్యపోషకుఁడుఁగూడ. ఈ ప్రభుని యాస్థానమున 'నందిమల్లయ – ఘంటసింగయ' యను జంటకవులుండి, వరాహపురాణము ప్రబోధచంద్రోదయము నను నచ్చతెనుఁగు కావ్యములను వ్రాసిరి. ఇందు వరాహపురాణము నరసరాజున కంకిత మొసఁగఁబడినది. ఈకవులలో సింగయకు 'మలయమారుత కవి' యను బిరుదముండెనఁట! నందిమల్లయ మేనల్లుఁడీతఁడు. ఈతని మేనల్లుఁడు నందితిమ్మన. ఈ నందతిమ్మనయే పారిజాతాపహరణ గ్రంథకర్త.

### 5. సంతానము.

ఈ నృపునకు తిప్పాంబిక నాగాంబిక ఓబాంబిక

యను భార్యలుండిరి. వారికిఁ గల్గినపుత్త్రులు ముగ్గురు. అందుఁ బ్రథముఁడు వీరనరసింహరాయఁడు; ద్వితీయుఁడు కృష్ణరాయఁడు; కడగొట్టువాఁ డచ్యుతరాయఁడు.

తే. ఆ నృసింహప్రభుండు తిప్పాంబవలన
నాగమాంబికవలన నందనులఁ గాంచె
వీరనరసింహరాయ భూవిభుని నచ్యు
తాంశసంభవుఁ గృష్ణరాయక్షితీంద్రు. మనుచరిత్రము ౧-౩౧

ఈ ముగ్వురునుగాక, రంగరాయఁ డను పేరుగల సుతుఁడుఁగూడ నీరాజునకున్నట్లు శాసనములవలనఁ దెలియుచున్నది.

### 6. మరణశాసనము.

నరసరాజు సమరప్రయత్నముననున్నట్టే యాకస్మికముగ శోథవ్యాధిచేఁ బడిపోయెను. ఆ రుగ్ణత పైకొనుటవలనఁ, దురుష్కులవశమైపోయిన దుర్గములను జయించుటకుఁగాక చింతించి, తనసంతతివారు వానిని సాధించి దక్షిణదేశప్రతిష్ఠ నిలుపవలసినదని మరణశాసనమున వ్రాసి, యాతఁడు క్రీ. శ. ౧౫౦౩ వ సంవత్సరమునఁ బరమపదించెను.

---

# పదునాల్గవ ప్రకరణము.



## వీరనరసింహారాయఁడు ౧౫౦౩-౧౫౦౯.

### 1. విరోధులనడఁచుప్రయత్నము.

నరసరాజునకుఁ బిమ్మటఁ గూడ సాళువ వంశము నకుఁజెందిన యిమ్మడి నరసింహారాయఁడు, రాజ్యమునకు రాలేదు. వీరనరసింహరాయఁ డాతనిఁ బెనుగొండదుర్గ మునకు నాయకునిగనొనర్చి, తాను ౧౫౦౩ వ సంవత్స రమున సామ్రాజ్యపీఠము నధిష్ఠించెను. ఇందులకు సామంతప్రభువులు సమ్మతింపక, పెక్కండ్రు తమతమ ధిక్కారములను దెల్పుచుఁ, గప్పములుసయితము చెల్లిం- చుట మానివైచిరి. వీరనరసింహారాయఁడు శత్రు రాజులవలన సామ్రాజ్యమున కెట్టిహానియును గలుగ కుండుటకై, తొలుదొల్త విద్యానగరరాజ్యపు మేరలలో వలసినంత సేనను రక్షకముగనునిచి, తిరుగఁబడిన సామంత రాజులనుజయించి కప్పములఁదెచ్చుటకై, తనసోదరులగు నచ్యుత రంగరాయలను గొంకణ కర్ణాటదేశములపైకిఁ బంపెను. అందుఁ గొంకణదేశప్రభువు కప్పములను జెల్లించుట కిష్టపడకను, దక్కనవా రెదురుతిరిగి యచ్యుత రాయాదులను రాష్ట్రపుపొలిమేరలు దాఁటువఱకుఁ దఱిమిరి. సోదరులు వ్యర్థులై మరలివచ్చుటఁచూచి, వీర నరసింహారాయఁడు విచారమునొంది, యిఁక నుపేక్ష

వహించుట పాడికాదనితలఁచి, దక్షిణదేశమున దండయాత్ర సాగించెను.

## 2. జైత్రయాత్ర.

వీరనరసింహరాయఁడు మహోదగ్రోద్ధతుఁడై వెళ్ళినస్థలములందంతటను విజయమేపొందుచు, సామంతుల బలదర్పమెల్లమాయించి, వారివలనరాఁదగిన కప్పములఁ గొనెను. 'భుజబలరాయఁ' డను బిరుద మీవీరునకుఁ గలదు. ఈతఁడు చిదంబరము కాంచీనగరము కాళహస్తి తిరుపతి మహానంది యహోబలము మున్నగు పుణ్యక్షేత్రములను సందర్శించి, యందుఁ బెక్కుదానములనుగావించి, 'దానధర్మపరాయణుఁ' డన వెలసిన వాఁడు. ఈప్రభుఁ డాఱుసంవత్సరములు ప్రజాపాలనముచేసి, యావల రుజగ్రస్తుఁడయ్యెను.

## 3. నిర్యాణదశ.

తా నిఁక జీవించుట దుర్ఘటమనితలఁచి, వీరనరసింహరాయఁడు తనయనంతరము తనకుమారుఁడును బాలుఁడును నగు తిరుమలదేవరాయని శౌర్యనిధియగు కృష్ణరాయఁ డేమిచేయునో యనిశంకించియుఁ, దన తల్లిప్రోత్సాహమునను, తిమ్మరుసుతోఁ గృష్ణరాయని కనుగ్రుడ్లు తెచ్చి చూపినఁగాని నిశ్చింతగఁ బ్రాణమువీడఁ జాలనని పల్కెను. తిమ్మరుసు ధ్వనిమర్మమెఱిఁగి, యొక్క కసుఁగందునకై వీరాధివీరుఁడగు కృష్ణరాయునిఁ గోల్పోవలసి వచ్చినందులకు మిగులనొచ్చుకొనియు, నది

వెలికిఁ దోఁపనీయక, వీరనరసింహరాయనితో నట్టులే చేసెదనని మనవిచేసివెళ్ళి, కృష్ణరాయుని కాతనిసోదరుని సంకల్ప మెఱింగించెను. కృష్ణదేవరాయఁడు మేరుసమధీరుఁడుగాన నందులకేమాత్రమును జలింపక, పితృసముఁడైన భ్రాతృన కనుమానకారణములగు నంబకములు తనకులేకున్న నేమియని, వానిఁగ్రుచ్చియిచ్చుటకై తత్క్షణమే యొఱనుండి కత్తిలాగెను. తిమ్మరుసా ధీరుని హస్తాబ్జములను బట్టియాఁపి, ప్రాగ్దిశాభాగమున గజపతులును, దక్షిణమున నుమ్మత్తూరినాయకులును, బశ్చిమమున - గోవాపాలకుఁడును, నుత్తరమున నశ్వపతులును, విద్యానగరసామ్రాజ్యాక్రమణమునకై యెడతెగక కృషి సల్పుచుండుటను దెల్పి, యమ్మహాసామ్రాజ్యమున కందుమూలమునఁ బ్రాప్తింపనుండు మహోపద్రవముఁ గూర్చి చక్కఁగనచ్చఁజెప్పి, యాసాహసోద్యోగమునుండి కృష్ణరాయునిమరలించెను; తదుపరి తిమ్మరుసు రాయనిఁదనయింట రహస్యముగనునిచి, యొక యాఁడు మేఁకకన్నులను గొంపోయి, వీరనరసింహరాయనికిఁ జూపెను. మరణావేదనలోనున్న నరసింహరాయఁడవి తన సోదరుని నయనములేయని విశ్వసించి, వానిఁగాంచి నంతనే ప్రాణములువిడిచెను.

---

# పదునైదవ ప్రకరణము.

## శ్రీకృష్ణదేవరాయఁడు ౧౫౦౯-౧౫౩౦.

### 1 మూర్ధాభిషిక్తుఁ డగుట.

వీరనరసింహరాయని యనంతర మాతని సవతి తల్లికుమారుఁడైన శ్రీకృష్ణదేవరాయఁడు శా. శ. ౧౪౩౦ వ శుక్లనామ సంవత్సర మాఘశుక్ల చతుర్దశి (౧౫౦౯ ఫిబ్రవరి నెల ౪ వ తేది)ని మహావైభవముత విద్యానగర సింహాసనాసీనుఁడయ్యెను. ఇంగ్లండులో నెనిమిదవ హెన్రి సింహాసనమునకు వచ్చినదియు నీసంవత్సరమే. కృష్ణదేవరాయని పట్టాభిషేకమహోత్సవము సందర్శించుటకై సామ్రాజ్యమునందలి నానాముఖముల నుండి రాజులును సామంతరాజులును బెక్కండ్రు విద్యానగరమునకు వచ్చియుండిరి.

౧౧ సీ. చక్కఁరవిలుకాని♦సక్కఁదనముఁగల్గి
చొక్కనా నార్వీటి♦బుక్కరాజు
సాకల్యముగఁ గీర్తి♦సర్వదిక్తటులందుఁ
బ్రాకటస్థితిమించు♦వాకు వారు
కంటకి రాజన్య♦గర్వంబులడఁగించి
లీలచేమించు నం♦ద్యాలవారు
ఘాటినిరాఘాట♦ఘోటీహాతవిరోధి
కోటులై వెలయు వె♦ల్గోటివారు
గీ. చందలిర కౌర్యులగు పెమ్మ♦సానివారు
జాదహాళివారు పొందలైన♦భూమిపతులు

గీ. ఇట్లు పట్టాభిషిక్తుఁడై చెలువుమీఱె
రమ్యగుణశాలి శ్రీకృష్ణరాయమౌళి.

—కృష్ణరాయవిజయము.

కారణాంతరములవలన నమ్మహోత్సవమునకు రాఁజాలని నృపు లనర్ఘములైన కానుకలనుబంపి, తమ తమ భక్తివిశ్వాసములను బ్రకటించిరి. పట్టాభిషేకోత్సవము ముగిసినతోడనే, కృష్ణరాయఁ డావఱకు నిర్బంధములోనుండిన తిరుమలరాయని - సవతితల్లి కుమారులను-బంధవిముక్తులఁగావించి, వారినిఁ జంద్రగిరిదుర్గమునకుఁ బంపెను.

## 2. జననకాలము.

ఈప్రభుని జన్మదినముఁగూర్చి వాదోపవాదములు పెరిఁగినవి; కాని క్రీ. శ. ౧౪౭౧ కు సరియైన శా. శ. ౧౩౯౩ వ, వికృతినామ సంవత్సర పుష్య బహుళద్వాదశీ శుక్రవారమున నీ నృపాలుఁడు జన్మించినట్లు, క్రింది పద్యమువలన స్పష్టమయ్యెడిని.

ఉ. అందలి శాలివాహన శకాబ్దముల దివసుత్రిసోమలన్
వందితమైన యవ్వికృతివత్సరమందలి పుష్యమాసమం
దున్ దగుకృష్ణపక్షమునయందు ద్వాదశి శుక్రవాసరం
బం దుదయించెఁ గృష్ణుఁడు శుభాన్వితుఁ డావరసింహమూర్తికిన్

## 3. స్వకీర్తి.

౧౫౨౦ వ సంవత్సరప్రాంతమున విద్యానగరమునకువచ్చి, కృష్ణరాయని సందర్శించిన 'డోమింగోస్ పెయిస్' అను పోర్చుగల్లు దేశీయుఁడు, కృష్ణరాయని

వ్యక్తిత్వమునుగూర్చి యనేకవివరణముల నొసఁగెను. అందుండి కొన్ని యంశము లీదిగువఁ బొందుపఱిచెదము.

'కృష్ణరాయఁడు మిక్కిలిపొడుగరియు నంతపొట్టియునుగాక సామాన్యమైన యెత్తున నడిమిరకమునాని వాఁడుగఁ గన్పట్టును. మనోజ్ఞమగు వదనమండలమును స్థూలశరీరము గల సౌందర్యమూర్తియాతఁడు. ముఖమున నందందు స్ఫోటకచిహ్నములున్నను నాని వదన లావణ్యమున కవి యేమాత్రమును వికారముగల్గింపవు. ధీరగభీరమైన దృష్టివైఖరియుఁ, బూర్ణప్రజ్ఞతో రాణించు బుద్ధివైశద్యమును, సంతోషస్వాంతమును, నాతనిమూర్తి కలంకారప్రాయములు. విదేశీయుల ననురాగభరమునఁ జూచి, వారి వ్యాపారవిధానమునుగూర్చి తెలిసికొనఁ గోరుట యాతనికిఁ బ్రియము. ఈతఁడు న్యాయబుద్ధి గలరాజు. ఒకొక్కకప్పుడు హఠాత్తుగ దురాగ్రహముఁ జెందును. నిరంతర ముత్కళాధీశునితోఁ బోరుసల్పెడు ప్రతివీరుఁడు.

'సూర్యోదయాత్పూర్వము పడకనుండి లేచిన తోడనే రమారమి మూఁడుమూఁగులనూనెత్రావి, యానూనెతో దేహమంతయు రాచుకొనుట యాతనికిని. పిదప, మొలకొకచిన్నగుడ్డ కట్టుకొని, భారములైన కర దండములఁద్రిప్పును. తైలము శరీరమున నింకునందాఁకఁ గత్తిసాముచేయుటయుఁగలదు. ఆవలఁ దనజెట్టీలలో బలిష్ఠుఁడగు నొక్కనితో మల్లయుద్ధమొనర్చును. అ-

శ్వాగూఢుఁడయి విశాల ప్రదేశమున నొకవంకనుండి మఱియొకవైపునకుఁ దెల్లవాఱువఱకు నతి రభసమున స్వారిచేయుట యాతనితుది పరిశ్రమ. ఈకార్యకలాపములెల్ల నరుణోదయాత్పూర్వమే యొనరించి, యవలఁ దనకిష్టుఁడును దనగౌరవమునకు విశేషముగఁ బాత్రుఁడును నగు నొక బ్రాహ్మణునివలన సుస్నాతుఁడగును. అంతః పురావరణమున నున్న దేవాలయమునకరిగి, కులాచారానుష్ఠానవిధులను దీర్చుట, యిష్టులగు రాజకీయ వేత్తలతో ముచ్చటించుట, యీప్రభుని యనంతర కైంకర్యములు'.

### ౪. స్వభావము-గుణములు.

శ్రీకృష్ణదేవరాయలు విద్యానగరసామ్రాజ్యరంగమున నభినయించిన పాత్రములలోనెల్ల నేటి. దిగంత విశ్రాంతమగు కీర్తినిఁబొందిన పురుషవర్యుఁడు. ఆంధ్ర ప్రపంచమును యశస్కరముగఁ బాలించిన నిఖిలరాజులలో నగ్రస్థానమువహించిన చక్రవర్తి. ఉదారభరితమగు శాంత మీతని సహజస్వభావగుణరాజము. పరిసరవర్తులగు నెట్టివారి హృదయమునేని నొక్కవీక్షణమాత్రముననే లోఁగొనుసామర్థ్య మీతని యధీనము. ఈమహనీయుని ధర్మగుణము పులుగడిగినముత్తెము. ఈ నృపవతంసము మహారాజకీయ రహస్యవేత్త. ధైర్యస్థైర్యముల కునికిపట్టు. ఆకర్షకమగు శీలమున కండ. మహాకవివరేణ్యుఁడును భాషాపోషకుఁడును; కాని నిరం-



శ్రీకృష్ణదేవరాయఁడు - పుట ౧౫౪.

తరము రాజమందిరాంతఃపురమునఁ దూలికాతల్పముననే సుఖోపవిష్టుఁడై యుండలేదు. సమరాంగణమున విరోధి వీరుల కభిముఖముగ మిక్కిలి సామర్థ్యముతో సైన్యము నడపుచు, శాత్రవమదకుంజరములకు స్వప్నావస్థలోఁ గూడ భీతావహముగ మూర్తీభవించిన పురుషసింహము.

## 5. సైన్యసన్నాహము

కృష్ణరాయఁడు రాజ్యమునకు వచ్చినతోడనే తన తండ్రియు సోదరుఁడును జయింపక విడిచిన ముద్గల్లు రాయచూరు దుర్గములను సాధించుటకును, గజపతుల నోడించి యుదయగిరిని లోఁగొనుటకును, దృఢసంకల్పుఁ డయ్యెను; కాని యశ్వపతులును గజపతులును నావఱకే విశేషసైన్యముఁ గూర్చుకొనియుండుటచే, వారిపై నుఱుకుటకుముందు దుర్గబలము నర్థబలము సైనికబలము సమృద్ధముగ నుంపఁదలఁచి, తొలుదొల్త వానిసంస్కరణమునకుఁ బూనక తీరలేదు. ఆపై నాతఁడు సల్పినది దుర్గప్రాకారములను బెంపొందించి, వానిని వైరివీరుల కభేద్యములుగ నొనర్చుటయు, నగరకోశాగారము ధనరాసులచే నింపుటయు, నశ్వబల గజబలముల నపరిమితముగఁ గూర్చుటయును. రాయఁడు ముప్పదియాఱువేల గుఱ్ఱములను, తొమ్మిదివందలయేనుఁగులను, స్వయముగఁ బోషింపఁదొడఁగెను. ఈసంస్కరణములఁ బూర్తిగావించుట కాతనికి రెండుసంవత్సరముల కాలము పట్టినది.

## 6. కవితారచనము-విద్యాగోష్ఠి.

౧. కృష్ణదేవరాయనికృతులు—కృష్ణరాయఁ డీ రెండేండ్లును గేవలము సైన్యసన్నాహముననేయుండక, విద్యావినోదగోష్ఠిలో ధారాళముగఁ బాల్గొనెను. కర్ణాటాంధ్ర సంస్కృతాదిభాషలలో నీతఁడు సహజపాండిత్య ప్రతిభాధురంధరుఁడు. సంస్కృతాంధ్రసారస్వతములలో మహాప్రబంధములను బెక్కింటిని వ్రాసెను. తాను గీర్వాణభాషయందు మదాలసచరిత్ర సత్యభామాపరిణయము సకలకథాసారసంగ్రహము జ్ఞానచింతామణి రసమంజరి మొదలగు శృంగారకావ్యములు రచించినట్లు ఆముక్తమాల్యద (పీఠిక-ప. ౧౩) లో వ్రాసికొనెను. అందొక్కటియు నిప్పుడు కానరాదు; కాని యీమహారాయుని యాంధ్రప్రబంధ మొక్కటిమాత్రము ప్రకృతము గోచరించు చున్నది. అది యాంధ్రావనియందలి పండితప్రకాండులచేఁ బ్రామాణిక గ్రంథరాజములలో నొక్కటిగ రూపింపఁబడిన 'విష్ణుచిత్తీయ' మను నామాంతరముగల యాముక్తమాల్యద. ఈకృతి యల్లసానిపెద్దనకృతమని కొందఱిమతము. పెద్దనార్యుని శైలితో నాముక్తమాల్యదశైలి సరిపోల్చుటకుఁ గాదు.

సీ. ఘనకట త్పయోబ్ధి కిరణ్య రసాతలాన్యోన్య
పిండీకృతాంగ భీతాండజములు
ధృతకులాచలాగ్ర ఖండితసమిల్లవరూప
చరణాంతికభ్రమంత్తరువరములు

ఘన గుహాఘటిత ఝూం◆కరణ లోకైక ద్వి
దుందుభీకృత మేరు◆మందరములు
చటుల ఝుంపా తర◆స్స్వ నగరీ విపరీత
పాతి తాశాకో◆ణపరిబృఢములు
తే|| ప్రబలతర బాడబీకృతే◆ఽమ్మదములు
తాస్వరేరమ్మదీకృత◆బాడబములు
పతగ సమాశ్రిత్పతత్రి ప్ర◆భంజనములు
వృజినతూలౌఘములఁ దూల◆విసరుఁగాత. పీఠిక ౩

క. శమనపు శ్రీపురభిధో
ద్యమకద్దోర్వర్గ వలయి◆త స్వర్ణగిరి
భ్రమదంబై కాంచన వ
ప్రము దీప్రంబగుచు నప్పు◆రంబున నొప్పున్ ౨-౪

గీ. తిరుగు హరిపుర సురతరు◆సురులమరగి
బహుళహాళహళి భరితః◆ప్పగి నగర
సగరపుర వర పరివృథ◆జవనయవన
ప్రతన భవదని నని దగి◆కృష్ణరాయ.

స్రగ్విణి. అస్థిరాహింద్ర శ◆య్యాదవీయ స్థిర
ప్రస్థితానేక్షీ శ్రిత◆శ్రిత చేతో ఘనా
కస్థలప్రస్ఫుర◆తాళి యత్క్రేళి మా
ర్గస్థలీ నృత్తమ◆త్తల్లి హల్లీసకా ౩-౯౨

ఇట్టిపద్యములు పెద్దనకవీంద్రుని జిహ్వాగ్రము నుండి వెలువడియుండఁజాలవు; మఱియుఁ గృష్ణరాయఁడు ప్రభుకోటికిఁదప్ప నితరుల కూహింపరానిదై తనకావ్యమున నందందు విశేషించిచెప్పిన రాజనీతియు, మహారాజాంతఃపురమున మిక్కిలి వైభవముతో నశేషసౌఖ్యమునఁ దులఁదూఁగు చక్రవర్తులకుఁగాక తదితరులకుఁ

దెలుపశక్యముకాని పరమసుకుమారములైన వర్ణనలును, బ్రాహ్మణలోకమున కుద్భవ రహితములగు పాక వర్ణనలును, నీకావ్యము పెద్దనరచితముకాదనుటకుఁ బ్రబలాధారములు. కృష్ణరాయకవి, యీగ్రంథమునందలి యాశ్వాసాంతపద్యమున నొక్కట, నిట్లుచెప్పికొనెను.

మ. ఇది సింహాచల దంభకేసరి పదాంభోజాత భక్తిప్రభా ఘణ్య ల
బ్ధ మరుట్టంకణ పొట్టునూరి విజయస్తంభోపకంఠాంకి తాం
క దృఢేస్తాఙ్క కృష్ణరాయనృప సంజ్ఞాస్మృతిప్రోతమౌక్తమా
ల్యద నాశ్వాసవరంబు నాలవది హృద్యంబై మహిన్ బొల్పగున్

తన యాస్థానమునందలి యొకానొకవ్యక్తి నిర్మించినగ్రంథము తానురచించినట్లుగ వ్రాసికొనుట, యొక మహాసామ్రాట్ఛిరోమణి యుచితజ్ఞతకుఁ దగియుండదు గదా? ఈప్రబంధమున సరిశధార కొకచిన్నిమచ్చు—

ఉ. అందితసాంద్రపల్లి తలయాభరణాంబల తక్కఁ దోయిఁ జి
ల్కందముఁ బసిండి యోణరుదమంగముఁ జేర్చుట తక్క గోయఁ జి
ద్దంచు జనాది ధూపితమయందుట తక్క విదిర్చుఁ బూవుఁ జె
మ్మంచు, జెలుంగ తక్క నగుయౌవత మొత్తు నటంచు నవ్వమున్

గ్రంథమంతయు సంస్కృతపదభూయిష్ఠమై నారికేళపాకమునఁ గ్రొంగ్రొత్తవర్ణనల హారువుఁగూర్చుచున్నది; కాని సులభశైలికిఁ దార్కాణములగు పద్యములునులేకపోలేదు. ఒక చక్కని యుదాహరణము.

కం. చంపకు చదువుల మేము ప
ఠింపని శాస్త్రములెవి? మాపఠింపని కృతులేవి?
యింపవని నమ్మవేఁ 'బ్రథ
మాంబిలతే వహ్నిః' యనెడుమాటవుఁగాదే ౬—౩౨.

౨. ఆంధ్ర సారస్వతాభివృద్ధి — కృష్ణరాయకవి చంద్రుఁడు కర్ణాటాంధ్ర సంస్కృతాది భాషలలో నఖండ పాండితీధురంధరుఁడయ్యు, నాంధ్రమునే విస్తారముగఁ బ్రేమించుచుండెను. ఈ సుధీంద్రుని పరిపోషణమున నాంధ్రభాషాయోష నవనవారంభ యౌవనోజ్జ్వలాంగి యై సర్వాలంకార సంశోభితయై లోకసమ్మోహనకరముగ నలరారెను. గీర్వాణవాణికి భోజునివలె నాంధ్ర భారతికిఁ గృష్ణరాయఁడు నాథుఁడై వెలసి, యాంధ్ర సారస్వతామృతము నిచ్చకొలఁది జుర్రి దేశభాషలందుఁ దెనుఁగు లెస్స యని మెచ్చెను.

౩. పండితసమాదరణ — ప్రబంధ నిర్మాణమునఁ గృష్ణరాయని కాలమువఱకు సంస్కృతభాషయందలి కావ్యపురాణాదుల నాంధ్రీకరించు పద్ధతియే వ్యాప్తిలో నుండెను. స్వతంత్రప్రబంధరచనమునకు దారితీసిన మహానుభావుఁడు కృష్ణరాయఁడే.

ఈ ప్రభువరేణ్యుని యాస్థానమున, పెద్దన-తిమ్మన-రామభద్రుఁడు-ధూర్జటి-సూరన-మూర్తి-రామలింగఁడు ననుకవు లెనమండ్రుండిరి. విబుధలోకగ్రామణు లగు వీర లష్టదిగ్గజములన విలసిల్లిరి. అందు—

పెద్దన — మేటి. ఈతని యింటి పేరల్లసాని వారు. ఈ 'యల్లసానివాని యల్లికజిగి సొంపటు'. పెద్దన శఠకోపయతిశిష్యుఁడు. మనుచరిత్ర హరికథాసారము భోగినీదండకము మున్నగు కృతు లీతని విరచితములు.

ఇందు మనుచరిత్ర మాంధ్రప్రబంధములలోఁ బేరెన్నికఁ గాంచినది. దీనికి మూలమైనకథ మార్కండేయ పురాణమునుండి గ్రహింపఁబడినది. కృష్ణరాయని యుద్దేశానుసార మీకవి 'నవశిరీష కుసుమపేశల సుధామయోక్తుల' దాక్షారామున నాప్రబంధము రచించెను. ఈతని రచనావిధానము కేవలము నవీనమనరాదు. కథామార్గము వర్ణనలు మున్నుగు వానిలో మనుచరిత్రము ముఖ్యముగాఁ జిల్లలమఱ్ఱి పినవీరభద్రుని శృంగారశాకుంతలము ననుసరించినది. (మూ-వసు. విమ. పుట ౧౧) అయినను ప్రబంధ సృష్టియందలి పాత్రపోషణ మత్యంతస్వాభావికము. రాయఁ డాశావపుష్కరిణిలోని యుదారమధుర వాక్యామృత లహరీడోలల నూయెలలూఁగి యానంద పరవశుఁడై కవిబ్రహ్మను బల్లకిలోనుంచి దానిఁ దనకేల నెత్తెను. కవిగండపెండేర మాతని పాదమునఁ దాన తొడిగెను. 'ఆంధ్రకవితాపితామహ!' యని యగ్గించెను. కవితల్లజుఁడు కోరిన యగ్రహారముల నాతనికి నిచ్చెను. ఇట్లు రాయఁడు పెద్దనయెడనత్యధికగౌరవభావముఁ జూపెను. ఈ కవీంద్రుఁడు కృష్ణరాయని యనంతరముఁగూడ జీవించియుండినందున నమ్మహారాయునిస్మృతికై తన పరివేదన నిట్లు వెలిఁబుచ్చెను.

సీ॥ ఎదురైనచోఁ దన మదకరీంద్రము నిల్పి
కేలూఁత యొసఁగి యెక్కించుకొనియె
మనుచరిత్రం బందుకొనువేళఁ బురమేఁగఁ
బల్లకిఁ దనకేలఁ బట్టియెత్తె

బిరుదైన కవిగండపెండేరమున కీవె
 తగుదని తానె పాదమునఁ దొడిగె
కోకటగ్రామాద్యనేకాగ్రహారంబు
 లడిగిన సీమలయందు నిచ్చె

తే॥ ఆంధ్రకవితాపితామహ! యల్లసాని
 పెద్దనకవీంద్ర! యని నన్నుఁ బిలుచునట్టి
 కృష్ణరాయలతో దివికేఁగలేక
 వసుధఁ బ్రదికితి జీవచ్ఛవంబనగుచు

ఇందువలనఁ గృష్ణదేవరాయనికాలమున నుండిన గౌరవాదరణము లాతనియనంతర మీతనికి లేక పోయె నని వ్యక్తమయ్యెడిని

౫. నందితిమ్మన—ముక్కుతిమ్మనయని ప్రసిద్ధి. ముక్కుతిమ్మనపల్కు ముద్దుపల్కనియును వినికి. అఘోర శివగురుని శిష్యుఁడీతఁడు. తేనెలు సోనలై కురియు తీరునఁ బారిజాతాపహరణము రచించెను.

౬. అయ్యలరాజ రామభద్రుఁడు—సకలకథాసారసంగ్రహము, రామాభ్యుదయము, నీతనికృతులు. ఇందు మొదటిది సరసవచోభరితము. రెండవది శబ్దాలంకారశోభితము.

౭. కవిధూర్జటి—ఈతఁడు ప్రౌఢపదగుంఫితమయి యాకర్షకమగు శైలిని శ్రీకాళహస్తి మహాత్మ్యము రచించెను. ఈతనికవిత్వము ధారాశుద్ధిఁగలిగి మాధుర్యమును సలక్షణమును నర్థాలంకార సంశోభితమును నయి

యొప్పారెడిని. శైలి, శ్రీకాళహస్తి మాహాత్మ్యమునుండి సాలంకృతసరళధారకు రెండుపద్యములు—

ఉ|| తమ్ములు కమ్మఁదెమ్మెరలు♦తల్లడమందఁగ ఝమ్ముఝమ్మనన్
దుమ్మొదవించు పుప్పొడుల♦తో నెగయన్ బిసినీలతాంగి కే
శమ్ములు ధూపధూమముల♦సౌరభము ల్గొలుపంగ విచ్చిన
ట్లమ్మెయి నొప్పుఁదమ్మిగొల♦నక్కడ నొక్కటిఁ గాంచె వేడుకన్

తే|| హంససంసదభీష్ట వి♦హార హేతు
వై బహూదకహృద్యమై♦యుపరిశరత్క
మగుచు సద్వాక్యమై పంక♦జాకరంబు
పొలిచె బ్రహ్మంబు తెలియఁగనఁ♦బూర్ణమగుచు

వర్ణనముల నీతఁడు కడుంగడు స్వాభావికముగఁ గావించెను. దుర్భిక్షవర్ణన ఘట్టమునుండి మచ్చు—

ఉ|| తోలును నెమ్ములు న్మిగిలి♦త్రోసివఁ దొంబది చోట్లఁ గూలు వా
రాలిని బిడ్డల న్విడిచి♦యాఁకటిచిచ్చున వెచ్చపోవు వా
రేలిక బంటురాని రొక♦యింటికి లేక కృశించువారునై
తూలెజనంబు మానవని♦దోషము దాఁకి నిరస్తసస్యమై.

కం. నవయుచు నుండియు నొక్కొక
దివసంబున వశన మబ్బఁ♦దిని దగమిగులన్
భువిఁ బొరలఁగి లేవనోపక
శివశివ! జనకోటి విడుచు♦జీవానిలముల్

ఈతని లలితకవితామాధురీమహిమ కచ్చెరు వొంది కృష్ణరాయఁడు ‘స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటి పల్కులు కేలఁగల్గెనో యతులిత మాధురీమహిమ?’ యని పొంగిపోయె నఁట!

౮. మాదయగారిమల్లన—

క॥ చెప్పఁదగుఁ గవిత గసనుల్
చిప్పిల నప్పప్ప బళిబళీ యనలేదా
యెప్పుడు చెప్పకయుండుటె
యొప్పను మీ సుకవి యెంతయుఁ గజ్జాఁ డౌగా.

అనుచుఁ బ్రతిజ్ఞాపురస్సరముగ జాతీయశబ్దపరిపోషితమును రసభావసమన్వితమును నగుశైలిని రాజశేఖర చరిత్రమువ్రాసి, చివరకుఁ జనపంతము నెగ్గించుకొనిన ఘనుఁడు.

౯. పింగళిసూరన—ఈకవివర్యుఁడు రాఘవపాండవీయము, కళాపూర్ణోదయము, ప్రభావతీ ప్రద్యుమ్నము, మున్నగు కావ్యకన్యలకుఁ బిత. రాఘవపాండవీయము తొలినుండి చివరదాఁక రామాయణ భారత కథార్థములు తోఁపఁజేయుచు, రామణీయకమగు సులభశైలినిఁగల ద్వ్యర్థికావ్యము. ఈవిషయమున నొకచాటువిట్లు ప్రశంసించుచున్నది.

కం. విశదంబొకపక్షంబున
విశయము వేఱొకట నిట్టి విలసిల్లినయా
శశిరేఖల్లు సాటియగుఁ గవి
వశియగు రఘుపాండుకావ్యరచన సూరనకున్

రాఘవపాండవీయకృతి విషయమున కవియే తన్నిట్లు పొగడుకొనెను.

శా. ఏంతర్థంబులపద్యమొక్కటియు ద్వ్యర్థంబుగా జెప్పఁగా
కుంటుఁ దద్గతి కావ్యమెల్లనయినన్ ఓహో యనన్ జేయుదే

పాండిత్యంబున నందునన్ దెనుఁగు కావ్యంబుద్భవింపంబురింద
డు దివ్యుఁడౌ రామభారతకథల్ శోధింప భాషాకృతిన్

కథాసంవిధానమున బాణకృతకాదంబరి ననుసరించియు-గుచు,నిప్పటి నవలారచనా విధానమున కాదర్శపాత్ర-ముగఁ, జదువరుల కానందాతిశయముఁ గొల్పు విచిత్ర సరణిలోఁగల ప్రబంధము, కళాపూర్ణోదయము. స్వ-భావోక్తులు నిండార, సరసమై-సరళమై-స్వాభావికమైన పదమైత్రి వెలయు,మిక్కిలియుఁ జక్కఁదనమున నొప్పా-రుచు, ప్రభావతీ ప్రద్యుమ్నము ప్రౌఢప్రబంధమై విరాజిల్లును. ఈకవి కృష్ణదేవరాయనికాలమున మిక్కిలి చిన్నవాఁడు గానోపు.

౧౦. బట్టుమూర్తి—ఈతఁడు బట్టుకులమునకుఁ జెందిన కవివరేణ్యుఁడు. రాయని యష్టదిగ్గజములలో బ్రాహ్మణేతరుఁ డీతఁ డొక్కఁడే. బళ్లారి మండలమున పాలమండలమునకు సమీపముననున్న బట్టువల్లె యీతనిఁ గన్నతల్లి. కవితాశిల్పమున ప్రాణకెక్కి 'ప్రబంధాంకము వా'రని ప్రసిద్ధిఁగన్న యీతని పూర్వులా పల్లియుఁ గృష్ణరాయనివలన నగ్రహారముగఁ బడసియుండిరి. 'ఆంధ్రకాముదిలోని ముప్పత్త్వయాభావస్యాల్లసాని పెద్దనార్య శిష్యే బట్టుమూర్తి మహాకవినా విరచితే వసుచరిత్రే' అను వాక్య మీమూర్తికవి యల్లసాని పెద్దనార్యుని శిష్యుఁడని వాకొనుచున్నది. సంస్కృతాంధ్ర సాహిత్యములందును, సంగీతము నందును, నప్రతిమాన

ప్రజ్ఞగడించి, తన యత్యద్భుత ప్రతిభాప్రకటనముచే నొక్కొక్క యాంధ్రుని స్మృతిపథమున నిరంతరము నర్తించుచుండు యశోవిశాలుఁడీమూర్తికవి. ఈతని పాండితీప్రకర్ష క్రింది పద్యమువలనఁ దెలియఁగలదు.

మ. ఘనుఁ శ్రీ... మ... ...క భూజనానందనున్ జగత్ప్రాణనం
దనకారుణ్యకటాక్షలబ్ధ ... మహా ... సుధాధారాళసం
జనితైకాంతిప్రబంధఘటికాసద్యశ్శతగ్రంథక
ల్పనసంగీత ... ...బంధ ... బంచి, పల్కెన్ గృపన్.

భట్టుమూర్తియు రామరాజభూషణుఁడును వేర్వేఱు వ్యక్తులను వాదమంతరించినది. 'రామరాజభూషణ' యనునది భట్టుమూర్తికిఁగల బిరుదచిహ్నమగుటచే, మూర్తిభేదము పాటింపరాదని ప్రాజ్ఞులీవఱకే రూఢిపఱిచి యున్నారు. ఈకవికులచంద్రుఁడు విరచించిన గ్రంథప్రపంచమునఁ బ్రకృతము హరిశ్చంద్ర నలోపాఖ్యానము నరసభూపాలీయము వసుచరిత్ర యను మూఁడు కృతులుమాత్రమే యగపడుచున్నవి. ఇందు మొదటిది ద్వ్యర్థికావ్యము. రెండవది యలంకారశాస్త్రము. శ్లేషప్రబంధరాజము మూఁడవది. వసుచరిత్ర, మనుచరిత్రమునకుఁ బ్రతిబింబమని తదీయ విమర్శనము నుడువుచున్నది. ఈ కావ్యమునకుఁ బీఠికవ్రాసిన శాంతి భద్రాద్రి రామశాస్త్రిగారు దీనిఁగూర్చి యిట్లు తెల్పిరి.

'......ఇది రసములకు సముద్రము. కల్పనలకుం గల్పవల్లి. అలంకారములకుం జేటిక. శబ్దవైచిత్ర్యమునకు వాటపట్టు. శ్లేషములకు నిధి. శ్యామలకు జయగంట.........'

ఈ మహాగ్రంథమునకు సమగ్రమగు విమర్శనము రచించిన వజ్ఝల చిన సీతారామస్వామి శాస్త్రి గారు భట్టుమూర్తి కవితాశిల్పవిలాసమును గూర్చి తెల్పిన యభిప్రాయమిది,

'... బంగారమునకు తావిగాఁగనువలె నీమహాకవి కవితాధారకు సంగీతసౌరభ్యణి తోడుపడుటచే నితఁడు బహిరంతస్స్ఫురద్రసములగు పద్యములు రచింపఁగల్గెను.

'ఉ. తేనియలొల్కు మాటలను దీపికగాఁగలుపోసి కూర్పలేక్
వీనులవిందు చేసెడు నలీనమృణాళ మృదూక్తివైఖరుల్
తో నడచు వ్యంగ్యములతో నలగారెడు నైజభావనల్
పూనిక గూర్చు రామనృపభూషణునైపుణ మెన్న శక్యమే'!

ఒకానొకప్పుడు తిమ్మరుసుమంత్రి, మూర్తికవి తనకుఁ గైవార మొనర్పలేదనుకినుకచే, నాకవి వతంసమును గూర్చి యితరకవులలోఁ గుట్రసల్పి యేదియో పరిభవ మొనర్పఁ జూచెననియు, నందుపై భట్టుమూర్తి రేఁగి—

'......సస్యసంబంధుచేఁబూరి పాపఫ్రువను జంపుచున్నాఁడు చంపును జంపఁగలఁడు' పరుషవాక్యత సమవర్తి భట్టుమూర్తి.

శా. గుత్తిన్ బుల్లలుగుట్టి, చంద్రగిరిలోఁ గూడెత్తి, పెన్గొండలో
మాత్రిక పత్రిమూఁదుకొఁడి, బలుదుర్గాధీశు రాంబగాలఫున్
బిత్తుల్ మోపి పదస్థుడైన ఘనులన్ ......'

అనుచు నాతని జన్మోత్తరవృత్తాంతము వెల్లడింపఁ జూచెననియు, నందుపై విషయము శ్రుతిమించెనని తలంచి, తిమ్మరుసు తనకురాఁగల దుష్కీర్తికి భయపడి,

పట్టాభిషేకోత్సవసమయమునఁ గృష్ణరాయఁడు తనకొసఁగియుండిన యమూల్యమగు పచ్చలహారము నాకవి కంఠమునవైచి సన్మానించి, యాతని యాశీస్సులఁ గొనెననియుఁ బ్రసిద్ధి. ఒకప్పుడు రాయఁడు తక్కిన కవుల మాటలకు లొంగి, భట్టుమూర్తి కొలువునకురాఁగా నాచారానుసారముగ నాతని కభ్యుదతుఁడుగాక బిఱ్ఱబిగిసికొనిపోయెననియు, నందుపై భట్టుమూర్తి యాగ్రహావేశుఁడై 'లొట్టయి దేటిమాట పెనులోభులతో మొగమోటమేల? తాఁగుటకయున్న వృశ్చికముఁగుమ్మఁ బుర్వని యందు లేకదా? తొట్టకమాన, నాము ము తీవ్రమహోగ్రభయంకంబుగాఁ దిట్టితినా' యనుచు నంత్యనియమము నుత్క్రమింపఁబోవు నవసరమున రాయఁడు లేచి, యథావిధమునఁ గైదండయొసఁగి సత్కరించుటయేకాక, యమూల్యపారితోషికములచే నిమ్మహాకవిని బహూకరించి సమాధానపఱిచెననియుఁ బ్రతీతి. ఈయాధారములవలనను నిట్టి మఱికొన్ని కథలవలనను మూర్తికవి, కేవలము ధనకనకవస్తువాహనాది కామ్యార్థములకై రాజులయు రెడ్డిరాజులయు నాశ్రయమే ప్రధానధర్మముగాఁగొని వారిమనసెఱింగి వర్తించుచుండిన యా కాలమునాఁటి కొందఱి కవుల తెగలోనివాఁడుకాక, న్యాయరహితములగు విషయములు సందర్భించునెడల, నతఁడు రాజనియు నితఁడు రైతనియుఁ జూడక, మొగమెదుటనే నిర్దాక్షిణ్యముగ వారిలోపములను గట్టివిఱి-

చినట్లు వెల్లడించి, సామగ్ర్యాసహాసవచనములఁ దెగఁది-ట్టుచు నెసఁగిన స్వాతంత్ర్యప్రియుఁడని విశదమయ్యెడిని. ఈమూర్తికవి కృష్ణరాయని కాలమున నూరనవలె వ-యసునఁ జిన్నవాఁడుగనే యుండవచ్చును.

కృష్ణరాయని తరువాత రామరాజుకాలమున నా-తని యాస్థానమున భూషణప్రభుఁడుగనుండి, బట్టు-మూర్తి రామరాజభూషణబిరుదముఁ బొందెను. రామ-రాజుసోదరుఁడగు తిరుమలదేవరాయఁ డీకవితంసముల-నుగూర్చి కొండాడిచెప్పిన పద్యమిది.

శా. 'శ్రీరామక్షితిపన్ మదగ్రజు జయశ్రీలోలు నానాకళా
పారీణున్ బహుసంస్కృతాంధ్రకృతులన్ బల్మెచ్చి మెప్పించి త
త్తాత్పర్యమ్ముల గర్భవాసహృదయ శ్రీ దంతాగ్రహారాది స
త్ప్రేరంబందిరి రామభూషణకవీ! భూసుర్యుఁడ వీవన్నిటన్.

౧౧. రామలింగకవి—ఈతనిగురించిన కథలాంధ్రదేశమున నాబాలగోపాలమునకు విదితమేకాని, యవెల్ల సత్యబద్ధములని విశ్వసింపరాదు. కేవలప్రౌఢశైలిని పాండురంగమాహాత్మ్యమును దివ్యప్రబంధమును రచించిన కవివర్యుఁ డీతఁడు. అందుండి శైలికి—

'......అమ్మిథునంబు కుండలదేశప్రాంతంబు గదిసిన

'క. సంపాతిరంగ రంగ
ఝంపా సంపాత్యమానజలకణరేఖా
సంపాదితలాస్యల
సంపదనొదలించెఁ దరము శైవతంతుఁగా'    ౧—౧౨౪.



గజశాల



విఠలభట గోపురము.
(దేవాలయ దృశ్యము).



నరసింహావిగ్రహము.

(పటముల స్వాతంత్ర్యము శ్రీ యం. కే. రంగస్వామయ్యంగారికి జెందినది).

వారితబుద్ధిఁ బండితవరేణ్యుఁడు పణ్యవిలోకనాథుఁ డా
చార సమగ్ర వర్తనుఁడు సారవచస్స్థితి నొప్పువాఁడొగిన్.

క. శతసంఖ్యలొక్కరైనను
సతతము శ్రీకృష్ణరాయజగతీపతిలోఁ
జతురంగమాడి గెల్చెను
ధృతిమంతుఁడు పొడ్డుచెన్న తిమ్మన బళిరే.

కృష్ణరాయఁ డీతిమ్మనమంత్రి ప్రజ్ఞకు సంతసించి కొప్పోలుగ్రామమును 'కృష్ణదేవరాయపుర' మని పేరిడి యగ్రహారముగ నొసంగెనఁట.

౧౩. ఎల్లయకవి—అష్టదిగ్గజములలోఁ జేరని రాయల ప్రత్యేకాంధ్ర కవులలో చింతలపూడి యెల్లయ మహోత్కృష్టుఁడు. సమస్యాపూరణములయం దీతఁడు దిట్టయై కన్పట్టుచున్నాఁడు. అల్లసానిపెద్దనార్యుని యభిమతానుసారము 'నగరు తగరు తొగరు వగరు' అనుపదములు ప్రాసస్థానముల నెలకొల్పి, భారతరామాయణ భాగవతములపరముగ నీకవివర్యుఁడు సృష్టించిన పద్యత్రయమిది.

'చం. తొగరుచి కన్నుదోయిఁ గడుఁ దోపఁగ గర్జుఁడు భీమసేనుపై
నగరు ధరాధరంబునను నాఁకిన ఢంకినదాఁకి నొచ్చి తా
వగరుచుచున్ వివశుఁడై బయగు నాటిన నచ్చటి రాజలోకముల్
నగరు సుయోధనాజ్ఞ మది నాఁటుటఁ జేసి ధరాతలేశ్వరా.

చం. నగరుపగాతొ సంకవిపినంబుల కేగుఁడు రాజ్యకాంక్షకున్
దగరు కుమారులారయని తల్లి వగల్మిగులంగఁ దోఁపఁగాఁ
దొగరువరత్నగట్టి మదిఁ దోఁపఁగ గద్గదఖిన్నకంఠయై
వగరుచుచున్నఁ జూచి రఘువంశవరేణ్యుఁడు తల్లి కిట్లనున్.

చం. పగరవు మాత్రమే పగుదు భవ్యుఁడు గాఁడు సభీసభస్వ మా
న్న గరుడవాహనుండు మను వాఁడటు డించుటయెల్ల నుద్దవా
దిగరని కాక మోహపు లతా తనువైన విధంగఁ జాతురే
తొగరుచి యోషధీశువకు దోఁపఁగఁజేయుట పిదనాదఁగన్'

బ్రహ్మాసములగు కవినాథులలోఁ దాను భూషణ సదృశుఁడుగ నుండినట్లును, నచ్యుతున కంకితముగఁ బ్రౌఢ ధరణిలోఁ దానురచించిన రాధామాధవ కృతివానఁ గృష్ణరాయ . మెప్పించి, 'రాధామాధవుఁ'డను బిరుద నామ మందినట్లును జెప్పికొనియున్నాఁడు.

శా. రాధామాధవ మచ్యుతాంకితముగాఁ బ్రౌఢశ్రియం జెప్పి, త
న్మాధుర్యంబునఁ గృష్ణరాయవిభు నత్యంతంబు మెప్పించి నా
నాధాత్రీ ప్రతిమాన సత్కవులలోనన్ భూషణశ్రేణితో,
రాధామాధవనామ మందిన జగత్ప్రఖ్యాతి చారిత్రుఁడన్.

తారకబ్రహ్మరాజీయాది ప్రబంధములఁ గొన్నింటి నీసుధీంద్రుఁడు విరచించినట్లు తెలియుచున్నది.

౧౮. లక్ష్మీనారాయణుఁడు—రాయనియాస్థానము సంగీతవిద్వాంసులకుఁ గూడ నాశ్రయమొసఁగుచుండినది. ఆకాలమున నందలి గానకళావేదులలో శ్రీభండారు విట్ఠలేశ్వరుని నందనుఁడగు లక్ష్మీనారాయణుఁడు సుప్రసిద్ధుఁడు. రాయని యోలగమున నితఁడు సంగీత విద్వాంసుఁడు మాత్రమే కాదు: సంస్కృతపండితుఁడును. ఈబుధవర్యుఁడు సంగీతసూర్యోదయమను నైదధ్యాయముల యుత్కృష్టగ్రంథము రచించెను. 'సూక్ష్మభరతాచార్య' 'రాయబయకార' 'తోడరమల్ల' 'అభినవభరతా-

చార్య' బిరుదము లీయండితాగ్రిణి కుండియున్నటు లాతని సంగీతసూర్యోదయమునందలి క్రింది గద్యవలన వ్యక్త మయ్యెడిని.

'ఇది శ్రీమద్విప్రకులవార్థి భండారు విట్టలేశ్వరనందన నూత్న భరతాచార్య రాయబయకార కోడగమల్లాభినవభరతాచార్య శ్రీ లక్ష్మీనారాయణ విరచితే సంగీతసూర్యోదయే'

౧౫. భానుకవీశ్వరుండు—లక్ష్మీనారాయణుండు కృతికర్తయుఁ గృతిభర్తయును. భానుకవి, పంచతంత్రి నాంధ్రీకరించి యీగుణనిధి కంకితముచేసెను.

సీ. గీ. రమ్యమైయుండు విద్యాపురింబు నందు
నిమ్మహా కృతి భానుకవీశ్వరుండు
తెనుఁగు బాస నొనర్చె గోనామె కర్త
నవని నానందరి రాగాన్నముకున్ దనర.

౧౬. ఈశ్వరదీక్షితుండు—ఈతండు సంస్కృత సారస్వతమున ఘనముగఁ గృషిసల్పిన ప్రతిభాభ్యుండు. రామాయణవ్యాఖ్యలు బృహద్వివరణము లఘువివరణ- మును నీతని కృతులు.

శ్లో॥ కర్ణాటాధీశ్వరే రాజ్యం కృష్ణరాయేప్రశాసతి,
రామాయణం చిత్రకూటే వ్యాఖ్యాదీశ్వరం దీక్షితః
బృహద్వివరణం చైవ తథాపవరణం లఘు;
యథా రామాయణే వ్యాఖ్యాద్వయ మీశ్వర దీక్షితః.

ఈతండు రాయనికఱువదిగడియలలో శ్రీమద్వా- ల్మీకిరామాయణ మేడుకాండలు సమగ్రముగ వినిపించిన సమర్థుండగు పాఠకుండఁట.

౧౨. తదితరులు.— మఱియు తిమ్మణాచార్యుఁడను కర్ణాటకకవి కృష్ణరాయనిసంస్థానముననుండి, స్వభాషలో భారతమునురచించి, రాయనికంకితము గావించెను. కృష్ణదేవరాయనికడ ద్రావిడకవులు నయితము కొందఱుండిరని ప్రతీతి. ఈవిద్వచ్చక్రవర్తి సంస్కృతాంధ్రకర్ణాటక ద్రావిడ కవిప్రవరుల నిరంతర మిట్లాదరించుటయేకాక త్రిలింగరాజ్యమునందలి సమస్తవిద్వాంసులను సంవత్సరమున కొక్క పర్యాయమైనఁ దన సభలో సమముగఁ బూజనఁజేయు సంకల్పముచే నేఁటేఁట వసంత కాలమున నాంధ్రభూవలయమునఁగల కవులను సభాస్థలి కాహ్వానించి, సముచితభంగి నాసుధీంద్ర బృందమును బహూకరించు చుండెను మహాంతరణశాలికూడ.

కం. ప్రతివర్ష వసంతోత్సవ
కుతుకాగత సుకవినికర గుంభిత నానా
స్తుతి గీత మూఁచ విశంకిత
చతురా తింపురి పధూప్రభా వదన శశికా.

— పారిజాతాపహరణము

శ్రీకృష్ణరాయఁడిటు లాంధ్రకర్ణాట సంస్కృత ద్రావిడ సారస్వతములను సంగీత కళను బోషించి, కావ్యకర్తయు మనుచరిత్ర పారిజాతాపహరణ కర్ణాటకభారతాది కృతికన్యలకు భర్తయునై తన యశశ్చంద్రికలను దిగంతములవఱకు వ్యాపింపఁజేసెను.

## 7. శత్రువుల రహస్యప్రయత్నములు.

కృష్ణరాయఁ డెప్పుడును సుకవీంద్రులగోష్ఠినిఁ బ్రొద్దులుపుచ్చుచు, రాజ్యవ్యవహారము నించుకయుఁ బాటింపక ప్రమత్తుఁడుగ వర్తించుచున్నట్లు శత్రురాజులు భావించి, హఠాత్తుగ నాతనిపైఁబడఁ దలఁచిరి. వారు తొలుతఁ దమ ప్రయత్నములను విద్యానగరసామ్రాజ్య సామంతరాజులలో ననుకూలురకుఁ దెల్పి, యందులకుఁ దోడగుచో రాజ్యము సంపాదించి యిచ్చెదమనియు, నందుతో సంపూర్ణస్వాతంత్ర్యమునకుఁగూడ ననువుఁ గల్పించెదమనియు నాసఁగొల్పి, తన్మూలమున సామంతులఁ గొందఱి నాకర్షించుకొనిరి. ప్రతిపక్షు లిట్లు లోలోన సమరసన్నాహములు గావించుచుండుట కృష్ణరాయఁడు గూఢచారులవలన నెఱిఁగి, వారికృషికిఁ బ్రోదివేయఁ దిరిగిన గొప్పగొప్ప సామంతరాజులనందఱిని వెంటనే తొలఁగించి, వారిస్థానములయందు విశ్వాసపాత్రులగు ప్రతినిధులను నియోగించెను. అంతటితో నరాతుల యాంతరంగిక వ్యాపారము లంతరించినవి.

## 8. రాజ్యవ్యవస్థ.

ఈచక్రవర్తి విద్యానగరసామ్రాజ్యము ననేక మండలములుగ విభజించి, యందలి యొక్కొకమండల భాగమునకు నొక్కొకస్థానికప్రతినిధినునిచి, పరిపాలన సౌకర్యమున కనువేర్పఱిచెను. ఈప్రతినిధులలో నిరు దెగలవారుండిరి. అందొక తెగవారు వేతనములు మా-

త్రము పుచ్చుకొనుచుఁ దనమండలభాగమున వచ్చెడు నాదాయమెల్ల సామ్రాజ్యకోశమునకుఁ బంపువారు. రెండవవర్గమువారు తమకువచ్చెడు నాదాయమంతయుఁ దామేయనుభవించుచుఁ, జక్రవర్తికైంకర్యమున కుపకరించుటకై యొకనియమితసంఖ్యగల సైన్యము నెప్పుడును దమతమపరగణాయందు నిలువయుంచి పోషించుచు, సార్వభౌముఁ డాజ్ఞాపించుటతడవుగ దానినాయత్తపఱచు నియమమున, వంశపారంపర్యముగ రాష్ట్రభాగమును బాలించువారు. ఇందువలన సామ్రాజ్యపాలనము సుఖముగ సాగుటమాత్రమేకాక, తా నెప్పుడు సంకల్పించినను దనరాజ్యమునందలి వివిధభాగములనుండి సేనలు విరివిగ వచ్చిచేరు నవకాశమేర్పడినది. ఈపద్ధతివలనఁ జక్రవర్తి శత్రురాజులపై దాడివెడలుటకే వేళను సన్నద్ధుఁడయియుండుటకును, నాఁడు దేసమయమున విరోధిరాజులపైఁబడనుంకించినను బదిలక్షలసేన యొక్కపెట్టున సంసిద్ధమగుటకును ననువొనఁగూడినది.

### ౪. దక్షిణదేశదండయాత్ర.

కృష్ణదేవరాయఁడు సైనికబలము పెంపొందించిన తరువాతఁ గొలఁదికాలమునకే చైత్రయాత్రసాగించి మైసూరిరాష్ట్రముఁజొచ్చి, యందలి యుమ్మత్తూరు ముట్టడించి, తనయకుంఠితదోర్వీర్యమున దుర్గమును గైవసమొనర్చుకొనెను. ఆప్రాంతమున మిగులబలాఢ్యమైన దుర్గము శివసముద్రము. దానినాక్రమించినఁగాని తా-

క్కినవి సుసాధ్యముకావు. ఆదుర్గాధినాయకుఁడగు గంగ రాజు చాలకాలమునుండి విద్యానగరసామ్రాజ్యమునకు సామంతరాజుగనుండి, తాఁజెల్లింపవలసిన కప్పము కప్ప-ముఁ జెల్లింపక తిరుగుఁబాటుఁగావించుచు, కలిసివిరులఁ బాలఁడలుముచుఁ గేవలముమదాంధుఁడై, సామ్రాజ్యా-ధిపతులకుఁ బిట్టపిడుగుగానుండెను. శివసముద్రపు జీవ మర్మమెఱిఁగి, యాదుర్గాధీశునకుఁ బ్రబలశత్రువుగ నుండిన చిక్కరాయనిఁ, గృష్ణదేవరాయఁడు తనవైపుత్రిప్పికొని, యాతనిసాయముసఁ గావేరినది మార్గమున వెడలి, దుర్గమునుదాఁకి, సేనలనెల్లఁగూల్చి, సంవత్సర కాలము ముట్టడించి విఫలుఁడయ్యెను. ఎదురెత్తువేయుటకుఁ దనకడఁదగుబలము లేనందునఁ బరాభవమునకంటెఁ బ్రా-ణత్యాగమే పరమసుఖమునితలఁచి, గంగరాజు కావేరిఁ దనయసువులను సమర్పించెను. అనంతరము కృష్ణరా-యఁడు శివసముద్రపుఁగోట స్వాధీనముగావించుకొనెను.

> బాహ్వోస్సహా సకలకలాకలాపయుక్త
> స్సప్తాంగం సపది విజిత్య గంగరాజమ్;
> ధీమాన్ శివసముద్రముత్కటం ద్రా
> గావాసం యతిమతిరీశ్వరం శివానామ్.
>
> — సంగీతసూర్యోదయము.

తరువాత మైసూరును కర్ణాటకదేశములను జిన్న చిన్నరాజ్యములను సుకరముగజయించి, తాను వశపఱు-చుకొన్నరాష్ట్రభాగములకెల్ల శ్రీరంగపట్టణమునురాజ-ధానిగ నొనర్చి, యచ్చటఁ దనపేరఁ గృష్ణరాయధ్వజ

మొత్తించెను. అంత రాయఁడా కర్ణాటకరాష్ట్రమున నేఁడాదికిఁ గోటిరూకలు కప్పమిచ్చునియమమునఁ జిక్కరాయనిఁ బ్రతినిధిగ నియోగించెను. తదుపరి కృష్ణదేవరాయఁడు కొండగు మలయాళములను, చోళ చేర పాండ్య రాష్ట్రభాగములను, మధుర తిరునల్వేలి మున్నగు దుర్గములను సాధించి, వానిని మూఁడుమహామండలములుగ నేర్పఱిచెను. ఆపరగణాలకు జింజి-తంజావూరు-తిరునల్వేలి పట్టణములను రాజధానులుగ నొనర్చి, వానికి కృష్ణప్పనాయఁడు-విజయరాఘవనాయఁడు- వెంకటప్పనాయఁడునను నాంధ్రరాజులను నాయకులనుగ నియోగించెను. రాయఁడా ప్రాంతమున నింకను బెక్కు పాళెములను గెలిచి,వానికి కంబగాఁడను 'వీరప్పగాఁడు' అను వానిని దొరలుగా నియమించి, యఖండవిజయముతో విద్యానగరముఁ బ్రవేశించెను.

### 10 పూర్వదేశ దండయాత్ర.

కృష్ణదేవరాయఁడు ౧౫౧౩వ సంవత్సరమున నోఢ్రరాజు పాలనమున నున్న నెల్లూరి మండలమునందలి యుదయగిరి దుర్గము నాక్రమించెను. నెల్లూరి మండలాధీశ్వరుఁడగు వీరభద్రగజపతి, కృష్ణరాయనిశౌర్య ప్రతాపాగ్నికోర్వలేక, తనభార్యతో నరణ్యములకుఁ బాఱిపోయెను. ఈయంశమునే పెద్దన చపలాతిశయోక్తిగ నిట్లునుడివెను.

మ. ధరణీకంధరులు కృష్ణరాయల చమూఘాటీగతిన్ వింధ్య గ

ద్వారముల్ దూలఁగఁ జూచి తారచటఁ గాఁపై యుండుటన్
జాల, నలుచ్చైరుపై యెత్తి వింతచేఁతలు పంచ్చైన్ జాడకే
యంచు, వే సారిచెన్ జాతురు వీరరుద్ర గజరాట్ప్రోద్ధాంత
మార్గాంగనల్. —మనుచరిత్ర పీఠిక ౨౫

గజరాజతనయయగు చిన్నమదేవినిఁ గృష్ణరాయఁడు వివాహమాడి, వీరరుద్రగజపతికి రాజ్యమిచ్చివైచెను. ఉదయగిరినుండి రాయఁడు తిరిగిపోవునపుడు తిరుపతికి వెళ్ళి యచ్చట విష్ణుదేవునకు స్వర్ణాభిషేకము చేయించి, కనకమయ రత్నోపచిత కంకణములను సమర్పించెననియు క్షేత్రమునఁగల శాసనములు నుడువుచున్నవి. కృష్ణరాయనియు నాతనిరాణులయు తామ్రప్రతిమలు నేఁటికి నందుఁగలవు. ఉదయగిరియందలి కృష్ణవిగ్రహమును గొనిపోయి రాజధానిలోఁగల కృష్ణస్వామి దేవాలయమునఁ బ్రతిష్ఠించెను.

కృష్ణరాయఁ డుదయగిరినిసాధించినతరువాత రెండేండ్లకు, ౧౫౧౫ వ సంవత్సరమున నుత్కలదేశముపై వెడలి కొండవీటిదుర్గమును ముట్టడించెను. తన్నెదిరించిన ప్రతాపరుద్రగజపతితోడను నాతనికుమారుఁడగు వీరభద్రగజపతితోడను బోరి, వీరభద్రగజపతిని జీవగ్రాహిగఁగొని జూను నెల ౨౩వ తేదిని నాదుర్గమును గైవసమొనర్చుకొనెను. కృష్ణామండల ప్రాంతమునఁగల కొండపల్లె వేఁగిదేశములోని జమ్ములోయ కోనసీమ గ్రామములను, గోదావరీమండలములోని రాజమహేంద్రవరమును, మఱుసటి సంవత్సరము జయించెను. రాయఁ-

డు తన్నెదిరించిన ప్రతాపరుద్రగజపతిని, దాయముకొనఁ-
జాలకపోయి, యుత్కలదేశమునందలి బెల్లముకొండ
నాగార్జునకొండ అద్దంకి కేతవరము అమ్మనబ్రోలు ము-
న్నగు రాష్ట్రభాగములనుగూడ జయించి, కళింగరాష్ట్ర
మండలమునందలి సింహాద్రివఱకుఁగల యెల్లప్రదేశముల
నాక్రమించెను. ఈవిజయ సూచకముగఁ బొట్నూరి
కడ జయస్తంభమును నాటెను. రాయని సమకాలికుఁ
డగు భండారు లక్ష్మీనారాయణుఁడు ఈ దిగ్విజయములను
గూర్చి తన సంగీత సూర్యోదయమున నిట్లువర్ణించి
యున్నాఁడు.

శ్లో॥ దుర్గం శిక్యాథ సోzనా ఘనదయగిరివం తత్రిగాహూత్తరాజం,
బంధీకృత్యైక హృత్వాయుధి నగిదరేశం కొండవీడ్డొండపత్యై;
శీఘ్రాగ్రిహంగృహీత్వా గజపతితనయం పొట్టనూర్యట్ట రాగ్రే,
విశ్వశ్లాఘ్యప్రతాపో విరుదయతి జయస్తంభమాచైచ్ఛ్రకృభానీత్

చివరకుఁ బ్రతాపరుద్రుని రాజధానియైన కట
కముఁ బ్రవేశించి, దానిని దహించివై చెను. రాయ-
నితోఁ గంటుగొనిజీవించుట కలలోనివిషయమని గజపతి
గ్రహించి, తనయొక్క కృష్ణరాయనికిఁగల మాత్సర్యముఁ
దొలంచుటకై, తనకొమార్తెయగు తిరుమలదేవి నావీరా
గ్రణికి సమర్పించెను. ఆవలఁ గృష్ణరాయఁడు గజపతి
మన్నించి, కృష్ణానదికుత్తరమునఁ దానువశపఱుచుకొని
యుండిన యుత్కలదేశరాష్ట్రముల నన్నింటిని గజపతికి
మరలనిచ్చివై చెను.

శ్లో. ప్రాగ్యాం కృష్ణనరేశ్వరో గజపతేర్జిత్వాద్రిదుర్గాదికాన్,
సాకం తిమ్మరుసూనునా మహామాత్య యుగంధరేణ ప్రసాదం తతః;
— సంగీతసూర్యోదయము.

తదుపరి మానవగులు మొదలగు మన్యసంస్థాన-
ములను వశపఱచుకొని, సింహాద్రికేఁగి యచ్చట సిం-
హాచల నృసింహదేవునకు మాన్యక్షేత్రములను గ్రామ-
ములను దానముగావించి, ౧౫౨౦ వ సంవత్సర ప్రాంత
మున విసారధనముతో విద్యానగరమునకు మరలెను.
కృష్ణరాయని యుద్ధప్రారంభము లెంత యుద్రేకవంతము-
లో పర్యవసానములు నంత శాంతగర్భితములు. క్రింది
తాత్పర్యము గ్రహింపుఁడు.

చం॥ “మును నాఁగొని కొండవీటిఁ జెయూఁతనాఁగి దు కృష్ణరాయఁడు
స్త్రనవిజానిఁ జయించె నదె గజపతి మే నడ సేఁద్రి కృష్ణగా
యన్నృపతి కొండవీటిఁ దనాహవభూమిఁ బ్రివాపరుఁడై యం
దనుఁగు నీరధదుర్గ గయణామతిఁ గాంచె జగత్ప్రసిద్ధిగన్.”

## 11. రాయచూరు ముట్టడి

రమారమి రెండుశతాబ్దములనుండి పూర్వపురా-
జులకును నుత్తరమునఁగల మహమ్మదీయులకును జరుగు
చున్న యెడతెగని పోరాటమునకు హేతుభూతమగు
రాయచూరిని ముట్టడించుటకై, కృష్ణరాయఁడు ౧౫౨౦వ
సంవత్సరము మేనెల నడిమిదినములలో బయలువెడ
లెను. రాయచూరిదుర్గము మొదట విద్యానగరప్రభు-
వులకుఁ జెందినదేయైనను, నాకాలమున విజాపురనాథుఁ
డగు ఇస్మాయిలాదిల్షా పరిపాలనమున నుండెను. ఆది-

ల్లాయును గృష్ణరాయఁడును దొలుదొల్తఁ జాలసఖ్యభావ-
మున మెలఁగుచుండినవారే; కాని యశ్వములఁ దెచ్చి యి-
చ్చెదనని రాయనికడ ధనముగైకొని పరుగిడిన 'సయ్యాద్
మర్కార్'అను తురుష్కవ్యాపారి నాదిల్షా దాఁచియుంచి,
రాయఁడు కోరినను బట్టియీయఁడయ్యెను. అదియే వైర
కారణమై మహాకలహమునకు మూలబీజముగ నేర్పడెను.
'చిన్నపామునైనఁ బెద్దకఱ్ఱతోఁ గొట్టవలయు'నని తలంచి,
రాయఁడు పదిలక్షలసేనతో రాయచూరిపై వెడలెను.

ఫెర్నోన్యూనిజు వర్ణనవలనఁ గృష్ణరాయఁడు
కదనమునకు వెడలినపుడు ౫౫౧ గజములును
౩౨,౦౦౦ గుఱ్ఱములును, ౭౩౬,౦౦౦ ల సంఖ్యగల కాల్బ
లమును వెంటనుండెనని తెలియుచున్నది. రాయఁడా
సేనానివహమును బదునొకండుభాగములుగ విభజించి,
సంగ్రామరంగమున నాయత్తపఱిచెను. ఇస్మాయి
లాదిల్షా ౧౪౦౦౦౦ల సంఖ్యఁగల యాశ్వికపదాతివర్గము-
లతో రణావనిఁ బ్రవేశించెను. మహేంద్రవిక్రముఁ
డగు రాయఁడు మిగులవిజృంభించి, తనసేనతో ముందుగా
నొక్కుమ్మడిని దురుష్కసైన్యమును దాఁకెను. కృష్ణా
తుంగభద్రానదుల మధ్యప్రదేశమున నుభయసేలకును
క్రీ. శ. ౧౫౨౦ వ సంవత్సరము మేనెల ౧౯ వ తేది శని
వారమున భయంకరసంగ్రామము నడచెను. తురుష్క-
వీరులెడవిడక శతఘ్నులఁ బ్రేల్చుచు, హిందూసేన నొకటి
న్నరమైలు దూరమువఱకు వెనుకకువెడలించిరి. అంతఁ

కృష్ణరాయఁడు విఱిఁగిన సేనను బురికొల్పికొని, కరి వరుసతో శత్రువాహినిఁ జొచ్చి, మధ్యందిన చండమార్తాండాతపవిగామానుఁడై మహోద్వేల పరాక్రమమున వీర విక్రమసారముఁ జూపుచు, ము లిమానులను కృష్ణానదీ మధ్యభాగమునకుఁ దఱిమి, యెచ్చటివారి నరఁటులపగిదిఁ దుండించుచు, శవములు గుట్టలుగఁ గూల్చెను.

'మ॥ సమరక్షోణిని కృష్ణరాయని భుజా [illegible] చేఁ బడ్డ దు
ర్గమ దోర్దండ [illegible] యవనవ్రాతంబు [illegible]
[illegible]
[illegible] బోవుచున్ .'

హైందవసేన యొకఁడిందిఁగని కత్తి ఁడిమి గ్రహించి మిక్కిలియుఁజై రేఁగి, తురుష్కదళముపై నడిచి భయంకర మారణకర్మమునకుఁ గడంగెను. సంగ్రామరంగమునఁ బ్రతిపక్షవీరుల రక్తధారలు వఱదలుగట్టెను. ముసల్మానులా మహాగ్రిధాటి కాఁగలేక విషాదోద్విగ్నమానసులై తోకత్రెంచుకొని పాఱఁదొడఁగిరి. విద్యానగర వీరయోధు లట్లు పఱచుచున్న సైన్యము వెన్నంటి కొట్టి కోలాహలమొనర్చి కూలఁగ్రుమ్మచు, నేటి యావలివలకుఁదఱిమిరి. వెన్నిచ్చి పాఱెడు వీరులఁజంపఁ జనదని తనసేనకాజ్ఞాపించుచుఁ, గృష్ణరాయఁ డిస్మాయిలాదిల్షాశిబిరమును సమీపించెను. ఆదిల్షా తలప్రాణము తోఁకకువచ్చుటచే నొక భద్రగజమునెక్కి రేఁగులు

యందుఁ బెద్దవారికిఁ దానుంచిన కలుబరిగిని పక్కన యిరువురకుఁ దనసామ్రాజ్యమున నున్నతపదవులను నొసంగి, 'యవనసంస్థాపనాచార్య'డను నొప్పెను.

కృష్ణదేవరాయఁడు తనజీవితమున నపజయమనున దెట్టిదో యొకప్పుడు నెఱుఁగక ప్రభులోకమునఁ దన్ను మించినవాఁ డొక్కఁడును లేకుండునట్లు విక్రమించెను. ఈచక్రవర్తి తూర్పునఁ గటకమునుండి పశ్చిమమున సల్సెట్టువఱకుఁ దనరాజ్యము విస్తరము గావించెను. ఈ మహావీరుని దిగ్విజయముల నన్నింటినిగూర్చి కాకపోయినను గొన్నిటినైనఁ జాటుటకు మనుచరిత్రమునందలి క్రిందిపద్యముచాలును.

సీ. తొలుదొల్త నుదయాద్రి◆శిలఁ దాఁకి తీండ్రించు
నసిలోహమున వె◆చ్చనై జనించె
మఱి కొండవీడెక్కి◆మార్కొని నలిగొన
యలసపాత్రు◆నంటి రాఁజె
నటు సాగి జమ్మిలో◆యఁబడ వేఁగదహించెఁ
గోనవిల్లేఁ జెల్చెఁ గొ◆ట్టానఁ దగిలెఁ
గనకగిరిస్ఫూర్తిఁ గరచె◆గౌతమిఁ గ్రోఁచె
నవులనాపొట్నూర◆గులు నిల్చె
గీ. మాడెములు వ్రేల్చె నొడ్డాది◆మసియొనర్చెఁ
గటకపురిఁ గాల్చె గజరాజు◆గలఁగి పఱవఁ
దోఁకచిచ్చన నౌరయౌ◆ద్ధురతఁ గృష్ణ
రాయ బాహుప్రతాప జా◆గ్రన్మహాగ్ని. —పీఠిక. 38.

శ్రీకృష్ణదేవరాయని రాజ్యవ్యాప్తిని నౌదార్య గరిమను బిరుదావళులను మనుచరిత్రము చక్కఁగ వి

శదము చేయుచున్నది. కుమారస్వామి క్రౌంచపర్వత-మునువలెఁ గృష్ణరాయఁడు ఉదయగిరిదుర్గమును బాల్యముననే భేదించెననియు, నావాడ శకంధ కళింగ దేశాధిపతులతోఁ గయ్యములు గొనుచుండెననియు, నాపంచగౌడ ధాత్రీతలమెల్ల నాపేరునకు విహారణరంగము య్యెననియు, సకలార్థిజనాశాపూర్తి కాతనిదా యము పాదపమట్టు లలరెననియు, రాజాధిరాజ వీరప్రతాప రాజపరమేశ్వర బిరుదములచే నామహనీయుఁడు పిలిపిల్లెనయు నని నుడివెడిని.

సీ. ఉదయాచలేంద్రంబు మొదలనెవ్వనికుమారగిరికుఁ గ్రౌంచాచ-
[లాకుమారుఁడొ
నావాడపతి శకంధర సింధురాన్యకు లొగాఁపు లెవ్వానిఖరశరాని
కి పంచగౌడ ధాత్రిపదంబెవ్వాని కీర్తినాటకరంగ నేఁగుచుట్టబయలు
సకలార్థిలోకజనాశాపూర్తి కెవ్వాని ఘనభుజాదండంబు కల్పశాఖి
గీ. ప్రబలరాజాధిరాజవీరప్రతాపరాజపరమేశబిరుదవిభ్రాజి యెవ్వఁ
డట్టి శ్రీకృష్ణదేవరాయప్రభుండు × × ×

## 13. పరిపాలనము.

సామ్రాజ్యాభివృద్ధి కృష్ణదేవరాయనికాలమున వలె మరేరాజుకాలమునను పెంపువహించియుండ లేదు. ఆధీశ్వరుని సర్వోత్కృష్ట పరిపాలనము కారణముగ, సం-పదలవము లెల్లఁ బల్లఁబడినవి. అతివృష్టియు ననావృష్టియు క్షుద్రవిరోధాగమభీతియుఁ బ్రజలనుండి తొలఁగెను. దేశమున క్షేమమును సుభిక్షమును నెలవుకొనినవి. జనులాబాలగోపాలము తమతమవృత్తులను ధర్మభంగిని సా-

గించుచు, నహితభయము విస్మరించి యేవేళను ననుభవ మందున్న స్వారాజ్యమహిమనే సంస్మరింపఁ జొచ్చిరి.

సీ. తొలఁగెను ధూమకే◆తుక్షోభ జనులకు
  నతివృష్టి దోషభ◆యంబు వాసెఁ,
గంటకాగమభీతి◆గడచె సద్ధతిభూమి
  భృత్కటకంబెల్ల◆నెత్తువడియె,
మాసె నఘస్ఫూర్తి◆మరుభూములందును
  నెలమూఁడువానలు◆నిండఁగురిసె,
నాబాలగోపాల◆మఖిలసద్ద్విజమును
  నానందమున మున్క◆నతిశయిల్లెఁ
గీ. బ్రజలకెల్లను గడు గామ◆రాజ్యమయ్యెఁ
జారుసత్త్వాఢ్యుఁ డీశ్వర◆నారసింహ
భూవిభుని కృష్ణరాయఁ◆డభ్యుదయమొంది,
పెంపుమీఱంగ ధాత్రిఁబా◆లింపుచుండ.

—మనుచరిత్రము. పీఠిక ౩౮

## 14. వ్యాపారము.

రాయనికాలమున వ్యాపార మత్యుత్కృష్టస్థితికి వచ్చెను. ఈతని రాష్ట్రభాగమునఁ దొంబదియామడల దూరమువఱకు విస్తరించియున్న సముద్రతీరప్రాంతము నందు విద్యానగరరాజ్యముతోఁ బరదేశ వ్యాపారము మిక్కిలి హెచ్చెను. రాజధానినుండి వివిధములగు పదార్థములు విదేశములకు విరివిగ ననుపఁబడుచుండెను. రాయఁడు తనరాష్ట్రముననున్న బంగారుగనులను వజ్రపు గనులను గనుఁగొని వానినిజాగ్రత్తపెట్టి, యందుండి లభించు ఖనిజములలోఁ దనకును దనరాష్ట్రవాసులకును

సమృద్ధిగనుంచుకొనుచు, మిగిలిపోవుభాగము నితరుల కమ్మకమున కిచ్చివేయుచుండువాఁడు. బుడుతకీచులతోడి సఖ్యము రాయనికధికము. తాను వారికన్నివిధములఁ దోడ్పడుచు, వారిసానుభూతినిఁ బడయుచుండెను. ఈ ప్రభుని సేనలో బుడతకీచు సైనికులుగూడ నుండిరని పైనఁ దెల్పియుంటిమి. ఆవాహినికి 'క్రిస్టొవడిఫిగరిడో' యను నాతఁడు సేనానియయి యుండెను. సామ్రాజ్యమునకు వలయు దుపాకులు, మరఫిరంగులు మొదలగు యుద్ధోపకరణములన్నియు వారే సిద్ధముచేసి యిచ్చుచుండిరి.

### 15. కట్టడములు.

దిగ్విజయములలో రాయఁడు సాధించిన ధనమంతయు దైవాలయప్రతిష్ఠలకే వినియోగించెను. ఈ పార్థివుఁడు తన పూర్వులెవ్వరును సృష్టించియుండని నిర్మాణములను వెలయించెను. పంపాదేవాలయమునకుఁ బ్రాగ్భాగముననుండు సింహద్వారమును, రంగమండపమును, కృష్ణాలయమును, హజారరామదేవాలయమును, నేకశిలామయమగు నుగ్రనరసింహవిగ్రహమును, విఠోబాలయసమారంభమును గావించెను. వల్లభపురమునొద్ద తుంగభద్రకానకట్టకట్టించి, దానినుండి బసవనకాలువనేర్పఱిచినట్లును, వేర్వేఱుచిన్నకాలువలను చెక్కించి తుంగభద్రానదినుండి త్రిప్పి, నగరమున శుద్ధజలవసతి విస్తారముగఁ గావించినట్లును శాసనములు నుడువుచున్నవి.



కృష్ణదేవరాయని [గగన] మహలు: పెనుకొండ.



విద్యానగర రాజుల కాలమునాఁటి యొక గ్రామ దుర్గము: ధర్మవరము.

నాగలాపురమునకు (హాస్పేటకు) గొంతదూరమున వాయువ్యదిశను రెండుకొండల చివరలను గలుపుచు, పొంకారికి బ్రాకారముగ నేర్పడు నట్లొకగొప్ప కట్టకట్టించి, తనజననియగు నాగాంబజ్ఞాపకార్థమయి నాగలాపురమును నిర్మించెను. అదియేయిప్పుడు హాస్పేట యనఁబడుచున్నది. ఇంతియకాక శాఖానగరమగు పెనుగొండపురమునఁ గొండకుఁ గ్రిందిదూర గగన మహలను మేడను, కొండచివర 'ఖిల్లా'యను హర్మ్యమును నిర్మించి, వానిని వసంతకాల వాసయోగ్యములగు రంగములుగ నేర్పఱచుకొనెను. ౧౫౧౬వ సంవత్సరమున రాయఁడు దక్షిణసీమకు వెడలియుండినపు డాప్రాంతము నంగల ప్రధానదేవాలయములందెల్ల గోపురమండపాదులను నెలకొల్పెను. కాళహస్తీశ్వరనిలయమున కత్యున్నతమైనగవనును రత్నస్తంభమండపమును గట్టించెను. చిదంబరాలయమున నుత్తరదిశయందలి సింహద్వారమును దిరువణ్ణామలయమునకుఁ బదునొకం డంతస్తుల గోపురమును సహస్రస్తంభ మండపమును దత్సాన్నిధ్యమున నొకకాసారమును వెలయించెను. పెక్కుదేవాలయములకు మాన్యక్షేత్రములను నగ్రహారములను నొసఁగెను. శ్రీశైలక్షేత్రమున బ్రహ్మరథోత్సవ మార్గమున కిరువంకల మండపములను గట్టించెను.

## 16. శిల్పకళ.

'ఫెర్నోన్యూనిజ' కృష్ణదేవరాయని సందర్శించి

నప్పుడు రాయఁడాతనితోఁ గాలువలు నిర్మించుటకై గ-
చ్చ్చపని తెలిసినకార్యకరులను పోర్చుగల్లునుండి పంపవలసి
న దని చెప్పినటు లాతఁడు వ్రాసెను. బహుతకీచులు
విద్యానగరమునకు వచ్చుటకుఁ బూర్వమే హిందువులకు
గచ్చుపని తెలిసియుండెను; కాని యప్పటివారు పదు
నాఱవ శతాబ్దమునకుమునుపు రాతిపనికి గచ్చువాడి
యుండలేదు. ఇందూలకు గారపనితో నవసరములేకుండ
ఱాలబండలయంచులు పంగుల నాణెముగను బొందికగను
జెక్కి, వాని నొండొంటితో నమర్చుచుండిరి. ఇది
వారి శిల్పకళానైపుణ్యమున నొక ప్రధానాంగమయి
యుండినది. కృష్ణరాయఁడును నాతనికిఁ బూర్వము
విద్యానగర రాజ్యము పాలించిన రాజులును దమసేనల-
లో మహమ్మదీయులను విస్తారముగఁ జేర్చుచుండిరి
గదా? ఈముసల్మాను సైనికులలో శిల్పులుపెక్కండ్రు
నగరమున శిథిలములగు దుర్గప్రాకారాదుల నప్పుడప్పుడు
సంస్కరించుచుండిరి; కాన నాకాలమునాఁటి విద్యా
నగరమునందలి నిర్మాణములయందు, హిందువులయు,
మహమ్మదీయులయు శిల్పకళాప్రభలు మేళవించియుం-
డుట మనము నేఁటికిని శిథిలనగరమునఁ గాంచఁగలము.

## 17 నగర వైభవము.

సీ. పంచాననహరపాండు భైరవ విఠ్ఠలే
శ్వరముఖ్య దేవతా వ్రజముచేత
పరిపంథిగర్వ విద్రావణ శ్రీకృష్ణ
రాయభూధవ భుజాంతరముచేత

ఘటనటజ్యోతిషం పౌరాణిక భిషగ్వ్ర
తతుల సత్కవీశ్వరులచేత
సంతత పదవాహిం చారు కుండాల ఘం
టాజవప్రకట ఘోటములచేత
గీ. రమ్యమై యుండు విద్యాపురంబు......—పంచతంత్రి.

విద్యానగరమును దర్శించిన 'డార్టె బార్బోస్' అను పోర్చుగల్లు దేశస్థుఁడు, దాని యైశ్వర్యమును నౌచిత్యమునుగూర్చి, యుత్కృష్ట విషయములఁ దెల్పెను. మచ్చున కొక్కటియంశ మిందుఁజూపెదము.

'వీథులును చౌకులును మిగులవిశాలములై నవి. అన్ని దేశములయు నన్ని మతములయు జనులు తఱుచుగ నీప్రదేశములయందుఁ గూడి, మిక్కిలిక్రిక్కిరిసి లెక్కకు మీఱి యుందురు. ఈపట్టణమున వ్యాపార మపార ముగ జరుగును. పెగునుండియు లంకనుండియు దిగు మతియైన సొమ్ము లనేకము లిందుఁగలవు. నరసింగ (విద్యానగర) రాజ్యమున నొకవజ్రపుగనియు, దక్కను రాజ్యమున మఱియొకటియు నున్నందున, నీదేశములోనే వజ్రము లనేకములు గోచరించు చున్నవి. హోర్ముజు (Ormuz) సీల్ (Cael) దేశములనుండి దిగుమతియగు ముత్యములును-చిన్న ముత్యములును-సరిగబుటాలపట్టును రక్తాంబరములును—పగడములును—విశేషముగా నిందుఁ గన్పట్టును. రాజకీయోద్యోగులతోడను గొర్నర్లతోడను రాజ్యాంగవ్యవహారములనుగూర్చి మాటలాడు గృహ మొకటి యీరాజునకున్నది. వారంతయును బోయీలు

మోసికొనితెచ్చి వెలగలపల్లకులలో వచ్చుచుండిరి. పల్లకులును గుఱ్ఱపురౌతుల సమూహములును రాజనగర ద్వారముకడ నెల్లప్పుడు పడిగాపులుండును. సొంతపై-కముతోఁ గొన్న గజాశ్వములలో సిరాజెప్పుడును ౯౦౦ యేనుఁగులను, ౨౦౦౦౦ ల కంటె నెక్కుడైనగుఱ్ఱములను నిలువయుంచియుండును.'

మహాస్రగ్ధర. ఎకరాలన్ దుందుభాసాహిణములఁ గల భద్రేభ
సందోహ వాహ ప్రకరంబుల్ గొంచుఁ దత్తత్ప్రభువుల నడపన్
రాయబారుల్ విలోకింపుకై నిత్యంబు శ్రీకృష్ణుని యవసర
ముల్ చూతురందందఁ గొల్వై యవ్వేళ యాప్రత్యగ్రమహాసంధ్యము
బనివడి తిన్మందిరాళిందభూమిన్. —మనుచరిత్రము పీఠిక ౮౦

18. తిమ్మరుసు.

శ్రీకృష్ణదేవరాయనికి ముఖ్యామాత్యుఁడై రాజకీయరంగమునఁ బ్రాముఖ్యముఁ బొంది, యాంధ్రదేశ-మునఁ బ్రసిద్ధివడసిన మంత్రితిమ్మరుసునుగూర్చి కొన్ని పట్టులిట వ్రాసెదము.

౧. జన్మము: దారిద్ర్యము——ఇతఁడుసాళ్వవంశ-మునకుఁ జెందిన యాఱువేల నియోగి బ్రాహ్మణుఁడు. కేవలము దరిద్రకుటుంబమునకుఁ జెందిన యుత్తమదంప-తులకు ౧౪౬౦ వ సంవత్సరమున జన్మించెను. తండ్రి రాచయ్య. తాత వేమయ్య. 'గోవరాజ'ను సోద-రుఁడును 'కృష్ణమాంబ' యనుసోదరియు నితనికుండిరి. తలిదండ్రులు బాల్యముననే మరణించిరి. కృష్ణమాంబ

నాదిండ్ల గోపరాజు పెండ్లియాడెను. ప్రబోధచంద్రోదయమునకు వ్యాఖ్యానమును కృష్ణార్జునసంవాదమను ద్విపదకావ్యమును రచించిన దీగోపరాజే. పసితనముననే తలిదండ్రులు మరణించుటచేతను, పేదఱికమువలనను, తిమ్మరుసు నాతనితమ్ముఁడును జిన్నతనమునఁ బాలకాలము చదువు సంధ్యలు లేక స్వేచ్ఛగఁదిరుగుచు, గుత్తిలో విస్తళ్ళుగుట్టియుఁ బెనుగొండలో నన్నసత్రము ననుగుకొనియుఁ, జంద్రగిరియందు బిచ్చమెత్తియు, నందంద మండలేశ్వరుల తాంబూలపుసంచులు మోసియు, జీవింపవలసినవారైరి. తిమ్మరుసునుగురించి మారికవి చెప్పినపద్యమున నారంభములో 'గుత్తిస్బల్లెలుగుట్ట' యనియుండుటచే నీతని జన్మస్థలము గుత్తిప్రాంతములోనిదని యూహించుట కవకాశమున్నది.

౨. విద్యాభ్యాసము: ఉద్యోగము— చంద్రగిరి ప్రధానామాత్యుఁడగు తుళువ నరసరాజునకు మంత్రిగ నుండిన చిట్టి గంగనామాత్యుఁ డీబాలకులను జేరఁదీసెను. ఆతని యాదరాతిశయమున నీసోదరులు కొంత కాలమునకే విద్యావంతులు సర్వశాస్త్రకోవిదులు నై చంద్రగిరిసంస్థానమునఁ దొలుతఁ జిన్నపదవులలోఁ బ్రవేశించిరి. గంగనామాత్యుని మరణానంతరము తిమ్మరుసు, తుళువనరసరాజు పల్కుబడివలన గంగనామాత్యుని స్థానమునకు వచ్చెను. నరసరాజు విద్యానగర పీఠాధిపత్యము వహించినపిమ్మట నాతనికడను వీరనరసిం-

హారాయనియొద్దను గృష్ణరాయనియొద్దను నమాత్యుఁడు-గనుండి, యారాజులకన్నెఱిఁగి వర్తించుచుఁ, దనప్రతిభావిశేషమున నాప్రభువుల మన్ననకుఁ బాత్రుఁడయ్యెను. తిమ్మరుసు కృష్ణరాయని గాఢాభిమానముఁ జూఱఁగొన్న సమయముననే యా యమాత్యుని తమ్ముఁడగు గోవిందరాజునకు గుత్తిదుర్గాధిపత్యము లభించెను.

3. భాషాసేవ— తిమ్మరుసునకు గీర్వాణాంధ్రభాషలలోఁ జక్కని యభినివేశముండెను. అగస్త్యఋషికృతమగు చంపూబాలభారతమున కీవిద్యానిధి మనోహరమైన వ్యాఖ్యానము వ్రాసెను. ఈతఁడు భాషాభిమానమునను గేవలము జాత్యభిమానమునను నాంధ్రకవులఁబెక్కండ్రఁ జేరదీసి, ప్రభునియాదరావలోకనములకు వారలను బాత్రులఁ గావించెను.

ఈతనికిఁ దిరుమలాంబయను కుమార్తెయుండినది. ఆకన్నియ నాతఁడు తనచెల్లెలు కృష్ణాంబికకుఁగల్గిన మొదటి కుమారుఁడగు నప్పామాత్యున కిచ్చి వివాహము చేసెను. మాదయగారి మల్లనకృతమగు రాజశేఖరవిలాసకృతినాథుఁ డీయప్పామాత్యుఁడే.

4. చరమదశ— కృష్ణరాయఁడు మొదటినుండియుఁ దిమ్మరుసును మిక్కుటమగు భక్తిభావమునఁ జూచుచు, నాతని 'అప్పాజీ' (తండ్రిగారూ) అని పిలుచుచుండెను; కాని చరమదశలోఁ దిమ్మరుసు కృష్ణరాయని కుమారున కాఱేండ్లబాలునకు విషముపెట్టించి చంపి

యావత్తుండిన గౌరవమెల్లఁ గోలుపోయెనని తెలియు చున్నది. రాయఁడు దుస్సహమగు పుత్త్రశోకమునఁ దిమ్మరుసును జెఱలోనుంచెను. ఈ యమాత్యుఁడు కారాగారముననే చనిపోయెనఁట.

ద్రావిడమంత్రి — 'అరంవళ్ర్త మొదలియా' రను నతఁడు ద్రావిడుఁడయ్యు, మల్లికార్జునుని కాలమునుండి కృష్ణదేవరాయనివఱకు విద్యానగర సామ్రాజ్యమునకు మంత్రిగానుండియుండెనని తెలిసెడిని.

19. కాంతలు

౧. రుచీదేవి—శ్రీకృష్ణదేవరాయనికి రుచీదేవి చిన్నమదేవి తిరుమలాంబ యనుభార్యలు ముగ్గురుండిరి. అందురుచీదేవి గజపతిరాజు ప్రియతనూజ. శ్రీకృష్ణ దేవరాయని శౌర్యోద్ధతికి వెఱచి, గజపతిరాజు తన గారాబుపట్టిని గాన్కగనొసఁగి, రాయనిమైత్రి నార్జించెను. ఈసంధికార్యము హర్షముగూర్పమి గజపతిరాజు భార్య, కృష్ణరాయుని రూపుమాపి పగఁబాపుకొనుట యుక్తమనియెంచి, వివాహానంతర మొకపసిండియడిదము కటిబంధరూపమునఁ జేయించి కూఁతునకొసంగుచు, నాసాధనబలమున రాయనిముగింపవలసినదని యాంతర్యమునఁ దనతనయకు దుర్బోధమొనర్చి పంపెనఁట. తల్లియాజ్ఞయెట్టిదైనను శిరసావహించెడి యా చేడియు, మాతాదేశము తనకనిష్టదాయకముగనున్నను విధిలేక యంగీకరించెను. ఒకనాఁడు వల్లభుఁడు సేనతో

శయనాగారముననున్నపు డాయువిద జననియానతి సా-
గించుటకై యొడ్డాణ మింపుకఁ దలించెను. వెంటనే
యది చిటాలున నెగసి తేనిపాదముఁ గఱచఁ బడెను. రా-
ణి యా కట్యాభరణముననున్న యామాయాయుధముఁగని,
మోసముఁగ్రహించి యాసాహసికకుఁ బ్రవాసశిక్ష విధించె-
ను. విభునినిర్ణయానుసార మాయువతి కర్నూలుమండల-
మునందలి నల్లమలకాంతారప్రదేశమున నుత్తరపుటోర
నొంటిగనుండవలసివచ్చెను. ప్రాణేశ్వరుని చిరవియోగ
విచార మొక్కటి తక్క నితరముల నామె సరకుఁగొనక,
'వరదరాజమ్మ' యను మాఱుపేరున నచ్చటవసించుచు
నందొకపట్టణమునిర్మించి, యనేకఘనకార్యముల నొన-
ర్చెను. ఆకైంకర్యములలో నామెకీర్తిచంద్రికల నా-
చంద్రతారకముగ వెలయించినది, తటాకనిర్మాణము.
ఆతటాక ప్రతిష్ఠానంతరము ప్రవాహాతిశయమునఁ బలు
మఱు కట్టతెగుచుండెననియు, నందునుగుఱించి యా
సాధ్వి జలదేవతను బ్రార్థింప, నది నరబలిఁగోరెననియు,
ననంతర మొకగొల్లత 'చిన్నకంబఁడు' 'పెద్దకంబఁడు'
నను తనకొడుకులను గంగకుసమర్పించెననియు, నది
మొదలుగఁ దటాక మాబాలకుల జ్ఞాపకార్థము కంబము
చెఱువన వెలసెననియు, నాప్రాంతవాసులు చెప్పకొను
చున్నారు. తనరాణిసల్పుచున్న యిట్టిలోకహితకార్యము-
లఁగూర్చివిని, కృష్ణరాయఁ డెంతయునలరి, యామె
యపరాధమును క్షమించి, యాయంగనను మరలనర్ధాం-

౧౧. స్వీకరించెను. ఈగాథకు జనశ్రుతితప్ప మఱెట్టి యాధారమును గానరాదు. వరదరాజమ్మ కృష్ణదేవ రాయని యాభిజాత్యమునుశంకించి, తానేపత్నిగా నమున కేఁగెనని మఱికొందఱు చెప్పికొనెదరు.

౨. చిన్నమదేవి—ఈమె వేశ్యాంగన యనియు, కృష్ణరాయఁడామెను బాల్యమునుండి మిక్కిలి ప్రేమించు చుండి, తాను రాజ్యమునకువచ్చుచో బట్టపుభార్యగ స్వీకరించెదనని చేసిన వాగ్దానానుసారము తన పట్టా-భిషేకోత్సవసమయమున నామెను వివాహమాడి పట్ట మహిషిగఁగైకొనె ననియుఁ, దనకామెయెడఁగల యను రాగాతిశయముఁ బ్రకటించుటకై రాయఁడామె పేర నాగలాపురమను నొకపేటఁగూడఁ గట్టించెననియు, న్యూనిజ్ వ్రాసెను. దీనినాధారముగఁగొని యావలి చరిత్రకారులుసయితము చిన్నమదేవి వారాంగనయనియే రూపించిరి; కాని కృష్ణరాయఁడు నాగలాపురమును దనభార్యపేర నిర్మింపలేదు. తల్లియగు నాగాంబస్మర-ణార్థమై కట్టించెనని కుమారధూర్జటివిస్పష్టముగఁ దెల్పెను. చిన్నమదేవి నెల్లూరిప్రభుఁడైన వీరరుద్రగజపతికి నాతని యర్ధాంగియగు సుభద్రాదేవివలనఁ గలిగిన ముద్దుపెంపు బిడ్డ. కృష్ణదేవరాయఁడు ౧౫౧౩వ సంవత్సరమున నరిజనాభేద్యమైన యుదయగిరిదుర్గమును భేదించి, వీర-రుద్రగజపతిని నాతని పుత్త్రులను వడవులకుఁదోలి చిన్నమదేవిని జేపట్టెను. ఈమెగుణరూపవర్తనాదులలో

లక్ష్మినిఁబోలినకాంత. తన సౌశీల్యాదులచే నచిరకాలముననే నాఘనిహృదయమాకర్షించిననారి. ఆమె దృష్టిలో భర్తకంటెను భగవంతుఁడధికుఁడు కాఁడు. బీదసాదలకుఁ బెన్నిధి. నిరంతరాన్నప్రదాయిని; గాననే 'అన్నపూర్ణ' యని వినుతిఁగాంచెను.

3. తిరుమలదేవి — ఈమె కటకపురాధీశ్వరుఁడగు ప్రతాపరుద్రగజపతిసుత. భర్తయెడ నత్యంత భక్తిగౌరవములఁజూపుచు, నాతని సమ్ముఖమునఁ దలలోసి నాలుక వలెను, చక్కనరాణులపట్టునఁ బూసలలోని దారమట్టును వర్తించుచు, నానందకరజీవనముఁ బొందిన సుందరి.

కృష్ణరాయని పట్టపుభార్యలలోఁ గజపతి యిరువురే సుప్రసిద్ధురాండ్రు. ఇందుఁ జిన్నమదేవి మీఁదఁ గృష్ణరాయని కనురాగమెంతు. కొన్ని దండయాత్రిలలో నీరాణులు తమ భర్తతోనుండి, యమరావతి విజయవాటిక మున్నగుపట్టణములందుఁ బెక్కుదేవాలయములకు షోడశమహాదానములను విరివిగఁ గావించిరి.

4. సంతానము—కృష్ణరాయనికిఁ దిరుమలరాయఁడను నొక పుత్త్రుఁడును నిద్దఱుపుత్త్రికలు నుండిరి. కుమారుఁ డాఱుసంవత్సరములు మాత్రమే జీవించెను. కృష్ణరాయఁ డాయాత్మేంద్ర బాలకుని సింహాసనమునను నిచి రాజ్యభారమంతయుఁ దానేవహించి ప్రజాపాలనము సేయుచుండెను; గాని రాజకుమారుఁ డాఱవయేఁటనే

మృతినొందెను. రాయని పుత్త్రికలలోఁ దిరుమలాంబ నార్వీటిరామరాజు వివాహమాడెను.

తే. అనఘుఁ డా వైరనేని భీమాధిపేంద్రు
పౌత్రి దమయంతిఁ జేపట్టె నట్టి తిరుమ
రామభూపాలకుఁడు కృష్ణరాయతనయ
యగు తిరుమలాంబ నుద్వాహమయ్యె నెదుర.

—నరపతివిజయము. ౨౮౯.

వెంగళాంబను రామరాజు తమ్ముఁడు తిరుమలదేవరాయఁడు గ్రహించెను. ఈవెంగళాంబ తిరుమలాంబిక వలెనే, గురుజనభక్తిచే జననీజనకులయుఁ బరిజనానురక్తిచే దాసీజనబృందముయొక్కయు, శుశ్రూషాపరత్వమునఁ బ్రాణేశ్వరునియు విశ్వాసాతిశయములఁ జూఱఁగొని, యందఱకు నిరంతరోల్లాసదాయినియై పుట్టినింటికిని మెట్టినయింటికిని నలంకారప్రాయముగ నుండెను.

తే. అవనిభుని దేవి శ్రీవేంగళాంబ పుట్టి
నిల్లు మెట్టినయిల్లు వర్ధిల్లఁ జేసెఁ
బుట్టినింటికి మధనంబు మెట్టినింటి
కమితదోషాపహాతియుఁ గూర్చి కమలఁ దెగడి.

—వసుచరిత్ర ౧—౬౩

తిరుమలరాయఁడు కృష్ణరాయని యల్లుఁడు కాఁడనుట కొందఱి విమర్శకుల మతము.

20. చరమస్థితి.

౧. తురుష్కులమీఁద ధిక్కారము—పట్టినదెల్ల బంగారమును ముట్టినది యాణిముత్తియమును నగుచుం-

డుటచే రాయఁడు విజయోన్మత్తుఁడయి, దక్కను సుల్తానులు సందర్శింపఁ గోరినప్పుడును - సందేశములంపి నప్పుడును-వానినంగీకరింపక, యానజీరుల మెడఁ గేవలము నిరసనభావముఁ గనఁబఱుపఁజొచ్చెనఁట. మహమ్మదీ-యులలోని విభేదముఁద్రొలఁగించి,వారిలో నైకమత్యమును నెలకొల్పుటకు, విద్యానగర రాజుల యలక్ష్యభావమే ప్రథమకారణమయ్యెనని తెలిసెడిని.

౨. నిర్యాణము—ఆంధ్ర విద్యాభోజుండును, ఆంధ్రకవివరహృత్కమల బాలమిత్రుండును, ఆంధ్ర భారతీలాలస మానసాబ్జుండును, విష్ణుచిత్తీయ సకలకథా సారసంగ్రహాద్యనుపమ ప్రబంధకర్తయు, యవనక్రి-వ్యోద్దండ మదాపహార క్రియాకుశలనారసింహుండును నగు శ్రీకృష్ణదేవరాయసార్వభౌముఁడు, తన కెదురులేని మగంటిమిచే నిరువదియొండ్లములకాలము మహావైభవ-ముతో నేకాతపత్రముగ రాజ్యపాలనమొనర్చి, పుత్త్ర వియోగదుఃఖాకుల స్వాంతుఁడగుట దుర్భరజీవనుఁడై, ౧౫౩౦ వ సంవత్సరమువఁ దవ భౌతికకాయముఁ ద్యజించెను.

శా. ఏకచ్ఛత్రముగాఁగ నిర్భయముగాఁ దేశంబు పాలించెనే
ఏకచ్ఛత్రముగాఁగ వేరె విలసద్భోగంబు లెవ్వారికిన్ జెన్నారెనే
చాకాఁకన్ దలపించు వైభవముతోఁ భాస్వంతుఁడౌ తేజుతో
శ్రీకారుణ్య మహాప్రవర్షములతోఁ గల్యాకటాక్షాళితోన్.

గీ. అనుచు లోకంబు సంస్తుతించు వరనిశ్శేణి
కాలిభావనిర్భాగ్యకులశేఖరములోని

# పదునాఱవప్రకరణము.

---

## అచ్యుతరాయఁడు. ౧౫౩౦—౧౫౪౨.

### 1. శత్రువిజయము.

కృష్ణదేవరాయఁడు దివంగతుఁడైనపిమ్మట నాఁతని సవతితల్లికుమారుఁడనఁగా నరసరాజున కోబాంబికవలనఁ గలిగిన పుత్త్రుఁడగు నచ్యుతరాయఁడు శా. శ. ౧౪౫౨ విరోధినామ సంవత్సర కార్త్తికబహుళ పంచమినాఁడు రాజ్యపదముఁబొందెను. ఈతఁడు దక్షిణమునఁదిరునల్వేలి వఱకుఁ గొన్నిప్రదేశములు సాధించినట్లు, కాంచీనగరము నందలి శిలాశాసనమొకటి నుడువుచున్నది. ఈచక్రవర్తి సింహాసనమునకు వచ్చినతరువాత కేరళదేశాధీశ్వరుఁడగు తిరువడేశ్వరుఁడు విద్యానగరసామ్రాజ్యమునకుఁజెందిన పాండ్యరాష్ట్రమును హరించి, యందలి సామంతరాజును బాఱఁదఱిమెను. అనంతరము కేరళనాథుఁడు విద్యానగరరాజుల విరోధివర్గమునకుఁజెందిన చోళరాజుతో నేకీభవించి, రాజ్యపుమేరల నతిక్రమింపఁ బ్రయత్నించెను. అచ్యుతరాయఁ డిది తెలిసి, యసహాయశూరుఁడును స్యాలకుఁడునునగు సకలముతిమ్మయను దగినసేనను వెంటఁగొని వెళ్ళి, తానుశ్రీరంగముననిలిచి, బావమఱఁదిని మాత్రము కేరళరాజుపైకిఁ బంపెను. ఉభయసేనలును తామ్రపర్ణీతీరమున నొండొంటిని డీకొనినవి. 'లొటిపిట్ట

శూల రోకంఠ్లఁగానిపో దన్నట్లు, సమరమున స్వసైన్య మెల్లఁ గోల్పోయినపిమ్మట తిరువ తేశ్వరుఁ డుక్కుదక్కి, తిమ్మయకుఁ బాదాకాంతుఁడై 'దాసోఽహ' మ్మనియెను. తిమ్మయ యాతనిక్షమించి, విద్యానగరసింహాసనమున కాతఁడును చోళనాథుఁడును నంకితులుగనుండ నంగీకరించి, యెవ్వరెవ్వరిరాజ్యములను వారికొసగి యట నుండి మరలెను. తన కెదురొమ్ముకుంపటిగా నుండిన కృష్ణరాయఁడు మరణించుటచేతను, నచ్యుతరాయఁడు సామ్రాజ్యన్యాసము స్వీకరించెనని కర్ణాకర్ణిగవినుట వలనను, విజాపురనాథుఁడు 'గాలిఁ సరుసవుడే తూర్పు పోసికొనుట మంచి' దనితలంచి, తానదివఱకుఁగోల్పోయి యుండిన ముద్దగల్లు రాయచూరు దుర్గములను సునాయాసముగ స్వాధీనము గావించుకొనెననుట కొన్ని యాంగ్లభాషాచరిత్రముల మతము; కాని యచ్యుత రాయఁడు యుద్ధమున విజాపురపాలకు నోడించి, యాతనిఁ బాదాకాంతునిగ నొనర్చుకొనెనని, యచ్యుత రాయాభ్యుదయము రూఢిగఁ బల్కుచున్నది.

## 2. సద్వారము.

అచ్యుతరాయఁడు కేవలనిరంకుశాధికారప్రియుఁ డయి, తన సామంతరాజులను స్వదేశమునుండి వెడల నడఁచుటచే, వారందఱు నేకీభవించి యాతనిపైఁ దిరుగుఁబాటొనర్చుటకుఁ గృతనిశ్చయులైరి. ఈసందర్భముననే యార్వీటి రామరాజాదులుఁగూడ రాయుని

సోదరపుత్త్రుఁడగు సదాశివరాయని సామ్రాజ్యనాయకు నిగ నొనర్పఁదలఁచి, యందులకుఁ దఱుచు ప్రయత్నింపఁ జొచ్చిరి; కాని సలకముతిమ్మయ మూల స్తంభమువలె నుంటచే వారిప్రయత్నము సాగివచ్చినదికాదు ప్రబలుఁ డగు శత్రురాజెవఁడైన రాజధానిపై దండెత్తివచ్చుచో, నచ్యుతరాయఁడు సేనలఁ బంపి వారలను మగిడింపక, రాజధనాగారమునుండి వరాలు మూటలనంపి సంధి గావించుకొనుచు, మరల కోశాగారము నింపుటకై పన్నులువైచి ప్రజలను బాధింపఁబూనెనఁట. ఈచక్రవర్తి వర్తనమును, పరిపాలనపద్ధతులును, నాఁటి దక్షిణ దేశ హిందూరాజుల ప్రతిభకుఁ గళంకదాయకములుగ నుండెనని తెలిసెడిని. ఇట్లు తన పూర్వులార్జించి యుంచిన విత్తముతో నంతఃపురమున నింద్రియభోగముల ననుభవించుచుఁ జెక్కుచెమర్చకుండ నుండి, రాజ్యపాల-నాది విషయముల నంతగ గమనింపక, శాత్రవులు తేఱిచూడ నశక్యమైన విద్యానగరరాష్ట్రమున, నరాతి నృపతుల ప్రవేశమునకుఁ దావొసఁగెను. ఇదియే విద్యానగరసామ్రాజ్య మహాకల్పభూరుహ మంతరించు-టకు మూలక్రిమిగఁ బరిణమించెను.

### 3. విజాపుర సుల్తానుతోఁడి మైత్రి.

ఇస్మాయిలాదిల్షాకుఁ బిమ్మట విజాపురసింహాసన-మునకువచ్చిన యిబ్రహీమాదిల్షా ౧౫౩౫వ సంవత్సర-మున విద్యానగరమున కాప్తమిత్త్రునివలెవచ్చి, రాయని

విశేషగా వమునకుఁ బాత్రుఁడయ్యెను. తనరాజ్యమున నరాజకముప్రబలుఁ జేఁ, దానినడంచుకొఱకు విద్యానగర ప్రభుఁడు విజాపురపు వజీరున కేఁటేఁటఁ గప్పముకట్టుట కియ్యకొనెనఁట. అందుపై సామంతప్రభువులు తురుష్క రాజు చెలిమిసల్పవలదనియు, రాజధానినుండి యాతనిని సాగనంపినచో సామ్రాజ్యసింహాసనమునకు విధేయులమై యుండెదమనియు. బొంకించిరఁట. రాయఁడిబ్బిహీమున కిరువదిలక్షల వరహాలొసఁగి పంపివై చెనఁట. ఇది ఫెరిస్తా వ్రాఁత. సామంతరాజుల యథార్థత్వము తెలిసియు నచ్యుతరాయఁడు కనిగ్రుడి వినిచెవుడుగాఁ దనసౌఖ్యమునఁ దానుండుటచే గొంతకాలము నాయకు లెవరయినప్పాను సాఁము వారు ప్రవర్తించియుందురు.

దా. ము.

అచ్యుతరాయఁడు దానకర్ణుఁడనఁ బిలసిల్లెను. ఈతని దానపత్రములలో మహావిష్ణువు కుబ్జరూపధరుఁడై వామనాకారమున నున్నట్లు గలదు; అనఁగా నీ యుదారచరితుఁడు త్యాగమున బలిచక్రవర్తికిఁ దుల్యుఁ డని యొందలిభావము. ఈనృపతి ౧౫౩౫లో నానందనిధి యనుపేర నొకనిక్షేపము నిల్పెను. పాండ్యదేశమునుండి చోళమండలమువిడఁదీసి దానిని దనకుఁ అఁదలగు మూర్తమాంబా వివాహసమయమున, నామె కరణముగ నిచ్చివైచి, యామెభర్తయగు చెవ్వప్పనాయని నారాష్ట్రమునకుఁబ్రభునిగ నొనర్చెను.

# పదునేడవప్రకరణము.

## అనంతరము.

### 1. అచ్యుతరాయని తరువాత (౧౫౪౨.)

అచ్యుతరాయనికిఁ బిమ్మట సలకముతిమ్మయ, రాయని కుమారుఁడును తన మేనల్లుఁడునునగు వేంకట దేవరాయని విద్యానగర సామ్రాజ్యమునకుఁ బట్టాభిషిక్తునిగ నొనర్చి, రాజ్యవ్యవహారముల నన్నింటిని స్వయముగఁ జూడఁదొడఁగెను; కాని వేంకటదేవరాయఁడు సింహాసనారూఢుఁడయిన కొలఁదికాలమునకే గతించెను.

"క్షితి ప్రతిష్ఠాపితకీర్తిదేహే ప్రాప్తే పదం వైష్ణవ మచ్యుతేంద్రే
అనన్తరస్య ధరాసన మస్య సూనుర్న్యధో బభౌ వేంకటదేవరాయః
ప్రశాస్తి రాజ్యం ప్రసవాస్త్రరూపే విశ్వస్థితా వేంకటరాయరూపే,
అభాద్భుయోర్దచిరాత్మజానాం అఖండలాస మహాధరాధే"

—ఎపిగ్రాఫియా ఇండికా ౪వ పుస్తకము ౧వ పుట,
౯వ పుస్తకము ౩౩౨వ పుట.

వేంకటదేవరాయఁడు బాలుఁడగుటచేతను, విద్యానగరమునందలి ముఖ్యామాత్యులందఱుఁ దనపక్షమున నున్నందునను, సలకముతిమ్మయ బాలరాజును జంపి తాను సింహాసనము నాక్రమించెనని కొన్ని చరిత్రలు నుడువుచున్నవి; కాని శాసనాంశములనుబట్టి చూడ, నీ విషయము నిజమని తోఁపదు. వేంకటదేవరాయఁడు బలవన్మృతికిలోనయ్యెనని తెల్పెడుశాసనము మృగ్యము. సదా

శివరాయుని విద్యానగర సింహాసనమునఁ గూరుచుండఁ బెట్టుటకుఁ బ్రయత్నించుచు, తిమ్మయమూలమున సఫల ప్రయత్నులగుచుండిన యహితవర్గములోని వారెవరో యాతనిపలుకుఁబడిని దగ్గించుట కొకవేళ నీ యుపవాదము పుట్టించియుండిరేమో.

### ౭. సలకము తిమ్మయ.

వేంకటదేవరాయని యనంతరము తిమ్మయయే రాజ్యమునకు వచ్చెను. సామ్రాజ్యాకాంక్షఁ దవిలియున్న రామరాజాదు లందులకేమాత్రము సైఁపఁజాలక విద్యానగరమున నాతనికి విరోధులుగనుండిన దళవాయిలను దమతోఁ జేర్చుకొని, తిమ్మయను బ్రతిఘటించిరి; కాని వారియెత్తున కెదురెత్తు వేచి రామరాజాదుల నేవిధముననైనఁ బాఱఁద్రోల నెంచి, తిమ్మయ యాదిల్షాసాయము కోరుచు నాతనికి లేఖఁబంపెను; రామరాజాదు లది తెలిసి, విషయము శ్రుతిమీఱుచున్నదని తలంచి, తిమ్మయతో మైత్రివహించిరి. ఆదిల్షా విద్యానగరమునకు వచ్చియు, తిమ్మయ వేఁడికోలుపై నాతనికడఁ గొంతపరిహారధనముఁ బుచ్చుకొని, తన రాజధానికి మరలిపోయెను. వెంటనే యళియరామరాజు పెనుగొండనుండి చాలినంత దండుతో విద్యానగరముఁ జొచ్చి, యందలి ప్రముఖులను జేర్చుకొని, తిమ్మయ్యపైఁ బడెను. అడకత్తెరలోని పోఁకయగుట నాతఁడు విధిలేక యాత్మహత్యఁ గావించుకొనెను. తదుపరి రామరాజనాయాసముగా సింహాసనముఁ గొనెను.

ఎద్దులును బండ్లయు నేకమయినఁ గొండమీఁదికెఁజోవు టేమియబ్బురము?

### 3. సదాశివరాయఁడు ౧౫౪౨—౧౫౭౦.

జయోపేతుఁడయిన రామరాజును నాతనిసరదారులును నచ్యుతరాయని సోదర (రంగరాయని) పుత్రుఁడగు సదాశివరాయని విద్యానగరపీఠమునకుఁ బట్టభద్రునిగఁ జేసిరి. ప్రజాపరిపాలనమునకుఁ గేవల మసమర్థుఁడగుట సదాశివరాయఁడు పేరునకుమాత్రము రాజు. సామ్రాజ్యచక్రము రామరాయనియు నాతనిసోదరులయు తంత్రముపైననే తిరుగుచుండెను. వారుచెప్పిన విధమున నడచుకొనువిధి సదాశివరాయునిది.

ఆపటుకీర్తి రామవసుంధరాధిపచంద్రుఁడు కృష్ణరాయ ధాత్రిపతి సార్వభౌమ దుహితృప్రియుఁడై, విచిత్రప్రతాప సంతాపితశత్రుఁడై, యల సదాశివరాయ నిరంతరాయ విద్యాపుర రాజ్యలక్ష్మికి, విధానము తానయి మించె నెంతయున్

—రామాభ్యుదయము.

---

## తుళువవంశము. ౧౪౯౦—౧౫౭౭.



## పదునేనిమిదవ ప్రకరణము.

---

### VI. చతుర్థ (ఆర్వీటి) వంశము.

### ఆర్వీటి రామరాజు.

#### 1. వంశము.

రామరాజు చంద్రవంశక్షత్రియుఁడు. పురూరవుఁడు, నహుషుఁడు, యయాతి, భరతుఁడు, యుధిష్ఠిరుఁడు, నందుఁడు, చాళుక్యుఁడు, రాజరాజనరేంద్రుఁడు, వీరహేమాలి, మొదలగు ప్రసిద్ధ పురుషులీతని పూర్వులు. వసుచరిత్ర ప్రథమాశ్వాసమున నీ వంశాభివర్ణనము వీరవేంకటపతివఱకు నఱువదిపద్యములలోఁగలదు. దాని సారాంశమిది.

తాతపిన్నమరాజు చాళుక్యవంశజుఁడగు బిజ్జలుని సంతతివాఁడు. పిన్నమరాజుకుమారుఁడు సోమదేవుఁడు. ఆతని పుత్త్రుఁడు రాఘవుఁడు. రాఘవుని సుతుఁడు పిన్నశౌరి. అతనికొడుకు బుక్కరాజు. బుక్కరాజు సంతు రామరాజు. రామరాజునకు, కొమ్మరాజు-కొండరాజు-శ్రీరంగరాజు ననుతనూజులు గల్గిరి. ఇందుఁగడపటివాఁడగు శ్రీరంగరాజు, శత్రురాజ్యములయందెల్లెడల వీరవిహారమునల్పిన శూరశిఖామణి; మఱియు నిత్యదాననిధి.

శా. క్షోణీవిశ్రుత నిత్యదాననిధియై సొంపొందు శ్రీరంగరా
ట్ప్రాణం బాయని సత్కృపాణియడుంబ్రీస్వక్షిదానైక పా



ఆర్వీటి రామరాజు - పుట ౨౧౦.

విద్యానగర చరిత్రము



గుత్తిదుర్గము.

రిణంబౌ టను దే తదీయకర శాతదృక్షణ్ణ విద్ధాహిత
శ్రేణులున్నన్నఁ గన్ణఖేచర విశీర్ణప్రాధిణాటింపఁగన్. ౧ - ౨

ఈవితరణవైభవశాలి యర్ధాంగి తిమ్మాంబిక: పులోమజవలెఁ బూజ్యతఁగన్నది. ఈమెవలన శ్రీరంగ రాజునకు కోనరాజు, తిమ్మరాజు, అళియరామరాజు (ఇప్పటి మనకథానాయకుఁడు), తిరుమలదేవరాయఁడు (వసుచరిత్ర కృతిపతి), వేంకటాద్రి యనువీరులుద్భవించిరి.

ఈవీరపంచకము మాత్రమేకాక లక్కాంబయను కొమార్తెకూడ శ్రీరంగరాజున కుండెనని నరసభూపాలీయము నుడువుచున్నది.

సీ. ఘనభుజాశౌర్య రాఘవుఁడు రాఘవదేవ
ధరణీశుఁ డేరాజు తాతతాత
నరనుతుఁడైన పిన్నమరాజు సౌజన్య
ధన్యుఁ డేరాజన్యు తాతతండ్రి
యమితవైభవుఁడైన యార్వీటి బుక్కభూ
తిలనాథుఁ డేరాజు తండ్రితండ్రి
యసమానదాన విద్యాధురంధరుఁడగు,
రామరాజేంద్రుఁ డేరాజు తండ్రి.

తే. యట్టిసోమాన్వయాబ్ధి శీతాంశుఁడనఁగ,
నమరు శ్రీరంగవిభుపుత్త్రులైరి చెలంగు
లక్కమాంబ ... ... ... లలితశీల.
యర్మ్యహాసాధ్వి పొదరుఁ బలధిక యశులు. ౧—౬౫.

అందుఁ బ్రథముఁడగు కోనరా జాదిత్యునిఁదిర-స్కరించు తీక్ష్ణతపపటిమఁగల్గి శత్రురాజులనుజించి వారి నివాసభూముల నాక్రమించిన ప్రబల ప్రతాపాఢ్యుఁడు.

శా. శ్రీరంగాధిపు కోనభూవిభుని కిం దృప్యత్ప్రభుండాంక తే
జోరాజద్ద్విజరాజ కీర్తిగరిచేం శూరాగ్ర్యతిగుండై వధం
బాహ్గాహించి పటిష్ఠ హాసించుచు సహింపారాతిలక్ష్మించి త
త్సాగ్రాహర్నిశగు ప్రతాపవసుధం సాధించుఁ జిత్రంబుగన్.
౧—౩౯.

రెండవవాఁడు తిమ్మరాజుఁగూడ యశస్కరమగు ఖడ్గపరిభావముగల వీరాగ్రణియే.

క. ఆతని తమ్ముఁడు తిమ్మక్ష్మాతలపతి పొగడఁగని యొప్పునుఁ డనఁగీర్తి
వ్రాత వినూతన కైతక జాతద్యోతిత కృపాణ చపలాన్వితుఁడై
౧—౪౦.

నాలవవాఁడైన తిరుమలదేవరాయనికి, రఘునాథరాజును శ్రీరంగరాయఁడును, రామరాజును, వీరవేంకటపతియు, జనించిరి.

ఈవంశజులు చిరకాలమునుండి యార్వీటి సంస్థానాధిపతులై, ఖ్యాతివహించుటచే నార్వీటివంశనామము వీరికేర్పడెను. ఆర్వీ డనునది ప్రకృతము కడపమండలము నందలి జంబులమడుగు తాలూకాలో జంబులమడుగు గండికోట పురములకునడుమఁ బినాకినీతటమునఁగల యొకగ్రామము. ఆర్వీటివంశమున రామరాజు ప్రముఖుఁడని 'రెవరెండు హెస్రిహెరాస్' నుడువు చున్నాఁడు. ఆవంశమున నిజముగ నింతటిఘనుఁ డింకొకఁ డగపడఁడు. పరాక్రమాతిశయమున నేమి పరిపాలనపాటవమున నేమి యాంధ్రధరాతలమున నసమానుఁడని వినుతిఁగనిన యీతఁ డార్వీటివంశమునఁ బ్రథమస్థానమందఁదగిన మహాసీ-

యుండనుట యేమియబ్బురము? 'అర్వీటిరామరా' జని యాతఁడు ప్రసిద్ధినొందుట యిందుచేతనే. ఈప్రతిభా-ఢ్యుఁడు కృష్ణరాయని కొమార్తను బెండ్లియాడి మహా సామ్రాజ్యాధీశుని కల్లుఁడగుట, నళియ రామరా జన నలరెను. వెళ్ళినచోట్లనెల్ల విజయములనే పడయుచుండు-టచే నీవీరావతంసము విజయరామరాజనియు విలసిల్లెను. అర్వీటివంశజులు మొదటినుండియుఁ బదాతిసైన్యమును బ్రాణసదృశముగఁ జూచుకొని నరపతులనఁబఱఁగుట నాయన్వయజులకు నరపతివంశ నామముసహిత మేర్పడి నది. అందు రామరాజత్యధికప్రాశస్త్యముఁ గనినవాఁడు.

౨. నిర్బంధము.

రామరాజు తొలుత విద్యానగరసామ్రాజ్యమున-కుఁజెందిన యార్వీటి సంస్థానమునకుఁ బ్రభుఁడుగానుండి, కృష్ణరాయని సేనానాయకులలో నొక్కఁడయి, రాయ-చూరియుద్ధసమయమునఁ దనపటుతర పరాక్రమము వెలార్చి రాయనిప్రీతికిఁ బాత్రుఁడయ్యెను. కృష్ణదేవ రాయని యనంతర మచ్యుతరాయని కాలమునుండియు సదాశివరాయని నేవిధముననైన సామ్రాజ్యనాథునిగఁ జేయుటకయి, యాతఁడుప్రబలప్రయత్నముసల్పి, సా-మ్రాజ్యసింహాసనము లోఁగొనెను. విద్యానగరసామ్రా-జ్యమునకు సదాశివరాయఁడు నామకార్థప్రభుఁడుగనుండె ననియు దొరతనపుఁ గీలకమంతయు రామరాయనియు నాతని సోదరులయు హస్తమున నుండెననియు వెనుక

సూచించియుంటిమి. చివరలో సదాశివరాయని నిర్బంధితునిగనొనర్చి రామరాజే రాజయినట్లు శాసనములు నుడువుచున్నవి. సదాశివరాయఁ డేఁడాదికొక్కపర్యాయమే ప్రజల కగపడుచుండెనఁట. కొంతకాలమున కదియు పచ్చపూసాయెను. ఈతఁడు రాజ్యకార్యనిర్వహణమున కణుమాత్రమును దగియుండక పోయినను దత్పదవీప్రతిష్ఠ కుత్తూఁత లూఁగుచుండుటవలన, రాజ్యరక్షణాకళాకుశలుఁడగు రామరాజు ప్రజోపయోగార్థమును, సామ్రాజ్యమును శత్రువులబారినుండి తప్పించి దాని యభివృద్ధినిఁ బోషించుటకును, సదాశివరాయని నిట్టి నిర్బంధమున నుంపవలసివచ్చెననియు, నెంతకాలమునకుఁ-గూడ సదాశివరాయఁ డగపడకుండుటచే జనులలో నాతఁడు మరణించినట్లు వదంతులుసయితము ప్రబలెననియు, హెరాసు తన యారవీటివంశగ్రంథమున వ్రాసెను. సదాశివరాయఁడు పేరునకు రాజుగానున్నను, స్వాతంత్ర్యమునున దెట్టిదియో యెఱుంగని నిర్బంధితుఁడగు నొక కారాగృహవాసిదశలో నుండినటులఁ బైకిఁ దోఁచినను, నాతనియెడ రామరాజునకును దదనుజులకును గల భక్తికి లవమైనను లోపముగల్గలేదు.

### 3 పరాక్రమస్ఫూర్తి.

రామరాజు బాహువిక్రమమున కృష్ణదేవరాయనికిఁ బై చేయియనఁదగిన శూరుఁడు. ధైర్యస్థైర్యము లితనికి వెన్నతోడఁగల్గిన గుణములు. ఈహేతువుననే యీ

యోధుఁడు దేశమున గొప్పవలుకుఁబడి నార్జించి, కర్ణా-
టక మహాసామ్రాజ్యాధీశుఁడనఁ బ్రఖ్యాతినొందెను.
ఈ మహాశూరుఁడు పరిపంథిరాజులగు భోజ కాంభోజ
కళింగ కేశ పాలకులఁ గొనివచ్చి, తన యంతఃపుర రాణు-
లకుఁ బరిచారకులనుగ నొనర్చెనఁట. వైరివీరశుష్కవిపిన
మహాదవానలుఁడన వెలసి పురాణవీరులకుఁ దుల్యుఁడై
యొప్పిన ఘనుఁడీతఁడు. బలదర్పమున ననుజులునయిత
మగ్రజునకుఁ దీసిపోవువారనరాదు. అందుఁ దిరుమల
రాయనికంటె వేంకటాద్రి మిగులసాహసికుఁడు. కావుననే
'ఆహవగాండీవి'యన విలసిల్లెను. అనుఁగుదమ్ములిరువురు
నన్నియెడల నగ్రజునకుఁ గుడియెడమ భుజములట్లయొప్పి,
సమరాంగణమున మహమ్మదీయులకు మృత్యుభీకరులుగఁ
గన్పట్టుచుండిరి. గోల్కొండ విజాపురము అహమన్న-
గరము బెడందకోటసుల్తాను లేకీభవించి రామరాజాదు-
లపైఁ గవియుఁ దెగించుట కాసోదరత్రితయమునఁగల
యిట్టి బలగర్వమే కారణము.

## 4. మహమ్మదీయులతోడి సఖ్యము.

అచ్యుతరాయఁడు గావించిన లోపములఁ జక్క-
దిద్దుటకును, రూపుమాసియున్న విద్యానగర కీర్తిలతికను
బునరుజ్జీవింపఁ జేయుటకును, నత్యంతము పరిశ్రమించిన
వాఁడు రామరాజు. ఆతఁడు ముసలిమానుల గొం-
డారులలో మనస్పర్ధను బెంచి, తన లావరితనము మెఱయ
వారిని జంత్రపుబొమ్మలవలె నాడించుచుండెను. రాజకీయ

వ్యవహారవిశారదుఁడును మహాతంత్రజ్ఞుఁడును నగుట చేతను, ముసల్మానులు విద్యానగరముపై విజృంభింప-కుండ భయముగొల్పుటకుమాత్ర మప్పుడప్పుడు తన శౌర్యాగ్నిని రగుల్కొల్పుచు, ౧౫౬౩వ సంవత్సరము వఱకు దక్కను మహమ్మదీయనృపులను గనుసన్నలలోఁ ద్రిప్పుచుండెనే కాని రామరాజు తురుష్కులకు సహజ ద్వేషి కాఁడు. పెక్కువిషయములలో నీ ప్రభుఁడు తురు-ష్కులకు విశేషముగఁ దోడ్పడుచు, వారియెడఁ దనసహజ దయాంతఃకరణముఁ గనఁబఱిచి, వెనుకటిచక్రవర్తులవలెనే మతసమత్వముఁ బ్రకటించెను. దక్కను నవాబుల పరి పాలనకాఠిన్యము నోర్వఁజాలక, తలదాఁచుకొనవచ్చెడు కొంతటి మహమ్మదీయప్రజకు విద్యానగరము తల్లియిల్లు కాఁగా, రామరాజు తండ్రివోలె వారిని జేరఁదీసి, యాదరించెను. ముసల్మానులకయి తన నగరమునఁ దుఱకపేట యొకటి ప్రత్యేకముగఁ గట్టించి, వారిప్రార్థ నాదుల కభ్యంతరము గలుగకుండ నగరమధ్యమున నొక మసీదుగూడ నిర్మించియుండెను. ఈ హేతువున రామరాజు రాజ్య మన్నితెగలవారికిని నెల్లవిషయముల నిజముగ రామరాజ్యమే యయ్యెను.

గీ. అవనియంతయు రామరాజ్యంబు సేసెఁ
దనగుణమ్ములు కవికల్పితములు గాఁగ
సలవియొరటింప సత్కావ్యములను వెలయ
భూమినొక రాజమాత్రుఁడె రాముఁడిభుఁడు.

— శరవ[illegible]

గోలకొండ నవాబగు జంషిద్ కుతుబ్షాకు నాతని తమ్ముఁడగు ముల్క్ ఇబ్రహీంషాకును విరోధము పొసఁగఁగా, జంషిద్ షా సోదరునియెడల చలముపూని యాతనినిఁ దుదముట్టింపఁ దలఁచెను. ఇది తెలిసి యిబ్రహీంషా యచ్చటినుండి విద్యానగరమునకుఁ బాఱిపోయి, రామరాజును శరణు వేఁడెను. శరణాగతుని యగ్రజుఁడగు జంషిద్ షా తనకాప్తుఁడైనను నాతనిమైత్రి నొకవంకనుంచి, 'దుర్బలస్యబలంరాజా' యను నుడిసార్థకముగఁ, దన్నాశ్రయించిన యిబ్రహీంషా వెఱ్ఱఁదీర్చి, విద్యానగరసీమ యందొక గ్రామమొసఁగి యాతని నాదరించెను.

"...పూని శరణాగతుల నెల్లఁ బోచె రాముఁ డతఁడు
నిజచరితఁబు రామాయణముగ" —వసుచరిత్ర ౧—౪౪.

విద్యానగరప్రభుని దయావీక్షణములవలన నిబ్రహీంషా ఆ చిన్నసంస్థానమున గౌరవజీవనముఁబొందుచు నాంధ్రులనడుమఁ దెనుఁగు దేశప్రభువుల సావాసమునఁ జాలకాలము సుఖముగఁ బెరిఁగెను.

### 6. విద్యానగరవాసనాబలము.

తాను దలఁచియుండినచో సోదరుని హత్యగావింపఁబూనిన జంషిద్ షా నాక్షణమే పదభ్రంశుసిఁగావించి, రామరాజు శరణాగతుఁడైన యిబ్రహీంషాను గోల్కొండ గద్దెపైనిల్పియుండును; కాని యాతఁడంతటి తీవ్రపథమవలంబింపక యాత్మరక్షణభారము పైన వేసికొనుటతోడనే శాంతిఁబొందెను. తరువాతఁ గొంత

కాలమునకు ౧౫౫౦వ సంవత్సరమున జంషిద్ కుతుబ్ షా మరణించెను. నమ్మినవాని కభ్యుదయము ప్రసాదించి యిచ్చునదే రామరాజునకుఁ బరమావధిగాన నాతఁడా వెంటనే ముల్క ఇబ్రహీంషాను గోల్కొండసింహాసనమునను చి తదీయరాజ్యమునకాతని నభిషిక్తునిఁగావించెను. 'అతని వర్తితుని దత్సుతునిఁబట్టముగట్టి కుతుపన ఎల్కన క్షోణినిల్పె'నని సరసభూపాలీయము. ...హోదారస్వభావుఁడై 'మల్కిభరా' మనుపేర నాంధ్ర దేశమునఁ బ్రబలఖ్యాతిగడించిన నవా బీతఁడే. విద్యానగరసీమ నాంధ్రవిద్వాంసులగోష్ఠిని వసించుటంజేసి, యీ ముసల్మాను వజీరున కాంధ్రభాషా వాసనయు, నాంధ్రకవితానురక్తియు, విద్యానగరచక్రవర్తుల వితరణ శాలిత్వాదికములును, జాలవఱకు నలవడె ననవచ్చును. ఈతఁడు గోల్కొండరాజ్యము గైకొనినపిమ్మటఁ, దన యాస్థానమున నాంధ్రకవుల నునిచికొని, వారిచేఁ గావ్యముల రచింపించెను. ఈతని కొలువులోనుండియే యద్దంకి గంగాధరకవి తపతీసంవరణమును, పొన్నిగంటి తెలగనార్యుఁడు యయాతి చరిత్రము * పద్యప్రబంధములుగ రచించుట. ఇందు గంగాధరకవి యీసుల్తానుని యాస్థాన వైభవమునుగూర్చి యిట్లు వర్ణించెను.

'సీ. సకలవేదపురాణశాస్త్రపారగులైన
యొుంటిమిద్వాంసులెల్లకుచోట

* ఇది యచ్చతెనుఁగుకబ్బము. ముల్క ఇబ్రహీముని సరదారుఁడగు 'అమీరుఖాను'న కంకిత మీయఁబడినది.

సప్తభాషలయందు సాంధ్యము గలేకుండు
భూకాంత కాంతుఁ డిందు లోకవంద్యుఁ;
గజపతినరపతి క్ష్మాభృత్తలంటిన
యొడికంపు రాయబార్లకు దండ;
మేరు మందరముల మించఁగల్గిన మన్న
యులు దండనాథు లొక్కొక్కకొదలఁ;

తే. జేరికొల్వ ధరాధిపాసీనుఁడగుచు
గమ్యగుణహారి మల్లికాగామకేరి
భారతీక్షేత్రమయ సింధుబంధమధ్య
లలితపుణ్యైక భా సుధాలహరి దేలు.'

ఆంధ్ర సారస్వతమున నత్యంతాభిరుచి గలవాఁడగుట నీ ప్రభుఁడు వేయాఱులనొసఁగి కవులను గాన కళాభిజ్ఞులను శాస్త్రవిదులను మిగుల సన్మానించుచుండువాఁడు.

సీ. సత్త్వగా సంగీత నాదభేదవిజ్ఞ
ధీరాత్ములకు బంగారులిచ్చు
గమ్మసైనా సభా ప్రాధ సత్కవివర
జాలములకు బదివేలునిచ్చు
కూర్చుండు మనియెనా గురుతర శాస్త్రజ్ఞ
లక్షణవిదులకు లక్షలిచ్చు
సాబాను రాయన్న సకలాశ్రితానేక
కోవిదులకు మెచ్చి కోటియిచ్చు

గీ. బళిర! చతురబ్ధి మేఖలా కలితధాత్రి
చక్రవర్త్యక్రపాలనా చారుకీర్తి
రమ్యమగు శాతపత్రరా గాజితుండు
చారుతరమూర్తి! యళియరామ చక్రవర్తి.

క. గానివాని కీర్తనిసన్మానగరిమ యంత హెచ్చుగ నుండదఁట! ఎవఁడైనను సరే యాంధ్రకవితలోఁ దన పేరు కూర్చి తానుమెచ్చఁజెప్పినా యిచ్చకోలఁది నిచ్చునఁట.

సీ॥ 'రా! యిటుధట్టు!'
'ఏమి కవిరత్నము! పిల్చితివి?'
'ఈవిపద్యములే;'
'ఏమనవనీశుపై?'
'నృపకుకేశ్వరుడా నిథగాముశాహిపై,'
'అయుతపుణ్యమూర్తి యతఁ దర్థులు వేఁడిన నిచ్చు?'
'ఇచ్చినా — వేయును, రెండువేలు, పదివేలును, లక్షలు,
'ఛా!' [గోట్లునిచ్చు'

ఈనవాబుపై నాంధ్రకవులు చెప్పినచాటువులు కొల్లలుగ నున్నవి. ఈవితరణాధ్యుఁడు మరణింపఁగా నంతటియల్పాయు వమ్మహాత్మునికిఁ గూర్చిన విధిని దూఱుచు, నొకకవి యిట్లు వందురుచున్నాఁడు.

ఉ. రారవిధాత! కొరివినరా! తగుఁ రా! తెలిసెట్లమారి! ని
స్సారగుణాభిరాజులను జంపక మల్కిభరామభూవరున్
జారయశోధనున్ సుగుణిఁ జంపితి వర్థులకేమి దిక్కురా
చేరిన యంతరాజును సృజింపఁగ నీతరమా వసుంధరన్?

౬. రాయచూరి శాక్రమించుట.

విజాపుర విద్యానగరరాజ్యముల మేరలోనుండి, విజాపురమున కాయువుపట్టులననొప్పి, చిరకాలముగ విద్యానగరసామ్రాజ్యమునకుఁ జెందినవియై, యచ్యుత రాయనికాలమున విజాపురరాష్ట్రముతోఁ గలిసిపోయిన రాయచూరు ముద్గల్లుదుర్గములను వశపఱుచుకొనుట-

కయి, రామరాజేడేండ్లలో రెండుతడవలు ప్రయత్నించెను. అందు రెండవ ప్రయత్నము ౧౫౬౩వ సంవత్సరమున జరిగినది. ఆదినములలో నహమ్మద్నగర ప్రభుఁడుగనుండిన బుర్హాన్ నిజాంషా రామరాజునకును గోల్కొండ సుల్తానగు ఇబ్రహీంషాకునుగూడ విరోధిగనుండెను; కాని రామరాజు బలదర్పితుఁడగుటవలన నాతనితో వైరమూని జీవిక సాగించుట దుస్తరమని తలఁచి బుర్హాన్ నిజాంషా తనకుఁదానే రామరాజుతోఁ జెల్మిసల్పెను. రామరాజా-యుదనునఁ దనమిత్రుఁడైన ఇబ్రహీంషాకును నిజాంషాకును నావఱకునుండినదీర్ఘద్వేషముఁ బోఁగొట్టి యాయుభయు-లకు గాఢమగుమైత్రినిఁ గూర్చెను. తత్కార్యఫలితముగ నీముసల్మానుద్వార లిరువురు దంపతిపోయి, చెరియొక వంకగా విజాపురముఁ దాఁకిరి. ఆతరుణముననే రామరాజు రాయచూరు ముద్గల్లుదుర్గములను గృష్ణా తుంగభద్రానదులకునడుమనున్న యంతర్వేదిని నాక్రమించుటకై సోదరుఁడగు వేంకటాద్రిని నియమించెను. మూఁడు రాష్ట్రముల సేనలు నొక్కపెట్టున తనపైఁ బడుటచే, నాదిల్షా భయభ్రాంతుఁడై నిజాంషాకు షోలాపురమండల భాగమునిచ్చివైచి, యేదోయొకనియమమునకు లొంగి, రామరాజుతోఁగూడ సంధి గావించుకొనెను; కావున నీదండయాత్రయము రామరాజుప్రయత్న మీవిధముగ విఫలమై పోయినది. ఆదిల్షా తనతో సుహృద్భావమున నుండుటచే, నాతని నిగ్రహించి తన దుర్గములను సాధింపఁదివురుట,

కేవలము దాక్షిణ్యనిధియగు రామరాజునకు మనసొప్పినది కాదు; కానఁ జాలకాలము మాత్రఁ డాయుద్యమమే విడిచిపెట్టెను; కాని ౧౫౫౫వ వత్సరమున నిజాంషా విద్యానగరసభయందు కమూల్యములగు కానుకలంపఁగా నాదిల్లాయందులకు సహింపలేక తనయాస్థానమునందుండిన విద్యానగర రాయబారులను బరిభవించిపంపెను. అది తెలిసి రామరాజు క్రుద్ధుఁడై యహమ్మద్నగరాధీశుఁడగు నిజాంషాకుఁ దగినసైన్యబలముఁదోడిచ్చి, యాదిల్లాయునకార్వనాజ్ఞాపించెను. రామరాజు ప్రేరణమున నిజాంషా యాదిల్లాపైఁబడి యాతనిసేనలనుగూల్చి, కల్యాణనగరమును స్వాధీనము గావించుకొనెను. రామరాజంత మాత్రమున నూరుకొనక రాయచూరునాక్రమించుటకై వేంకటాద్రిని నియోగించుచు, వెనుకనుండి తానుగూడ నాతనికి మద్దత్తుగ వెడలెను. అగ్రజునాదేశానుసారము వేంకటాద్రిప్రభుఁడు, ముద్గల్లుముట్టడించి, తన్నెదిరించిన విజాపురపాలకుఁడగు నిబ్రహీమాదిల్లాను నాతనిసేనాసమూహమును గుట్టలకుఁద్రోలి, ముద్గల్లు రాయచూరి దుర్గములను నంతర్వేదిని వశపఱచుకొనెను.

మ. 'బలభుగ్వంద్యుఁడగు వేంకటేంద్రుని మహాశబాహాబలాటోప వి
హ్వలుఁడై మున్నతిభావనక్రియ నహాశనాభిఖ్యుఁడై నట్టి యే
దులఖానుం డిదె నేఁడు గ్రమ్మఱ నహాదుండయ్యె నాఁడ్రి లెన్
దలఁ దశ్పాదముఁదాల్చె భీమరథిపొంతన్ గాన నిల్చొన్నతిన్.

---

* ఆదిల్లా పదమునే వెనుకటివారు 'ఏదులఖాన్' అనివాడిరి.

మ. శ్రీరసంగ్రామ జయాభిరాముఁడగు నా శ్రీ వేంకటక్ష్మావరుం
డాయత రాజశిఖామణిత్వముఁడగుఁ దత్పట్టభద్రుఁడ్గాఁ గాఁగున్న నీ
ధరణీపాలకులెల్ల! మెచ్చఁగ సహోదర్యోణి కృత్యాప్తి భా
సురదుర్గాధిపతిత్వవైభవ భవస్ఫూర్తి న్వ్యజృంభించు నే.

— నరసభూపాలీయము. ౧ — ౨౪; ౨౨.

ఈయుద్ధమున నిజాంషాయును రామరాజును నతని నాలవపుత్త్రుఁడైన చినతిమ్మరాజును సయితము పాల్గొనునట్లు తెలియుచున్నది. యుద్ధానంతరము రామరాజు రాయచూరి దుర్గాధిపత్యమునకు చినతిమ్మరాజును నియోగించినట్లు రామరాజీయము వ్యక్తపఱిచెడిని. చినతిమ్మరాజుగూడ యువనాంతకుఁడై విలసిల్లినమహావీరుఁడే.

ఉ. నారదవింటె చిత్రమిది నాగరవాసులు గాక దేవతా
వారిజగంధులున్ గలసి వత్తురు సన్నొలువంగ దేవుసు
హారులు మ్లేచ్ఛులన్న విను మాసురవల్లభ యాకుభూమి రా
చూరి పురీశు తిమ్మవిభు నాగ్రక రాచిని బ్రమ్మగారుణా.

— రామరాజీయము.

## 7. సోదరుల పరిఘటనము.

రామరాజుసోదరు లిరువురు నన్నఁపైఁదిరుగఁబడి యాదవనిగ్గైకొనిరనియు, వారి నడంచుటకయి రామరాజు గోల్కొండ నవాబుసాయ మర్థించెననియు, ఫెరిస్తా వ్రాసెను. అన్నయెడఁ బితృభక్తిగలిగి, యగ్రజునకుఁ బరమవిధేయులై, యేవేళ నాతనియాదేశమును వేద వాక్యముగ మన్నించుచు వర్తించుచుండిన తమ్ము లన్న-కుఁ బ్రతిఘటించి, యాదవనిఁ గ్గైకొనిరనుటలో సత్య

లేశమును లేదు. ఈ యువరాజులిరువురు (వేంకటాద్రియు తిరుమలదేవరాయఁడు)ను బీదరురాజ్యముపైఁబడి బెడంద కోట కవాటముఁ బగుల్చి, బరీదుషాను బరాజితునిఁ గావించిరఁట; ఈ హేతువుననే భట్టుమూర్తి తిరుమల రాయని 'బెడందకోట పటుకవాట పాటనా' యనియు 'బీరబరీదనరాధ హారీ' యనియు సంబోధించెను. నరపతి విజయ మీవిషయమున నిట్లు నుడువుచున్నది.

ఆ. వె. అసదృశోరుశౌర్యుఁడౌ వసగాఁడీవి
వేంకటాద్రిరాజ విబుధరాజ
అని బకీదుగొల్చి యాతనిబిరుదము
కొమ్మఁగొనియె భూజనమ్ము వొగడ ౨౬౪.
'అహమదనగరబకీదస్త్రాంగ హారుఁ
డతఁడు విలసిల్లు శ్రీవేంకటాద్రివిభుఁడు'

—నరపభూపాలీయము. (౧—౨౫)

8. మునల్మానులకుఁ దోడగుట.

విజాపురమునకుఁ బ్రాణసదృశములైనదుర్గములను రెంటిని నంతర్వేదిని నిబ్రహీమాదిల్షా గోల్పోయినను, రాయని పరాక్రమక్రమ మెఱింగినవాఁడగుట, నాతనితోఁ గంటుగొనుటకిష్టములేకయు నొకవేళ నిగ్రహించినను జీవించుటయసాధ్యమని నిశ్చయించుకొనియు నెదురెత్తఁబూనక, విద్యానగరనాథునితో సఖ్యభావమున మెలఁగుచుండెను. 'సయ్యద్ ఉల్ముల్కు' అనఁబడు సరదారుఁడొక్కఁడు ౧౫౫౫వ సంవత్సరమునఁ దనపైఁ దిరుగఁబడి, యుద్ధమునఁ దన్నోడించి, రాజ్యముహ-

రింపఁగా, నిబ్రహీమాదిల్షా రామరాజు సాయము గోరెను. వెంటనే యాతఁడు తన తమ్ముఁడగు వేంకటాద్రిని సుల్తానునకు బాసటగాఁబంపెను. ఆవీరుఁడు దళవాయిని నైజామురాష్ట్రములోనికిఁ దఱుముకొనిపోయి యచ్చట వానిఁగీటణంచి సుల్తానునిగౌరవముఁ గాపాడెను. బుకు-తకీచు లోకస్వామి (౧౫౫౬) విరోధకారణమున విజాపురసామంతరాజులలో నొక్కనిబాధింపఁగా, రామరాజుసామంతనృపునకుఁ దోడై బుకుతకీచుల యొత్తిడినిఁ బాపెను. ఈబుకుతకీచు లేకొన్ని విషయములలోనో ప్రతికూలురుగ నగపడినను, జాలవఱకు విద్యానగర చక్రవర్తులతో స్నేహభావముననే మెలఁగుచుఁ దాము గొనివచ్చెడు నుత్తమాశ్వములను దొల్లింటి నియమానుసారముగ విద్యానగరప్రభువులకే విక్రయించుచుండిరి. వా రితరభాగములలోవలె విద్యానగరసామ్రాజ్యప్రాంతమున నెందును జనులను గ్రైస్తవమతప్రవిష్టులఁగావింప సాహసింపఁజాలకుండిరి కూడ.

## 9. అపూర్వపుత్రీరత్నము.

విజాపురాధినాథుఁడగు ఇబ్రహీమాదిల్షా ౧౫౫౭ వ సంవత్సరమున మృతినొందెను. పిమ్మట నాతని తనూజుఁడగు నలీయాదిల్షా రాజ్యమునకువచ్చెను. ఈతఁడు విద్యానగర ప్రభువుల శాశ్వతస్నేహము సంపాదింపఁ దలఁచి, ౧౫౫౭ వ సంవత్సరమున స్వయముగ విద్యానగరమునకు రాఁగా, రామరాజతని నల్పగౌరవమునఁ

జూచెననియు, నందుచే సఖ్యతకుమాఱుగా విరోధమే పొసఁగెననియు, నట్లయ్యు నాయిరువురు మరుసటి సంవత్సరమే యేకీభవించి, యహమ్మద్నగరముఁ దాఁకుటచే నారాజ్య మీయుభయుల సేనాసమూహ మధ్యమున విధ్వంసమయ్యెననియు, ఫెరిస్తా నిర్వచించుచున్నాఁడు. ఈ యాదిల్షాసఖ్యపరిభావమునుగుఱించి మహమ్మదీయ మహాయుగ మిట్లు చాటుచున్నది.

"రామరాయలు కుమారుఁడొకఁడు మరణమొందఁగా నీ యాదిల్షా తదియస్నేహము దృఢపఱుచుకొనుటకుఁ దగినసమయమని తలఁచి, రాయల దుఃఖోపశమనము చేయుటకై నూఱుగుఱ్ఱములమాత్రము వెంటఁబెట్టుకొని విజయనగరమునకు బోయి, దుఃఖోపశమన వాక్యములుపలికి, నన్ను మీ పుత్రునిగఁ జూచుకొమ్మనియెను. రామరాజుభార్య యాదిల్షాను పుత్త్రిభావమునఁ జూచుకొనెను. అప్పటినుండియు రామరాజును నాదిల్షాయును పితృపుత్త్రులవలెనే యొకరినొకరు ప్రేమించుకొనుచుండిరి ఈపుత్త్రుఁడే తుదకుఁ దాళికోటలో తండ్రినిమోసపుచ్చి చంపెను."

ఈయంశములఁబట్టిచూడ రాయునియెడ నీతురుష్క నృపునకుఁగల్గినభక్తిపరివర్తనము, కేవలముపిల్లి శీలమేయని రూఢిపఱుచుచున్నది. నాఁటఁగోలె నాదిల్షా తనయెడఁ దేని పూనినభక్తియె వర్తించుచున్నను, నిష్కళంకహృదయుఁడగురామరా జదిగ్రహింపక, యాతురుష్కనృపతిని గన్న కుమారునివలెనే కన్నులఁగప్పుకొనుచు, నాతని వాంఛితములెల్లఁదీర్చుచుఁ, దన నిర్వ్యాజానురాగము వెలయించుచుండెను.

## 10. అహమదునగరముపై దాడి.

౧. మొదటి యుద్ధము:—తాను రామరాజునెడ నెట్లు ప్రవర్తించుచున్నను రామరాజు హృదయము కేవలము నిష్కపటమైనదని యెఱిఁగినవాఁడగుటచే, నాదిల్షా యాహైందవప్రభుని యుత్కృష్టమగు సాహాయ్యమును విశ్వసించి, తనతండ్రినుండి కైకొనియుండు కల్యాణనగర షోలాపురదుర్గముల నీయవలసినదని, హుస్సేన్ నిజాంషాకు వర్తమానమంపెను; నిజాంషా యాసందేశమునకుఁ దిరస్కారపూర్వకమగు ప్రత్యుత్తరమొసఁగుచు, నాతని దూతను బరిభవించి తఱిమెను. అనంతర మలీయాదిల్షా రామరాజుసాయ మర్థించెను. రామరాజాదిల్షాతో నేకీభవించి, యహమ్మద్నగరముపైఁ బడెను. హైందవవీరు లప్పుడాడిచిన యాఁబోతులవలెఁ బెచ్చురేఁగి ముసల్మానుల నున్మూలింపఁజొచ్చిరి. అందులకుఁ దురుష్కసేన లాఁగలేక చెట్టుకొకపిట్టగఁ జెదరిపోయెను. అనంతరము విద్యానగరసైన్యము రాజధానిఁజొచ్చి దానిఁబాడువెట్టుచుఁ, దదీయరాజ్యమును జాలతాబాదువఱకు విధ్వంసమొనర్చెనఁట. ఫెరస్తా యీ యుద్ధవైఖరినిఁ దెల్పుచు, నాస్తికులగు విద్యానగరయోధు లెట్టి క్రూరకార్యాచరణమునకేని వెనుదీయలేదనియు, వారు ముసల్మానుస్త్రీల నవమానించిరనియు, మసీదులఁ బడఁగొట్టిరనియు, పవిత్రవంతమగు కొరానును జింపివైచిరనియు వ్రాసెను. ఈఘోరకార్యాచరణముఁ గాంచలేక హుస్సేన్ నిజాంషా

తానే రామరాజ శిబిరమునకు నడచిపోయి సర్వసైన్య సమక్షమున, కల్యాణనగరపు తాళపుచెవులను రాయనికి సమర్పించెను. 'పోరునష్టి పొత్తులాభ'మనుట రిత్తకాదు.

"శా. విశ్వామిత్రునిఁగొల్చి రాముఁడతఁ డుర్విన్ జెందెఁ గల్యాణమున్
విశ్వామిత్రులఁగొల్వ రాముఁడితఁ డుర్విన్ జెందెఁ గల్యాణమున్
శశ్వత్కీర్తులు రాము లయ్యిరువురున్ సాధించు కల్యాణ లా
భైశ్వర్యంబులు ధర్మనిర్మథన ధర్మాలంబన వ్యక్తముల్. ౧-౪౩

అని యీ కైంకర్యవిశేషమునుగూర్చి రామరాజ భూషణుఁడు కీర్తించెను. కల్యాణపురమును సాధించు ప్రయత్నమునఁ దిరుమలరాయ వేంకటాద్రులుకూడ రామరాజుతోనుండి జయముగొన్నట్లు క్రిందిపద్యముల వలన వ్యక్తమగుచున్నది.

సీ. హరికార్యుఁడగు తిర్మలాధీశ్వరుండును ద
 దవరజుండగు వేంకటాద్రిరాజు
భుజయుగంబుగ బలస్ఫురణతోఁ గరిహరి
 వరవీరభటులతో దొరలతోడఁ
దనయాజ్ఞ మీఱినఁ గినుక నిజామునై
 దండెత్తి తఱిమి యుద్దండవృత్తి
నతఁడేలుచున్నట్టి యాముదానగరంబు
 చౌకెత్తి మఱి యాముదాలు వేసి

ఆ. సేతు కాశిమధ్య భూతలనుతజయ,
శ్రీవరించి వేడ్క చేఁ జెలంగు
రామమూర్తియైన రామరాజేంద్రుఁడు
సాంద్రవిభవజిత సురేంద్రుఁ డెలమి.

—నరపతివిజయము. ప. ౨౭౧

కం. 'ఖల్యాథయకర హరిఖుర
హల్యాహతజన్య జాంగలాంగణఫలహా
కల్యావహా బహుదిగ్జయ
కల్యాణ నిజామగు ప్రకల్యాణహరా.'

—వసుచరిత్రము. ౫-౧౨౪

౨. రెండవ యుద్ధము—రామరాజు కల్యాణ దుర్గము నాదిల్షా వశముచేసి విద్యానగరికి వెళ్ళెను. తన కత్యంతము ప్రీతిఁగూర్చు కల్యాణపురముసు గోల్కొండవలసివచ్చినందులకు నిజాంషా కడువిచారమునొంది, మరల దానినెట్లైన స్వాధీనము గావించుకొనుతమకమున, గోల్కొండనవాబుతో మైత్రిసల్పి యావజీరుని తోడ్పాటున నానగరము ముట్టడించెను. ఈ యుదంతముఁగూర్చి దత్తపుత్త్రుఁడగునాదిల్షా తనపెంపుడు తండ్రియైన రామరాజునకుఁ దెల్పుచు, నాతని సాయ మర్థించెను. అందులకు రామరాజు సమ్మతించి యేఁబది వేల యాశ్వికదళముతోడను, విస్తారమగు పదాతివర్గముతోడను, కుమారునకు వెన్నాసయై నిల్చెను. ఉభయ సేనలకును గల్యాణనగరసమీపమునఁ బోరుపొసఁగెను. రామరాజు పరిపంథివీరులనెల్ల నుగ్గాడఁజొచ్చెను.

ఉ॥ రామమహీశ్వరుండు రణరంగమునందు నిజాముసేనలన్
భీమపరాక్రమున్బరఁబీచమణంపఁగ నాటికెన్నుచున్
రామగుణంబుచందమిదిరా యితఁడాతఁడెయౌ వటంచు నా
తామరసోద్భవోద్భవుఁడు తాళములొత్తును బాట్యమాడుచున్.

—రామరాజీయము.

ఇనుముఁగూడినయగ్గి సమ్మెటపెట్లకుఁబాల్పడినట్లు నిజాంషాతోఁజేరిన గోల్కొండ కుతుబ్షాయును విద్యా-పుర వీరయోధుల తీవ్రతమాఘాతములకు గుఱికాక తీఱలేదు. 'గోలకొండవజీర్ల కోటులకాయముల్ చించు నేరాజేంద్రు చేతికత్తి' అని రామరాజీయమును 'కుతుపసా నిజామాదికులతపతులఁ జెండె దోర్గర్వఖర్వితాఖండ-లుండు' అని నరపతివిజయమును దెల్పుచున్నవి.

మఱియు——

సీ॥ ఎదలపైఁబొదలు ప♦య్యెదలు జాఱఁగఁ బాఱు
బిబ్బీలకు ముసుంగు♦లబ్బఁజేసె
ఘనభేరికాధ్వను♦ల్విని గుండియలువ్రీల
వ్రాలు మల్కాలకు గో♦రీలు సేసె
నుడుగనివిభ్రాంతిఁ♦దడఁగాళ్ళువడనిల్చు
ఖానులు డాఁగ జీఁ♦కటులు సేసె;
గడలేని కాందిశీ♦కత నేఁగు దమకుర్వి
జడధులెల్లను గాలి♦నడలు సేసె

తే॥ ననుచు శిరములఁ దాల్తు రె♦వ్వనిసమగ్ర
సైన్య ధూతధూళిఁ జకితులై ♦చను సపాద
కుతుపశాహి నిజామాది♦కులతపతు ల
తండు నృపమాత్రుఁడే రామ♦ధరణివిభుఁడు.

ఉ॥ హారిశౌర్యుండగు రామభూవిభుని తీ♦వ్రాటోపవద్వాహినీ
శరవేగంబున నాత్మమూలబలము♦జ్జాఱన్ దళాడంబరం
బరుగం గొమ్మలుపోవ లావరి నిజా♦మాదుల్వజీరుల్భుజిం
తురు సమ్రిత్వముఁ గానలో మసలిమా♦నుల్గా వితర్కింపఁగన్.

—వసుచరిత్రము ౧-౪౫;౪౬

ఈ యఖండ పరాక్రమధాటికి నిలువనోపక యాగండకత్తెరనుండి తలఁగుట కేదిమార్గము దైవమా యని దిక్కులు సూచుచుండు, గోల్కొండమిత్రుని వాలకములోని కీలకము నెఱుంగుటచేఁ గాఁబోలు నాతని రణక్షేత్రముననే జాఱవిడిచి, నిజాంషా పాఱిపోయి యహమద్నగరమున దాఁగుకొనెను.

మ॥ కలిమి న్వేంకటరాయశౌరి నెదురం గాలేక యశ్వాహితం
బదరన్ గౌతమి దాఁటువేళ నిజకాంతాశ్రుప్రవాహోత్థిఁ గా
ల్నడదప్పన్ జడుఁడై విజానుఁ దుడుపాలంబంబునన్ దాఁటి యొ
క్కెడఁ గన్న స్ఫురియించు నయ్యుడుపరేఖ న్నామమోహంబునన్.

—వసుచరిత్రము ౧-౪౨

కుక్కతోఁక పట్టుకొని గోదావరి యీఁద బూనుట వెఱ్ఱితనముగదా? ఇఁక గోల్కొండనవాబు రక్షణమునకు గత్యంతరము లేకపోయెను. ఆతఁ డుపాయాంతరముఁగానక, ఘనపురమును పానుగల్లుదుర్గమును రామరాజునకొసంగి, యాతనినుండి ప్రాణదానము గొనెను.

3. నగర విధ్వంసము—గోల్కొండ విజాపుర విద్యానగరప్రభువు లేకీభవించి, యహమద్నగరముపైఁ బడిరి. అహమ్మద్నగరవిభుఁడు వీరక్షేత్రమునఁ దన్ను విడిచివెళ్ళెననుకోపము గోల్కొండవజీరునకు హెచ్చె. అందునను రామరాజాదుల మనఃప్రీతికై పాటుపడవలసిన విధియు నొకటి. ఇందుచేఁ గుతుబ్షా యుద్రిక్త హృదయుఁడై తాఁజెడినకోఁతి వనమెల్లఁ జెడిచెనన్నట్లు నగర

విధ్వంసక కార్యమున నినుమడిగఁ దోడ్పడెను. తన లేఖకు నీచోక్తులతోఁ బ్రత్యుత్తరమిచ్చియుఁ దన రాయబారినిఁ బరిభవించి తఱిమియుఁ జేసినయుపచారమునకును, దానుజయించిన నగరమును మరల నాక్రమించిన మదాంధతకును, నిజాంషాకుఁ జక్కని ప్రతీకారము గావింపవలెనను మాత్సర్య మాదిల్షా కగ్గలము. ఈకారణములచే నీవజీరు లిరువురును దమవిస్తారబలములఁగొని, కేవలము సాహాయ్యమాత్రుఁడైన రామరాజుతో నహామ్మద్నగరముఁజొచ్చి, స్వమతాభిమానలేశమును లేక, దానిఁ బరిపూర్ణముగఁ బాడొనర్చిరి. ఈ వినాశకర ప్రయత్నమున విద్యానగర సేనలును జాలనఱకుఁ దోడ్పడినను, గోల్కొండ విజాపుర రాష్ట్రవాహినులపారముగ నుండినందునఁ బగసాధించుతలంపున నవియే విశేషముగ విక్రమించినవి; రామరాజు సర్వసేనలకు నధినాయకుఁడయి యుండుటచేఁ గాఁబోలు, నీయుద్ధమును గూర్చి వర్ణించిన ఫెరిస్తా దోషమంతయు రామరాజునకే యంటఁగట్టుచు, 'నగరమును గాల్చుటయందును సౌధములు గూల్చుటయందును భటులు వారి సంపూర్ణ శక్తిని వినియోగించిరి. మసీదులు గుఱ్ఱపుశాలలుగను దేవసదనములుగను మాఱినవి. రామరాజు కనఁబఱిచినచర్య మిగులదుస్సహమైనది.' అని నుడివెను.

ఈకలనిలో రామరాజుకుమారులగు పెద్దతిమ్మరాజును కొండరాజును గూడ దండితోనుండి, తమ

శౌర్యోద్ధతినిఁ బ్రకటించినట్లు, నరపతివిజయము తెల్పుచున్నది.

ఉ॥ ధ్యేయుఁడు రామరాజ పెద♦తిమ్మ విభుం డని వాజిదోల లోఁ
బాయని భీతిచేత మొన♦భగ్నము గా యవనుల్ దొలంగ నా
చాయ నిజాముఁ డడ్డుపడ♦సామజయూథముఁ ద్రుంచెఁ జూపఱుల్
వాయజాఁడంచు నెంచఁగ న♦వార్య సముజ్జ్వల బాహుశౌర్యుఁడై.

ఉ॥ మావుల నేనుఁగుల్ భటస♦మాజము పీనుఁగుపెంటగాఁగ గం
గావలినుండి కృష్ణదను♦కం బొనరించి నిజాముఁద్రోలి రా
మావనినాథు కొండవిభుఁ♦డాహవకేళిఁ జరించెఁ జూచి యా
దేవత లెల్ల నీఘనుఁడు♦దేవవరాత్మజుఁ డంచు మెచ్చఁగాన్.

—ప. ౨౯౯; ౩౦౨.

౪. అభయప్రదానము—తన సేనలన్నియు సమరాంగణమున మ్రగ్గుటచేతను, నహమ్మద్నగరము వినాశమై శత్రువుల చేఁబడుటవలనను, నిజాంషా గర్వక్రోధములను గల్యాణపురాకాంక్షయును వదలి, యుసురులు దక్కినఁ జాలుననితలఁచి, ప్రాణదౌర్బల్యమునకై విద్యానగరప్రభుని పాదములఁబడెను. అంత నాచక్రవర్తి సుల్తానున కభయప్రదానముతో నహమదాబాదు నగరముఁగూడ నిచ్చివైచెను. నరసభూపాలీయము నందలి క్రింది చరణముఁ గనుఁడు.

‘శరణన్న మల్కనిజామున కభయంబొసంగి తదీయ రాజ్యంబునిలిపె’

౫. రామరాజు సలక్ష్యభావము—తలఁచుకొన్న ప్రతికార్యమునను రామరాజున కద్భుతఫలితమే కన్పట్టఁ జొచ్చెను. జయపరంపర లాతనియడుగుజాడలకు దాస్య

మొనరింపఁబూనినవి; కానసే యెటుచూచిన నావీరుని కత్తికెదురుతేకయ్యెను. ముసల్మాను లాతీవ్రశాసనుని యాజ్ఞ లేవేళఁ బాలింప హస్తబద్ధులయి నిరీక్షించుచుండురు. వారి రాజ్యభాగములకుఁ జెందిన పట్టణముల నొక్కొక్కటిగ నిర్భయముగ నాతఁడాక్రమింపఁదివిరెను. తురుష్క నాయకు లనినను వారిసుల్తానులనినను నా ప్రభుఁడు గణనసేయుటలేదు. ఈయలక్ష్యభావ మాతని శత్రుపక్షమువారికేకాక మిత్రవరమువారికిఁగూడ దుస్సహమయినది. ఈ రాజేంద్రుని మదోద్రేకమును గూర్చి మహమ్మదీయచరిత్రకారుఁడగు ఫెరిస్తా యిట్లు వాక్రుచ్చుచున్నాఁడు. 'జయపరంపరలచే నాతనిగర్వము మిన్నంటెను. ఇస్లాముసుల్తాను లా ప్రభునికంటెకి తుచ్ఛులు. వారి రాయబారులను మన్నించుట లేదు. ఆస్థాన మంటపప్రవేశ మొనర్చినపుడు వారినిఁ గూర్చుండుఁడని చెప్పుటకైన నారాజు శ్రమనొందఁడు. అతని మ్రోల నిల్చియే యుండవలెను. వారు తనతో వెళ్ళునపుడు తానాజ్ఞాపించుదనుక గుఱ్ఱమెక్కఁగూడదు. ఇది యాతనిశాసనము.'

# పందొమ్మిదవ ప్రకరణము.

---

## తల్లికోటయుద్ధము.

### 11. సుల్తాను లేకీభవించుట.

గతప్రకరణాంతమునఁ దెల్పినవిషయములే తల్లికోటమహాసంగ్రామారంగమునకు దారితీసినవి. విద్యానగర చక్రవర్తి దత్తపుత్త్రుఁడే కలహబీజమునకుఁ బాదొనర్చిన ఘనుఁడు. విద్యానగరరాజ్యమున రామరాజుపక్షముల చాటునఁ బెక్కెండ్లు పెరిఁగి, యాతనివలనఁ బ్రాణరక్షణమును గోల్కొండపీఠాభిషేకమును బొందిన, స్వయం దత్తుఁడగు మల్కిభరాముఁ డందులకుఁ జోద్రి వేసి, చక్కనిజలాధారముఁ గల్పించిన మహాసీయుఁడు. ఇఁక రాయనిశత్రుకోటికిఁ జెందిన బరీదునిజాంషాలు బీజరక్షణమునకై సుభద్రమగు కంచె నిర్మించిరనినచో నాశ్చర్యమేమి? తొలుత నాదిల్ షాయొకఁడే యెవ్వరిసాయమును గొనక రామరాజును దెగటార్ప సంకల్పించి, తన యమాత్య దండనాథులతో నాలోచించెను; కాని రామరాజు, భుజబలస్ఫూర్తిచేఁ దురుష్కనృపకుంజరములకు సింహస్వప్నమని చక్కఁగ గ్రహించినవారగుట, నాదిల్ షానచివాగ్రేసరు లాపీరుని నొక్కొక్కరుగ నిరోధించి గెలుచుట స్వప్నగత వృత్తమనియు, వజీరు లందఱు నేకీభవింపనియెడల రాయనిబలదర్పము దవా-

నలనట్లు ప్రారంభశీలుని జుట్టుముట్టి సమూలముగ దహిం-
చివేయుననియు హితముబోధించిరి. అదిల్ షా మన్మ-
జుఁడగుటచే మంత్రుల హితోపదేశమునందలి సత్యము
గ్రహించి, తొలుత సమర్థుఁడగు రాయబారిమూలమున
గోల్కొండసుల్తానునకుఁ దననిశ్చయము నెఱింగించుచు,
నాతని యభిమతముఁ దెలుపఁగోరెను. గోల్కొండ
నవాబగు నిబ్రహీంకుతుబ్ షా బీజపూరువజీరుని యుద్య-
మమునకుఁ దన పరిపూర్ణామోదముఁ గనఁబఱచుట
తోడనే తనియక, యాదిల్ షాకును నాతనిబద్ధవిద్వేషి
యగు నిజాంషాకును గాఢమగుమైత్రినిగూడఁ గల్గించెను.
బెడందకోటనవాబు, తిరుమలరాయ వేంకటాద్రులవలన
సివటకు దెబ్బతిన్నవాఁడగుటచే నాసుల్తానులతో సుఖ-
వుగ నేకీభవించెను. ఇట్లు మునల్మానుదొరలు నలువురు
నొక్కటియై యేవిధముననైన విద్యానగర సామ్రాజ్య-
మును రాజధానిని తదీయచక్రవర్తులను భగ్నమునొందింప
సుస్థిరసంకల్పులై యందులకు వలయు వ్యూహములఁ
గూర్చి యోజింపఁదొడఁగిరి.

12. ఘటన.

అలీయాదిల్ షా రామరాజునెడఁ గపటంపుఁ బిత్రు
భక్తిఁగనఁబఱచుచు, నాతనివిరోధులగు నిజామాదులకు
విద్యానగరసామ్రాజ్య మర్మముల నెఱింగించుచు, నా
రాజ్యముహరింపకున్న మనకుముక్తి లేదని చేయెత్తిచెప్పి
తోడివారలఁ బ్రోత్సహించుచు, 'నాసలుబత్తుఁడు నోరు

తోడే' లన్నటుల వర్తింపఁ జొచ్చెను. ఈ సుల్తానులలో ముఖ్యముగ నిజామును నాదిల్‌షాయును నీవఱకుఁ దమలో గాఢముగఁ బాదుకొనియున్న విద్వేషము మఱచి, యన్యోన్యమైత్రిని దృఢపఱచుకొనుటకయి, యొండొరులు సంబంధబాంధవ్యముఁ గల్గించుకొనిరి. అలీయాదిల్షా నిజాముపుత్రికయగు చాంద్‌బీబీని వివాహమాడి షోలాపురదుర్గము శరణముగఁగొనెను. నిజాము జ్యేష్ఠపుత్త్రుఁడగు మూర్తిజాయనువానికి నాదిల్‌షా తనచెల్లెలి నిచ్చి పెండ్లిచేసెను. రామరాజీవిషయములను సూచనగ గ్రహించి, 'మనము పితృపుత్త్రభావమున నున్నాము. నేనింతదనుక నీకెంతయో సాయ మొనరించినాఁడను. నీకొఱకై నిజాముతో రెండుపర్యాయములుపోరి, కల్యాణపురము సాధించియిచ్చితిని. నీవిపుడు తక్కినవారితోఁ జేరి యుద్ధప్రయత్నములొనర్చుచు నాయెడఁ గృతఘ్నుఁడవై ప్రవర్తింతువేమి. అది న్యాయముకాదుసుమీ' అని వ్రాసిపంపెను. అందుల కాదిల్‌షా 'నాకుమీరు సల్పిన మహోపకృతి చిరస్మరణీయమైనది. దాని నేనేమఱియుండలేదు. ప్రకృతము నేను వారితోఁగలసి యున్నట్లు నటించుచున్నాను. ఈనటన వారిగుట్టు కనిపెట్టునిమిత్తము. ఇదంతయు మీకొఱకేకదా? సమయమువచ్చినవెంటనే మీ పక్షము నవలంబించి మీకే సాయముచేసెదను. మీ కుమారుఁడనయియుండి నేను తండ్రికిద్రోహము చేయుదునే?' యని ప్రత్యుత్తర

మంచెను. ఆదిల్ షా మొదటినుండి చివరదాఁక నిట్లే మేఁకవన్నెపులియై రామరాజును వంచించెను. తరువాతఁ గూడ రామరా జాదిల్ షావర్తనమునుగూర్చి యను-మానింపలేదు.

## 13. సమరసన్నాహము.

అంతరంగిక కార్యకలాపము లన్నియు ముగిసిన తోడనే వజీరులు నలువురును దమకుఁగల సమస్త సేనల-తోవచ్చి, విజాపురమునకు వెలుపల నావఱకే సంసిద్ధ మొనర్పఁబడియున్న, విశాలమైన బయలులోఁగూడిరి. అనంతర మాదిల్ షా పూర్వులనుండి హరించిన రాయ-చూరు ముద్గల్లు దుర్గములను వెంటనే తనవశముచేయ వలసినదని రామరాజునకు వర్తమాన మంపుటతోఁ గల-హమున కంకురార్పణముఁ గావించెను. రామరాజున కప్పుడు మోసము బయలుపడినది. 'ఆదిల్ షా యింతటి క్షుద్రవర్తనుఁడని మొదట నేనుతలంపలేదు. ఆతఁడు గుడి-లో నుండి గుడిత్రాళ్ళు కోయుటకే యత్నించెను. ఒకరి నాడఁబనిలేదు. లోపము నాయందేకలదు. గోహంత-కునిఁ జేరఁదీసి కుమారునట్లాదరించుటచే, నన్నుగట్టుకొను-టకు త్రాళ్ళు నేనై తెచ్చికొనిన ట్లైనది' అని చింతించి, యాదిల్ షా కనఁబఱిచిన ద్రోహవర్తనమున కెంతయును రోషపరవశాక్రాంతస్వాంతుఁడై, యావార్తఁ గొని వచ్చిన విజాపుర రాయబారినిఁ బరాభవించి, భటులచేఁ దఱుముఁగొట్టించెను. ఇదియే కయ్యమునకుఁ దగిన

కారణమని శత్రుపక్షమువారెంచిరి. తదుపరి వజీరులు నలువురును మహాకూపార కల్లోలజాలములఁబోలిన వాహినీసందోహములతో ౧౫౬౫వ సంవత్సరము జనవరి నెల ౨౫వ తేది దక్షిణాభిముఖముగ బయలువెడలి తల్లికోటదుర్గసమీపమున విడిసిరి. ఈదుర్గము కృష్ణాతరంగిణికుత్తరమున, కృష్ణా ద్రోణాసంగమస్థలమున కాలు కోసులదూరమున, దోణానదీతటమునఁ గలదు. అది గజాశ్వాది జంతుసంతతి గ్రాసవాసముల కెంతయు ననువగు సమవిశాల శాద్వలప్రదేశమధ్యమున నున్నది. ఆ రంగము తనరాజ్యమునకుఁజెందిన దగుటచే, నాదిల్షా యందు మిత్రవర్గమునకును వారిసేనలకును నన్నివిధములగు ననుకూలవసతుల నేర్పఱిచి, తననెయ్యుర బహుభంగుల సత్కరించుచు, వారల యత్యధికప్రీతికిఁ బాత్రుఁడయ్యెను. నిజామాదులు నదినిదాఁటుటకు వీలగు మార్గముల నన్వేషించుటకై సమర్థులగు భటులను నియోగించి, యుద్ధరచనానుకూలపథములఁ గూర్చి యాలోచింపఁజొచ్చిరి.

### 14. నదీతరణము.

రామరాజది తెలిసికొని మహమ్మదీయులు నది దాఁటిరాకుండ వారినావలి భాగముననే యాఁపుటకై యిరువదివేలయాశ్వికులను, లక్షకాల్బురను, నెదువందల గజబలమును దోడిచ్చి, తిరుమలరాయనిఁ బంపెను. అతనివెనువెంటనే మఱియొకమహాసేనతో వేంకటాద్రినని

చెను. చివరఁదాను స్వయముగ విద్యానగరమున నిలువ యున్న సమస్త సైన్యమునుగొని శత్రువులు నంతుపడిసి- యున్న శిబిరమునకెదురుగ వెడలెను. ఈ సైన్యమంతయు మొత్తమున నేఁబదిలక్షలు. అందాఱులక్షలు పదాతివ- ర్గము నొకలక్ష యాశ్వికదళమును. తురుష్కులకడిది కెదురుగ, వారు నదిని సులభముగదాఁట నుద్దేశించు- కొనియున్నచోట, మార్గమున కడ్డముగ హిందువు లొకగోడనుగట్టుట కుపక్రమించిరి. మహమ్మదీయులది తెలిసి, నదిని వేఱొకభాగమునదాఁటఁ బ్రయత్నించుచు- న్నట్లు నటించిరి. ఒకవంక వేంకటాద్రిరాయఁడును, మఱొకప్రక్క తిరుమలదేవరాయఁడును, తురుష్కులు నదిదాఁటిరాకుండ వారుపోవుచున్నభాగములందెల్ల నది కీవలినెపునఁ జక్కఁగలబలగముతో నరుగుచు వారి నవ- రోధించుచుండిరి. ముసలిమానులు తమపటజాలముఁ- బ్రయోగించి యుద్ధముచేసెన విద్యానగరవీరులయడ్డుఁ దొలఁగించుకొను నుత్కంఠచే నీవలావలఁ గనురభసమున దాట్లువేయఁజొచ్చిరి. ఇట్లు మహమ్మదీయులు వేయునంజి- యలకు హిందువులు మోసపోయి, నదీసంరక్షణార్థమై తమ సైన్యమును భాగభాగములుగవిభజించి, నదికిదక్షిణపు టొడ్డునఁగల రేవులయందెల్ల నాసేనాభాగములనుంచిరి. హైందవసైన్య మీచందమున శాఖోపశాఖలుగఁ జీలి నదీమార్గముల నన్నింటినరికట్టి వానిఁబరిరక్షింపఁదివురుట చూచి, ముసల్మాను లదియు మంచికొఱకేయని తలంచి

తమశిబిరమునకుఁబోయి, మూఁడుదినములవఱకు నూర కుండిరి. నాలవనాఁడు వారుమరల నదీతటమునఁ బోడ-వునను నడచుచు, నందొక రేవును సంరక్షించుచున్న సై-న్యమును వేఱొకతావునకుఁ గదలునట్లుచేసి, చిటికలో వెనుకమరలి యందఱొక్కూడుకున హఠాత్తుగ నదిని దాఁటిరి.

## 15. సంకులసమరము.

౧ హిందువులయు దేశికము—౧౫౬౫వ సంవత్సర-ము జనవరినెల ౨౩వ తేది హిందూమహమ్మదీయులు తలపడిరి. ఈభయంకరప్రవిదారుణము తల్లికోటకు సమీపమున సంభవించుటచే నిది 'తల్లికోటయుద్ధ' మనఁ బ్రసిద్ధినొందెను. దక్షిణహిందూదేశచరిత్ర స-మరప్రపంచమందెల్ల నీయుద్ధము చాలఁ బ్రాముఖ్యముఁ గన్నది. ఉభయ పక్షములవారును దమకుఁగల సర్వ సైన్యములతో, సంగ్రామభూమి నలంకరించిరి. హిం-దువుల సైన్యమంతయు మూఁడు మహాభాగములుగ నొనర్పఁ బడియుండెను. సోదరులు ముప్వురు వానికి నాయకత్వము వహించిరి. రామరాజు తొంబదియా-ఱేండ్లుచెల్లిన వృద్ధుఁడయ్యు, రణక్షేత్రమునఁగల మధ్య రంగమునందలి సేనకధినాయకుఁడై, ముప్పదియేండ్ల యు-వకునివలెఁ దన సైన్యమును గడుఁజుఱుకుమెయిఁ గ్రమప-థమున నడపఁజొచ్చెను. ప్రథమసోదరుఁడగు తిరుమ-లరాయఁ డగ్రజునకుఁ గుడివైపునను రెండవతమ్ముఁడగు

వేంకటాద్రి వామపార్శ్వముననను, దమతమవాహినులతో మహమ్మదీయ సేనకెదుట నుత్తరాభిముఖులై నిల్చియుండిరి. అందు వేంకటాద్రియాదిల్ఖాను రామరాజు నిజాంషాను దిరుమలరాయఁడు బరీదు కుతుబ్షాలను బ్రతిఘటించి, సమరోద్యోగులయి యుండిరి. రామ-రాజుదళమున కెదురుగ మహమ్మదీయయోధు లాఱువందలశతఘ్నుల నుంచుకొని, శత్రువులు తమపైఁబడుట తడవుగ వారలపై వానిఁ బ్రేల్చుటకు నిరీక్షించియుండిరి. నాయకు లాఫిరంగులను మూఁడు బారులుగఁదీర్చి, యా వరుసలకుముందు పెద్ద పెద్ద తుపాకులను బ్రక్కలలోఁ జిన్నతుపాకులను బెక్కింటిని మందుచే నింపియుంచిరి. ఆవరుసలకు ముందు రెండువేలసంఖ్యగల విలుకాండ్రు ప్రతిష్ఠితులయి యుండినందున నీతంత్రము శత్రుపక్షము వారికిఁ దెలిసినదికాదు. హైందవసేన విజృంభించి, మధ్యరంగముననున్న విలుకాండ్రపైఁ బడెను. వెంట-నే రెండువేలసంఖ్యగల యోధనుర్ధారులు మాయా విగ్రహములట్లు మఱుగుపడిరి. ఉత్తరక్షణమే శతఘ్ను-లుప్రేలినవి. హైందవవీరవర్గ మగ్నిగోళప్రవర్ష సమాక్రాంతమయ్యెను. వందలకొలఁది శూరు లగ్గినుఱికిన శలభములక్రియ ననిమొన మ్రగ్గుటచేఁ దదితరులు కాందిశీకతఁ బఱచిరి; కాని యారంగమునకుఁ గుడి యెడమ పార్శ్వముల సుపర్ణవిక్రమ సదృశబలులగు తిరుమల వేంకటాద్రులు యవనుల సంగ్రామవిడంబము-

ను సరకుగానక తను తమ మగంటిమిమెఱయఁ బ్రతిపక్షులతో జయసిద్ధిగఁ బోరుచు, ముసలిమానువీరులు తెగఁబాఱునట్లు విజృంభించిరి. ధైర్యమందాద్రియగు వేంకటాద్రి సమరక్షోణినిహిమాద్రివోలె నిలిచి. ప్రక-టించిన కౌక్షేయక కౌశలమత్యనుపమ మైనది.

మ. ప్రతికూలాద్రి నిర్భిద్వ భేదన కళాపారీణమై సంగర
క్షితిలో వేంకటరాజశేఖరుని కౌక్షేయంబు కృష్ణాధిక
స్ఫూర్తిఁ జెన్నొందఁ దదీయ ధారఁబడి శాత్రవోపాకరుల్యావన
క్షితులన్ గాంచిరి నాకలోకవనితా శృంగార సాంగత్యముల్
—నరసభూపాలీయము ౧- ౨౬

ఆవీరుఁడు తన కభిముఖముగనున్న సేనఁజొచ్చి, యందలి సైనికావళి శిరపరంపరలఁ బూలమొగ్గలనువలెఁ జెండుచు, నాతురుష్కవీరకోటిని బరిపూర్ణముగఁ బరా-జయమొందించెను.

సీ. కందుకక్రీడగాఁ గదనరంగస్థలిఁ
గడువడిరుల మస్తకములఁ దునిమి
వారులనుబోరిఁ గొని కరులను దునిమి త
దారోహకులఁ ద్రుంచి వీరభట వి
దళనంబుఁ జేసి దుర్భర పతాకలఁ గూల్పఁ
గనుఁగొని కాందిశీకత వహించి
వీడుపట్టను బాసి విడిచి నిజాము సే
దులఖాను కుతుబుషాహుల దళంబు

తే. విచ్చి వెన్నిచ్చి కనుఁగొని యిచ్చఁబలికి
మెచ్చఁ దెచ్చిన వధయంబు నిచ్చి విజయ

కాహళులుమ్రోయ నియమించె ♦ సమ్మౌజనంబు
లభినుతులొనర్పఁగా వేంక ♦ టాద్రిరాజు

—నరపతివిజయము ప. ౨౬౫

పార్శ్వభాగములం దిటు లతిరణోత్సాహమున వీరరసవిలసితముగఁబోరుచు, యోధవరులుపొందుచున్న విజయాటోపమునుగని, నడిమిసేనలు మరలఁగూడి యుత్సాహాతిశయమున బిట్టుగనార్చుచు శత్రుఘ్నులనెదిర్చి, మార్తుఱ నిచ్చకొలఁదిఁ గసిమసఁగఁజొచ్చెను. ముసల్మానులు శాత్రవవాహినిపై ఫిరంగిగములఁ బుంఖానుపుంఖములుగఁబఱపఁ దొరఁకొనిరి. ఆతీక్ష్ణాగ్నిగోళపతన కారణమున నొక్కొక్కపెట్టున నైదువేలసంఖ్యగలసైన్యమువంతున శోణితముఁగ్రక్కుచు, హైందవదళము నేలఁగూలుచుండెను. ఒకవంక ఫిరంగులుపేలుచుండ, మఱొకవైపునుండి తురుష్కులయాశ్వికదళము తమ ఫిరంగులతో మధ్యసేనఁజొచ్చి, హిందూసైన్యముఁద్రోసికొనుచు రామరాజున్నశిబిరమువంక దారితీయఁదొడఁగెను. విద్యానగరయోధులు పిఱుదివియక ప్రాణములపై నాసఁగొనక రౌద్రోద్రేకముతో భీషణసింహనాదములు సల్పుచుఁ దుఱకమూఁకపైనుఱికి, యావీరనికాయముఁ జెఱకుగడల తెఱంగునఁ జెండుచుండిరి. విజయలక్ష్మి విద్యానగరవీరులపై సమ్మోహనదృష్టులఁబఱపసాగెను.

౨. తురుష్కులవిజయము—రామరా జాతఱిఁ బల్లకిలోఁగూర్చుండి తనసేవలను హెచ్చరికసేయుఁ

పరిశీలించుచు, నందలియోధాగ్రేసరులకు మఱింతయుత్సాహముఁగొల్పుటకై పల్లకినుండిడిగ్గి, మణులతోడను ముత్యాలజాలరులవలనను నలంకరింపఁబడియున్న స్వర్ణసింహాసనమున నాసీనుఁడయి, యంతవఱకు ననిలో నకుంఠితవిక్రమముచూపిన వీరవతంసములకు ధనరాసులను గనకాంబరములను మణులను స్వర్ణభూషణావళులను భారితోషికముగనొసఁగి, ప్రక్కలకుఁ దొలఁగుచున్న భటులలో వీరరసము వెలయించి, క్రమ్మఱఁ బల్లకిలో బయలువెడలెను. ఆయదనున ముసల్మానుల యాశ్వికబల మాతనిఁదారసించినది. అంత విద్యానగర వీరుల యభాగ్యవశమున నరాతిసేనలోని యతిదారుణమగు క్రుద్ధమదకుంజర మొక్కటి ఘూర్ణిల్లుచు, భయంకరముగ ఘీంకృతులువైచుచు, నత్యంతరభసమునఁ బరిపంథివాహినిఁజొచ్చి కలంచుచు, హఠాత్తుగ రామరాజుపల్లకిని మోయుచున్న బోయీలనుద్రోసికొనుచు వచ్చెను. అందువలన బోయీలుభయపడి పల్లకినిదిగవిడిచి పరువిడిరి. రామరాజు సంసిద్ధమయియున్న యొక తురంగము నారోహించుచున్నట్టే తురుష్కులగుఱ్ఱపు రౌతు లాతనిఁగొనిపోయి, నిజామునెదుటఁ బెట్టిరి. ఱాలరువ్వినవారినిఁ బూలరువ్వరన్నట్టుగ నామహమ్మదీయనృపుఁడు తననిశితఖడ్గమున రామరాజుశిరము నొక్క త్రుటిలోఁదుండించి, పొడవైనబల్లెమునకు దానిఁగ్రుచ్చి యెత్తి, హైందవసేన కభిముఖముగనుంచెను. విద్యా

నగరవీరులు రామరాజు శిరఃఖండముపై నచంచలముగు దృష్టులునిగుడ్చుచు చిత్రప్రతిమలవోలె క్షణకాలము స్తంభించిపోయి విభునకుఁగల్గిన ఘోరవిపత్తునకై యత్యంత భయవిషాదవిస్మయావిష్టచేతస్కులై యిఁక నచ్చోట నిలువనేరక చెట్టుగట్లపాలుగఁ బరుగువాఱఁజొచ్చిరి. ఇట్లుచెల్లచెదరై చనుచున్న సైన్యమును దురుష్కులు వెన్నంటి వెంపెరలాడిరి. మొత్తమునలక్షసైన్యముకూలెను. కృష్ణానదీ వినిర్మలవారిపూరము విద్యానగరసైనికనికాయకాయవినిస్స్రుత రుధిరధారా సమాకీర్ణమయ్యెను.

3. ప్రభువులుపరుగిడుట—ఈవిషాదకరసంఘటనము సంభవించినపిమ్మట మఱొక్కమాఱు సేనలను సమకూర్చి తుఱకమూఁకపైఁబడుటకుఁగాని, నగరమును సంరక్షించుటకుఁగాని, యెవ్వరును బ్రయత్నింపలేదు. వేంకటాద్రికూడ నావఱకే సమరాంగణమున వీరశయనమునందియుండెను. జీవముతోనుండినది యొక్క తిరుమలరాయఁడుమాత్రమే. ఆతఁడు నమ్మహాపద్రవ స్థితినిఁగాంచి గుండెచెదరువగుడు, నటఁదామసింపనేరక, విద్యానగరమునకు హాళాహాళింజని, యందుఁబ్రతిమా కృతినున్న సదాశివరాయని వెంటఁగొని, ౫౫౦ గజముల పైఁ బదికోట్లకుమించినవిలువగల బంగారమును వజ్రములను మణులను వేసికొని, సామ్రాజ్యధ్వజమును—నమూల్యరత్నఖచితకనకాసనమును గైకొని, కతిపయానుచరులతో వెడలి, పెనుగొండఁజేరెను.

౮. నగరవినాశము — ఆహవరంగమున నోడిన సైనికులును సేనాధిపతులును విద్యానగరమునకుఁబోయి యందుఁ దమభార్యాపుత్త్రులను వీలగునంతవఱకుధనధాన్యాదులను గైకొని, పట్టణమువిడిచిపాఱిపోయిరి. రాజులును దండనాధిపతులును రక్షకభటులును నిట్లు తొలఁగుటచే, విద్యానగరసంరక్షణమునకు గత్యంతరమే లేకపోయెను. ప్రజలు నిరాధారులైరి. స్వప్నమందైనఁ దలంపనిచందమున మిన్నువిఱిఁగిమీఁదఁబడుటచే, విద్యానగరపౌరబృందము చిందఱవందఱయై, నగరమునకు దాపరింపనుండు ఘోరవిపత్తుఁదలంచుకొని, యానిర్వేదమున నొక్కటియుఁదోఁపమి, స్వసంరక్షణ ప్రయత్నమును గూర్చి తలపోయనేలేదు. వాహన శకటాదు లన్నియు రణావనిలో విచ్ఛిన్నమగుటవలన, ధనాఢ్యులగువారు తమద్రవ్యము స్థానాంతరమునకు సాగించుకొనిపోవ నసమర్థులై, దానినందేవిడిచి ప్రాణభయమునఁ బఱచిరి. నగరపరిసర పర్వతప్రాంతవాసులగు నారణ్యకజను లీతఱిఁగని మఱుసటిదినమే విద్యానగరముఁజొచ్చి, దానినిఁ గొల్లఁగొనిరి. అనంతరము చుట్టుప్రక్కలనున్న జానపదులుదోఁచిరి. జయోపేతులగు మహమ్మదీయులు కొంతకాలము సమరస్థలిని విశ్రాంతిఁగొని, పిమ్మట మూఁడుదినములకు నగరప్రవేశమొనర్చిరి. అదిమొదలైదునెలలకాల మానగరికి విరతిలేకపోయెను. తురుష్కులు క్రూరులై నిరాయుధులును నిరపరాధులునునగు

నందలి జనులను సదమదమొనరించి, నగరమందలి విగ్ర- హములను భగ్నపఱిచి, రాజమందిరములుగాల్చి, మేడలు గూల్చి, కోటగోడలనుఁ గుల్చి యారామములను విధ్వంస మొనర్చి, యగ్గితోడను కత్తులతోడను గడ్డపాఱలతోడను నానాచిత్రకృత్యములొనర్చి, నిరంతరప్రయత్నములచే నగరమును పాడఱఁజేసిరి. అనేకశతాబ్దములనుండి లో- కసమ్మోహనకరముగ నలంకృతమయి యుంద్రనగరమున కెనయనఁ జెలువారిన నగరికిఁ దుఱక లొక్కత్రుటిలో నెంతటిపాటు వాటిల్లఁజేసిరి? ఆదివ్యనగర మహాచిత్య- మును యవనవీరులు లవమైన గ్రహింపఁజాలకపోయిరే! ఔరా! తెడ్డునకుఁ బాకగుణము తెలియునా? ఒక్కొక తురుష్కభటుఁడు నందుండిన ధన మపరిమితముగఁ గొనిపోయి కోటీశ్వరుఁడయ్యెను. శేషించియున్న జనులు పుర మెడఁబాసిరి. అత్యల్పకాలముననే విద్యానగరము విజనస్థానమయ్యెను. 'అత్యుచ్ఛ్రియః పతనహేతుః' అనుపండితవాక్యము పొల్లుపోలేదు.

౫. శిథిలస్వరూపము — ఇదిజరిగిన రెండేండ్ల కనఁగా ౧౫౬౭వసంవత్సరమున 'రోసిజర్ ఫెడరిక్' అను నిటలీదేశపురాయబారి విద్యానగరమును సందర్శించి, సౌధములు నిర్మానుష్యములై వీథులు ఘోరవనసత్త్వ నిలయములై యున్నవని వ్రాసెను. అదిమొదలాపురము మరల నెప్పుడును దలయెత్తి నిలువలేదు. అయ్యది మహానగరమైనను, శత్రువులచే నట్లు సర్వనాశనమొన-

ర్పఁబడినదాదిగ, నరణ్యభూమియయ్యెను. ఇప్పు డది సంపూర్ణ శిథిలావస్థలో నున్నది; అయినను నందలి కొలభాగములు కొన్ని పూర్వుల శిల్పకళాకౌశలము వేయిచందములఁ జాటుచున్నవి. కొందఱు పంటకాఁపు లందందు భూసమమై పాడుపడిన వీథులకును దైవాలయములకును నడుమనున్న క్షేత్రభాగములను వ్యవసాయమున కుపయోగించుకొనుచున్నారు.

రమారమి మూఁడుశతాబ్దములకాలము, లోకమున నేమహానగరము నెఱుంగని యుత్కృష్ట సంపదలకెల్ల నిలయమై, ధనాఢ్యులతోడను వీరులతోడను నెంతటి ప్రాభవవైభవములచేతనో భాసిల్లుచు, నొకదిన మత్యున్నతస్థితిలోఁ బరమసౌభాగ్యగరిమ చేఁదనరిన మహానగరమమ్మఱునాఁడే శత్రువులచేఁజిక్కి, వర్ణనాతీతమై యెందును కనివినని ఘోరహత్యలకాకరమై, హఠాత్తుగ నీరూపమునమఱి, భయావహములగు నంతరములతోఁ బొల్చెనని ఘోషించెడు విషాదకరఘట్టము, ప్రపంచ చరిత్రమున నెచ్చటను గాన్పింపదు.

"Never perhaps in the history of the world has such havoc been wrought and wrought so suddenly on so splendid a city; seeming with a wealthy and industrious population in the full plenitude of prosperity one day and on the next

seized, pillaged and reduced to ruins amid scenes of savage massacre and horrors beggaring description."

—Sewell, Page 208.

ఆహా! ఎట్టినగరమున కేగతిపట్టెను? 'జాతస్య మరణంధ్రువమ్' అను నార్యోక్తి సార్థకముగదా?

— —

# ఇరువదవ ప్రకరణము.

---

పరిశిష్టము.

1 తిరుమలదేవరాయఁడు ౧౫౭౧—౧౫౭౭.

తల్లికోటయుద్ధమువలన రాజధానినాశనమయ్యెనే కాని, సామ్రాజ్యమంతరింపలేదు. ఆహవరంగమున నళియరామరాజసువులు గోల్పోయిన యనంతరము రామసేతువువఱకుఁగల సామ్రాజ్యమంతయుఁ దిరుమల రాయఁడు పరిపాలించుచు విద్వాంసులకుఁ గల్పకము వోలెనుండినట్లు వసుచరిత్ర నుడువుచున్నది.

క. ఆరామశౌరి పిమ్మట
ధీరామరశాఖి వీరతిరుమలరాయం
డారామసేతు హిమవ
త్కారామారమణుఁడై జగంబు ధరించెన్ ౧—౫౪

రామరాజునకుఁ దరువాత విద్యానగర సామ్రాజ్యమును బాలించినవారికిఁ గర్ణాటకప్రభువులని పేరు. తిరుమలరాయఁడు విద్యానగరము స్వాధీనము గావించుకొనుటకు మరలనొక్కపర్యాయము పూనెనుగాని యా ప్రయత్నము ఫలకారికాలేదు. అంతియకాక యది విజాపురము గోల్కొండరాజ్యములకు మిక్కిలి సమీపమున నుండుటచే మరలనావిద్యానగరమునే రాజధానిగఁ గానెనుపట్టుదలయుఁ దిరుమలరాయనిలో నంతలేవత్రి-

మముగ నుండియుండదు. ఆతఁడు సదాశివరాయనితోఁ బెనుగొండకు వెళ్ళి, యందు సంస్థానకార్యములు సాగింపఁ జొచ్చెను. తల్లికోటయుద్ధమునకుఁ బిమ్మట తిరుమల రాయఁడు పెనుగొండకు వెళ్ళలేదనియు, విద్యానగరము నుండి సమస్తసంపదలతోడఁ దిరుపతికిఁబోయెననియుఁ బెనుగొండకు వెళ్ళెననుట పొరబాటనియు, రెవరెండు హెన్రీహెరాస్ వ్రాయుచున్నాఁడు; కాని యది సరికాదు. రణరంగమున రామరాజు మృతినొందుటయవసరముగఁ దిరుమలరాయఁడు పెనుగొండఁజేరి, నవరము చెన్నప్పనాయనిసాయమున నందుఁ గోటలు నగడ్తలు బురుజులు మున్నగు వానిని జీర్ణోద్ధారము చేయించి, యది దైవనిర్మితమగుపట్టణమగుటచే దానినే కర్ణాటకసామ్రాజ్యమునకు రాజధానిగనొనర్చెను. తిరుమలరాయఁడందు రాజ్యపాలనము చేయుచున్న సందర్భముననే గోలకొండ బీజపూరుసుల్తానులుమూఁడుపర్యాయములు పెనుగొండను ముట్టడించిరి. మొదటిముట్టడి తిరుమలరాయఁడు పెనుగొండ చేరిన కొన్ని నెలలకే క్షయనామసంవత్సర పుష్యమాసము (క్రీ॥శ॥ ౧౫౬౮వ నవంబరు) న కేసరుఖానుని వలన జరిగినది. రెండవమాఱు విభవనామసంవత్సర వైశాఖమాసము (క్రీ॥ శ॥ ౧౫౬౯ ఏప్రిలు) న నూలిఖానునిచే నైనది. కడపటిది యేదులశాహి, సరదారులు మున్నగువారితోఁ గవిసెను; కాని యీమూఁడుపర్యాయములలను దురుష్కులే పరాజితులైరి. తిరుమల

రాయని కార్యంకరుఁడగు చెన్నప్పనాయఁడు మహమ్మదీయులఁ బాఱఁదోలినట్లు పెనుగొండశిలాశాసనము* తెల్పుచున్నది. తుఱకలు పెనుగొండను ముట్టడిగొనఁగా, తిరుమలదేవరాయని సైనికులు తురుష్కుల చతురంగ బలముల నున్మూలించుటచే, నరివర్గమునందలి మదపుటేనుంగుల చర్మాంబరములతోడను కపాలమాలికావళుల తోడను బెనుగొండకొండలు నిండి పోయెనని, రామరాజ భూషణుఁడు నుడివెను.

చ. తిరుమలరాయశేఖరుని ధీరచమూభటరాజి యాజి భీ
కర యవనేశ్వర ప్రహిత ఖాన బలంబులఁ జక్కు సేయ ని
ద్ధరఁ బెనుగొండకొండలు మదద్విప చర్మకపాలమాలికా
పరికరభూషితంబులయి బల్విడిఁ గాంచె గిరీశభావమున్ ౧—౫౮

విద్యానగరవినాశముతోడనే పరిసరసామంతరాష్ట్రములలో నరాజకములు ప్రబలెను. ధనాఢ్యులెల్లరు స్వాతంత్ర్యముఁ బూనఁదొడఁగిరి. సదాశివరాయఁడు దక్షిణదేశమున సంచారము సేయుచుండఁగా, తిరుమల దేవరాయని ప్రతినిధియగు మధురనాయకుఁడు సదాశివ రాయని నిరోధించి హత్యగావించెనఁట! తన మొదటి కుమారుఁడే హత్యకుఁ గారకుఁడని తిరుమలదేవరాయఁడు శంకించి, యాతని రాజ్యార్హునిగ నొనర్ప మానెనని

* ఈ శాసనము పెనుగొండ పట్టణపు టుత్తరద్వారమున నాంజనేయస్వామియాలయపు దక్షిణభాగమునందలి గోడ శిలాఫలకముపైఁ జెక్కఁబడినది.

తెలియవచ్చెడిని. సదాశివరాయుని మరణానంతరము తిరుమలరాయఁడు ౧౫౭౧వ సంవత్సరమున సామ్రాజ్యమునకుఁజక్రవర్తియై కొలఁదికాలముమాత్రమే రాజ్యమేలెను. అంతలో నరాజకముహెచ్చిల్లినది. సామంతులుపెక్కండ్రు తిరుమలరాయుని రాజవిద్రోహియని భావించి, యతనియెడ విశ్వాసముదలఁగి, యెవరికివారు స్వేచ్ఛవహించిరి. ఆయాందోళనకరపరిస్థితుల నుడుపుటకును, బరిపాలన సౌకర్యార్థమును, దిరుమలరాయఁడు తన బంధువులలో ముగ్గురిని బ్రతినిధులుగ నియోగించెను. ఇంతపరిశ్రమించియు రాజ్యపాలనము నాతఁడు జయవంతముగ సాగింపలేకపోయెను.

## 2 మొదటి శ్రీరంగదేవరాయఁడు ౧౫౭౨—౧౫౮౫

౧. రాజ్యారూఢుఁడగుట—తిరుమలదేవరాయనికిఁగల రఘునాథరాజు శ్రీరంగరాయఁడు రామరాజు వేంకటపతి యనుకుమారుల నలువురిలో రాయనికిఁ బిమ్మట నాతనిజ్యేష్ఠపుత్త్రుఁడగు రఘునాథరాజు రాజ్యమునకు రావలసియుండెను. కాని యట్లు జరుగలేదు. కారణము సదాశివరాయునిమరణమునకు రఘునాథరాజు మూలమని తండ్రియనుమానించుటయేయని పైన సూచింపఁబడినది. జనకుఁడు జీవించియున్నపుడే శ్రీరంగరాయఁడు యువరాజ పట్టబంధురుఁడయియుండెననుటకు నాధారములునుగలవు. ఇందులకు శ్రీరంగరాయని

సుగుణసంపదయే హేతువని వసుచరిత్ర ప్రశంసించి యున్నది.

చ. హరిపదభక్తిశీలుఁడగు నారఘునాథనృపాలు కూర్మి సో
దరుఁడు నిరంగరాయ వసుంధావరుఁ డాత్మగుణప్రమోద వ
తి రుచుల రాయశేఖర వింతీర్ణ మహాయువరాజ పట్ట బం
ధురుఁడయి సర్వభూధవనంధూర్వహశక్తివహించునెంతయున్.

౨. తురుష్కులతోడిపోరాటము— శ్రీరంగదేవ రాయనికాలమున మహమ్మదీయులు రెండుపర్యాయ-ములు పెనుగొండనుదాఁకిరి; కాని యీప్రభుఁడు వార-లనుగ్రమ్మఱించి, కుతుబ్షావశపఱుచుకొనియున్న కొండ వీడు వినుకొండదుర్గములను గూడ సాధించెను.

"………శ్రీరంగరాయ క్షితిభాగధేయః
ఉద్దగిరాస్థితః పటివిచిత్య చ దుర్జయాన్,
దుర్గమకొండవీడు వినుకొండ పురప్రముఖాన్
భూవలయకరత్న పెనుగొండపురే నివసన్,
రాజతియః సమకరాది లాంఛనత"

—ఎపిగ్రాఫికా కర్ణాటికా సంపుటము ౮ పుట ౮౬

మ. అలఘు ప్రాభవభవ్యుఁ డాకుతిపశాంహా మేయసైన్యంబు న
గ్గలికన్ బాహులచేతగెల్చి బిరుదుల్ంగైకొన్న శ్రీరంగరా
యల చిత్తంబిగురింప...... —లక్ష్మీవిలాసము.

రాయనికి 'మహాసేనానియు ధైర్యశాలియు నగు ప్రభుఁ' డనుబిరుద ముండినట్లు మూఁడవ వేంకటరాయని దానశాసనమువలనఁ దెలియుచున్నది. ఒక్కమాఱు ౧౫౭౭వ సంవత్సరమున రాయఁడు పట్టువడఁగా నాప్ర-

భుని మేనమామయగు జగదేకరాయఁడు దుర్గమును గాపాడెనఁట. అందులకుఁ గృతజ్ఞతగ నీనృపుఁడు తనమాతులునిఁ జెన్నపట్టణమునకు నాయకునిగ నొనర్చెనని తెలియుచున్నది.

3. శృంగునిమల: శ్రీరంగరాయఁడు—శ్రీరంగ రాయఁడు కొంతకాల మనంతపురమునకు సమీపమున నున్న శృంగునిమల ముఖ్యపట్టణముగఁ జేసికొనెను. అతఁడు వసించుచుండిన మహాలు, ఋశ్యశృంగపర్వత మాలికకుఁ జేరువను దక్షిణదిశనుండుకొండపై నుండినది. అదినేఁటికిని 'మహాల్ కొండ' యనఁబడుట యిందుచేతనే. రాజ్యకార్యనిర్వహణార్థమై రాయఁ డనుదినము మహాలుకొండనుండి పట్టపుటేనుంగుపై శృంగునిమలయందలి యాస్థానమండపమున కరుగుచుండెను. ఈమలకు సమీపముననే యాతఁడు తనపేరనిర్మించిన తటాకము గలదు. రాయఁ డిటనున్నసందర్భమునఁగూడఁ దురుష్కులాతనిఁజెనకి భగ్నమనోరథులై మరలిపోయిరి. అని శృంగునిమలప్రాంతమున జనశ్రుతియున్నది. ఈ శృంగునిమల పూర్వము ఋశ్యశృంగమహర్షి యాశ్రమ భూమిగానుండిన పవిత్రపర్వతరాజము. శ్రీరంగరాయుని కాలమునఁ బట్టణము ఋశ్యశృంగాచల నితంబ ప్రదేశ మందలి సమతలములలో నిర్మింపఁబడియుండనోపు. దాని గృహవాటికగుర్తు లిప్పటికి నందుఁగలవు. కోటగోడల జాడలును గన్పట్టుచున్నవి. జలవసతిలేకపోవుట చేతనో

మఱేహేతువుననో యీపురము మరలఁ గొంతదిగువ నిర్మింపఁబడినది. గ్రామము నేఁటికిని కొండపేరున 'శృంగునిమల' యనఁబడుచున్నది. ఆనామమే 'సింగనమల'యని మాఱినది. పురసమీపముననున్న తటాకమునకు శ్రీరంగరాయల చెఱువనియేపేరు. ఇందలి 'ప్రతిమలశూము'నం దీ విషయమగు శాసనములేవియో గలవఁట! వానిఁజూచుట యశక్యమయ్యెను. శ్రీరంగరాయఁడు నివసించుచుండిన మహాలుకొండ వ్యవహారమున నిపుడు 'మాలకొండ' యనఁబడుచున్నది. ఇది యెల్ల కేవలము జనశ్రుతి. ఆధారాంతరములు లభించినఁగాని విశ్వసించుటకు వీలులేదు. రాయఁడు బహుశః సింగనమల తటాకనిర్మాణసమయమున మహాలుకొండపైఁ గొంతకాలము వసించియుండిన నుండవచ్చును. ఈతఁడు ధైర్యచిత్తుఁడును శూరుఁడును నగుట నాజిలో నిజామాదులనత్త్వమడంచి జీర్ణవిద్యానగరసామ్రాజ్యమును బునరుద్ధరించెను.

'జీర్ణకర్ణాట భూపునర్జీవనుండు రమ్యగుణశాలి శ్రీరంగరాయ మౌళి'

యని నరపతివిజయము (ప. ౨౭౭).

౪ వేంకటరాయఁడు ౧౫౮౫—౧౬౧౫.

కం ఆరఘునాథ ప్రభృతి ధ
రాగమణీంద్రులకు మువ్వురకు సోదరుఁడై
సారమతి వేంకటపతి
క్ష్మారమణీప్రియుఁడు వెలయు శత్రుఘ్నుడవన్

బహుచరిత్ర ౧—౫౮

౧. శాంతిస్థాపనము—శ్రీరంగదేవరాయని య నంతరము కర్ణాటకప్రభువులకుఁ జంద్రగిరి రాజధాని యయ్యెను. తదుపరి సింహాసనమునకు వచ్చినవాఁడు శ్రీరంగరాయని తమ్ముఁడగు వేంకటరాయఁడు. సదాశివ రాయనిమరణమువలనఁ బ్రజలలోఁ బెచ్చుపెరిఁగియుం- డిన సంక్షోభ మీవీరునికాలమునఁ గొంత శాంతించినది. ఈతఁ డధికప్రతిభాశాలియగుటచే, కర్ణాటక రాజ్యము నందలి రాజద్రోహులనందఱ నడఁగఁద్రొక్కెను. అక్బరుచక్రవర్తి తనసామ్రాజ్యమును దక్షిణమునకు విస్తరింపఁజేసి, శాంతికరములగు నియమముల నొనర్చుట కూడ, నీ వేంకటరాయని పరిపాలనమునకుఁ దోడ్పడెననుట నిస్సంశయము. ఆచక్రవర్తి యాసిర్ ఘుర్ నుండి పంపిన- సందేశమును బట్టి బీజపూరుసుల్తాను వేంకటరాయని సఖ్యము నాకాంక్షించెను.

౨. బుడుతకీచులతోడి చెలికారము— బుడుతకీచులకు శ్రీవేంకటరాయఁడనుంగు మిత్రుఁడు. ఈప్రభుని యాస్థాన మునఁ గ్రైస్తవసన్న్యాసులు కొందఱుండి తూలికాలే- ఖనమునను క్రైస్తవమతధర్మములయందును నీతని కభి- రుచిఁగొల్పిరి. ఈరాయఁడు ధైర్యశాలియు నదృష్ట వంతుఁడును. శ్రీకృష్ణదేవరాయని పరిపాలనము నాఁటి వైభవ మీతని యాస్థానమునకుసయితము మరలెనన వచ్చును. ఈతనికీర్తి యత్యంత స్వచ్ఛమైనదఁట.

“ ........ఆత్మసవర్ణ లబ్ధికిఁ జరాచ
రంబునఁ జరించుఁ దిరుమలరాయతిఃయ
ధీర వేంకటరాయ సత్కీర్తికన్య”. —వసుచరిత్రము.

౩. కుటుంబము——వేంకటరాయనిబంధువుల ప్రత్యేక వ్యవహారములుకొన్ని సామ్రాజ్య వినాశమునకుఁ జాలసహాకారములైనవి. ఈ నృపతికిఁ బెక్కండ్రు భార్యలున్నను సంతతిమాత్ర మరుదయ్యెను. దత్తపుత్త్రస్వీకార మీరాజునకుఁ దృప్తిఁగొల్పలేదు; కనుక నితఁడు తనబంధువులలోని తిరుమలరాయరంగరాయలలో నొక్కని సామ్రాజ్యపాలనకర్తగ నెన్నుకొనదలఁచి యుండెను. తేనికిఁ, జిన్నవాఁడగురంగరాయునిపైఁ బ్రీతి యగ్గలముగనుండినది; కాని యీప్రభునియనంతర మా యెన్నికసమస్య పోరాటముకిందదిగెను.

౪. రెండవవేంకటరాయఁడు: వేంకటపతి పైన వర్ణించినట్లు తిరుమలరాయనికిఁ దరువాత రెండవ వేంకటరాయఁడు కర్ణాటక సామ్రాజ్యమును బాలించెననుట రెవరెండ్ హెన్రీహేరాస్ మతము; కాని తిరుమలదేవరాయనికిఁ బిమ్మట నాతని కడగొట్టుకొడుకగు వేంకటపతిరాయఁడు ౧౫౮౦ వ సంవత్సరమునకు మునుపే మూర్ధాభిషిక్తుఁడయియున్నట్లు, ఎపిగ్రాఫియా కర్ణాటికా ౭వ పుస్తకమున షిమొగ్గతాలూకా ౮౩వ సంఖ్యగలశాసనము చాటుచున్నది. ఇంక హేరాస్‌నుడిపిన రెండవ వేంకటరాయఁడెవ్వఁడో.

## ఆర్వీటివంశము. ౧౫౭౧—౧౬౧౫.



## 4. విద్యానగరసామ్రాజ్యావశేషము — ఆనెగొంది.

పదునేడవశతాబ్దారంభమునకు మహమ్మదీయుల దాడి పూర్తిగనంతరించినను, విద్యానగరసామ్రాజ్యాభివృద్ధికిమాత్రము మార్గము లేకపోయెను. నరపతి వంశమునకుఁజెందిన చంద్రగిరి యాఅవరంగదేవరాయని ప్రతినిధి, ప్రకృతము చెన్నపురియందు సెంటుజ్యార్జుకోట యున్నస్థలమున, నైదుమైళ్ళపొడవు నొకమైలు వెడల్పు గల భూభాగమును, 'ఫ్రాన్సిస్' అనునతనికి ౧౬౩౯వ సంవత్సరమున నమ్మివైచెను. తరువాత విద్యానగర సామ్రాజ్యము క్షీణించి, నిలిచియున్న కొంతభాగము గూడ టిప్పుసుల్తానునికాలమున నాతని రాష్ట్రముతోఁ గలిసిపోయెను. నరపతి వంశమిట్లు కాలకౌటిల్యకారణమునఁ దనకున్న సామ్రాజ్యమును, ప్రాభవవైభవాదులను, ధనకనకవస్తువాహనాదులను, గ్రమక్రమముగఁ గోల్పోయి, చివర కానెగొంది యభిజనమున లీనమయ్యెను. ఆహా! ఎంతమహాసామ్రాజ్యము? ఎంతదర్పగ్రస్తులగు సామ్రాట్టులు? ఎంతటివైభవసమన్వితమగు ప్రాభవము? ఎట్టియుత్కృష్టమ సంస్థలు? ఎటువంటి మహాసౌధములు—దేవసదనములు? అన్నియుఁద్రుటిలోఁ దుర్గింగినవి. ప్రపంచమునంగల పట్టణములలో నెల్లఁ దలమానికమన నెసఁగిన యమ్మహానగరము, నేఁడు భూగర్భమున దాఁగినది. హైందవజాతీయతను మత స్వత్వమును దేశవైభవమును సముద్ధరించిన యారాజ

పరమేశ్వరులు మఱుఁగుపడిరి. వారిస్వరూపము దర్పము నిపుడు మాదునకైనఁ గానరాదు. ప్రాపంచకవైభవ మెంతదైన నింతయేకదా? అంతయు క్షణభంగురము.

పైనఁ దెల్పిన స్థానమున నరపతి వంశజులు నేఁటికి నున్నారు. కొంతకాలముక్రిందటఁ గాలధర్మమునొందిన శ్రీరంగదేవరాయఁడు, నరపతి వంశమునకుఁ జెందిన పురుషుఁడనుట ప్రసిద్ధి. ఈతఁడు మితభాషియు-సాధు శీలుఁడును నాంధ్రభాషాభిమానియు నయియుండెను. ఈతని ప్రథమపుత్త్రుఁడు కృష్ణదేవరాయఁడు. ఈవంశజు లిపుడు చెన్నపురిప్రభుత్వమువారివలన నెలకైదువందల రూప్యముల యుపకారధనముఁ బొందుచు, నైజాము రాష్ట్రమునకుఁ జెందిన చిన్న సంస్థానము ననుభవించు చున్నారు. ఈసంస్థానమే మన చరిత్రమునకు మూలాధారమై, రామాయణయుగమునుండియుఁ గిష్కింధ యనవెలసి, పదునొకండవ శతాబ్దారంభమున నంద మహారాజు పరిపాలనమునాఁటికే ప్రబలవిఖ్యాతినొంది, విద్యానగరనిర్మాణమునకును దదీయసామ్రాజ్య సంస్థా-పనమునకును నంకురమై విరాజిల్లిన యానెగొంది—

మ॥ అని, శ్రీ సిరిసి యవ్వాయుజుఁడు, సాంరాంబాతనూజుండు, రా
మున భవ్యోగ్రతపఃఫలంబు, జనసంభావ్యప్రగల్భుండు, దే[వా
వ నియోగార్హుండగు నాంజనేయుఁడు సుధీవ్రాతంబు హర్షింప
చిన విద్యాపుర భూవ్యవృత్తమిది, నాసీసన్ గాంచి పెంపొందెడున్.

---




యాత్రికులు చూడఁదగిన శిథిలనిర్మాణములు,

వాని మార్గములు.

వివరములకుఁ బ్రక్క పుట చూడుఁడు.

## జీర్ణ నగరమునందలి కొన్ని ముఖ్య నిర్మాణములు.

పార్శ్వపటమునందలి సంఖ్య ననుసరించి చూడుడు.

1 అంతఃపుర స్నానగృహము
2 నీటికాలువ
3 చంద్రశేఖర దేవాలయము
4 మజ్జనశాల
5 నీటి మండపము
6 విజయ మందిరము
7 రాజనగరము
8 నేలమాళిగ
9 రాజ సందర్శన గృహము
10 హజార రామాలయము
11 ఘటశాల
12 గజశాల
13 రంగస్వామి దేవాలయము
14 దండనాయకుని ప్రహరి
15 టంకసాల
16 భూగర్భ దేవాలయము
17 ధనురాకార మార్గము
18 సమాగమన చిహ్నములు
19 వీరభద్రుని గుడి
20 నరసింహ విగ్రహము
21 సాసివికల్లు గణేశుడు
22 కడలెకల్లు గణేశాలయము
23 హేమకూట పర్వతము
24 జైనాలయములు
25 విరూపాక్షేశ్వరాలయము
26 నంది
27 కోదండరామ దేవాలయము
28 వరాహ దేవాలయము
29 అనంతశయన దేవాలయము
30 అచ్యుతరామాలయము
31 మాతంగగిరి పైకిదారి
32 జైనాలయము
33 సుగ్రీవుని గుహ
34 రాజతులాభారము
35 అసమగ్ర సింహద్వారము
36 విఠోబాలయము

# మొదటి ప్రకరణము.

---

## విదేశయాత్రికుల వర్ణనము.

తూర్పున కాంపిల్యనగరమును నుత్తరమున నానెగొందియుఁ బశ్చిమమున నాగలాపురమును దక్షిణమున దరోజియు విద్యానగరమునకు బాహ్యద్వారములుగ నుండెను. ఈ మహానగరము రమారమి యిన్నూట యేఁబదియారు చదరపుమైళ్ళ వైశాల్యము గలదియై జీవదశలో ముప్పదిలక్షల కుమించిన జనసంఖ్యచేనొప్పియుండెను. దీనిఁగూర్చి విదేశీయులు నుడివిన విషయములలోని ముఖ్యాంశములను మాత్రము సంగ్రహముగఁ దెలిపి, ప్రకృత శిథిలస్థితిని తరువాత వివరించెదము.

### 1. నికోలో డెయికోంటి.

ఇటలీదేశీయుఁడగు నితఁడు రెండవదేవరాయని పరిపాలనా ప్రారంభసమయమున (౧౪౨౦ వ సం॥ము)న విద్యానగరముఁజూచి క్రిందివివరముల నొసఁగెను.

ఇది మహానగరము. ఆయుధధారణమునకు సమర్థులగు యువకులు తొంబదివేలమంది యీ నగరమునఁ గలరు. హిందూదేశ ప్రభువులలో విద్యానగరమహారాజు సమర్థుఁడు. నగరవాసు లేఁడాదికొకతడవ గృహదేవతలకు బ్రహ్మోత్సవము గావింతురు. పడుచులు మంచివస్త్రములు-సొమ్ములు-ధరించుకొని, తేరునకు ముందుభాగమున దైవసంకీర్తనములు గావించుచు నడతురు. సంవత్సరమున కొందు మూఁడు గొప్పపండుగలు జరుగును. అందొకపర్వదినమున నగరమునందలి స్త్రీ

పురుషు లాబాలవృద్ధులు సుస్నాతులై నవీనవస్త్రములను ధరించి, నృత్యగీతాది వినోదములతోను విందులతోడను త్రిరాత్రములు గడపుదురు. మరియొక పండుగనాడు దేవాలయములయందంతటను లోపలను వెలుపలనుగూడ విరివిగ దీపకళికల నుంతురు. మూడవది నవరాత్రుల పండుగ. ఇదిగాక మతిమూసురాత్రములు జాగరించుపండుగ యింకొకటి యున్నది. అందు వసంతముల వేడుక ముఖ్యము. ఆదినములలో రాజులు రాణులు నవక, వీధులలో వెళ్లెడు స్త్రీపురుషాదుల యందఱిపైనను వా రాపసుపునీళ్లు చల్లుదురు.

## 2. అబ్దుర్ రజాక్ *

ఇతడు పారసీక దేశస్థుడు. రెండవ దేవరాయుని రాజ్యపాలనమునకు జివర ౧౪౪౩ వ సంవత్సరము విద్యానగరమును సందర్శించెను. ఆతని వర్ణనమునుండి ముఖ్యవిషయములు.

రాయనిరాష్ట్రము కృష్ణనుండి కన్యాకుమారివఱకు నున్నది. రాజధానియందు కొండలవంటి యేనుగు లున్నవి. అందున్న సైన్యము పదునొకండులక్షలు. హిందూస్థానములోని నిరంకుశాధికార ప్రభువులలో రాయడు మేటి. ఈ ప్రభుని రాజధాని బోలిన మహానగరమును మేమెన్నడును జూచియుండలేదు. ఈ ప్రపంచమున నట్టిది వేఱొకటి యొండైన నున్నట్టును విన్నవారముగాము. మహాబలాఢ్యములైన శిలలచే గట్టబడిన యేడుకోటలును దుర్గములును దీనికి రక్షకములు. వీధులన్నియు జనసమూహముచే గిక్కిఱిసియుండును.

---

* ఈ విషయమై విశేషవివరము లాంధ్రమున దెలిసికొనగోరువారు, శ్రీ భావరాజు వేంకటకృష్ణరావు పంతులుగారి 'అబ్దుర్ రజాకు' (భారతి) వ్యాసమును, చిలుకూరి వీరభద్రరావు గారి శీర్ణకర్ణాటక చరిత్రము నందలి విదేశీయుల వ్రాతలను జూడనగును.

ప్రతివీథికిని పై భాగమున సుమనోజ్ఞములు-సమున్నతములు-నయిన కమానుల వరండాలున్నవి. గులాబి పూలంతటను విరివిగ లభించును. జనులకు వానియందెక్కువ మక్కువ. నగరమున నున్నగ పాలగార వేసిన రాతిగొట్టముల మూలమున శుద్ధజలము సమృద్ధముగ లభించును.

రాయుని మండపద్వారమున కెడమవైపున దివానుఖానా రాజమందిరమువలెనే యున్నది. దాని యెదుటనే సభామండపమున్నది. రాయల కొలువుకూట మన్నింటికంటె నెత్తైనది. రాజభవనమునకు వెనుక ధననాయకుని మందిరమున, దాని కెడమవైపున టంకసాలయు, టంకసాల కెదురుగ నగరపాలకునియిల్లును, దివానుఖానాయెదుట గజశాలయు నున్నవి. టంకసాల వెనుకనున్న బజారునకుఁ బొడవున నిరుపార్శ్వముల గృహములు వరండాలు వానియెదుట నున్నత శిలావేదికలు నిర్మింపఁబడినవి. ఈబజారు పదునేనుగజముల వెడల్పును నిన్నూఱు గజముల పొడవును గలది.

నేనొకనాఁడు రాయని యాస్థానమండపమునకు వెడలితిని. ప్రభుకార్య తత్పరులగు నమాత్య పుంగవులతో రాజపుత్త్రుఁడు కౌశేయాంబరములను నవర్ఘ్యములగు భూషణావళులను ధరించి, పౌరజన బృందము బలసికొలువ సింహాసనాసీనుఁడయియుండెను. అతఁడు సూక్ష్మమును నున్నతమును శ్యామలమును గల శరీరమున స్నిగ్ధములైన గండభాగములచే నొప్పుచుండు సుందరాకారుఁడు.

రాయఁడు మహానవమీ పర్వదినమునఁ దనయాస్థానము నందుఁ గొలువు దీర్చెను. నాఁడాతనిరాష్ట్రమున నున్న సామంతప్రభువులు దండనాధిపతులు నెల్లరు, సుమనోజ్ఞముగ నలంకృతములైన వేయి యేనుఁగులను గొనివచ్చిరి. నగరమంతయు నాపర్వదినమున మిగుల రమణీయముగ నలంకరింపఁబడి యుండినది. ఏనుఁగు లొకమైదానమున సముద్రపుటలలవోలెఁ గన్పట్టుచుండెను. ఆవిశాల ప్రదేశమున వసుత్తణ మొక్కొక నూతన భవనముగాని గదిగాని దృష్టిగోచరమం-

గుచుండెను. ఈ ప్రదేశమున కెదుట నవమండప విరాజితమగు రాజసౌధమొకటి నిర్మింపఁబడి యుండినది. అందుఁ గడపటిదానిలో నసాధారణ పరిమితిగల రత్నఖచిత స్వర్ణ సింహాసన మమర్పఁబడి యుండినది. సింహాసనముమీఁద నాలుగంచులలోను మూఁడు వరుసలుగ ముత్తెములు కుట్టఁబడిన మృదుతల్ప మొకటి యుంపఁబడి యుండెను. రాజు మూఁడు దినములు నామెత్తపై నాసీనుఁడయి యుండెను. ఈ నిర్మాణకుడ్యములును పైకప్పును బూర్తిగ బంగారు పలకలచేఁ గప్పఁబడి యుండి వింత వన్నెగల రత్నములు పొదుగఁబడి యుండినవి. ఒక్కొక స్వర్ణ ఫలకమును గత్తి వీపు మందముగల్గి బంగారు మేకులచే బిగింపఁబడి యుండెను.

### ౩. పెయిస్

కృష్ణదేవరాయనికాలమున ౧౫౨౦లో 'ఫిగరిడో' యను పోర్చుగీసురాయబారివెంట వచ్చి, విద్యానగరమును సందర్శించిన పోర్చుగల్లుదేశస్థుఁ డితఁడు. ఆ నగరమునఁ దానవలోకించిన విషయములనన్నింటి నీతఁడు యథాక్రమమున వర్ణించెను. అందలి ప్రధానాంశములు.

పట్టణమున కాఱుమైళ్లు యావలినుండి యద్దముగ దెబ్బదిమైళ్లు పొడవువ్యాపించి, నగరమును జుట్టియున్న పర్వతమాలికనుండియే పట్టణములోని కందందు మార్గములున్నవి. ఇవియే నగరద్వారములు. ఇవితక్క నగరప్రవేశమునకు మార్గాంతరములు లేవు. బలిష్ఠములైన ప్రహరులు పర్వత శ్రేణులనడుమనున్న సమతలములనావరించి, కొండల నొండొంటితో బంధించియున్నవి. ప్రజలు నడచుటకు మంచి బాటలు గలవు. అవి యీ ప్రాకారద్వారముల మూలముననే పోవుచున్నవి. ఆద్వారములు వీరభటసంరక్షితములై యొప్పును. పర్వతమాలికల యందందుఁగల సరోవరములు నగరములోని తోఁటలకును, వరిపొలములకును, జీవనాధారములై యున్నవి.

పశ్చిమదిశనుగల ద్వారములలో నాగలాపురము (హాస్పేట) దగ్గఱనున్నది మిక్కిలి ప్రాముఖ్యముగన్నది. గోవానుండి వచ్చెడు బాటయొకటి యీద్వారముననే విద్యానగరమునఁ బ్రవేశించుచున్నది. కనుక నిది బలాఢ్యములగు ప్రహరులతోడను దుర్గములతోడను సుభద్రమయి యున్నది. కోటగోడకు బాహ్యభాగమున జలపూర్ణములైన యగడ్తలుగలవు. రాజసదనము నగరమధ్య ప్రదేశమున నున్నది. ఆప్రదేశభాగమున రాజభవనమువఱకుఁగల వీథులు, దండనాధపతులయు—సామంతప్రభువులయు—మనోజ్ఞములైన సౌధములచే నొప్పును. గృహములు నానావిధ చిత్రములచే నలంకృతములై రామణీయకములై విరాజిల్లుచున్నవి. రాజాంతఃపుర భవనమునకు ముందుభాగమున సువిశాలసమతలమొండుగలదు. నగరమధ్యమునసుండుటచే నీసమతలము మిగులఁ బ్రయోజనార్హముగ నున్నది. రాజమందిరము (Lisbon) లిస్బన్ నగరదుర్గమున (పోర్చుగల్ దేశపురాజధాని) కంటె నధికస్థలమాక్రమించుకొని దుర్భేద్యమును సురక్షితమును నగు ప్రకారిచే నొప్పుచున్నది. మఱికొంతముందుపోవు సెడల సుందరతరములగు సౌధవాటికలచేఁ జెలువొందెడు నింకొక వీథివచ్చును. అది ధనాఢ్యుల కావాసభూమి. అందు నవరత్నములును, నానావిధ వస్త్రములును, ప్రపంచమునంగల ప్రతి వస్తువును, వెలకు లభించును.

ఈ నగరమున నవ్యములైన మణులయు వజ్రములయు వ్యాపార మత్యధికము. ఇందుచే నిందన్ని తెగలవారును చేరుటకవకాశ మేర్పడుచున్నది. ఈనగర వైశాల్య మొకవైపునుండి నిర్ణయించుట యసాధ్యము. నేనొక పర్వతమెక్కి కొంతవఱకు విస్తారభాగముఁ జూచినాఁడను. నగరమంతయు ననేక పర్వత శ్రేణులనడుమ నుండుటచేఁ గొంత ప్రదేశమాత్రమే నాకు గోచరమయ్యెను. నేను చూడఁగల్గిన భాగము రోమకనగరమంతయుండి కడుమనోజ్ఞముగ నున్నది. దానిలో వనములు, తటాకములు, నీటికాలువలు నున్నవి. తుఱక వీథికిరువార నొకకాలువ ప్రవహించుచు, చేమవారింజ నిమ్మ పనస పోఁక మామిడి మున్నగుతోఁటలకు సమృద్ధిగ జీవనము నొసఁగుచు, వానిని జక్కఁగఁ బెంచి యాభాగము నొకమహారామసదృశముగ

కొనర్చినది. అసంఖ్యాకముగను వగణితముగను నున్న యీ మహానగర జనసంఖ్యనుగూర్చి నేనిం దుదాహరింపను. అది యతిశయోక్తిగ నగపడునేమో యనుభయము..

విజయనగరము లోకమునందలి సమస్తవస్తుసముదాయమునకు నాకరమగు పట్టణము. పలుదెఱఁగులైన ధాన్యములిందు సమృద్ధముగ ఫలించి మిక్కిలి చౌకగ లభించును. గోధుమపంట తక్కువ. ముఖ్యములైన పండుగ దినములలో రాయఁడు విద్యానగరమున నుండి సనాతన సాంప్రదాయానుసారము విందులు వినోదములలోఁ బాల్గొనును. ఈ యుత్సవ సందర్భములందుఁ బ్రభుత్వమువారు, సామ్రాజ్యమునంగల మహారాజులు, రాజులు, దండనాయకులు మొదలగు వారిని కుటుంబపరివార సహితముగ నాహ్వానింతురు. రాష్ట్రము నందలి యాటకత్తియల నందఱను పిలిపింతురు; కాని యుద్ధమునకు వెళ్లియున్నట్టియు, సామ్రాజ్యపు మేరలను గావలికాయునట్టియు, సేనలను మాత్రము రప్పించుటలేదు.

ఈ ప్రభునకుఁ బదిలక్షల సేనయున్నది. అందు గుఱ్ఱపుదళము ముప్పదియైదువేలు. ఏనుఁగు లనేకము లున్నవి. మహాబాహుఁడైననే తప్ప దన సైన్యములోఁ గొలఁదిపాటివాని రాయుఁడు చేర్పఁడు. ఈ తన సేనలలో నొక్కపిఱికిపంద నాకగపడలేదు. ఈ సైన్యము పరరాష్ట్రములపై దాడివెడలుటకే వేళను సంసిద్ధముగ నుండును. ఎక్కువ రాఁబడిగల ప్రభువులనేకులు రాయనికి విధేయులై కప్పములు చెల్లింతురు. రాజునకు సంతానప్రాప్తియయ్యెనేని నృపవర్యులనేకు లాసందర్భముల నమూల్యములగు కానుకలను బంపుదురు. ఆదినములలో రమారమి పదునైదు లక్షల బంగారు వరహాల మొత్తము చక్రవర్తికి వచ్చును. అతఁడుకూడ విశేషముగ దానముచేయును.

పెయిస్ పై వివరములనిచ్చుచు నడుమ నడుమ నాగలాపురము, అందుండి విద్యానగరమునకు వెళ్ళెడు వీథులు, చెఱువులు, నేళ్ళు, ఫలవృక్షసంతతులు, దేవా

లయములు, తదారాధనలు మున్నగువానినిగూడ సూ-
క్ష్మముగ వర్ణించెను. అవియిందు వదలివేయఁబడినవి. ఖండాంతరరాయబారుల యీవివరములఁబట్టి, విద్యానగరమెంతటి మహోన్నతదశయందుండెనో యూహించుట సులభము. అది నేఁడెంత శోచనీయదశలో నున్నదియుఁ బాఠకు లెఱుఁగఁగలరు.

విద్యానగరశిథిలభాగములను నందలి విరూపాక్షేశ్వరాలయమును సందర్శింపనేఁగెడు యాత్రికులకెల్ల నాగలాపురము (హాస్పేట) కూడలియయి యుండుటచే దానిఁగూర్చి తొలుతఁగొన్ని పఙ్క్తులు వ్రాసెదము.



# రెండవప్రకరణము.

---

## నాగలాపురము. (హాస్పేట)

### 1. పురప్రతిష్ఠ.

బళ్ళారికిది ముప్పదియాఱుమైళ్ళదూరమున గో-వాకు వెళ్ళు నినుపదారికి సమీపమున నున్నది. శ్రీకృష్ణదేవరాయఁడు బాల్యమాదిగఁ బ్రేమించుచుండి, తాను చక్రవర్తియైనపిమ్మట వివాహముచేసికొనిన చిన్నమదేవి యనునామె జ్ఞాపకార్థమై, యాతఁ డీ పట్టణము౧౫౦౯-౧౫౨౦ సంవత్సరములమధ్య నిర్మించెనని, యాంగ్ల చరిత్రములు నుడువుచున్నవి. కాని రాయఁడు తన తల్లియగు నాగాంబపేర 'నాగలాపుర' మని యీ నగరమును నిర్మించినట్లు కుమారధూర్జటి తన కృష్ణరాయ చరిత్రమున స్పష్టపఱుచుచున్నాఁడు.

ఉ. వాడలు మేడలుం దుతియు నంగడులుం బేటలు రచ్చకూటముల్
కేడుక తోఁటలుం గలుగ నింతగఁ గట్టెను నాగలాపురిన్
గీడు మదిన్ దలంపక నుతింపఁ ద్రిలెలంగిన తల్లిపేరటన్
వాడియకాడ పుత్త్రులకు నూతల సద్విధి గౌరవించుటల్ 3-వ.

నాఁటఁగోలె నది యామెపేరనే నాగలాపురమన నొప్పెను. కృష్ణదేవరాయని కీపుర మత్యంతప్రీతికరమగు పుటభేదనమయి యుండెను. ఆసార్వభౌముఁడు దీనిని వాసస్థలముగను పెనుగొండ వసంతకాల వాసయోగ్య

సురిశతుఁబొందదున్న యఱువది మంది నిర్బంధితుల తలలను, గోపుర ద్వారమునొద్దఁ గొట్టించెను. కొన్నిగట్టిములను సెను పోతులను బలి-యొసఁగెను.

ఈచెఱువు నీటివలన నగరమునందలి వరిపొల-ములకును దోఁటలకును జలముగొంపోవుటకై పెక్కు-కాలువలు ననేకవిధములగు జలవసతులుఁ గల్పింపఁ బడినవి. పూర్వ మీచెఱు వంత ప్రయోజనకరముగ నుండినను, నిపుడది వట్టిపోవుటచేఁ దటాకగర్భమునంగల నేల మెట్ట పైరుల కుపకరించుచున్నది.

### 3. జొన్నలరాశి.

నాగలాపురము (హాస్పేట) కు దక్షిణభాగము-నను గట్ట కుత్తరపుఁ జివరను కోణాకృతినిగల యొక చిత్రమైన గుట్టయున్నది. అది జొన్నల (జోలద) రాశి. చుట్టును దట్టముగ మొలచిన పచ్చనిపచ్చికచే నావృత-మయి యిది చూచుట కెంతయును మనోజ్ఞముగఁ గన్పా-ట్టును. బోయయువకు లిందుండి తమ మూఁపులపై ధాన్యపు మూటలుంచుకొని యెచ్చట నాఁగక, కొండ చివరదాఁకఁ బరువెత్తు చుందురు.

### 4. జంబునాథదేవాలయము.

పైనఁబేర్కొనిన పర్వతశ్రేణికిఁదూర్పున,సముద్ర మట్టమునకు ౨౯౮౦ అడుగులయెత్తుగల, జంబునాథ పర్వతమున్నది. పర్వతమధ్యభాగమున నొకవిశాలమగు సమతలముపై జంబునాథదేవాలయము వెలయును. ఈ

ఆల

యాలయమున గమనార్హములగు విశేషములెవ్వియును లేవు; కాని ధాతుశక్తిగల యూటనీటి బావియొకటి గలదు. ఇందలి జల మనేకవ్యాధులను గుదుర్చునని ప్రసిద్ధి. నాగలాపురము (హాస్పేట) నుండి యిచ్చటికిఁగల దూరము మూఁడుమైళ్ళు. కొండ పై భాగముదనుక ననువగు సోపానమార్గ మున్నది. ఈ దారినడుమ నొకమండప మగపడును. దాని స్తంభము-లలో రెండింటిపై శిలాశాసనములున్నవి. అందొక్కటి కొండపైనున్న యనంతశయనాంజనేయ దేవాలయము-లకు మాన్యములుంచియున్నట్టి దానవిశేషముఁదెల్పును.

## 5. పురవృద్ధి.

నాగలాపురమున నొకవిశాలమైన రాజవీధి యున్నది. దీనికిరువైపులఁ జిల్లరవీథు లనేకములు. ప్రధానవీధికిఁజివర నొకదేవాలయము గలదు. గొప్ప గొప్ప వర్తకులందఱును నాగలాపురమునందలి పడమటి భాగమగు చిట్టవాడిగి యను నుపనగరమున వసించుచున్నారు. పడమటితాలూకాల వాణిజ్యమునకెల్ల నిది ప్రాముఖ్యముగనినది. చిట్టవాడిగికిఁ బడమటివైపునఁ బ్రజలలో జ్వరములు వ్యాపించుచున్నందునను, నాగలాపురమున రైల్వేస్టేష నుండుటవలనను, దానియంచున-నున్న చిట్టవాడిగి తూర్పుభాగముమాత్రమే వృద్ధియై, క్రమక్రమముగ నది నాగలాపురములోఁ జేరికొనుచున్నది. పడమటివైపున వరిపొలములుగల పల్లియ

లనేకములు మన్నవు జ్వరాతిశయమునఁ బ్రజలను గోల్పోయి, యరణ్యములగు చున్నవి. భూస్వాములు గూడ పొలములలోని తమ యునికిపట్టులువిడిచి, నాగలా పురముననో చిట్టవాడిగియందో నివాసము గుదుర్చుకొని యున్నారు. వా రనుదిన ముదయమే పొలములకు వెళ్ళి యచ్చట సాయంకాలమువఱకుఁ బనిచేసి, మరల నగరమునకు వచ్చుచుందురు. ఈకారణమున నాగలా పురమునందలి జనసంఖ్య, పదేండ్లలో నూటికి నలువది వంతు హెచ్చినది. చిట్టవాడిగి మద్దలాపురములుగూడఁ క్రొత్తనగర పురపాలకసంఘమునకుఁ జెందినవే. ఇందలి జనసంఖ్య ౧౮౪౮ (౧౯౦౧ జనాభా).

6. మ్యునిసిపాలిటీప్రయత్నము.

౧౮౮౪–౮౫–౮౯ సంవత్సరములలో నీపురము మ్యునిసిపాలిటీ పట్టణముగ మాఱవలయునను సమస్య వచ్చెను; గాని కొన్ని యననుకూలములవలనను, బ్రజాభిప్రాయమందులకు విరుద్ధముగనున్నందునను, నాప్రయత్నము సాగినదికాదు. అచ్చటి ప్రధానసహాయ కరగాహీకార్యాలయము ౧౮౭౮వ సంవత్సరమందుండి గుత్తికిని, ౧౮౭౯వ సంవత్సరమున గుత్తినుండి పెనుగొండకును, మాఱినది.

7. మహామారి. (Plague)

భయంకరమగు నీ వ్యాధివలన నగర మనేక పర్యాయములు క్రింగిపోయెను. ఈవ్యాధి నైజాము

బొంబాయి రాష్ట్రములనుండి యిచ్చటికిఁ బ్రాకుచున్నది. ఒక్కసారి వచ్చెనేనిఁ జాలకాలము పీఁటపట్టుకొని నిలుచును. ఇందలి నైసర్గికగుణము లందులకుఁ దోడగుచున్నవి. ఇదికారణమునఁ బ్రజలెన్నిసారులో యూరు విడువవలసివచ్చినది. పౌరు లీభయంకరమగు మారణవ్యాధికి మిక్కిలి యలవాటుపడియున్నారు. వారి పిల్లలుగూడ నాటలసందర్భమునఁ, దఱచు చిన్నచిన్నప్లేగుగుడిసెలను నిర్మించుకొని, తామందు వసించుచున్నట్లు నటించుచుండుటఁ జూడ, బిడ్డలకుసయిత మదియొక వినోదకరక్రీడగా మారిపోయినది.

## 8. వృత్తులు-వాణిజ్యము.

ఇచ్చటి ముఖ్యవృత్తి నేఁత. తోళ్ళు పదును చేసి యమ్మెడు చర్మపుమండీలుకొన్ని యిందున్నవి. ఇత్తడి కాలిమెట్టెలు నుంగరములు కడియములు చిఱుగంటలు మున్నగువానిని జేసి జీవించు కుటుంబములును గలవు. తుంగభద్రానదివలన నీప్రాంతమునఁ జెఱకువిస్తారముగఁ బైరగును. ఇనుపగానుగ లిందు విరివిగ వినియోగింపఁబడుచుండుటచే, నీయూరికమ్మరివాండ్రు లోహపుగానుగలను దామే చేయుటకును పోఁతపోయుటకును నేర్చికొని యున్నారు. వీనిఁ జేయుటకు వలయు పరికరములను వీరు చెన్నపురినుండి తెప్పించుకొనెదరు. ఇచ్చట బెల్లపువ్యాపారము హెచ్చు. బెల్ల మిందుండి బొంబాయివైపున కెంతవిశేషముగ నెగుమతి యగుచున్నదో యంతయధిక-

ముగ విదేశమునుండి యిక్కడికి చక్కెర దిగుమతియగుచున్నది. ఈహేతువున బెల్లపుధర మిక్కిలితగ్గిపోయినది.

### 9. కోటగోడల గుఱుతులు.

పట్టణమునకుఁ బశ్చిమభాగమున సహాయకర-గ్రాహి బంగళాకు దక్షిణమునఁ, గొలఁదిగమాత్రము కోటగోడలగుఱుతు లిపు డగపడుచున్నవి. బ్రిటిష్ ప్రభుత్వమువారు ౧౮౬౬వ సంవత్సరమునందలి కఱవు సందర్భమున,కూలివాండ్రతో నీకోటగోడఁబడఁగొట్టించి, యపరిశుభ్రపదార్థములకును జీకిపొదలకును నాలయ-మై, దుష్టోరగములకును వివిధ విధ వనసత్వములకును నాశ్రయస్థానమై యుండిన, కోటకు వెలుపలి యగడ్త-లో నామట్టిని ద్రోయించి, ప్రాకారకుడ్యములను నేల సమముగఁ జేసివైచిరి.

### 10. మహమ్మదీయ సమాధులు.

అంగళ్ళవాడకుఁ దూర్పుభాగమున ఱాలచేతను గచ్చువలనను నిర్మింపఁబడి సమాధులతోనున్న మశీదులు మూఁడును, సుప్రమండలకరగ్రాహి బంగళాకు దగ్గఱఁగఁ గల రెండు మశీదులును నీపురమునఁ జూడఁదగినవి. ఈ మశీదులలోని సమాధులు రణరంగమున మృతినొందిన తురుష్కవీరులవఁట. ౧౮౯౭వ సంవత్సరమున నిప్పుడున్న బంగళాకట్టుచున్న సమయమందు, ప్రధానసహాయకరగ్రా-హి యీమశీదులలో నొకదానిని దాత్కాలికముగు వా-సస్థానముగఁ జేసికొనియుండెను. అదియిప్పటిబంగళాయూ-

వరణమున నేయుండినది. అంగళ్ళవాడకుఁ దూర్పుభాగము నందలి సుబేదారుబావియును, దాని కానుకొనియుండు నొకమశీదును, టిప్పుసుల్తానుని సామంతప్రభుఁడుగనుండిన 'గఫూరుఖా'నను నాగలాపురపు సుబేదారునివలన హిజ్రి ౧౨౦ (క్రీ. శ. ౧౭౯౫-౯౬)వ యేఁట నిర్మింపఁ బడెనని యందలి హిందూస్థాని శిలాశాసనము నుడువు చున్నది. ట్రావులర్సు బంగళాకు దక్షిణమున నలువది గజముల దూరములో రెండువటవృక్షముల దిగువ, తన యిరువదిరెండవ (క్రీ. శ. ౧౮౫౮) యేఁటఁ జని-పోయిన 'విల్లియము క్లావరింగు' సమాధి యున్నది. ఈక్లావరింగు బళ్లారినుండి సికందరాబాదునకుఁ దంతి తీగలు వేయుటకై వచ్చియుండి కలరావలన నాగలా-పురమునందలి ట్రావలర్సు బంగళాలో మృతినొందెను.

---

# మూఁడవప్రకరణము.



## కమలాపురమార్గము.

### 1. అనంతశయనాలయము.

నాగలాపురమునుండి యీశాన్యదిశగా వెడలు విశాలమైన మార్గముఁబట్టి నాగలాపురమున కొకటిన్నర మైలుదూరము నడచినచో నందు బాటకుఁ గుడివైపున నొక గొప్పయాలయ మగపడును. ఇది శ్రీకృష్ణదేవ రాయనిచే నిర్మింపఁబడిన యనంతశయనాలయము. దీని సింహద్వార ముత్తరాభిముఖము. గర్భాలయమన్నింటి వలె సామాన్యమగు చిన్న గదికాదు. చతుష్కోణాకృతి గల పెద్దమండపము. ఇది శిథిలగూడము. గర్భాలయమునకుఁ దగినట్లు నిర్మింపఁబడిన పొడవైన వేదికయు, నండాకారముగల పైకప్పును గర్భగృహమునకున్నవి. ఇది యిటుల నసాధారణరూపమున నిర్మింపఁబడుటకుఁగారణము వేఱు. అనంతశయనాలయమునఁ గృష్ణరాయఁడు శేషశాయియగు విష్ణువిగ్రహముఁ బ్రతిష్ఠించుటకై నిర్మించెనఁట. ఈయాలయము నుద్దేశించి చెక్కిన విష్ణువిగ్రహము హడగలితాలూకా హొసాలళ్ళిలో నున్నది. విగ్రహ నిర్మాణము పూర్తియైనపిమ్మట దాని నీనవీనాలయమునఁ జేర్చుట కొక మనుష్యుఁడు నియోగింపఁబడెననియు, నానియుక్తపురుషుఁడు ముందువెళ్ళునపుడు దారినడుమ నెందును వెనుదిరిగిచూడఁగూడదను నియమమున విష్ణుఁ

డటనుండి తరలుటకు సమ్మతించెనయు, నామనుష్యుఁడు పయనము సేయుచు ననంతశయనుఁడు తనవెంట వచ్చు చుండెనో లేదోయని తిరిగిచూచెననియు, నదికారణముగ విగ్రహము కదలక హొళాలళ్ళిలోనే నిలిచిపోయెననియు నచ్చటివా రొకకథచెప్పుకొనెదరు. తక్కినవిగ్రహములఁ గూర్చియు నిట్టికథలే వాడుకలోనున్నవి. ఇవెల్ల విశ్వస నీయములుకావు. విగ్రహము గొనిపోకుండుట కేదేని-బ్రత్యేకకారణ ముండియుండును. దేవాలయము కొంతవఱకు ఖిలరూపము. బ్రిటిష్ ప్రభుత్వమువా రందందు మరమ్మతుచేయించియున్నారు. ఆలయావరణ కుడ్యములు సంపూర్ణముగశిథిలములు. ఈయావరణమున గొల్లవారిపల్లె యొకటి గలదు. దానికి 'అంచెనగుడి' యనిపేరు. ఆలయప్రాకారపు శిల లాగ్రామజనుల గృహముల నలంకరించియున్నవి. పల్లెయందలి జన సంఖ్య ౯౦౭.

## 2. 'సూళెయ' బావి.

అనంతశయనాలయమునుండి తూర్పునఁ గొంత దూరముపోఁగా, నాగలాపురమునకు రెండున్నరమైళ్ళ దూరములో'మల్పనగుడి' యనునొకగ్రామము త్రోవకు దగ్గఱనేకాన్పించును. ఈగ్రామమున కావల నొకకోసు దూరమునందు, మార్గమున కెడమపార్శ్వమున చేనిలో వలయాకారపుబావియున్నది. దీని లోపలిభాగము చుట్టు నష్టకోణాకారపు వసారా యెనిమిదికమానులతో నిర్మిం-

పఁబడినది. పై భాగమునుండి నసారాలోనికి వెళ్ళుటకు రాతిసోపానములు గలవు. ఇది పురాతన నిర్మాణమే; కాని చూచుటకు నయనోత్సవదాయకముగ నున్నది. బావి విశాలమైనది. బాటసారుల యుపయోగార్థము దీనినొక వారకాంత త్రవ్వించెనఁట. కాననే 'సూళేయ బావి' యనఁబడెను.

3 మహమ్మదీయ సమాధులు.

ఈ బావి సమీపమున దాటి రెండుపాయలుగాఁ జీలును. ఒకటి పూర్వ్వగఁగమలాపురమునకును, రెండవది యీశాన్యదిశగాఁ బంకుకును పోవును. ఈ మార్గములు సంధించుచోట నొక పుంకపుఁజావడియు, గమ్యస్థానములను సూచించెడి తెర్కులు మార్గికుసు గలవు. పంపకుఁ బోవుడి శాఖాపథమున నొక మైలుగడువఁగ, కడలై రామపురసమీపమునఁ బై సమాధులు మూఁడగుపడును. ఇవి మహమ్మదీయ నాయకులవి. వీని చుట్టును బలమైన ప్రాకారకుడ్యము గలదు.

4. రాజ వీథి.

నాగలాపురమునుండి యనంతశయనాలయ మూలమున రాజమందిర ప్రాంగణమువఱకు సిరాజవీథి వెళ్ళుచుండెడిది. అందు విద్యానగర సార్వభౌముఁడు నిర్మించిన యనంతశయనాలయమే కాక, యాశ్రేణిలోఁ బ్రభువులును దండనాథపతులును గట్టించిన మఱికొన్ని దేవసదనములుఁగూడ నుండెను. ఆ వీథి కిరువంకల నిండ్ల

వరుసలు కొంచెముక్కుగ దీర్ఘబడియుండినవి. బాటసా-రులకుఁ జల్లని నీడలనొసఁగు వృక్షరాజము లుభయ పార్శ్వముల శ్రేణీబద్ధముగ నెలకొని యుండెననియు, నావిపణిలో సమస్తవస్తువులు సమృద్ధముగ లభించుచుండె ననియు, పెయిస్‌వ్రాసెను. మహాక్రీడా ప్రదర్శనమునకు గూడఁ జాలినంత వైశాల్యముగలదియఁట యావీథి. దాని బాహుళ్యమునఁ గొలకొలలాడుచుండెనని యాతఁడు తెల్పి యున్నాఁడు. ఆజాడలిప్పు డేమియునుగానరావు. ఆకట్టడము లన్నియు నేలమట్టమయి యుండనోపు; అయినను మార్గమునం దచ్చటచ్చట వలయాకారగోపురాంచితములగు పాడుపడినగుళ్ళున్నియున్నవి. ఈగుళ్ళను దవ్వుదవ్వున నుండియే చూడవచ్చును.

5. తటాకమార్గము.

తురుష్కుల సమాధులు చూచుకొని యచట నుండి మరలి, తొల్లింటి మార్గముఁజేరి, పూర్వాభి ముఖముగా నడచుచుఁ, గమలాపురమును సమీపించు చున్నచోట మిక్కిలి వైశాల్యమున విశుద్ధజలము నిండారఁ-గల యొక తటాకము నేత్రగోచరమగుచుండును. ఆ చెఱువుకట్ట చాలవెడల్పయినది; కనుక బండ్లుగూడ యిత మందే వెళ్ళును. చెఱువునందంతటను వెండికత్తులపరంపర-లవలె బేడిస పక్షులుఁగు వాలుగ మున్నగుమీనములు మీఁదికెగయుచు, హాయియలుమీఁఁగులుకుచుఁ, దృటి-లో బుడుంగున నీటమునుంగుచుఁ, దోఁచియుఁ దోఁపని

విధమున నానందము మీఱ ననేకవిధముల నాడుకొను చుండును. నిరంతరమందుఁ బోఁతవిగ్రహములట్లు వసించి కపటధ్యానము నాచరించుచు, నామీలగమి నాహార-ముగఁగొనుచు, బకములు విరివిగఁ బెంపొందుచుండును. అందలి కిరాతులు కొంద ఱాక్రౌంచములను, జాలరులు మత్స్యములను, దఱుచు వేటాడుచుందురు. ప్రభుత్వము వారికీ చేఁపలవ్యాపారమున సాలునకు నాలుగువందల రూప్యములు రాఁబడి యున్నదఁట! ఈ తటాకము చేరువనే కమలాపురమున్నది.

---

# నాల్గవప్రకరణము.

## ౬. లాపురము—తత్ప్రాంతము.

### 1. కమలాపురము.

౧ వైశాల్యము—కమలాపురము, నాగలాపురము రైల్వేస్టేషనునుండి ఈశాన్యదిశ నేడుమైళ్ళదూరమునఁ గలగ్రామము. ఆప్రాంతమునందలి తక్కినపల్లెలకంటె నిది రెండంతలు పెద్దది. ఇందలి జనసంఖ్య ౬౦౩౨. ఇందు పురపారిశుద్ధ్యసంఘకార్యాలయము పోలీసుఠాణా తపాలచావడి పథికావాసగృహము గలవు. ఈపురమును దీనికిఁజేరిన మాగాణియు నిరువదిమూఁడువేల యెకరములకుఁ బైఁబడియున్నది. ఈవిస్తీర్ణభాగమున, దరోజి బళ్ళారిమార్గముల కిరువంకలఁగల నిర్మానుష్యములు నిస్సారములునైన గుట్టలుచేరియున్నవి. కమలాపురము విద్యానగరమునకుఁ గేంద్రస్థలమగుటచే విద్యానగర శిథిలభాగములుఁగూడఁ గొన్ని దీనితోఁ గలిసియున్నవి.

౨. చెఱువు—ఈప్రాంతమందలి చెఱువులలో సీయూరితటాకము పెద్దది. దరోజీచెఱువునకిది రెండవది. తుంగభద్రనుండివచ్చు రాయలకాలువ దీనికాధారము. ఈచెఱువునీటిచే ముఖ్యముగ వరి, చెఱకు, రమారమి ౪౫౦ ఎకరములు పైరుపెట్టఁబడుచున్నది. చెఱకు మాత్రమే పైరుపెట్టుచో పన్నులును వ్యయమును పోఁగా

రైతునకేఁబది కాలువంపల యాదాయముండునఁట. కావుననే యిందలిపల్లపుభూమి యొకరము రమారమి పదునేను వందలరూప్యముల మదింపునకెక్కియున్నది. తుంగభద్రానదీకుల్య (రాయలకాలువ) నిరంతర మేకవిధముగఁ బ్రవహించుచుండుటచే చెఱువెండిపోవుటగాని భూములు బీడువడుటగాని యెప్పుడును సందర్భింపదు.

3. కమ్మరులు: వృత్తి—కొంతకాలము క్రిందటి వఱకుఁ జెఱకుపాలు కాంచు కొప్పెర లిచ్చట విస్తారముగ సిద్ధమగుచుండెను. సొండూరిపర్వతమాలికకుఁ జివర నాగలాపురమునొద్ద గుమ్మటపుటాకృతిఁగల జంబునాథగిరి నుండి, ముతుక యినుపరజము గంతయెద్దులపై నిచ్చటికిఁ దెచ్చుచుండిరి. ఇందలికమ్మరు లారజమును జక్కఁగఁ గాఁచి యందలిమైలఁ దొలఁగించి, శుద్ధలోహముగ నొనర్చి దానితో వలయుపరికరములు చేసికొనుచుండిరి; కాని యాంగ్లభూమినుండి దిగుమతి యగు యినుము చౌకఁగ లభింపనారంభించినది మొద లీవృత్తి పడిపోయినది. ఇపు డచటి కమ్మరులు తమ పనులకన్నింటికి విస్తారముగ విదేశీయ లోహమే వాడుచున్నారు. ఈకమ్మరుల కులదేవత కాళి. ఊరిలోని కాళికాలయమున వీరేపూజారులు.

4. సత్రము—శిథిలభాగములు సందర్శింపఁగోరు యాత్రికులు బసచేయుటకు కమలాపురమునకంటె సర్వ మైన తావు వేఱొండులేదు. బాటసారులుదిగుటకై యూర నొక మంచిసత్రమున్నది. పూర్వమిది యొక

పాడుపడిన దేవాలయము. బళ్ళారి మండలమునకు కరగ్రాహి (Collector) గ వచ్చియుండిన 'జె. ఎచ్. మాష్టర్' అనునాతఁ డాయాలయమున నపుడపుడు తాత్కాలికముగ వసించుచు, చెడినభాగముల నన్నింటిని గ్రమక్రమముగ బాగుచేయించుచు, దానిని యాత్రికావాసగృహముగ మార్చి, స్థానికస్వపరిపాలన సంఘము వారి వశముచేసెను. జీర్ణ విద్యానగర ప్రేక్షకు లీసత్రము విడిదిగ నేర్పఱచుకొనినచో, మున్ముందు వర్ణింపఁబోవు శిథిలములఁజూచుటకు మిగుల ననుకూలముగ నుండును.

౫. బ్రహ్మమందిరము— ఇది ౧౮౬౫వ సంవత్సరమున విద్యానగరపు రాజవంశజులలోఁ గడపటి ప్రభుఁడగు నానెగొంది సంస్థానాధీశ్వరున కునికిపట్టుగ నుండెను. దీనిచుట్టును బలమైనగోడయొకటి యావరించి యుండినది. ఆప్రాకారపు నాల్గుచెఱఁగులలో నున్నతములై వలయాకృతిని వహించి గోపురాంచితములగు బురుజులు నాల్గుండెను. మందిరాంతర్భాగమున సీళ్ళ లేని రాతిబావియొకటి గలదు. ఈమందిరము బ్రహ్మకు మిగులఁబ్రీతిఁగూర్చునదియఁట. కష్టదశలోనున్నవారును జబ్బుపడినవారును నిచ్చటికివచ్చి, యారాధనలుసల్పి, గుణము పొందెదరనుట జనశ్రుతి.

౬. మహమ్మదీయులదరగా—పురాతన పట్టణమగు విద్యానగరసింహద్వారమునొద్ద కంప్లికిఁబోవు మార్గమునకు సమీపమున మహమ్మదీయుల 'దరగా'

యున్నది. ఇది శిథిలముగాక సుస్థితియందే కలదు. ఆదోని పాలకుఁడుగనుండిన 'ముసల్ మార్జంగు' అనునతఁడు దీని రక్షణకర్త. మహాత్ముఁడగు 'సయ్యద్ నురుల్లాఖాద' రనునతని స్మారకార్థమిది కట్టింపఁబడినట్లు ప్రతీతి. దీని రక్షణార్థము రెండువందల రూప్యములవెలగల యెనిమి దెకరముల మాన్యక్షేత్రమునొసఁగబడినది. రంజాన్ నెలలోఁ బదునైదవదినమున నురుల్లాఖాదరు జ్ఞాపకార్థము మహా-మ్మదీయు లిచ్చట నొకయుత్సవము జరుపుదురు.

## 2. పట్టాభిరామదేవాలయము.

సత్రమునుండి కొంతవఱకు నుత్తరముగఁ బుర గ్రామ్యము దనుక వెళ్ళి, యచ్చనుండి తూర్పున బళ్ళారి మార్గమున నరమైలుమారము నడచినచో, బాటకుఁ గుడిపార్శ్వమున పట్టాభిరామదేవాలయము కాన్పిం-చును. ఇది ౧౫౩౦-౪౨ సంవత్సరముల మధ్యకాలమున నచ్యుతరాయునిచే నిర్మింపఁబడినట్లిందలి శాసనమువలనఁ దెలియుచున్నది. పరిమాణమున నిది శిథిలాలయముల యన్నిటికంటెను మిగులగొప్పది. కమలాపురమునుండి పంపకును కాంపిల్యనగరమునకును బయలువెడలు రెండు మార్గముల కిరుపంకలును నున్న కట్టడములలో నీయాల-యము చాలఁబ్రసిద్ధినొందినది. దీనికిఁ జారిత్రకప్రాముఖ్య మేమియునులేదు; ఇందలి ముఖమండపము శిల్పకళా విహీనమైనను మిగులవైశాల్యముఁగల్గి,దర్శనయోగ్యముగ నున్నది. గర్భమందిరము విగ్రహశూన్యము. గర్భా-

లయమునకు దక్షిణమునఁగల వేఱొకమండపమున నొ-
క్కొక స్తంభమునఁ బదిపం డ్రెండు చిన్న కంబము లేక
శిలలోఁ జెక్కఁబడినవి. ప్రాకారావరణములో నిర్జల
కూపమొకటుగలదు. ప్రాకారకుడ్యములు తక్కినవాని
వలె బలాఢ్యములైన శిలలతో నిర్మింపఁబడినవి. సింహ
ద్వారము పూర్వాభిముఖము. ఈద్వారముపై సా-
మాన్యమానవుఁడు నిక్కి రాయి రువ్వఁజాలని యంతటి
యున్నతముగల గోపురమున్నది. ఇది కొంతవఱకు భిల
రూపము. హజారరామస్వామిగుడి విఠోబాలయము
చూచుటకుఁబూర్వమే యిది చూడఁదగినది.

### 3. కొలను.

ఈగుడికిఁ గొంతదూరమున మార్గమునకు వామ
పార్శ్వమునఁజుట్టును సోపానములుగల కొల నొకటి కా-
న్పించును. ఇపుడు దానిలో నీరులేదు. విద్యానగర
ప్రభువులకాలమున కమలాపురతటాకమునుండి దీనికి జల-
ము వచ్చు మార్గము గల్పింపఁబడియుండెను. ఇంకను
పూర్వదెసకుఁబోవంబోవ నెన్నియో పాడుపడిన గుళ్ళు-
న్నవి. వానికావలఁ బూర్వభాగపు సింహద్వార మగ-
పడును.

### 4. సింహద్వారము.

౧. ద్వారస్వరూపము—ఉత్తరమునఁ బెక్కు
మైళ్ళవఱకుఁ బ్రవహించెడు తుంగభద్రయుఁ, దక్కిన

దిశలఁగొలుసువలె నొండొంటితోఁ జేరికొనియున్న పర్వ-
తమాలికాపరంపరయు మేరలుకాఁగా, యుద్ధమే ప్రధాన
ధర్మమయియుండిన వెనుకటి దినములలో, విద్యానగర
మానాఁటి రాజపుంగవులచే శాశ్వతదుర్లంఘ్యముగ
నిర్మింపఁబడియుండెను. ఆ సువిశాలమహానగరముఁ జుట్టి
వచ్చునట్టి యున్నతములైన ప్రాకారముల కందందు జనుల
రాకపోకల కనువుగఁ గొన్ని ద్వారములుమాత్ర మేర్పఱు-
పఁబడియుండినవి. ఇవి సుభద్రములై సమున్నతగోపు-
రాలంకృతములై వీరభటులచే సురక్షితములై వెలయు
చుండినట్లు చరిత్రచాటుచున్నది. ఆయున్నత ప్రాకార కు-
డ్యముల యడుగున నిర్మింపఁబడిన యీ ద్వారములు
మహాభూధరశ్రేణుల యధోభాగమున నంటిలి చిన్నచి
కన్నములవలె గోచరించుచుండె ననుట సమాసోక్తియే
యగును.

౨. హనుమంతుని సింహద్వారము—ఇట్టి ద్వా-
రములలో నొక్కటి హనుమంతుని సింహద్వారము. ఇది
పట్టాభిరామ దేవాలయమున కీశాన్యదిశ నరమైలుదూర
మున నున్నది. తక్కినయన్ని ద్వారములవలె నిది బహుధృ-
ఢమైన శిలలచే నిర్మింపఁబడి, పైన పాలగారచే నొప్పు
చున్నది. సుందరద్వారములలో నిదియొకటి. దీని
యడుగుభాగము హైందవశిల్పకళకును, గుమ్మటపు
టాకృతిఁగల గోపురభాగము మహమ్మదీయ శిల్పకళకును
దార్కాణ మనవచ్చును. తొలుత నిదియు నిట్టివగు నితర

గోపురములును హైందవులచే హిందూసాంప్రదాయాను సారముగఁ గట్టఁబడియుండినను గాలాంతరమున శిథిలము లైన గోపురభాగములు, ప్రౌఢదేవరాయఁడు తుళువ నరసరాజు కృష్ణదేవరాయఁడు మొదలగు చక్రవర్తుల కాలమున, విద్యానగరమహారాజుల సేనలో నుండిన మహమ్మదీయ యోధులవలన సంస్కరింపఁబడినవగుటచే, నవి తురుష్కసాంప్రదాయసిద్ధముగ నిర్మింపఁబడియుం-డును. ఇందు లోపలిభాగమున నున్న కొట్టులో నాంజనే-య స్వామి విగ్రహమున్నది. ఇందువలననే హనుమంతుని ద్వారమను పేరు దీనికి వచ్చియుండును. ఈద్వారమునకుఁ బ్రక్కలలోఁగల కోటలు శిలరూపములు. ఈద్వారము ననుసరించి కట్టఁబడినద్వార మింకొకటి నగరమున కుత్తర మున విట్ఠలరాయ దేవాలయమునకుఁ బోవుత్రోవ నున్నది.

3. భీమ ద్వారము — హనుమంతుని ద్వారమున-కును 'గానిగిత్తి' దేవాలయమునకును నడుమ నన్నూరు గజములదూరములో, భీమద్వారమున్నది. దానిలో భీమునివిగ్రహము గలదు. అందుచేతనే దానికి పేరు వచ్చియుండును. విగ్రహపార్శ్వతలమున నొకశిలా శాసనమున్నది. దానియందలి యక్షరము లరిగిపోయి నందున స్పష్టముకావు. పైనవివరించిన ద్వారముల రెండింటికంటె నిది విశేషభాగము కలదైనది. ఈ సింహ ద్వారము పూర్తిగ హిందూసాంప్రదాయ విధానము ననుసరించి యున్నది. దీనికొక దిడ్డివాకిలి గలదు.

౪. కాంపిల్యనగరమార్గద్వారము—భీముని సింహద్వారమువంటి ద్వారమే మఱియొకటి కమలాపురము నుండి కాంపిల్యనగరమునకు వెళ్ళుమార్గమునందున్నది. ఇది పైదానియంత శిథిలమైనదికాదు; కాని దానివలెనే పూర్వపు హిందూనిర్మాణవైఖరికి జాడయున్నది. విద్యానగరమున మనము కనుగొనెడు సింహద్వారములలో నిది బలవత్తమమైనది. నగర ప్రాకారకుడ్యములు-మేడలులేని నిర్మాణములు నాగలాపురము (హాస్పేట) వఱకు వ్యాపించి యుండినను, నిపుడవి సంపూర్ణముగ శిథిలావస్థలో నున్నవి. హనుమంతుని సింహద్వారమును జూచికొని కమలాపురమునందలి బసకు మరలగును.

కమలాపురమునుండి యుత్తరాభిముఖముగ రెండు మార్గములు వెళ్ళును. అందొకటి యీశాన్యదిశగాం గాంపిల్యనగరమునకును రెండవది వాయువ్యమూలగాం బంపకును బోవును. ఈవాయువ్యమార్గమే పంపాపురమునుండి చిన్నసిత్రోవగామాఱి యానెగొందికి వెళ్ళును. మనము తొలుత కాంపిల్యనగరమార్గము ననుసరింతము.

---

## అయిదవ ప్రకరణము.

---

### కాంపిల్యనగరమార్గము.

#### 1. 'గాణిగిత్తి' దేవాలయము.

కాంపిల్యనగరమార్గమున నరమైలుదూరము నడచినచో దారికిఁగుడివైపున దగ్గఱఁగ నీయాలయమున్నది. ఆలయమునకెదుట నున్నతమైన ధ్వజస్తంభ మున్నది. రెండవహరిహరుని కాలమున (౧౩౮౫ న) నాతని దండనాథుఁడగు 'ఇరుగప' యీజైనాలయముఁ గట్టించినట్లు ధ్వజస్తంభమునఁగల శాసనము సూచుచున్నది. నాఁటి హిందూరాజులు జైనాలయములకు మహమ్మదీయుల మసీదులను నిర్మించుటకయి యిట్లు ప్రోత్సహించుచుండుటచే వారిమతసహనమున కచంచలమైన తార్కాణమయి యున్నది. 'గాణిగిత్తి' యనఁగా గాండ్లవాండ్రు. ఇది గాండ్లవా స్త్రీ కట్టించినయాలయముకాదు; గాన దీనికీపేరేలవచ్చెనో తెలియదు. ఇది జైనదేవాలయము. ఆలయముకెదుట ముగ్గురుజైనులు గొడుగుపట్టుకొని కూర్చుండియున్నట్లు చెక్కఁబడియుండుట జైనాలయమనుటకొక ప్రధానసాదృశ్యమగును. ఈయాలయముఁ జూచినంతనే హైందవశిల్పమునకు జైనశిల్పమునకుఁ గల భేదము సులభముగఁ దెలిసికొనవచ్చును. ఈయాలయ గర్భగృహముపైనిగోపురము మెట్లుమెట్లుగాఁదీర్పఁబడినది.

గోపురముల నిట్లు సోపానపరంపరాకృతిని నిర్మించుట యీ మండలమునందలి జైనుల నిర్మాణపద్ధతులలో ముఖ్యముగ గమనింపదగిన యంశము. శిథిలపట్టణము నందలి యితర భాగములందుఁగూడ నీరూపమునఁగల దేవాలయములఁ బెక్కింటి నిప్పటికిని జూడనగును.

## 2. మాల్యవంతరఘునాథాలయము.

గానిగిత్తి దేవాలయమునుండి కాంపిల్య నగర మార్గమున రెండుమైళ్ళునడవఁగా మాల్యవంతరఘునాథ స్వామిగుడి, త్రోవ కెడమవైపుననున్న ప్రస్రవణగిరిపైఁ గాన్పించును ఇది యుత్తరాభిముఖము. గర్భాలయమునకుఁ బైన నున్నతమైన గోపురముగలదు. శిథిలభాగముల యందలి తక్కిన యన్ని దేవాలయముల వలెనే యిదియు ద్రవిడనిర్మాణపద్ధతిని నున్నది; కాని యిందలిశిల్పకళ తక్కినవాని శిల్పకళకంటెను చక్కనిది. ముఖశాలయందును కల్యాణమంటపమునను గల కరశిల్పము ముద్దులు గుల్కుచున్నది. ఆలయప్రవెలిగోడలపై రాక్షసాకారములు సూర్యచంద్ర గ్రహములు మత్స్యములు సర్పములు మిగుల నందముగఁ జెక్కఁబడినవి. కృష్ణస్వామి యాలయమునఁగూడ నిట్టి యలంకారము కలదు. ఆంజనేయుఁడు సీతాదేవి కుశలవార్త యెఱింగించిన తరువాత వర్షర్తువు గడచునందాఁక శ్రీరాముఁడు తమ్ముఁడగు సౌమిత్రితో వానరసైన్యమునకయి యిందు నిరీక్షించి యుండెను. రాముఁడు పితృతర్పణముఁగావింపఁ దలఁచి

జలమునకయి యొకవిశాలమయిన గండశిలపై బాణము వేయఁగా, నది యాబండనుజీల్చి నీటినిపై కిఁదెచ్చినట్లు చెప్పుచు, నాప్రాంతవాసులు చూపించెడు రామబాణ మను పేరుగల దొన యాలయావరణమునందుఁ దూర్పు భాగమున శరాకారమునసే యగపడును. ఇందుఁ జల్లని శుద్ధోదక మున్నది. ఈసీరము తనకు వినియోగార్హ ము కానందున లక్ష్మణుఁడు దీనికి దక్షిణపువైపున నింకను గొంతపైభాగమున శరమువైచి జలముసాధించిన దొన యింకొకటి వేఱుగ నొకగండశిలపై బాణకారమునసే యున్నది. దానికి 'లక్ష్మణ బాణ' మనిపేరు. లక్ష్మణ బాణముకడ రామలక్ష్మణు లిరువురు బిత్రునకుఁ బిండప్రదానముగావించి, బ్రాహ్మణునకుఁ దండ్రిపేర స్వర్ణశృంగములుగల గోవులను బెక్కింటిని దానముచేసిరనియు, నందులకు గుఱుతుగ లక్ష్మణబాణసమీపమునఁ బిండాకృతులును ధేనురూపములును జిత్రితములై నవనియు, నచ్చటివారు చెప్పుచున్నారు. 'ఎ. ఎచ్. లాంగస్టు' అను నాంగ్ల చరిత్రకారుఁడు లక్ష్మణబాణమునుగూర్చి వివరించుచు, పిండాకృతులను ధేనురూపములను గుఱించి తెల్పునపుడు, దానియందు దశసంఖ్యాకములగు లింగములును నందులును గలవని వ్రాసెను. లక్ష్మణబాణమునకుఁ జేరువనే యాగ్నేయమూల నున్నతస్థలమున నొక గుంటిమీఁద శివాలయమొకటి యిటికతో నిర్మింపఁబడినది. బహుకాలమువఱకు నది నిగ్రహశూన్యముగ నుండెను;

కాని యీవల విహారదేశమునుండివచ్చిన యొకబైరాగి యిందు శివలింగప్రతిష్ఠ గావించెనట. ఈశివాలయము-నకుఁ బడమటిప్రక్కనున్న యున్నతవిశాల శిలాసమతల-మున నిలిచి, పశ్చిమాభిముఖముగఁ జూచినచో నొక వైపున శిథిలనగరమునందలి యేనుఁగుశాలయుఁ బ్రాకార కుడ్యములును, మఱొకవైపున నంజనపర్వతమును మాతంగగిరియుఁ దదితర శైలమాలికయు నేత్రరంజకములయి యొప్పును. ఈయాలయమున నేఁడాదికొక్క పర్యాయము బ్రహ్మారథోత్సవ మొనర్పఁబడుచుండెననియు నిపు డది యాఁగిపోయినదనియు వినికి.

### 3. ఆనందగుహ

౧. ఉనికి — మాల్యవంత రఘునాథాలయము విడిచి కాంపిల్యపురమార్గమందే యరమైలుగడచినచోఁ బ్రధానమార్గమునుండి యొకశాఖ వాయువ్యదిశగాఁ జీలును. శాఖాపథము ప్రధానమార్గమునుండి వేఱగు చోట 'ఆనందగుహా'యని వ్రాయఁబడిన దారుఫలక మొక చెట్టునకు వ్రేలాడఁగట్టఁబడి యున్నది. ఆశాఖ ననుసరించి యరమైలు నడచినచో, తుంగభద్రానదీ కుల్యాతటమున నున్నతశిలాతలమున నీమాల్యవంతానంద గుహ గాన్పించును.

౨. ఆశ్రమభాగములు — ఆనందాశ్రమమున శంభునాథుని మేడయు నాతని శిష్యుల కుటీరములు శివాలయము యజ్ఞవేదిక ఆంజనేయస్వామిగుడి మున్న-



మాల్యవంత రఘునాథాలయము.

గునకుగలవు శంభునాథునిమేడ కభిముఖముగఁ దూర్పున నాతని ప్రధానశిష్యుని కుటీరమున్నది. ఈనిర్మాణమునకు దక్షిణమున నొకవంకఁ బశ్చిమదిశను జిన్నని శివాలయ-మును, దానికిఁ బడమటిదిక్కున నించుక పైవెపునందు, దక్షిణపార్శ్వమున యజ్ఞవాటికయు, నుత్తరభాగమున హావనవేదికకంటెఁ గొంచెమెత్తులో నాంజనేయాలయ మును గలవు. ఆ యంజనేయాలయమునకుఁ బైననే యానంద గుహా యున్నది. ఇది యాంజనేయాలయమువలెనే గా-ఢాంధకార పరిపూరితము. అందుశిరస్సహితమగు వ్యా-ఘ్రాజినమును శంభునాథుని గ్రంథావళియు నున్నవి. క్రిందనున్న శివునకును, నాంజనేయ విగ్రహమునకును, గుహాయందలి గ్రంథాదులకును, ననుదినము నారాధనము జరుగును.

3. శంభునాథస్వామి—ఈతఁడు కాశ్మీర దేశము నుండివచ్చిన యొక బైరాగి. మాల్యవంతశ్రేణియందలి యుత్తరపుటోరలోని యాభాగమున స్థలముతీసి, యందు పైనఁదెల్పిన రెండంతస్థులమేడయు నితరములగు కుటీర-ములను నిర్మించుకొని శిష్యులతో వసించుచున్నాఁడు. మే మీతని యాశ్రమమునఁ గొన్నిదినము లుంటిమి. శంభునాథుఁ డవివాహితుఁడని వినికి. ఏఁబదేండ్లకు మిం-చనివయసును, మంచియంగపుష్టియు,స్వచ్ఛమగుగొజ్జెఁగ (గులాబి) పుష్పమువంటి శరీరచ్ఛాయయు, బింబఫల డంబము నధఃకరించు నధరయుగ్మమును, తేజోవంత

మైన వదనారవిందమును గల్గి, హరిణాంబకములఁ బోలి దయాశాంత ప్రవర్షములుగురియు ప్రకాశమానమయిన నయనములు గళమున నొప్పారుచు, శ్రీ బైరాగి యెప్పుడును హాస్యముఖుఁడును మధురవచోప్రియుఁడును నై వెలయును. ఈతఁడు మడమలదాఁక విశుద్ధ స్వదేశ కాషాయాంగ-రేఖయు భ్రూమధ్యమునఁ గుంకుమమును ధరించును.

౩. రోగనివారణము—శంభునాథునకు సమ్మోహ-హనశక్తి గలదని ప్రతీతి. ఒక్కయన్ని హస్తాత్రిబలముననే యాతఁడు సమస్త వ్యాధులను గుదుర్చునఁట. మేమందు వసించియుండినకాలమున రుగ్ణగ్రస్తులు కొంద ఱీయోగి కడకువచ్చుచుండుట సందర్శించెను. ఉన్మాదవశుఁడగు నొక వృద్ధబ్రాహ్మణుఁ డిచ్చటఁ జికిత్సఁ బొందుచుఁ గొంత వఱకు గుణముఁబొందె ననఁదగును.

4 మధువనము.

ఆనందాశ్రమమునుండి వెనుదిరిగి కాంపిల్యనగర మార్గమున మూఁడుఫర్లాంగుల దూరము నడచినచోఁ దూర్పునఁ దోవనకుఁగుడివైపునఁ బూర్వాభిముఖముగ-నున్న యాంజనేయస్వామిగుడి కాన్పించును. ఆచోటు పూర్వము మధువన ముండినభాగమని ప్రతీతి. ఆంజ-నేయుఁడు సీత కుశలవార్తకనుఁగొని తిరిగివచ్చు సందర్భ-మున, రఘువీరుని సందర్శించుటకుముందు, సానుచరులగు వానర వీరులతో విచ్చలవిడిగ సంచరించిన వనమిది. ఇపుడిందు వనములేదు. ఆంజనేయాలయము మాత్ర

మున్నది. గర్భాలయమున రమారమి పదునైదంగుల మెత్తుగలిగి యేకశిలానిర్మితమైన యాంజనేయవిగ్రహము గలదు. ముందటిభాగమున బలవత్తరములైన స్తంభములపై నిలుపఁబడిన మొగసాలయున్నది.

5. కొండ (గడ్డ) తిమ్మప్పగుడి.

కాంపిల్యనగరమునకు వెళ్ళుమార్గమునందే మధువననమునకుఁ దరువాతఁ గొన్ని గజములదూరములోఁ బ్రధానమార్గమునకుఁ దూర్పున నొకచిన్నని కాలిజాడ గిరిశ్రేణిపై పువెడలును. ఆకాలిత్రోవను బట్టిపోయినచో నదియొకగుట్టపై నున్న హనుమదాలయముకడకుఁ గొని పోవును. ఆయాలయమే తిమ్మప్పగుడి. గర్భమందిర మంధకారావృతము; గాన నిగ్రహము కానరాదు. ఈ తిమ్మప్పగుట్టపై నిలుచుండి పశ్చిమాభిముఖముగ దృష్టి సారించినచో దృష్టిపథంగము మనోజ్ఞముగఁ గాడఁగట్టును. పడమటి వైపుననున్న కడలైరామపుర ప్రాంతమునందలి పచ్చని వరిపొలములు చెఱకుఁదోఁటలు టెంకాయ తోఁపులు చుట్టునున్న పర్వతమాలిక లోనగునవి కనులఁ దనియించును.

6. కాంపిల్యనగరము.

౧. జనసంఖ్య: కాన్యస్థానములు—ఇది నాగలాపురమునుండి యీశాన్యదిశ నిరువదిమైళ్ల దవ్వునను కమలాపురమునుండి పదునాల్గుమైళ్ళదూరముననున్నది. కమలాపురము దాఁటిసపిమ్మట తిమ్మాపురపు పర్వత

ప్రాంతమునందలి యరణ్యప్రదేశము ప్రకృతిశోభచే మిగుల రామణీయకముగ వెలయును. కమలాపురమునుండి పైనఁదెల్పిన యరణ్యమార్గమున నరుగువారీసృష్టి వైచిత్ర్యములఁ దిలకించుచునే కాంపిల్యనగరముఁ బ్రవేశింతురు. ౧౮౫౧వ సంవత్సరమువఱకు నిది నాగలాపురమండల భాగమునకు ముఖ్యపట్టణముగ నుండెను. అప్పుడీభాగమును 'కంప్లి తాలూకా' యనుచుండిరి. ఈ పురమందలి జనసంఖ్య ౯౮౦౩. ఇచ్చట పురపాలక కార్యాలయమును సబ్ రెజిష్ట్రారు ఆఫీసును ట్రావెలర్స బంగళాయు నున్నవి. ట్రావెలర్సబంగళా పట్టణమునకు నిఋతిపూర్వన దర్గాజిక్కఁబోవుమార్గమునఁ గలదు.

౨. చారిత్రకప్రసిద్ధి—కాంపిల్య నగరము చరిత్రాత్మకమైన స్థలము కూడ. క్రీ.శ. ౧౦౬౪వ సంవత్సరమున నిది చాళుక్యులకు రాజధానిగానుండెను. దీనిని చోళులుజయించి యందులకు విజయసూచకముగ నిందొక జయస్తంభమునునిల్పిరి. 'ఇబ్నబటూటా'యనునతఁ డిది యానెగొంది నాయకులకుఁ బ్రధానదుర్గముగను విద్యానగర రాజులకు వెలికోటగను నుండెననినుడువుచున్నాఁడు. ఇందలికోట తుంగభద్రానదీతీరమునలభించు నల్లరాళ్ళతో నిర్మింపఁబడి, తుంగభద్రాప్రవంతీతటము నానుకొని యున్నది. విద్యానగర సామ్రాజ్యసామంతప్రభువులగు బళ్ళారిపాళెగాండ్రలో నొకనివలన నీప్రాకార నిర్మింపఁబడినట్లు తెలియుచున్నది. తాళికోట యుద్ధానంతర

మీఁబళ్లారి సామంతనృపులు విద్యానగరరాజుల యాధిప-
త్యమునుండి తొలఁగి, స్వతంత్రులైరి. ఈపాళెగాండ్రలో
నొకఁడగు హనుమప్ప కాంపిల్యనగరమునొద్ద తన
ప్రభునినోడించెను; కాని కోటమాత్రము స్వవశము
కాలేదు.

3. పురభాగములు—ఈ పురము రెండు భాగ-
ములు గలది. కోటలోనిభాగము కంప్లికోటయనఁబడును.
ఇది గృహవాటికలచేఁ గిక్కిరిసియున్నది. నదికొక
మైలుదూరమునఁగలదిపేఁట. కోటకంటెపేఁటయే యా-
రోగ్యకరము. ఇందలివీథులు సిఱుకైనవి. తుంగభద్ర
హద్దుమీఁటి పాఱునపుడు జనులు పురమునందలికొంత
భాగము విడువవలసి యుండును.

౪. చేతిపనులు: వ్యాపారము—ఇచ్చటి చేతిపని
నేఁత. అదియు వృద్ధికరముగలేదు. ఈ ప్రాంతమున
తుంగభద్రానదీజలమువలనఁ జెఱకు విస్తారముగఁ బై-
రగును; కాని యందుండి సిద్ధమగుబెల్లము ప్రేలైనది
కాదు. దానికిఁదోడుగ నితరప్రదేశములనుండి దిగుమతి
యగుచక్కెర చౌకఁగ లభించును; గాన బెల్లము ధర
తగ్గినది. ఈ హేతువునఁ జెఱకుదోఁటల రైతులు
హీనదశలోనున్నారు. కొయ్యలోఁ జిత్రములు దీర్చుట-
యు, తరణియంత్రమున బొమ్మలు సిద్ధముచేయుటయు,
నిచ్చట ముఖ్యములైన చేతిపనులు. ప్రకృతము వీనిలో
మొదటివృత్తి నిలిచిపోయినది. మూటలు గంతలు మో-

యు ప్రశస్తములైన యెనుముల కీయూరు పేరొందినది. సర్వసాధారణముగ నీ ప్రాంతములోని యెనుములకెల్ల కొమ్ములనడుమును నొసటిపై భాగమును తోఁక చివర కుచ్చును ధావళ్యమునొంది యుండును. ఇచ్చటి తుంగ భద్రానదీభాగమును జనులు పుట్టిలో దాఁటుచుందురు. ఆ ప్రాంతమువా రీపుట్టినే 'యరగో'లందురు.

నాగలాపురము ( హాస్పేట ) నుండి కమలాపురము మూలమున కాంపిల్యనగరమునకు మోటారు యానసౌకర్య మున్నది. కాంపిల్యనగరము చూచుకొని క్రమ్మఱఁ గమలాపురమునందలి బసకు మరలనగును.

---

# ఆఱవప్రకరణము.

## అంతఃపురావరణమార్గము.

ఈమార్గము, రాజపథమువలె విశాలముగనున్నను బహుళకంటకావృతము.

కమలాపురమునందలి సత్రమునుండి కాంపిల్యా నగరమార్గము వదలి వాయువ్యమూలగా నీయంతః పురావరణమార్గమున నడచినచోఁ గొంతదూరముననే యంతఃపురస్నానగృహ మగపడును. నేఁటిదనుక శిథిలము గాక నిలిచియున్న కట్టడములలో నిదియొకటి. ఇదియొక చౌకపుగది. చుట్టు నగడ్తయున్నది. వెలుపలిభాగము సామాన్యము. ఈగృహమునకు నలుప్రక్కలను ద్వారము లున్నవి. లోపల మహమ్మదీయనిర్మాణపద్ధతిని గచ్చు-తోఁ గమానులుదీర్చి కట్టఁబడిన నడవ (వరండా) కమల మందిరమునకువలెనున్నది. లోపగోడలు గారతో నిర్మిం-పఁబడిన చిత్రములచే నలంకృతములు. కమలాలయము నిదియు నేకసమయముననేపుట్టియుండును. కృష్ణాలయము నందలి యొకకట్టడమునఁదప్ప, నిఁకే దేవాలయమునందును మహమ్మదీయ నిర్మాణవిధానచిహ్నములుగాని కమాను-లుగాని లేవు. కమానులుతీర్చికట్టుట హిందువులకు సమ్మతముకాదు. ఈ మందిరమధ్యమున నొక క్రీడా సరస్సున్నది. అదిముప్పదియడుగుల పొడవును నంతియ

వెడల్పును నేడడుగులలోతును గలది. అడుగును దానికిఁ జేరిన పార్శ్వభాగములును పాలగారచే వెలయును. ఉత్తరదిశయందు సరస్సులోనికి సోపానములున్నవి. తుంగభద్రనుండి నీరువచ్చుట కనువైన రాతికొట్టమీ గృహమునకుఁ దూర్పున మెట్టమీఁద శిథిలమైకన్పట్టును. అంతఃపురమందిరమున కిది యరమైలుదూరమునఁగాదు. రాజును నంతఃపురకామినులును వినోదార్థమిచ్చటికి వచ్చుచుఁ దఱుచుగ నిందుజలక్రీడ గావించుచుండనోవు.

2. నీటికాలువ.

ఈస్నానగృహముచెంతఁ ద్రిభుజాకారముగ రెండు మార్గములుచీలును. అందుండియొకటి పశ్చిమోత్తరముగా పంపకు వెళ్ళును. రెండవది కొంచెము త్తరపువాలుగాఁ దిరిగి చివరకుఁ బైమార్గముననే లీనమగును. రెండవ దారిని గొంతదూరముపోయినచోఁ ద్రోవకు వామపార్శ్వమున రమారమి యెనిమిదడుగులలోతును ముప్పది గజముల వెడల్పును నూఱుగజముల పొడవునుగల నిడు చదరపుసరస్సు కాన్పించును. ఇదియును జక్కనిసన్నమున్నముచే పొరుమీఱుచున్నది. తుంగభద్రనుండి నగరమున నీళ్ళుకొంపోవుటకై పొడవునను గండశిలలోఁ దొలువబడిన నీటికాలువ కొలని కనతిదూరముననే యుత్తరపుదిక్కున నేలమట్టమునకు దాదాపు పదడుగులయెత్తుమీఁదఁ బూర్వపశ్చిమముగ వెళ్ళుచున్నది. ఆకాలువనుండి యీపల్లమువఱకు ఱాతినీటి గొట్టములు రెండు




అంతఃపురస్నానగృహము.

శిథిలరూపమునఁ బొడఁగట్టుచున్నవి. రాజాంతఃపురమున వసించు పరిజనవర్గమునకును, రాజదర్శనార్థమై వచ్చెడు నదితరులగు ప్రముఖులకును, నిదిసర్వసాధారణమగు స్నానపుఁ గోనేరు కాఁబోలును. ఈఁతపంటెమునకుఁగూడ నీ కొలను నుపయోగింపఁబడుచుండెనని తెలియవచ్చెడిని.

### 3. రాతికాలువ.

ఈరాతికాలువ యంతఃపురస్నానగృహమున కీశాన్యభాగమున రాజనగరపు మొదటిప్రాకారములోపలనే యున్నది. చక్కని శిల్పకారునిచే నునుపైనశిలలఁగోఁ జాలినంత మెఱుఁగుగను, సుమనోజ్ఞముగను నిర్మింపఁబడిన పెద్దకాలువలును జిన్నచిన్నగొట్టములును జలపరిపూర్ణములయి యీనగరమునందంతటను వ్యాపించియుండెననియు, నారాతిగొట్టములు నున్నని పాలగారుచే నలరారుచుండెననియు, నబ్దుర్‌రజాక్ వ్రాసెను. విద్యానగరము నావరించియుండిన పర్వతమాలికల నడుమ నందందు బెక్కు జలాశయము లుండెననియు, వానియాధారమున నగరములోని ఫలవృక్షములు తోఁటలు నితరములగు పైరులు పెంపొందుచుండెననియు, పెయిస్ తెలిపెను. ఇంతియకాక రెండవబుక్కరాయఁడు తుంగభద్రాజలమును నగరమునకు మరల్చి, విశేష ధనవ్యయముచే నిర్మించిన తురుత్తుకాలువకుఁ బెక్కుపిల్ల కాలువలుచేర్చి, నగరమునందలి వ్యవసాయమును వృద్ధిపఱిచెనని పథమభాగమునఁ దెల్పియుంటిమి. ఈరాతిగొట్టములమూలమున

వచ్చుచుండిన యుదకమే మజ్జనశాలలలోని కొలఁకులకు జీవనాధారముగ నుండినది. పూర్వపురాజు లిట్లు జల సమృద్ధికెన్నివిధములగు మార్గములున్నవో యన్నింటిని దొరికి, పరిశ్రమించి యున్నందుననే మరుభూమివంటి యీస్థలభాగ మచిరకాలముననే నందనవన సదృశమై యలరఁగల్గెను.

## 4. చంద్రశేఖర దేవాలయము.

ఇదిమార్గమునకుఁ గుడిపార్శ్వమున రమారమి యిన్నూఱుగజముల దూరమున నంతఃపురస్నానగృహమునకు దగ్గఱనున్నది. సింహద్వారము పూర్వాభిముఖము. ద్వారముపై నిగోపుర మంతయున్నతమైనదిగాదు. ప్రాకారకుడ్యము శిలరూపము. గర్భాలయమునకు దక్షిణ పార్శ్వమున నావరణములలోపల రెండుమూలలయందును శిథిలములైన రెండుమండపము లున్నవి. ఇందు రమ్యములగుభాగము లేవియును లేకపోవుటవలనఁ దుఱకలు దీనిగౌరవముఁగాపాడిరి.

## 5. మజ్జనశాల.

ఇది యంతఃపురస్నానగృహమునకుఁ జాలకమైలు దూరమునఁ బంపకువెళ్ళుమార్గమున వాయువ్యదిశ నున్నది. లోపలనన్నివైపులను కమానుల వరండా దీనికిఁ గలదు. నడుమ నొకసీటికొల నున్నది. పూర్వమిది సామాన్యజనమునకెల్ల స్నానపానాదుల కుపకరించుచుండెనఁట. ఈకొలనికి నాధారములుగనుండిన కాలువలు

చుట్టును సమీపమున నేయున్నవి. దానికిదగ్గఱ నేకశిలా మయమగు తొట్టియొకటి యున్నది. అది పండుగపబ్బ-ములలో బీదసాదల యుపయోగార్థమై పాలచేనింపఁబడు చుండెనఁట! మార్గమున కెదురుగనున్న పొలములలో మఱియొక రాతితొట్టియున్నది. దానిచుట్టునున్న బండలపైఁ బ్రయాణికు లాహారము భుజించుటకనువుగ లోఁతులేనిపల్లములు తొలువఁబడినవి. వానికి సమీపముననే యొకబావికూడఁ గన్పట్టును. పైనసూచించిన మజ్జనశాల యంతనాణెముగ లేకున్నను నదియు దాని పరిసరమునఁగల పరికరవిశేషములును విద్యానగర రాజుల దీనజనాదరణమును బ్రకటింపఁజాలియున్న వనుట నిస్సంశయము.

౮. విజయమందిరము.*

౧. నిర్వచనము—విజయమందిరమునకే విజయదశమీసింహాసన మనియు సింహాసనవేదిక (Throne Platform) యనియుఁ బేళ్ళు. ఇది యంతఃపుర స్నానగృహమునకు వాయువ్యమూలయం దున్నది. సర్వసామాన్యముగ జనులు దీనిని 'మహర్నవమిదిబ్బ' యనియు 'దసరాదిబ్బ' యనియునందురు. కృష్ణదేవరాయఁడు ౧౫౧౩ వ సంవత్సరమున నొరిస్సారాజును జయించి వచ్చినందులకు జ్ఞాపకార్థమై దీనిని నిర్మించెను; కనుక నిది 'విజయభవనము' ('House of Victory') అనఁబడు

* హంపీశిథిలములు (Humpi Ruins) చూడుఁడు.

ముండెనని పెయిస్ తెల్పుచున్నాఁడు.

౨. శిల్పకళ—నగరమున నిట్టితిన్నె లింకనుగలవు; కాని యింతటి యౌన్నత్యమును వైశాల్యమును రామణీయకమును నగు వేదికలుమాత్రము లేవు. విజయ మందిరపు పైభాగమునఁ దూర్పువంక సగములోఁతు వఱకు లోపలికిఁబల్లమును, నందుఁబ్రవేశించుట కనువగు శిలాసోపానము లుత్తరదక్షిణ దిశలయందును నున్నవి. అందడుగునఁ బార్శ్వభాగమున ఱాతిలో నైదువిగ్రహములు చెక్కఁబడినవి. ఆప్రాంతమునందలి జనులు కొంద ఱావిగ్రహములను బంచపాండవ స్వరూపములని భావించి నేఁటికిని వానికిఁ బూజసల్పుచున్నారు. ఈ తిన్నెయందు వెలయించిన శిల్పకళ తక్కినశిథిలములలోఁ గొన్నింటియందు మాత్రమే కాన్పించుచున్నది. ఇందలి శిల్పపుఁబని హాజార రామాలయమునందలి శిల్పపుఁబనిని బోలియుండును. ఈ వేదికకుఁజుట్టును నాధారముగనున్న ఱాలపైఁ బెక్కువందల చిత్రములు చెక్కఁబడినవి. నాఁటి ప్రజల వేషములు వృత్తులు నభిమాన వృత్తులు వస్తువాహనాదికములు నప్పటిచరిత్రవిశేషములు నందు బొమ్మలలోఁ జక్కఁగఁ జూపఁబడినవి; అంతేకాక, యోధులు-మల్లవీరులు-నశ్వగజాదులు నూరేఁగుచున్నట్లును, వేశ్యాంగనలు నృత్యము సల్పుచున్నట్లును, వారి యనుచరులు మృదంగాదివాద్యములు మ్రోయించుచున్నట్లును, వేఁటగాండ్రు మృగయావినోదమున మగ్నులై

యున్నట్లును, జెక్కఁబడియున్నది. ఈపీఠము నలంకరించు చిత్రములలో దక్షిణ పార్శ్వములమునఁగల శిలలపైఁ జెక్కినవి యందమైనవి. పైచాలున నేనుఁగులును, రెండవ బంతిలో హంసలు గుఱ్ఱములు మొదలైనను, మూఁడవవరుసలో నాట్యాంగనలును, బిమ్మట జైనులు*ను, బౌద్ధులు, వ్యాఘ్రయులు, మృగములను వేటాడు జాతులు, మల్లయుద్ధమొనర్చు జెట్టీలు. నాయకులు, ప్రభువులు, స్త్రీ సహాగమచర్యలుఁ జెక్కఁబడినవి. ఆకాలమున దసరాలోనడచు వింతలన్నియు నిందుఁబ్రకటితములై యున్నవి. 'ఈశిల్పములు దక్షిణ హిందూదేశమున నపూర్వమైనవి. పురాతనకాలమున లేయార్డు పరిశోధించి కనుఁగొనిన చిత్రముల కివి తుల్యము'లని ఫర్గుసన్ (Fergussion) నుడివెను. శిల్పము సాధారణమైనదైనను చిత్రముల యంగనిర్మాణ మంత విస్పష్టముగా నున్నను నవి చూపఱకు మిగుల నాకర్షకములుగ నున్నవి. నల్లఱాలలోని బొమ్మలకంటెఁ గొంచెము మృదులములైన వర్ణాంతర శిలాఫలకములయందలి చిత్రములే కడుంగడు రామణీయకములు. ఆ కాలమున విద్యానగర రాజులు దసరాపండుగదినములలో నీయున్నత వేదికపై స్వర్ణాసనమునఁ గూరుచుండి, యందునడచెడు నరణ్యమృగముల పందెములను మల్లయుద్ధములను నితర వీరవినోదములను గాంచుచుండిరి.

---

* అప్పటి జైనమతప్రచార మింత వలన వ్యక్తమగును.

3. ఉత్సవవిధానము— దసరాదిబ్బ, ప్రాచీన ప్రాభవవైభవములఁ జాటుట కాదర్శప్రాయమైన రామణీయకమగుపీఠము. దసరాదినములలో నందు రత్నఖచితమైన హేమాసన ముంచవలసి యుండినందునను, చుట్టును స్వర్ణనిష్క-రాసులఁ గుమ్మరించుచుండినందునను నదియెంతసుభద్రమై యుండవలెనో యూహించుట సులభము. ఏఁటేఁట నవరాత్రోత్సవ దినములలో జాజ్వల్యమాన వజ్రోపచిత కనకసింహాసనమున నృపుఁడాసీనుఁ డగుచుండెను. ప్రభువులు సామంత రాజులు సరదారులు శ్రీమంతులు మహానవమీ పర్వదినములలో, సార్వభౌమున కనర్ఘములైన కానుకలను సమర్పించుటకై యచ్చటఁ జేరుచుండిరి. సామంతప్రభువులలోఁ బ్రాముఖ్యముగన్న నవనాయకులు రాజమందిర సమీపమున నవదుర్గములు నిర్మించుకొని, యంచమూల్యములగు వస్త్రాభరణాదులను వివిధవిధ వస్తుసంచయమును నాట్యాంగనాబృందమును గొదవలేక యుంచియుండి, విజయదశమీ మహోత్సవదినములలోఁ దామందువసించుచుఁ జక్రవర్తికిఁ గానుకలు చెల్లించుటకై సంపూర్ణ రాజచిహ్నములతో నిప్రదేశభాగము నలంకరించుచుండిరి. నగర రాజకీయోద్యోగ ప్రముఖులలో నొక్కొక్కరును, వారివారికి నియమితములై పదవీప్రతిష్ఠా సూచకములగు వస్తులను బిరుదావళులను బూర్తిగధరించి, విజయమందిరముఁ జేరుట వారికివిధియైయుండెను. ఉద్యోగవర్గమం-

తయుఁ గూడినపిమ్మట నెనుపోతులు 'పొట్టేళ్ళు' చింబోతులు తోలినాఁడు తొమ్మిదేసివంతునను గ్రమక్రమముగ నెచ్చుగను బలియొసఁగఁబడుచుండెను. అనంతరము ప్రభుఁడు స్వర్ణసింహాసన పురోభాగమునకువచ్చి నిలచును. వెంటనే జేనిపట్టపు టేనుఁగులు తొమ్మిదియు, నుత్తమాశ్వములు తొమ్మిదియు, నానావిధాంబరాభరణ కుసుమ మాలికా సుగంధద్రవ్యాదులచే నలంకృతములై ప్రభుని సమ్ముఖముఁ జేరవచ్చును. వానిమ్రోల నశ్వదళ నాయకుఁడు తనపరివారముతో సవినయముగ ముందునకు వచ్చి, ప్రభునకు భక్తిభావమున జోహారొనర్చి వెనుక కొదిగి వెళ్ళును. పురోహితుఁడు హవనసంస్కార పూర్వకముగ గజాదివాహనముల నర్చించి, వానిపై మంత్రోదకముఁ బ్రోక్షించి, ప్రసూనమాలికలచే వాని కంఠసీమల నలంకరించును. పిమ్మట వానికి నైవేద్య మర్పించును. తదుపరి రాజేంద్రుఁడు *సింహాసనాసీనుఁడగును. అనంతరము గంధర్వాంగనలు వేగురు నృత్యముసల్పెదరు. తరువాత వేయిమందిజెట్టీలు చేత నాయుధ ములుపూని యొండొరులను గాయపఱుచు

* ఏఁడాదిలో నీపవిత్రపర్వదినములయందుఁ దప్ప నితరసందర్భములలో నీభద్రాసనము నధిష్ఠించు నధికారము ప్రభునకు లేదు. అందు నాతఁడు కేవలము ఋజుమార్గప్రవర్తకుఁడుగను సత్యసంధుఁడుగను నుండవలయును. శ్రీకృష్ణదేవరాయని తరువాత నచ్యుతరాయఁ డీగద్దె నుపయోగించుకొనలేదని విదేశ రాయబారులు నుడువుచున్నారు.

కొనుచుఁ బోరాడి, జయశీలురు పారితోషికములు వడ-
యుదురు. గజాశ్వాదులును బలిష్ఠములగు వృషభ
రాజములును సమాల్య వస్త్రభూషణాలంకృతములయి,
సింహాసనాసీనుఁ డయియున్న రాజుముందఱగా వెడలును.
తదుపరి సామంతనృపులు నాయకులు శ్రీమంతులు కులీ
నులు నొక్కరొక్కరుగఁ జక్రవర్తికిఁ గానుకలు సమ
ర్పింతురు. ప్రభుని దేవేరులలోఁ బ్రాముఖ్యము నసిన
ముప్పదియార్వురు రాణులు, భరింపఁజాలని జాతిముత్తెపు
సరులను వజ్రహారములను రత్నదామములను స్వర్ణాభ-
రణములను నసంఖ్యాకములఁ దాల్చి మనోజ్ఞహేమాంబర
ధారిణులయి, బంగారుకలశములనుగొని, కరదీపికాహ
స్తలు వెలుంగ, లజ్జావినయభావములు పైకొన, మంద
గతుల నల్లనల్లనఁ జనుదెంచి, రాజచంద్రునకు నీరాజన
మిత్తురు. రాజ్యాంగమువారేఁడాదిపొడుగున సమ
కూర్చియుంచిన యపూర్వములగు వివిధవిధ వస్తువితా-
నము నాసందర్భమునఁ బ్రభునియెదుటఁ గనఁబఱుచు
చుండిరి. సంగీతము చిత్రలేఖనము శిల్పము నిత్యాది
లలితకళా ప్రదర్శనమునకుఁగూడ, నీనవరాత్రి సమయముననే
యవకాశ మొసఁగఁబడుచుండెను. పదియవ దినమున
సార్వభౌముఁ డశ్వారూఢుఁడై, నాయకులకును యోధ
వరులకును వేఱువేఱుగ దర్శనమొసఁగి, వారలతోడ
సంప్రతించుచుండెను. ఇతర ప్రధాన పర్వదినత్రయ
మునఁగూడఁ బ్రసిద్ధులును యువకులును నగు రాజ

కుమారులు నాయకులతోడను నాట్యాంగనలతోడను జేరి, కేసరీజలమున వసంతాభిషేకముఁగావించుకొనెదరు. వార లాసందర్భమునఁ దమకగపడువారిపై నెల్ల గొట్టములతో నావసంతము నిర్దాక్షిణ్యముగఁ జిమ్ముచుండెడి వారు.

౪. పరిసరమునందలి నిర్మాణములు — తల్లికోట యుద్ధానంతర మీాసరాదిబ్బ చాలశిథిలమైనది. ఈ వేదికాంతర్భాగమున రహస్యగృహ మొకటైన నుండనోపునని పరిశోధకులు కొందఱు కొన్ని సందర్భములఁబూర్వ మూటిన్నియుకు నలువైపుల రమారమి పదియడుగులలోతు వఱకుఁ ద్రవ్వించిరియుఁ, గూలిలుకొంత అందులోఁబడి మడియుటవలనను, ద్వారమెచ్చట నగపడని హేతువునను ప్రయత్నమునుమరలఁ బూడ్పించిరనియుఁ దెలియవచ్చెడిని. దీనికిని ప్రాకారకుడ్య మొకటియుండి, యిప్పుడు శిలమై యుత్తరభాగమున దానిచిహ్న మొకింతనిలిచి యున్నది. ఈవిజయమందిరముపైకి వెళ్ళుటకుఁ బశ్చిమ దిశయందు మెట్లికలున్నవి. ఈవేదికపై నిలిచిచూచినచో నంతఃపుర ప్రాకారమును, సమున్నతము లయిన రక్షకభటగోపురములు రెండును, గజశాలయు, హజార రామచంద్రాలయమును, దండనాయకుని మందిరమును విస్పష్టముగ గోచరించును. ఈ ప్రాంతమందలి నిర్మాణముల పైకప్పులు గచ్చుతోడ తాతిపటువునకంటెను భద్రముగ నిర్మింపఁబడియుండుటచే, వాని మీాఁదిభాగ-

మున మేడలుసయిత్రము వెలసియుండెనని యూహించుట
కనకాశ మేర్పడుచున్నది.

## 7. శిలాద్వారము.

ఇది యును రాచనగరును విజయమందిర ప్రాకా-
రకుడ్యమునకుఁ జేరువ నున్నవి. ఏకశిలామయము. ఎత్తు
రమూరమి నదియంగులు. వెడల్పు మూఁడంగులు.
మంద మెనిమి దంగుళములు. రాతిలోఁ జేయఁబడిన
దయినను నొకదారుబంధమున నిమిడ్చిన కొయ్యపలకల
తలుపువలెఁ గాన్పించును. కొయ్య తలుపునకు వలెనే
దీనికిని వెనుకభాగమున గడె వేయుతూములు రెండున్నవి.
దేనికిది ద్వారమో! శిథిలభాగమునందలి మట్టిపోవులోఁ
బూడి యుండెనఁట. ఈవలఁ గనుఁగొనఁబడినది.

## 8. రాజనగరము

కొందఱిది దేవాలయము కాఁబోలునని శంకించు
చున్నారు. ఈ నగరమునందు దేవాలయములు తప్ప
నితర సౌధము లలంకార శూన్యములు. రాజసందర్శన
శాలకు సమీపమున నున్నందునను విజయమందిరము-
నకు సమీపమునసుండుట చేతను, నలంకారములగు శిల్ప-
ములేవియు దీని కుడ్యములపైఁ గన్పట్టనందునను, నిది
రాజనగరమే యయియుండవలెను. అంతయు నిటుక
తోడను గారతోడను జేసినపని. ప్రధానద్వార ము-
త్తరాభిముఖము; కాననిది దేవాలయము కాదనుట
విస్పష్టము. నేలసమముగఁ బూడియుండిన యీభాగ

మీఁవల పైకిఁదీయఁబడినది. దీనియెత్తైదడుగులు. దీని పార్శ్వ స్థలమునుండి దసరా యుత్సవమునకు వెళ్ళుట కనుకూలముగను మిగుల నాణెముగను నిర్మింపఁబడిన పీఠము పూడియున్నది.

9. నేలమాళిగ.

ఇది భూపట్టమునకు సమాన పరిమాణమున నుండుటచే సమీపించినఁ గాని గోచరింపదు. పూర్వా-భిముఖము: దీనికిఁ బ్రాకారముగలదు. ఇతర దేవాలయములకువలె పైకప్పు తాలబండలఁ అవు. కప్పున కాధారములగు కంబములు శిలానిర్మితములుగాన నిది దేవాలయము. గుడిలోనికిఁ బయట నుండి తాతి సోపానములున్నవి. అడుగు భాగమున గారవేయఁబడి యున్నది. మొదగది కూడ నుండియుండవలయును. అదిశిథిలమయియుండ నోపు. ప్రక్కలలో మట్టియురల కుండ బలమయిన ప్రహరినిర్మింపఁబడినది. ఆలయమున కును ప్రహరికిని నడుమ నిద్దఱు మనుష్యులు ధారాళ-ముగఁ బోఁగలిగినంత వెడల్పుగల సందు గలదు.

10. గాజస ద్మన గృహము.

నేలమాళిగకిది యేఁబదిగజముల దూరములో నుత్తరమున నున్నది. పురాతనకాలమున నిది చాలఁ బ్రాముఖ్యము వహించినది. ప్రధానద్వార ముత్తరాభిముఖము. ద్వార పార్శ్వమున సందర్శనమందిర ముండినది. ఈగృహము తొమ్మిది వరుసల కంబములు గలది.

వరుసకు తొమ్మిదేసి స్తంభములవంతున నుండి యున్నట్టి గురుతులు నేడు స్పష్టముగఁ దోఁచుచున్నవి. స్తంభములగపడవు. అవి కొయ్యతోఁ జేయఁబడినవేమొ. ముసల్మానులు వానిని దగ్ధమొనర్చి యుందురు. పైకిఁ బోవుటకు దక్షిణపార్శ్వమున శిలాసోపానము లుండి యుండును. ఇపుడాచిహ్నములు విస్పష్టముగఁ గాన్పించును. రాచనగరులన్నింటిలో నిది యుత్తమమందున్నది. ఇయ్యదియొక దర్బారు మందిరమయి యుండునేమొ. దీనిమీఁద మహమ్మదీయులచేఁ గూల్పఁబడి యుండును. ఈమందిరమున కెదుటనున్న శిథిలములలో పెద్దతాతి తొట్టియొకటి యొకమట్టిదిబ్బ కానింపఁబడియున్నది.

## 11. హజారరామాలయము.

౧. నిర్మాణము—'హజార'మనఁగా ప్రాంగణము (ముంగిలి). రాజప్రాసాదావరణమున నుండుటచే దీనికీపేరు వచ్చియుండును. రాజనగరమునకుఁ జేరువ నున్నందున నిది విద్యానగరప్రభువుల ప్రత్యేక ప్రార్థనాలయమని తెలియవలసియున్నది. శ్రీకృష్ణరాయఁడరుణోదయాత్పూర్వమే స్నానమాచరించి, యంతఃపురావరణముననున్న దేవాలయమునకరిగి, కులాచారానుష్ఠాన విధులనుదీర్చునని పెయిస్ తెల్పెను. ఆదేవాలయ మిదియే యగును. గర్భాలయమున కుత్తరభాగమున దక్షిణాభిముఖమయి యున్న యొకమండపము ద్వారమునకుఁ గుడిపార్శ్వపు గోడమీఁద శా, శ. ౧౪౩౫ వ సంవత్సర

చైత్రశుద్ధ పంచమినాఁ డీయాలయము కృష్ణదేవరాయఁడు కట్టించినట్లు రూఢిపఱుచు శాసనమున్నది. క్రీ. శ. ౧౫౧౩వ సంవత్సరమున నిట్లు రాయఁడు దీనిని నిర్మించి, చంద్రగ్రహణకాలమున తనతలిదండ్రుల స్మృతికై దీని కైంకర్యార్థ మైదుగ్రామములు మాన్యముక్రింద నేర్పఱిచినట్లు ప్రసిద్ధి. సాంగారి రాష్ట్రముననున్న తారూరు దగ్గఱ నొకచెఱువు త్రవ్వించి, దానినిసయిత మీరామాలయమునకు ధా రా పూ ర్వ క ము గా సమర్పించి యున్నట్లును బ్రతీతి.

౨. ఆలయభాగములు—పురుషవిగ్రహముఁ బ్రతిష్ఠించిన చోట్లలో నెల్లఁ దత్పార్శ్వాలయముననే స్త్రీవిగ్రహములనుగూడ నిల్పుటనాచారము పెక్కుశతాబ్దములనుండి దక్షిణదేశమునం దంతటను గలదు. అందుఁ బురుషవిగ్రహమునకు గుడి పెద్దదిగను స్త్రీవిగ్రహమున కంతకంటెఁ జిన్నదైనదిగను నిర్మించుట యొక సాంప్రదాయము. ప్రతి ముఖ్యదేవాలయమున నీయమ్మవారిశాలగాక దానికిఁ జేరికగా దైవపుత్రవిగ్రహములు దైవావతార ప్రతిమలు నుంచు మందిరములు నుండుటయుఁ గలదు వివాహాది కార్యములకు ముఖశాల లుండనే యుండును. కొన్నింటికిఁ గల్యాణమండపములు వేఱుగ నుండును. వీనితోఁగూడ గురుకులావాసమునకును, మతచర్చలకును, గ్రంథభాండాగారములకును, పురోహితులు యాత్రికులు సన్న్యాసులుబస చేయుటకును, తనువైన

పార్శ్వమండపములు నయితముండును. హజారరామ దేవాలయమున నమ్మవారిశాల, ప్రధానాలయమున కుత్తరమున మిక్కిలిసమీపమునఁ బూర్వాభిముఖముగ నున్నది. అ తెటనువలె నిచ్చటఁ బ్రధానాలయమున కంటె నమ్మవారిశాల చిన్నదే కాని యందలి శిల్పకళ వర్ణనాతీతమై సర్వవిధములఁ బ్రధానాలయ శిల్పమును మించియున్నది. ఈ దేవసదనముల రెండింటిలోను ఱాతి సీటిగోటములున్నవి. గర్భమందిరముపై గచ్చుసింపా- దిగఁగల గోళాకారపు గోపురమును, నాగోపురపుఁ జివర విరూపాక్షేశ్వరనిలయ శిఖరభాగమున నేఁటికిని గోఁచు లోహకలశములవంటి కలశమును, నిర్మింపఁబడి యున్నవి. అమ్మవారిశాల పైపటపున బౌద్ధులయు, చైతన్యులయు నాలయములకువలె భరింపరానివిధమున గార బండ్లకొ- లాదినిఁ జాల మందముగఁ గుప్పిమ్మరింపఁబడి యున్నది. అమ్మవారిగుడికి నయితము ముఖ మండపమును సింహ ద్వారమును గలవు. ఆవరణములోఁ గల్యాణ మండ- పము వెలుగనున్నది. పండుగల సందర్భములలో సీ యాలయమునకుఁ జెందిన దైవకైంకర్యకార్యములన్నియు నందే జరుగును.

3. శిలాశిల్పము—అమ్మవారిశాల యాకాలపు శిల్పకళా ప్రావీణ్యము సమగ్రముగఁ బ్రకటింపఁ జాలి యున్నది. భారత భాగవత రామాయణ కథావిశేషము- లఁ దెల్పు చిత్రము లీసదనముల రెండింటిగోడలపై సను

ముష్కులు మూటఁగట్టినట్లు తీర్పఁబడినవి. దేవాల యావరణములో నొక సూరామము యి యుండినట్లుగ నందలి భూస్వరూపము తెల్పుచున్నది. దానిని గడవఁగా మధ్య మండపము వచ్చును. ఇందు నల్లని స్తంభములు నాలుగున్నవి. అవి ప్రశస్త శిల్పకళాన్వితములు. ఇది వైష్ణవాలయమయినను దీని గోడలపై శైవచిత్రములు తీర్పఁబడినవి. ఉత్తరపు బ్రక్కనున్న స్తంభమునఁ జెక్కఁబడిన మహాశ్వారూఢుఁడై యున్న కల్కిచిత్రము గాక తదితర స్తంభములపైని మయూరవాహనుఁడగు సుబ్రహ్మణ్యస్వామి, వినాయకుని సమీపమునఁ బద్మాసనాసీనులయియున్న తీర్థంకరుఁడు మొదలగు శిల్పములుగూడ నభిరామములుగ నున్నవి. బుద్ధావతార స్వరూపముసైత మున్నది. ఉత్తర దక్షిణ ద్వారములనుండి వెళ్ళెడి మార్గము ప్రక్క మండపములలోనికిఁ బోవును. పడమటి వైపుననున్న గుడియందే రామచంద్రవిగ్రహ మున్నది. ఆలయము కొంత కృష్ణశిలలచేతను, మఱికొంత పసుపు నీలము చేరిన ముదురుపచ్చవర్ణముగల రాలచేతను, కట్టఁబడియున్నది. నాఁటి చిత్రకారు లీదేవాలయాంతర్భాగమునందలిగోడలకును, పైకప్పునకును, హంసలు చిలుకలు లోనగువానికిని, నిగ్గులుగుల్కునట్లుగ వేసియుంచిన రంగులు నేటికిని వన్నెమాయకున్నవి. ప్రహారి గోడలును స్తంభములును పలుదెగల చిత్రములచే మిగుల విన్నాణముఁగూర్చుచున్నవి. ఆలయ ప్రాకార కుడ్య-

ముల పైభాగ మంతయు యుద్ధోపకరణాంచితములగు చతురంగబలములు సమరభూమికిఁ బ్రయాణము సల్పుచున్నట్లు చెక్కఁబడి యున్నవి. ఈచిత్రము లన్నియుఁ గనుంగను నాకర్షకములై దర్శనయోగ్యములుగ నున్నవి. వలయాకృతిగ నున్న స్తంభముల శిరోభాగములు పైకప్పున కాధారములుగ లేకున్నను గేవలము శిల్పకళా పాటవముఁ బ్రకటించుటకే నిర్మింపఁబడినవి. ఆలయ కుడ్య-ములపై తాటకవధ జటాయురావణ యుద్ధము సీతాపహారణము శివధనుర్భంగము సప్తతాళ భంజనము సర-యూనదీతరణము రావణుని సమ్ముఖమున నున్న తాసనముపై నిర్భయముగను సగర్వముగను గూరుచుండియున్న యాంజనేయుఁడు మున్నగు చిత్రములు నిర్మితములయి యున్నవి. పైబంతిలోఁ గృష్ణలీలలును రెండవవరుసలో మేళతాళ మృదంగాదికము మ్రోయించు పరిజనులు తోడనుండ సుందరవస్త్రాలంకార శోభితలయి నృత్యము సల్పుచున్న నాట్యాంగనలును, మూఁడవచాలున రణభూమికి నడచుచున్న వీరనిచయమును, నాలవ శ్రేణిలో నశ్వదళమును, అయిదవపంక్తిని గజయూథమును జెక్కఁబడియున్నవి. సింహద్వార మసమగ్రమగుటచే నందు గారపనియగపడదు. దక్షిణభాగపు వరండా యందున్న తాలపత్రివులో బలాఢ్యములయిన విగ్రహ ఖండములున్నవి.

౪. దారుశిల్పము—శిలాశిల్పమంతయుఁ బరి-

కింపఁ గొండ్యాననివలెనే పొడఁగట్టఁజాలియున్నది. ఇట్లు రచించుటలో నానాఁటి శిల్పులీయాలయముఁ బక్కని పరిశ్రమము సల్పిరి. 'ఇందు జాతిఁనినిమించిన కో-య్యపనియున్నదే' నని విద్యానగరము సందర్శించిన యన్యదేశ రాయబారుల వ్రాఁతలు తెల్పుచున్నవి. రాజ మండపమున ముఖశాలలు మున్నగువానికి నాఁకాలపు శిల్పులు దారువు నుపయోగించి, దానికి రక్షకముగఁ బైభాగమునఁ దామ్రికవచములు తొడుగుచుండువారు. ఈపద్ధతి మధుర చిదంబరము మున్నగు క్షేత్రములలోని శిల్పవిధానమును బోలినది. ఇందుకు మిక్కిలి దృఢమైనకఱ్ఱ నుపయోగించి, దానిని దామ్రికవచాదులలో భద్రపఱచియుంచినను, మహమ్మదీయులు వానిని దగ్ధము చేయుటచే నిప్పుడా దారుశిల్ప మేమియును మిగులక పోయెను.

౫. పరికరములు—ఆకాలమున శిల్పులు సున్నితమగు శిల్పపుఁబని చేయవలసివచ్చుచో నల్లనిఱాలకంటె హారిద్రానీలవర్ణాంచిత శిలలనే మిక్కిలి యధికముగ నుపయోగించుచుండిరి. ఈశిలల నితరప్రాంతములనుండి యరుదుగఁ దెప్పించుచుండిరి. సర్వసాధారణముగ విద్యానగరమునందలి నిర్మాణములకు విదేశశిలలను విస్తారముగ వాడక, చాలవఱకు నాప్రాంతమునందలి నునుపురాళ్ళనే మిక్కిలి యెక్కుడుగ నుపయోగించు చుండిరి. ఈ యాలయమునందలి కొన్ని ప్రతిమలు లోహవిగ్రహముల

కంటె మిక్కిలి మెఱుఁగు దేఱి కాన్పించుచున్నవి. భారత ప్రపంచమునవెల సీభాగమునందలి శిల్పకళ మిగులవాసిఁ గాంచినది. దేవాలయ ముఖమండపమున నగాధము లగుఁ బెక్కు శిలలు నానావిధ శిల్పకళావిలసితములై నాఁటి శిల్పవిద్యావిభవమును బ్రేక్షకుని హృదయఫలక-మునఁ జక్కఁగ ముద్రవేయఁజాలియున్నవి.

ఈకోవెలకుఁ దూర్పుభాగమునఁ బురాతనమైన గుడి యొకటిగలదు.

## 12. ఱాతితొట్టి.

రాజు సందర్శనార్థమువచ్చు వారలకో యశ్వ గజాది జంతువులకో నీటిని నింపియుంచుటకయి యీ ఱాతితొట్టి నిర్మాపఁబడియుండును. ఇది గండశిలలలోఁ దొలిచిచేయఁబడినది. రమారమి ౪౨ అడుగుల పొడవును 3 అడుగుల వెడల్పును ౨౺ అడుగుల మొత్తును గలది. ఆకాలపువారీతొట్టిలో నేనుఁగు పిల్లలకయి పాలుపోసి యుంచుచుండినట్లు ప్రతీతి. తొట్టిని దడుచుగఁగడిగి మురికినీటిని వెలికిఁ బోనిచ్చుటకయి యడు-గునఁ జిన్నని తూమొకటి తొలువఁబడినది.

## 13. అంతఃపుర ప్రాకారము.

హజారరామాలయమున కుత్తరమునఁ గొంత దూరములోఁ బెక్కుమందిరము లీ యున్నతప్రాకార రక్షణమున కధీనములైయుండినవి. ప్రాకారపుగోడ లడుగున నత్యంత స్థూల్యమువహించి, పైకిఁబోనుపోను

మందముతగ్గ, చివర కిరువైపులను జాతివరుస లేకమై మొనదేలిన ట్లుండును. శిఖరభాగమున గచ్చుచేయc బడి, యందు నిశితలోహశంకువులు నాటుకొల్పcబడినవి. నిర్మాతలు, కోటగోడలు బలవత్తమములైనవిగc గాక స్త్రీల సంరక్షణమున కుచితములుగ మాత్రము నిర్మించిరని తోcచెడిని. ఈ యావరణమున నీవలకు మూcడుద్వారములు మాత్రమే యుండినవి. యాత్రికుల సౌకర్యార్థము పరిభుక్తమువారీవల వానిని హెచ్చించి యున్నారు. ప్రధానద్వారము పశ్చిమాభిముఖము, బుద్ధ-గయ మున్నగు ప్రాంతములయందువలె ద్వారములను వలయాకారముగcదీర్చుట హైందవ శిల్పులకు సుసా-ధ్యమేయయినను, బూర్వాచారానుసార మిచ్చటను బ్రాచీనపథము ననుసరించియే వారు వానిని నిర్మించిరి. ఈ ప్రాకారములోపల నింక నెన్నియో మందిరము లుండె నని యందు గట్టcబడియున్న జాలకుప్పలవలన గ్ర-హింపవచ్చును. సామంతప్రభువులలోc బ్రాముఖ్యము నొందియుండిన వననాయకుల సౌధములు రాజమందిర-మున కేవైపుననుండెనో గ్రహించుటకు వలనుగాదు.

## 14. రాణీమందిరము.

అంతఃపుర ప్రాకారమున నడుమనున్న నిర్మాణములలో మిగుల విశాలమగు శిథిలభాగమే రాణీమందిరమయియుండుననుట కొందఱియూహ. ఇది రాజ్యాంగకార్యస్థానమని మఱికొందఱిమతము; కాని యిచ్చటిపరి

సర నిర్మాణవిశేషములను గమనింప నిది రాణివాస మందిరముగానే తోఁచుచున్నది. ఉత్తరదిశనుగల ద్వారముదగ్గఱ నున్నతములైన రక్షకగోపురములు రెండున్నవి. ఈగోపురములు కేవలము రక్షకభటుల కొఱకే యేర్పడినవికావు. అంతఃపురస్త్రీలు తమ్మితరులు చూడకుండ నందువసించి, బయటిచిత్రములను గమనించుట కనుకూలముగ నిర్మింపఁబడినవి. ఈ గోపురముల పైనుండి చుట్టునాలోకించినచోఁ బంపాశిథిలములన్నియు నగపడును. మండువేసఁగిలోఁగూడ వీనియందు శీతల మారుతము వీచును. పూర్వద్వారముకడ నొక చిన్న కట్టడమున్నది. దానినెక్కి చూచిన గజశాల గోచరించును.

## 15. మంత్రాలోచన మందిరము

ఇది యంతఃపురావరణముననున్న సుందరతరములగు నిర్మాణములలో నొకటి. రెండంతస్థుల మేడ. అంతయు కమానులచేఁ గడు రమణీయముగఁ గట్టఁబడియున్నది. మేడమీఁదికిఁ బోవుటకు దీనియుత్తరపార్శ్వమున సోపానములుగలవు. మేడకూడఁ గ్రిందిభాగము వలెనే కమానులచేఁ దీర్పఁబడియున్నది. ఇది యైదువందల సంవత్సరముల క్రిందట నిర్మింపఁబడినదైనను నాఁటిపాలగార చెక్కుచెదరక నేఁటికిని నిగ్గులుగుల్కుచున్నది. సౌధము నిన్న నేఁడు కట్టినట్లు తోఁపఁజేయుచుఁ, దొంటివిన్నాణమునే ప్రకటించెడిని. మేడ పైమూఁతే



హజారరామాలయమునందలి యొకమండపము.

వికసితకమలముఁబోలినది. దీనిఁబట్టియే యీ నిర్మాణము నకుఁ గమలాలయమను పేరు వచ్చియుండును. భవన నిర్మాణమునకుఁ బూర్వము మేడకట్టు నుద్దేశము నిర్మాతల కుండినట్లులేదు. ఏలన దిగువయరలో మనకగపడు మొనకలు కట్టడముతోఁగూడఁ గట్టినవికావు. నిర్మాణముపూర్తియయినపిమ్మట నుంపఁబడినవి; కావునఁ గ్రింది భాగముకట్టిన తరువాత మేడనిడుటయను సంకల్పము నిర్మాతలకుఁ గల్గియుండును. అన్నికట్టడములకువలె దీనికిని పునాది మొట్టలోనుండి తక్కినవానివలెఁ గాక కొంత వఱకు శిల్పకళచేఁ జెలువుఁ గులుకుచున్నది. ఇతర నిర్మాణములకును దీనికినిఁగల ప్రధానభేదము మూలలు ప్రత్యేకసరణి నుండుట. ఈభవనమునకుఁ బ్రక్కగోడలు లేవు. ఇది బలమయిన పెద్దస్తంభములమీఁదను కమానులపైనను నాధారపడి బాహాటముగ నున్నది. మేడపైనుండు దంతెటను గిటికీలు గలవు. వీనిస్తంభములు కమానులు మహమ్మదీయ నిర్మాణపద్ధతినున్నను, పునాదియుఁ బైపఱపును దక్కిన యలంకారములును హైందవ నిర్మాణవిధానమునే సూచించుచున్నవి.

## 16. పరిచారికా మందిరము.

అంతఃపురావరణమునకు నైరృతిదిశను చిన్ననిపరోవరమధ్యమున నొక మండపముగలదు. దానికిఁ దూర్పున ముఖ్యద్వారమునకు దగ్గఱఁగా నీ పరిచారికా మందిర మున్నది. దీని నాప్రాంతవాసులు 'జనానా'

యుందురు. దీని లోపలిభాగమునఁ జుట్టును కమానుల వరండాతోఁ గూడిన వేదికయున్నది.

17 గజశాల.

ఇది గజశాలకునగల దక్షిణాభిముఖముగ నున్నది. ముందటిభాగమున సమున్నతములై విశాలములైన రెండు వేదికలు గలవు. ఆవేదికలపై బదునొకండు కమానుల వసారాయున్నది. లోపలసైతము చుట్టునెత్తైన తిన్నెయు దానిపై నాల్గుప్రక్కలలో కమానుల వరండాయు పరిచారికా మందిరమునకువలె నున్నది. మధ్య నిడుచదరపు పల్లముగలదు. లోపలి నడిమిక న్వు శిథిలమైనది. ముందు భాగమునందలి కమానుల వరండా యొక్కటి ప్రక్కఁ దక్కినకట్టడమంతయుఁ బరిచారికామందిరమువలెనే యున్నది దీనినిగూర్చి ధర్మశాలయనియు, యాత్రికు వసతి గృహమనియు, నాట్యమందిరమనియు, మల్లరంగమనియు, మంత్రాలోచన మండపమనియుఁ, బలువురు పలువిధములఁ దలఁచుచున్నారు. ఆలోచన మందిర మంతఃపురావరణ క్షేత్రముననే యున్నది. గాయకసభలు మున్నగునవి పరుగ వలెవచ్చుచోఁ గనులభవనమువంటి సువిశాల మనోజ్ఞ మందిరము లుండనేయున్నవి. ప్రభుఁడు తఱుచు కోట విడిచివచ్చుటలేదుగాన మల్లయుద్ధములకునయితే మంతఃపురావరణములోపలనే యుచితగృహవసతి యేర్పడి యుండును. ఇది గజశాలకు మిక్కిలిచేరువ నున్నది. ఇందుఁ గూడఁ బదునొకండుగదులు గలవు; గాననిది మావటీండ్ర

నివాసమునకయియే నిర్మింపఁబడియుండును.

18. గజశాల.

ఇది మిగులజలమైనగోడలు నున్నతములై విశాలములగు నంతరములు సుమనోజ్ఞములయిన గోపురములు గల్గి పశ్చిమాభిముఖముగనున్న యందమగు నిర్మాణము. అంతేయు మహమ్మదీయ శిల్పవైఖరిని గట్టఁబడినది. గోపురములు నసారాయు హిందూపద్ధతి ననుసరించినవి. దివానుఖానాకు నెదురుగ బ్రిటిగజమునకు వేర్వేరుగ నొక్కొకటి గదిచొప్పున గజశాల యేర్పరుపఁబడినదని యబుర్ రజాక్ నుడివి యున్నందున నిది గజశాలయని గూఢింపఁబడినది. ఇందుఁ బదునొకండు డేరాలు గట్టుట కనుకూలములగు గోపురాంచితములైన గదులు పదునొకండు విశాలములై యొప్పును. ఉత్సవ సమయములయం దూరేగించెడు నేనుఁగులు మాత్రమే యీశాలలోఁ గట్టివేయఁబడుచుండినవని ప్రసిద్ధి. నడిమిగది పట్టపు టేనుంగునకై యేర్పరుపఁబడియుండును. ఈమధ్యాంతరముపై నొకచదరపు బురుజున్నది. పైకిఁబోవుట కీనడిమిగదికిఁ బ్రక్క నొకచిన్న కొట్టునుండి సోపానములున్నవి.

19. జైనదేవాలయములు.

గజశాలకుఁ దూర్పుభాగమునఁగల మైదానమున రెండు జైనదేవాలయములు ఖిలరూపమున నున్నవి.

20. రంగస్వామి దేవాలయము.

ఇది యంతఃపురావరణమునకు వెలుపల దక్షిణ భాగమునఁ బూర్వాభిముఖముగ నున్నది. సగము వఱకుఁ బూడియుండి శిథిలమై యచ్చటచ్చట సంస్కారణముఁ బొందియున్నది.

21. రంగమండపము.

ఇది రంగస్వామిదేవాలయమునకు దక్షిణ పార్శ్వమున నున్నది. ఇందు దాదాపు తొమ్మిదడుగుల నిడివిగల యాంజనేయస్వామి శిలావిగ్రహము గలదు. ఈవిగ్రహమున కెదుట ననఁగా నావరణమందలి దక్షిణ పుగోడ లోభాగమున నొక బండమీఁద ప్రాఁతకన్నడపుటక్షరములలో శాసనమొకటియున్నది. అందు మాధవరాజు మల్లరాజుగారి మనుమఁడు వల్లభరాజుగారి కుమారుఁడు మహామండలేశ్వరుఁడు తిమ్మరాజు, సదాశివరాయని కాలమున శా. శ. ౧౪౬౮ వ విశ్వావసునామ (క్రీ. శ. ౧౫౪౬వ) సంవత్సర చైత్ర శుద్ధ తదియ గురువారమునాఁడు విద్యానగరము నందలి పెద్ద యంగడి వీథిలో మైలసంతకుఁ బడమటనుండు మాధవదేవునకుఁ దన తలిదండ్రులగు వెంగళమ్మ వల్లభరాజుల జ్ఞాపకార్థమై యాచంద్రస్థాయిగ నిత్యోత్సవములయందు నృత్యగీత వాద్యాది వైభవాదులకు యోగ్యముగ, ౨౫ అంకణములుగల విశాలమైన రంగమండపము నిర్మించి నట్లుగలదు; కాని యిప్పుడా మండపము పూర్తిగ లేదు.

## 22. దస్తరీ ఖానా

పై నిర్మాణములకెదురుగ నబ్బుర్ రజాక్ తెల్పిన దస్తర్ ఖానా యనఁబడు రాజకీయోద్యోగుల కొలువు కూటమున్నది. మంత్రిశేఖరుని విశాలమైన సభాగారమున కెదురుగ నిదియుండినటు లాతఁడు సూచించెను. దీని నాకాలమువారు 'దస్తరము కొట్ట'ని పిలుచుచుండిరి. అబ్బుర్ రజాకు వర్ణనమువలన నిది రమారమి యిరువది గజముల పొడవును నాలు గజముల వెడల్పునుగల వసారాగా నుండెనని తెలియుచున్నది. రాజకీయ పత్రములు, నిబంధములగు కాగితములు నిండుదస్తరములుగఁ గట్టియుంచుట వాడుక. కరణము లెప్పుడు నీవసారాలోఁ గూరుచుండి యెడతెఱిపిలేక లెక్కలు వ్రాయుచుండిరట. వారు తమవ్రాఁతకు రెండుగజముల పొడవును రెండువ్రేళ్ళ వెడల్పును గల తాటాకులు నల్లరంగుఫలకములు నుపయోగించుచుండిరనియు, వానిపై వారు పరపర గీయుచుండిరనియు, నబ్బుర్ రజాకు తెల్పెను.

### 23. పట్టాభిరాముని గుడి

రంగస్వామి యాలయమునకు నైరృతి మూలయందుఁ గొంతదూరమున నొక వేఁపచెట్టుక్రింద నొకదేవిగుడి యున్నది. ఇది పొలిమేర దేవత. కురుబవాండ్రి దేవత నిప్పటికిని బూజించుచున్నారు. ప్రాకారమునకు వెలుపలఁ గొంతదూరము నడచినచో ద్వారమున కావలి-

వైపున రెండు దేవాలయము లుండెననియు, నందొక యాలయములోని దేవత యనుదినమును బెక్కు గొఱ్ఱె-లను మ్రింగుచుండెననియు, పెయిస్ వ్రాసెను. ఆ దేవత యిదియో యయియుండునా?

## 24. దండనాయకుని ప్రహరి

ధననాయకుఁడు విద్యానగరరాజుల దండనాధిపతి. ఈతని ప్రహరి హజారరామాలయమునకుఁ బశ్చిమమునఁ గొంతదూరములో నున్నది. దానినడుమ శిథిలమైన పు-నాదిగలదు. దండనాథుని నగరున కది పీఠముకాఁబోలు. ఈ యావరణమున నదిగాక వేర్వేఱు పునాదులు కూడ నున్నవి. వానిలోఁ బెక్కు సంభములనిర్మాణ మొకటి. అది మహమ్మదీయులచే మసీదుగా మార్పఁబడినది. దాని పైన గుమ్మటము గలదు.

## 25. మసీదు.

సామ్రాజ్యమునకు వెలుపలనున్న మహమ్మదీ-యులతోఁ గత్తికట్టి విద్యానగరరాజు లెప్పుడును బోరు చున్ననుఁ, వారు తమసామ్రాజ్యమునందలి మహమ్మదీ-యులనుమాత్రి మత్యంత సాదరస్వభావముననే చూచు చుండెడివారు. మహమ్మదీయులు గొప్ప గుఱ్ఱపురౌతులు గను విలుకాండ్రుగను నున్నకారణమున, నాగౌరవమును బట్టికూడ రెండవదేవరాయఁడు నగరమధ్యమున వారి కొక మసీదు కట్టించియుండెను. నగరమున వారికై ప్రత్యేకముగ నొకవీధి యేర్పఱుపఁబడి యుండినది. పైనఁ

దెల్పిన మసీదు గొప్ప స్తంభములపై నాధారపడిన యొక చావడి (మొగసాల) వలె నున్నది. దాని వెలిగోడలు నిర్మాణము పూర్తియైన పిమ్మటఁ బెట్టినవిగఁ గన్పట్టును. పునాది యున్నతముగను నలంకార యుక్తముగను నుండి గచ్చుతోడ నిర్మింపఁబడినది. మనుష్యులయు జంతువులయు పక్షులయుచిత్రములు విరివిగ నందుఁగలవు. శిల్పపుఁబని దీని యందుహెచ్చు మహమ్మదీయ నిర్మాణపద్ధతి కెంతమాత్రము ననుసరణము కాఁజాలదు. ఈమసీదున నారాధనకర్హమైన నడిమిగుడి మక్కావైపు మరలి యుండలేదు.

### 78. రక్షకభటగోపురము.

పై నఁబేర్కొనిన యూదరణమున కీశాన్యదిశ నొక రక్షకభటగోపుర మున్నది. అది చాలభద్రమైనది. క్రింది మట్టమున నొక గదియు నందుండి పైకి వెళ్ళుటకు దక్షిణమున మెట్లదారియుఁ దప్ప, మిగిలినభాగ మంతయు గట్టిమట్టిదిబ్బ. శిఖరభాగమున మూఁడరలుగల గదియొకటి యున్నది. దానికుంచఁబడిన కిటికీల నిర్మాణ క్రమమును తిన్నవైఖరియుఁ జూడఁ దుపాకుల నుంచు నుద్దేశమున నిది నిర్మింపఁబడి యున్నట్లు తోఁచెడిని. పశ్చిమభాగపు కిటికీచెంతనున్న రెండుగదులలో నొకటి భటులనివాసమునకును, రెండవది యత్యంతావసర పరి స్థితియందు సందర్భములయం దుపయోగించుట కనువైన మందుసామానుల నుంచుటకును దగునట్లు కట్టఁబడినవి.

ముఖ్యమైన మందుసామగ్రి క్రిందియరలో నుంచఁబడు చుండెను. మందుకొట్టులోనికిఁ బోవుమార్గ మిప్పుడు మూసివేయఁబడినది. ప్రేక్షకుల దృష్టికది కడుంగడు నాకర్షకము గు నిర్మాణము.

27. టంకశాల.

రాజసందర్శనశాలకు నైరృతిదిశగలదిఁ ప్రభుత్వపు టంకసాల. మహమ్మదీయులు దీనిని బూర్తిగ నాశముచేసిరి. ఇప్పుడు గోడలు మాత్రము మిగిలి యున్నవి.

28. సౌధవీథులు.

అంతఃపుర ప్రాకారమునకు వెలుపల సామంత రాజులయు సేనానులయు సరదారులయుఁ దదితర ప్రభుత్వోన్నతోద్యోగులయు దివ్య సౌధములును, జిత్రాలంకార శోభితములై నేత్రరంజకములైన సుందర మందిరములును, రాజాంతఃపురము వఱకు విస్తరించి యుండెనని పెయిస్ వ్రాసెను; కాని యవి యీ యా చోటనుండెనని యిపుడు వ్యక్తపఱుచుటకుఁ గాదు.

కమలాపురమునందలి బసకేఁగి, యట విశ్రమింతము.

# ఏడవ ప్రకరణము.

---

## పంపాపురి మార్గము.

### 1, భూగర్భ దేవాలయము.

అరుణోదయాత్పూర్వమే మేల్కొని యుదయరాగ రక్తిమం దానమాడుచును, బ్రభాతారోగ్య వాయువుల నాఘ్రాణించుచుఁ, గర్ణరసాయనముగ గాన మొనర్చెడు విహంగ నివహ కలస్వనము నాకర్ణించుచు, నుత్తరాభిముఖముగ బయలు వెడలి, రాజాంతఃపురావరణమునకుఁ బోయెడు మార్గము విడిచి, పశ్చిమోత్తరముగఁ బంపాపురమునకుఁ జనెడు ప్రధానమార్గమున నొకటిన్నర మైలు దూరము నడచినచో, నంతఃపురావరణమునుండివచ్చు శాఖామార్గ మీరాజపథముతోఁ గలియుచోట, నీభూగర్భదేవాలయము గోచరించును. ఇది కొన్ని సంవత్సర క్రిందటఁ గనుఁగొనఁబడినది. నేల మట్టమున కైదారు గజముల లోఁతున నున్నది. ఇది శివాలయము. దీనిని 'పాతాళేశ్వరాలయ' మందురు. 'ప్రసన్న విరూపాక్షాలయ'మను నామముఁగూడ దీనికుండెనని, యందలి శిలాశాసనము తెల్పెడిని. గర్భాలయమందు నీరూరును. ప్రకృత మిది నిగ్రహశూన్యము. పూర్వాభిముఖము. ఇందొక గొప్పనందియున్నది. దానిముఖ మెవ్వరో చెక్కివేయఁ బడినది. శివలింగముచుట్టు నుదకముండవలసియుండుటచే

నాస్థలమున దీని నుద్దేశ పూర్వకముగ భూగర్భాలయ-
ముగఁ బూర్వులు నిర్మించి యుండవలెనని కొందఱి
యభిప్రాయము. ఈశిథిలభాగమున నీ పాతాళేశ్వరాల-
యమువలె భూగర్భముననున్న దేవమందిరముల నెన్నిం-
టినో చూడవచ్చును. అవి భూగర్భాలయములుగ
నుద్దేశపూర్వకముగఁ గట్టఁబడినవో లేక వఱదలమట్టిచేఁ
గాల వశమునఁ బూడిపోయినవో తెలియుటలేదు. ఈ
యాలయమునుండి హజారరామస్వామి దేవాలయము-
నకు భూమిలోపలనే సురంగమార్గ ముండినట్లు కొందఱు
చెప్పుదురు; కాని యార్కియాలాజికల్ సర్వేసూపరింటెం-
డెంటగు 'రే' (Rae) అనునతఁ డిది భూగర్భాలయము
కాదనియుఁ, బడమటి వైపునఁగల యున్నత భూభాగము
నుండి యనేక శతాబ్దములుగఁ దూర్పువైపు కొట్టుకొని
వచ్చిన మట్టిచేఁ జాలభాగము పూడిపోయెననియు, భూమి
లోపల మార్గమేలేదనియు నుడివెను. ఈయాలయ-
మున వాయువ్యదిశను నాగుల విగ్రహములు కొన్ని
గలవు. నాగపూజకిది మిగుల ననుకూలమగు స్థానము.

2. ధనురాకార మార్గము.

ఈమార్గమున నొక్కొక్కటి రమారమి యేఁబది
యడుగుల యెత్తుగల రెండు పెద్దగండశిలలు మీఁది
యంచు లొకటితో నొకటి సంధించి సహజముగ ధను
రాకారమును గల్పించినవి. ఈవలయముదిగువ దారి
యేర్పడినది. పంపాయాత్రికు లీతోవనుండియే పోవ-

లయును. ఈదారి పట్టణమునకు వెలుపల నున్న సింహ ద్వారముగుండ వెళ్ళును.

### 3. ఉద్దాన వీరభద్రుని గుడి.

అరమైలు గడచిన పిమ్మట నామార్గము కుడివంకగాఁ దిరిగి, రెండు చిన్న దేవాలయముల ప్రక్కను వెళ్ళును. అందు పూర్వదిశనున్న దేవాలయమున నుద్దాన వీరభద్ర విగ్రహమున్నది. పూజనడచుచున్న యాలయములలో నిదియు నొకటి. ఇందలి యారాధకులు వీరశైవులు. ఆలయపు వెలుపలి గోడయందు త్రోవప్రక్క నొకగొప్ప శిలాశాసనము గలదు. ౧౫౪౫ వ సంవత్సరమున నీయాలయమున విగ్రహప్రతిష్ఠ జరిగిన ట్లాశాసనము తెల్పెడిని.

### 4. సహగమన చిహ్నములు,

ఉద్దాన వీరభద్రాలయపు వెలిగోడకు రెండు సతీస్మృతిశిల లున్నవి. దారి కెదుటిమార్గమున నీ సహగమన చిహ్నములుగల శిలలు పెక్కుగలవు. పతివ్రతలగు స్త్రీలు తమహస్తములను స్వర్గమువైపున కెత్తియుంచుకొని సహగమన క్షేత్రమునకుఁ దరలుచున్నట్లుగ నందుఁ జెక్కఁబడినది. ఒకానొకకాలమున నిది సహగమన రంగమునకుఁ బ్రధానభూమిక యయి యుండునేమొ! తాను జూచిన సహగమన విశేషములను గూర్చి, న్యూనిజ్ క్రమరీతిని వర్ణించెను. ఈమార్గమునకుఁ గొన్ని గజముల దూరముననే తురుత్తుకాలువ ప్రవహించును.

5. తురుత్తు కాలువ.

'తురుత్తు' అనఁగా త్వర. ఇదివడిగాఁ బ్రవహించు చుండినందున దీని కీపేరు వచ్చినది. హంపకుఁ బడమట నొక మైలు దూరముననున్న తుంగభద్ర యానకట్టనుండి జలముఁ గొనివచ్చుచు, నిదిపెక్కు మైళ్ళవఱకు రాతికాలువల మూలమునఁ బ్రవహించుచు, వ్యవసాయమున కత్యంత ప్రయోజనకారిగ నుండినది. తుంగభద్రనుండి రాతిగండ్లగుండ జలమువచ్చును. దీనిని రెండవ బుక్కరాయఁడు (౧౪౦౪—౧౪౧౬న) నిర్మించెనని వెనుకఁ దెల్పి యున్నాము. దీని నిర్మాణకౌశల్యమును జూచి నేఁటియింజనీర్లుకూడ నద్భుతము నొందుచున్నారు. తుంగభద్రలో వేసఁగిని జలము తగ్గినచో కమలాపురము చెఱువే కాలువకు జీవనము పోయుచుండును.

6. నరసింహ విగ్రహము.

వీరభద్రాలయమున కనతి దూరమునఁ ద్రోవకుఁ బడమటి ప్రక్కనందుఁ గొన్ని గజముల దూరమున నొక పొలములో నరసింహ విగ్రహమున్నది. శ్రీకృష్ణదేవరాయఁడు ౧౫౨౮ వ సంవత్సరమున నీవిగ్రహ మొక శిలలోఁ జెక్కించియుంచి నాదియారాధనమున కయి మాన్యక్షేత్రము లుంచెను. ఈ నాది యిరువదిరెండడుగుల యెత్తుగలదియైనను, శిల్పకారుఁడం దేయంగమును పరిమాణలోపము లేకుండ, నృసింహమూర్తి యాదిశేషుని చుట్టపైనఁ గూరుచుండి నట్లును, మహాలక్ష్మి దక్షిణ

బాహులతికఁ దనవిభుని కటిస్థానమునఁ జుట్టి యాతని వక్షస్థలమున వామపార్శ్వమందుఁ గూరుచుండి యున్నట్లును, శేషఫణ మానృసింహుని శిరోపరిభాగమున నావరించియున్నట్లును, మిగుల హెచ్చుకళతోఁ దీర్చెను. శేషుని తలలు కొన్ని కొట్టివేయఁబడినవి. ప్రధాన విగ్రహము నాశికావిచ్ఛేదము నొందియు రౌద్రరసము మూర్తీభవించి యున్నట్లు కన్పట్టుచున్నది. లక్ష్మి కూరుచుండియున్న వక్షస్థల భాగము లక్ష్మీ స్వరూపమించుకంతయు మిగులకుండఁ బూర్తిగ భిన్నమొనర్పఁబడినది; కాని నరసింహుని మొలకుఁ జుట్టియున్న శ్రీదేవి కరలాంఛనము మాత్రము మిగిలియున్నది. ఆలయము నందొక మూలనున్న రాతిప్రోవులో లక్ష్మీ విగ్రహఖండము లింకను గలవు.

### 7. శివాలయము.

ఈనరసింహ విగ్రహమునకు నుత్తర పార్శ్వమున మిక్కిలి చేరువగ శివాలయమున్నది. అందలి శివలింగము మిగులఁ బెద్దది. ప్రసన్న విరూపాక్షాలయమున వలెనే యిందలి శివలింగమెప్పుడును నీటిచే నావృతమయి యుండును.

### 8. కృష్ణస్వామి దేవాలయము.

పైనఁ బేర్కొనిన యాలయముల రెంటికిని సమీపమున రమారమి నూఱుగజముల దూరమున నిదియున్నది. విజయమందిరమును హజారరామస్వామి

గుడియు నిర్మింపఁబడిన సమయము (౧౫౧౩) న నిది యుఁ గట్టఁబడినది. ఇపు డీయాలయము పాడుపడినది. ప్రాకారము బలమైన రాళ్ళచేఁ గొంత మొరటుగ నిర్మింపఁబడినది. గర్భ గృహముపైని గోపురమునఁ గృష్ణలీలలు తీర్పఁబడినవి. కృష్ణదేవరాయఁ డుదయగిరినుండి కృష్ణస్వామి విగ్రహముఁ గొనివచ్చి యిందుఁ బ్రతిష్ఠించెను. ఈవిగ్రహ మిపుడు చెన్నపురి వస్తు ప్రదర్శన శాలలోఁ గలదు. ఆవరణమునఁ జుట్టును మండపము లున్నవి. గుడిలోని శిల్ప మంతయందమైనది కాదు. దాని ద్వారములు శిథిలములై గోపురాంచితములయి యొప్పుచున్నవి. సింహద్వారమున కెదురుగ విశాలమగు నొక వీథియు దానికి నిరుగడల చావళ్ళును గలవు. ఈవీథి ఫలములైన నాల్గురాజమార్గములలో నొక్కటి. తొలుత వ్యాపారములకును నుత్సవాదులకును మిగులఁ బేరొందినది. బ్రహ్మరథోత్సవాదులచే మహావైభవమున వెలయుచుఁ దీర్థయాత్రాపరుల యొఱపిడివలనఁ గిటకిటలాడుచుండిన యావీథులిపుడు నిర్మానుష్యములై వ్యవసాయమున పనికిపట్టులయి యున్నవి.

### ౭. చిన్నవి విష్ణ్వాలయము.

కృష్ణాలయమునకు వెనుకఁ బశ్చిమభాగమున నగపడు రెండు దేవాలయములలో నిదియొకటి. ఇది, దక్షిణాకన్నడ మండలమున బదునాల్గవఁ శతాబ్దమున నిర్మింపఁబడిన యాలయములకుఁ దుల్యమైనది.

## 10 సాసివికల్లు గణేశుడు.

విష్ణ్వాలయమునకుఁ బైనఁ జిన్నగుట్టపై నీగణేశ మండపము వెలయును. చుట్టును గోడలులేక బాహాటమైన యిరువది యెనిమిది స్తంభముల యాధారమున మండపము నిల్చియున్నది. విగ్రహమున కావగింజంత గణేశుఁ డనుపేరున్నను నిది రమారమి పదునాలుగడుగుల యెత్తును నందములకుదిరిన వెడల్పును బొందియున్నది. ఈ విగ్రహపు వామహస్తమును తొండమును విఱుగఁ గొట్టఁబడినవి. ఎలుకవాహనము చాలఁజిన్నది. అది ప్రత్యేకశిలలో నిర్మింపఁబడినది.

## 11. కడలెకల్లు గణేశాలయము

మార్గము కొంత కొండపైకి వెళ్ళి యటనుండి క్రిందుగావాలును. అందు పై భాగమునున్న శిథిలాలయములలో నీగణేశాలయ మొకటి. ఇది పూర్వాభిముఖము. ఇందు సొగసైన రాతి స్తంభములు గలవు. గోడలు శిల్పపుఁబని యేమియునులేక సాధారణస్థితిలో నున్నవి. అందలి శిథిలాలయములలో నిదియే యందమైనది. ఇందుండి చూచినయెడల పంపావీథియు తుంగభద్రానదియుఁ జక్కఁగఁ బొడఁగట్టును. కడలెకల్లు గణేశుఁడనఁగా సెనగగింజ పరిమాణముగల శిలలోని వినాయకుఁడని యర్థము. ఈవిగ్రహము పదునైదడుగుల యెత్తునకు మించియుండును. ఇది సుస్థితిలో నుండియు పూజాపునస్కారములఁ గోల్పోయినది. గర్భగృహ మ-

సంఖ్యాకములగు గబ్బిలములకు జన్మస్థలమై, దుర్గంధమునకుఁ దల్లియిల్లై, లోనఁ బ్రవేశించెడు యాత్రాపరులకు బహుళ జుగుప్సాకరమై, దుర్భరశిరోవేదనఁ గూర్పఁ జాలియున్నది.

## 12. హేమకూట పర్వతము.

ఇది తుంగభద్రా నదీతీరమునఁగల గిరివరము. ఇందుఁ బెక్కుగుళ్ళున్నవి. అవి చిన్నవైనను దర్శనయోగ్యములు. కొన్నిటికి నిత్యారాధనము జరుగును. జైనాలయముల సమూహ మీ హేమకూటాచల భాగముననే కలదు. పంపాదేవి శ్రీవిరూపాక్షేశ్వరునిఁ గూర్చి తపస్సు గావించిన శైలరాజమిది. దీనిపైనున్న రెండంతస్తుల మండపమెక్కి చూచినచో పంపాదేవాలయమును తుంగభద్రా స్రవంతియు, దానియవలి యొడ్డుననున్న నైజాము రాష్ట్రపు టడవులును, దృష్టిగోచరములగును. ఇందలి కొన్ని జైనాలయములు హిందూదేవాలయములుగ మార్పఁబడినవి.

## 13. విచిత్రమైన గుడి.

పై రెండంతస్తుల మండపమునకుఁ బశ్చిమభాగమున నొకవింతయైన గుడియున్నది. శిథిల నిర్మాణములలోనెల్ల నిది చాలఁబురాతనమైనది. దీని గోపురము తిరుగఁబడిన బొంగరమువంటిది. చెంగల్పట్టు మండలమున నెక్కుడుగఁ బ్రసిద్ధినొందిన సప్తద్రవిడ



కొండపైని చిన్నని విష్ణ్వాలయము.

దేవాలయముల నిరియనుసరించినదని సూవెల్ నుడువు చున్నాడు. ఈపద్ధతిని గట్టబడిన యాలయములు దీనికి సమీపమున నొకటియు బంపాపతి దేవాలయమున కుత్తరమున మఱొకటియు నున్నవి.

11. జైనాలయములు.

ఉత్తర భాగపువాలు కొంత దిగినతరువాత జైనాలయము లగపడును. వాని గోపురములు పిరమిడ్స (ఆఫ్రికాఖండమున త్రిభుజాకారమున నుండు సుప్రసిద్ధ నిర్మాణముల)ను బోలియున్నవి. విద్యానగరమునందలి జైనాలయములన్నియు నీపద్ధతి ననుసరించియే కట్టబడినవి. వీనిచే నీప్రాంతమునందలి యప్పటి జైనుల ప్రాబల్యము తెలియఁగలదు. ఈయాలయము లేకాలమున నిర్మింపఁబడినవో. అన్నింటిలో నీహేమకూటమున నున్న మూఁడింటిగుడి మిగులఁ బురాతనమైనది. నడిమి యాలయము గుండ వెళ్ళినచో స్తంభములుగల మొగసాలవచ్చును. అది యుత్తరాభిముఖము. ౧౪-౧౫ శతాబ్దములలోని కోవెలలుకొన్ని, నిర్మాణవిధానమున వీనిని మించియున్నవి.

ఈనిర్మాణముల నన్నింటిని దిలకించి పంపాపట్టణమున బసచేసినచో, ముందు చూడఁదగిన వానిజాచుట కనుకూలముగ నుండును.

---

# ఎనిమిదవ ప్రకరణము.

---

## పంపాపట్టణము (హంపి).

### 1. పుర ప్రాముఖ్యము.

జైనాలయములు వదలి, శిలాసోపానములు గడచి, తూర్పుభాగమునందలి శిథిలద్వారము దాఁటినచో, పంపాపట్టణము చేరనగును. ఇది పంపాపతి దేవాలయమును జుట్టియున్న యొకచిన్నపల్లె. తొల్లింటి విద్యానగర రాజుల ప్రధానపట్టణము. విద్యానగర శిథిలముల కారణమునఁ బ్రసిద్ధినిగన్న రంగము. శ్రీవిరూపాక్షేశ్వరాలయ హేతువున దక్షిణకాశియని విఖ్యాతినిగడించిన పవిత్రభూమి. భారతప్రపంచమునందలి నూటయెనిమిది దివ్యక్షేత్రములలో నొక్కటి.

### 2. నాఁడు—నేఁడు.

పట్టణప్రాకారములును, సేనాపరంపరలు వ్యాపించియున్న భాగములును, నధికస్థలమాక్రమించియుండినవి. ఈపురి పడమటిగవను, నాగలాపురమునకు రెండు మైళ్ళకావల కొండలయధోభాగమున నొక యున్నతమైన మట్టితిన్నెయపై నిర్మితమై, ప్రకృతము ఖిలరూపముననున్న సింహద్వారము. ఆనెగొంది దీనికుత్తరపుటెల్ల. కంప్లి తూర్పుమేర. దరోజి దక్షిణపుహద్దు. ఆదైవయుగమున దీని వైశాల్యము ౨౫౬ చదరపుమైళ్ళు. జనులచేఁ గ్రిక్కిరిసి

యుండిన మధ్యరంగముమాత్రమే పదిమైళ్ళు. జనసంఖ్య సేనావాహినులతోఁ జేరి మొత్తము ముప్పదిలక్షలకుఁ బైఁబడినది. నాఁటినిర్మాణములు దైవనిర్మాణములనియు, నాపట్టణములు దైవనగరములనియు, నేఁటికిని శాసనములు ఘోషించుచున్నవి. ఆనిర్మాణములను బోలినది నేఁ డొక్కటియు వెలయదు. శిల్పమునకును చిత్రకళకును నది యౌవనకాలము. మతమున కెక్కుడుప్రాధాన్య మిచ్చిన యుగమది. నేఁటివలెఁ గేవలము వాణిజ్య కర్మాలయములకుఁగాక, నాఁడు దైవకైంకర్యనిలయము-లకు విద్యానగరము మాతృమందిరమై యుండెను. వాని కొఱకది సర్వస్వ మర్పించినది. నేఁడీప్రాంతమున మనకనుల కందందువిందుఁగూర్చున వేవియైన నున్నవనిన నవి నాఁటిదైవసదనములే. పంపాపుర మొకపల్లెయని యంటిమి. ఇప్పుడది తొంటివిన్నాణమున లేదు. అందు జనులు కాఁపురముండుగృహములైదారింటికంటె నె-చ్చుగలేవు. ప్రకృతమందలి ప్రజాసంఖ్య ౨౬. ఇందుఁ బూజారియు నాతని బంధువులును దాస దాసీజనులును మాత్రము చేరియున్నారు.

౩. ప్రకృతి.

ప్రకృతినిగాంచుట భగవంతునిదర్శించుట వంటిది. ఇందుచే స్థలప్రాముఖ్యమును, నందు విలీనమయియున్న ప్రపంచానుభవమును, భగవానుని గభీరశక్తిని నెఱుంగ నగును; గానఁ దీర్ఘయాత్ర జ్ఞానయాత్రయనుట సామంజ

స్యమేమొ. ఒకానొక మహాసామ్రాజ్యమునకు ముఖ్యపట్టణముగను జన్మభూమిగను నుండిన యీ ప్రాచీనపుర చరిత్ర కరుణజనకమైనదియు, మహాభయంకరమైనదియు, మిగుల విషాదకరమైనదియును. దీనియుత్తరభాగమున తుంగభద్రాస్రవంతి యిఱుకైన చిన్నని లోయలగుండ, గండశిలలఁ దొలచుచు, గుండురాళ్ళఁ ద్రోసికొనుచు, దరుల నొరసికొనుచు, శరవేగమునఁ బరుగువాఱుచుండును. ఈస్థలభాగమంతయు నత్యున్నతములైన ప్రస్తరవ్రాతముల వలనను, పర్వతశ్రేణుల తోడను, నిబిడీకృతమై యున్నది. ఈ గిరివర్గములఁ జెట్లెదుగవు; పైరులు పెరుఁగవు; గడ్డి మొలవదు. ఇవి కేవలము పాషాణమయములు. ఇచ్చటి నిప్పులఁజెరుగు వేసఁగిపగళ్ళును, వడవడ వడఁకించు శీతలరాత్రులును, మహాగండశైలములఁగూడఁ జీల్చివైచినవి. అట్లు విచ్ఛిన్నములైన యామ్మృషఖండములు పర్వతాగ్రముల నుండి దొరలి, యచ్చటి యగాధప్రపాతములలోఁ దలక్రిందులుగఁ బడిపోయినవి. కొన్ని మీఁదియంచు లొండొంటితోఁగదిసి ధనురాకారమువహించినవి. పెక్కుటాలంపలి శైలజాలమునుండి వేఱై గోపురాకృతిని నిలువున నిలిచియున్నవి. ఈసృష్టిచిత్రములను గమనించు కొలఁదిని భగవానుని యమేయశక్తి తనంతన హృదయపటలమున ముద్రితమగుచుండునుగదా.

### 4. అనుకూలపదార్థము.

సుప్రసిద్ధ నిర్మాణకార్యములకెల్ల మూలపదార్థ-

మగు నది రాయి. దానికయి యెంతోదవ్వు వెళ్ళనవస-
రములేదు. అదియిచ్చటఁ గొల్లలుగ లభించును. అసా-
ధారణములగు గొప్పగొప్ప సానతాళ్ళను సమకూర్చుట
కింతకంటె ననుకూలమగు ప్రదేశము వేఱులేదు. వానిని
దూరమునుండి కొనివచ్చుట మిక్కిలి యసాధ్యమగు
కార్యము; గాన మహత్తర నిర్మాణసృష్టి కిది చాల
ననువగు స్థానము. వలయు తాలను గ్రహించి సాను-
కూలముగఁ దీర్చుచో శిల్పకళా విజ్ఞాన మెంతయేని
వ్యాప్తినొందఁగలదు.

* పంప *

'పంప' యనునామము పురాణప్రసిద్ధము. తుంగ
భద్ర కది మాఱుపేరు. పంపాదేవినిగూర్చి యిచ్చటిజను
లొకకథచెప్పికొందురు. ఆమె బ్రహ్మపుత్త్రిక. మాల్య-
వంత మాతంగాద్రులలోఁ గుగ్రస్మరుచు, ఫలకుసుమాది
పూజాద్రవ్యములు నిరంతరము సేకరించి సమర్పించు
చుండుటచే, నందలి ఋషివర్యుల యాదరభాగ్యము
వడసిన కన్యాలలామ. ఆయతిసత్తము లామె యకలంక
మగు భక్తికి సంతసించి, వలయువర మేదేనిఁ గోరికొన
ననుగ్రహించిరి. అందుల కాయువతి యానందభరిత
హృదయయై మహాశివుఁడగు విరూపాక్షునిఁ దనకుభర్తగఁ
బ్రసాదింపవేఁడెను. ఆమునీంద్రు లందులకు హర్షించి
యామెకుఁ బవిత్రమంతోపదేశముఁగావించి, తపో

* Madras District Gazetteer - Bellary.

విధానమును చెప్పి, తన్మూలమునఁ బతినివడయుమని యానతిచ్చిరి. అంత నాసాధ్వి భయంకర నియమములఁ బూని, మహాదేవునిఁ గూర్చి దీర్ఘకాలము హేమకూటా-చలమునఁ దపమొనరించెను. విశ్వేశ్వరుఁడు ప్రసన్నుఁడై పంప నర్ధాంగిగ స్వీకరించెను. పురనామము 'పంప'. ఈ పంపాశబ్దమే కర్ణాటకభాషలో 'హంపి' యనిమారి-నది. పంపాపతి రెండవభార్య భువనేశ్వరి. విరూపాక్షాలయమున నీదేవతలకు వేర్వేఱు సదనములున్నవి.

5. విరూపాక్షేశ్వరాలయము. *

౧. గోపురాదులు — విరూపాక్షాలయము మి-క్కిలి పురాతనమైనది. ఇందలి కొన్ని భాగములు విద్యానగర ప్రభువుల కాలమునకుఁ బూర్వమే నిర్మింపఁబడినవి. క్రీ. శ. ౧౧౯౯ వ సంవత్సరమున నాగవంశ-జుఁడగు కలిదేవుఁడు, బళ్ళారి రాష్ట్రములోని కురుగోడు మండలము పాలించుచున్న సమయమున, నొక భక్తుఁడు విరూపాక్షునిపేరఁ గొన్ని మాన్యక్షేత్రము లుంచెనఁట. గుడి కుత్తరభాగమునఁగల యేక శిలాశాసన మీవిష-యముఁ దెల్పుచున్నది. విద్యానగర ప్రభువులలోఁ బ్రథముఁడగు హరిహరుఁడు, మాధవ విద్యారణ్యుని యుపకారార్థమై యందొక యాలయము నిర్మించెను. ౧౫౦౯ — ౧౦ సంవత్సర ప్రాంతములో సామ్రా-జ్యాభిషేకోత్సవ స్మారకార్థమై శ్రీకృష్ణదేవరాయఁడు

* Madras District Gazetteer - Bellary.

విరూపాక్షాలయమున రంగమంటపమును నిర్మించి, పూర్వోత్తర ద్వారగోపురములను గట్టించెను. ఇందుఁ దూర్పు గోపురము పదునొకండంతస్థులుగల్గి లోపల బోలుగానున్నది. ఇది వాయుమండలము దాఁటిపోవుచున్నంతటి యౌన్నత్యము వహించిన దగుటచే, గాలి గోపుర మను సార్థకనామముఁ బొందియున్నది. శ్రీకృష్ణరాయని ప్రోత్సాహమునను సాహాయ్యసంపత్తిచేతను 'పిట్టప్ప' యను శిల్పి దీనిని నిర్మించెనఁట. పాశ్చాత్యులలోని యింజనీర్లు సయిత మీ నిర్మాణ కార్య కౌశలమున కద్భుతముఁ జెందియున్నారు. ఉత్తరమునఁ గల గోపురము రాయల గోపురము. ఇది రాయని యనంతరము కనిగిరిరాజుచేఁ బునరుద్ధరింపఁబడుటవలన, కనిగిరి గోపుర మనియు వెలసెను. గాలి గోపురమున కంటె నిదిచిన్నది. పైకిఁ బోవుటకు కనువైన సోపానమార్గమున్నది. గాలి గోపురపు మెట్లదారి యపాయకర మను హేతువునఁ [illegible] రెండవ యంతస్థునుండి మూసియుంపఁబడినది. ఆలయమునకు రెండు ప్రాకారములుగలవు. బహిరావరణ మధ్యమున తుంగభద్ర కాలువ నిరంతరము ప్రవహించుచుండును. అంతః ప్రాకారాంతరమున గర్భాలయము నితరాలయములు నున్నవి. వానిలో భువనేశ్వర్యాలయ మొకటి.

౨. భువనేశ్వర్యాలయము—నాఁటి హిందూ నిర్మాణపద్ధతి ననుసరించి భద్రమై, బలాఢ్యమైన ద్వార

మీూభువనేశ్వరి సదనమునకుఁ గలదు. ఈయాలయ మందు చాళుక్యుల కాలమునాఁటి స్తంభము లనేకము లున్నవి. అన్నియు నల్లనిఱాలలోఁ జేయఁబడినవి. ఈ నిర్మాణవైఖరి ౧౧, ౧౨ శతాబ్దముల కాఁపు పద్ధతి ననుసరించియున్నది. గర్భాలయమునకంటెఁ దక్కిన నిర్మాణభాగమే మిగులఁ బురాతనమైనది. ఈగుడి యావరణమునకు వెలుపలఁ దూర్పుభాగమునఁ జిరకాల-మునాఁటిదగు నొకపిప్పలి వృక్షమును దాని దిగువఁగేవ-లము ప్రాచీనసాంప్రదాయము ననుసరించి నిర్మింపఁబడిన యొక చిన్న దేవాలయమును గలవు. దీనికిఁ జేరికగా 'లోకపావన' యనెడు సరోవరమున్నది.

3. విరూపాక్షాలయము—సింహద్వారము దాఁ-టి లోనఁ బ్రవేశింపఁగానే యొక పెద్ద ముఖమండప మును బిమ్మట గర్భాలయమును వచ్చును. ఇదియే విరూపాక్షాలయము. దీని ప్రధాన ద్వారమున కె-దుట నాల్గు స్తంభము లున్నవి. అందు రెండు బంగరు పూఁతగలవి. తక్కిన రెంటికిని రాగి రేకులు రక్ష కములు. కవాటములు గూడ తామ్ర రక్షాదళములచే నాచ్ఛాదితములై స్వర్ణలేపనముఁ బొందియున్నవి. స్తం-భముల కసంఖ్యాకములగు చిన్నని గుళ్ళుగలవు. వానిలో మూఁడువేలవఱకు దీపికలు వెలిఁగింపఁబడునఁట. గర్భాల-యమునందలి శివలింగమే విరూపాక్షప్రతిమ. క్షేత్ర సందర్శనార్థమయి యాత్రికు లనవరత మిందు విచ్చేసి,

శ్రీవిరూపాక్షేశ్వరున కారాధనములు గావించి వెళ్ళు చుందురు. శివలింగ మున్న గర్భాలయ మంధకార బంధురము. విగ్రహసందర్శనము చేయఁగోరువారు నలకుఁ గొంతమునకు విధిగఁ జెల్లింపవలయును. హైందవేతరులు లోనఁ బ్రవేశించుటకు వీలులేదు. గుడివెనుక మహిషాసురమర్దని (కాళి) విగ్రహమున్నది. అందెప్పుడు నేతిదివ్వె వెలుఁగుచుండును. ఉత్తర ప్రాకార ద్వారమునుండి తుంగభద్రకు దారి గలదు. ఇచ్చటి నదీ భాగము 'వశిష్ఠ తీర్థ' మనఁబడును. విరూపాక్షేశ్వరాలయము ౧౮౩౭ వ సంవత్సరమున బ్రిటిష్ ప్రభుత్వము వారి యధీనమైనది. ఆసమయమున బళ్ళారి మండలాధిపతిగ నుండిన 'రాబర్ట్సు' కనిగిరి గోపురమును మరల బాగుచేయించెను.

## ౭. పంపాపుర ప్రధాన వీథి.

గాలి గోపురమున కెదురుగనున్న శిథిలములగు నాల్గుబజారులలో నిదియొకటి. ౩౫ గజముల వెడల్పును ౮౦౦ గజముల పొడవునుగల విశాలమును రామణీయకమును నగు వీథియిది. ఇందే రథోత్సవాదులు జరుగును. దీని కిరువంకలనున్న శ్రేణులలోని గృహములును మండపములును శిథిలావస్థను బొందినవి. అయిననందుఁ గొన్ని యందమైనమేడలు ప్రాచీనవైభవ విశేషములఁ జాటఁజాలియున్నవి. ఇందలి మండపాదులు బ్రహ్మరథోత్సవ సమయమున యాత్రికులకు విడుదులుగ నుప-

యోగింపఁబడును. ఆసమయమున యాత్రాపరులనుండి విభుదల యచ్చటలక్రింద విరివిగ సుంకములు గ్రహింపఁబడును; కాని పెక్కుమండపము లపాయస్థితిలో మిక్కిలి యనారోగ్యప్రదములుగ నున్నను, వానినిఁగూర్చి విచారించువారు లేరు.

పూర్వ మీవీథియందే యున్నతాధికారుల కనుకూలములగు గృహావళు లుండినట్లును, రాజమందిరము గూడ నీభాగమం దేయుండినట్లును, దైవోత్సవ సమయములయందు రాజు తనసౌధప్రాంగణమున నిల్చి వినోదములఁ గాంచుచుండినట్లును, పెయిస్ తెల్పుచున్నాఁడు. అసాధారణములగు ముత్యాల జాలరులచేతను మణిహారములవలనను రాణించు వర్తకశాలలు, వివిధవిధ రత్నరాశులచే మెరుగునింపు మణివేదికలు, ప్రాభవ శోభితములగు నమూల్య చీనాంశుకములను ముక్తామణి హారములను ధరించి పర్వతములఁబోలు నేనుంగుల యంబారులలో నె[illegible] పయనమొనర్చు రాజులు, నా ప్రభువులను బలసికొలుచు హయారూఢులగు పందల తరబడి భటులు, నిరంతరము చీమలవలెను దోమలవలెను నెడములేక నడచు లక్షలకొలంది పౌరజనులు వెలయఁగ, నంతలి యొక్కొక వీథియు ననుపమ వైభవ సంపదలచేఁ బొంపిరివోవుచుండిన వెనుకటి దినముల యందలి యుత్కృష్టదశను యథావిధమున గ్రహింపవలయునని నా కాలమున వానిప్రాభవ వైభవాదులఁ గన్నారఁ గాంచి

చరిత్రకారులయిన పెయిస్ వంటి విదేశీయుల వర్ణనలు పరిశీలింపవలసియున్నది. ఒక మహాసామ్రాజ్య మూల్యమునకుఁ దుల్యముగ విలువఁగట్టుచుండిన నాఁటి పంపావీధి నేఁడు పాడ్వడి దౌర్భాగ్యావస్థకులోనై యెంతవిషాదకర స్థితిలోనున్నదో యాత్రాపరులు గ్రహించుచునే యున్నారు.

ఈ వీధికి విరూపాక్షేశ్వరాలయమునకు ముందు భాగమున కొయ్యతేరులు రెండుగలవు. సంవత్సరమున కొకపర్యాయము బ్రహ్మరథోత్సవ కాలమున నవి యుపయోగింపఁబడును. ఆదినములలో నానా రాష్ట్రజనులు వేలకొలఁదిగ నందుఁగూడి కైంకర్యాదులలోఁ బాల్గొందురు.

పంపాప్రధానవీధిచివర నొక మండపాంతరమున నేకశిలానిర్మితమగు నందివిగ్రహ మొండుగలదు. ఈవీథి తూర్పుకొనలో నొకమార్గము సూటియ బజారునకును నచ్యుతరాయదేవాలయమునకును వెళ్ళును. రాతిమెట్ల దారియొకటి కోదండరామాలయమున తుంగభద్రానదీ సమీపమందు వంపు దిరుగును.

# తొమ్మిదవ ప్రకరణము.

## తలారిగట్టు మార్గము.

### 1. రాతికాలువ.

పంపావీథికిఁ దూర్పుచివర వఱదలవలన నిసుకచేఁ గొంతవఱకుఁ బూడియున్న రాతికాలువ యగపడును. తుంగభద్ర దీనికభిముఖముగఁ గొంతదవ్వు వచ్చి, యందుండి విశాలములగు ఱాతితిన్నెలపైఁ దిరిగి, కోదండరామస్వామి దేవాలయము వైపుగా వెళ్ళును. వర్షాకాలమునఁ బ్రవాహవేగసమయమున నీభాగమంతయును జూచుటకుఁ గడుంగడు రమ్యముగనుండును.

### 2. 'సూళేయ' బజారు.

పంపావీథి మూలమునఁ బూర్వాభిముఖముగఁ గొంతదూరమునడచి, యెడమవైపుననున్న ఱాతిత్రోవ విడిచి దక్షిణదిశగా మరలినచో, నీ వేశ్యాజనసమాశ్రయము వచ్చును. ఇది వారవనితల నివాసమునకై ప్రత్యేకపఱుపఁబడిన నెలవు. వేశ్యలిందు విశేషముగ నివసించుచుండిరి.

### 3. దేవసదనములు-రాజభవనములు.

పూర్వపురాజులు తామార్జించిన విత్తమున విశేషభాగము భగవదాలయములు గోపురములు నిర్మించి, విగ్రహప్రతిష్ఠా కార్యము లొనర్చుటయందే వినియోగించుచుండిరి. వారంత ప్రయాసఁగొని దైవ నిలయముల

నత్యధికశ్రద్ధాభక్తులతో నుత్కృష్టతరణి నలంకారవంత-ములుగ నిర్మించుచున్నను గృహనిర్మాణవిషయ మించుకయు గణనసేయలేదు. నాఁటి రాజమందిర మూల బంధములు లవమైన నాడంబరములేక సామాన్యస్థితి యందే యుంగపడుచున్నవి. ఇతర సౌధములు సయితము డాబులేని తీరున నిర్మింపఁబడి యుండును. నేఁడు వాని గుఱుతులైన నగపడుటలేదు.

4. వరాహదేవాలయము.

ఇది పైబజారున కుత్తరపుఁ జివరయందు శిథిలమై కాన్పించును. దీనిలోఁ బిగోడ శిలపై వరాహ రూపము చెక్కఁబడినది. ఈప్రతిమకు మీఁది వైపున సూర్యచంద్రగ్రహచిహ్నము* లున్నవి. వరాహాలయమునకుఁ దూర్పుభాగమున నదినది గట్టుల దూరమున ననంతశయనాలయ మున్నది.

5 అనంతశయనాలయము.

ఇందలి విగ్రహ మవిచ్ఛిన్నము. ఏకశిలా నిర్మితము. నటిఁ లధికముగనున్న దినములందు నీటి మునుకలో నుండును. దీనిఁబోలిన యాకారమే కమలాపురమునందలి సత్రమునఁ గూడఁ జెక్కఁబడియున్నది. కమలాపుర మార్గమున నీవఱకే యొక యనంతశయన దేవాలయముఁ గూర్చి తెల్పియున్నాము.

---

* విద్యానగరప్రభువులు తమ యుగమునందలి సంస్థలపై నీచిహ్నములను ధారాళముగ వాడిరి. ఆసంస్థ లాచంద్రార్కముగ వెలయవలయు ననుట నిర్మాతల యాశయమయి యుండును.

## 6. అచ్యుతరాయాలయము.

మహానిర్మాణములలో నిదియొకటి. ద్వారములు మిక్కిలి గొప్పవి. అమ్మవారిశాల యున్నది. వరం-డాలు మండపములు విశేషము. అనేక స్తంభములుగల మండపముఁ గూడ నిందుఁగలదు. అచ్యుతరాయఁడు దీనిని (౧౫౩౯లో) నిర్మించెను. ఆకృతియం దిది పట్టాభి రామాలయమును విట్ఠలరాయని గుడిని బోలియున్నది. విఠోబాలయమునవలె నంత వైభవాభిరామముగ లేకు-న్నను, నవశ్యముగఁ జూడఁదగిన నిర్మాణము. ఇందలి స్తంభములు సొగసైనవి. శిల్పపుఁ బని యందమైనది. ఉత్తర పశ్చిమ భాగములలో పునాదియందలి శిల్పనై-పుణ్యము కొనియాడఁదగినది. పశ్చిమ ద్వారమున గంధర్వనృపుల సమ్మేళనము వర్ణనాతీతము. ఉత్తర ద్వా-రమునందలి శిల్పకళావైభవ మత్యంతరామణీయకము. ఇందు విష్ణులీలలు చిత్రితములు. బయటితలుపులకు లోనను వెలుపలను నదీదేవతా విగ్రహములు రెండు మొసలిపై గంగయు, తాఁబేలుమీఁద యమునయుఁ బయన మొనర్చుచున్నట్లు మిక్కిలి విన్నాణముగఁ జెక్కఁబడి యున్నవి. ముఖమండపమునకు సమీపముననే కల్యా-ణమండపమున్నది. ఏఁటేఁటను దైవకల్యాణ కార్యములు జరుపునపుడు, కార్యకరులు ప్రధాన విగ్రహములతోఁ బాటుగ నితరములగు నన్ని ప్రతిమలతోడ నీమండప-ము నలంకరింతురు. దీని సింహద్వారమున కెదురుగ

పెద్దవీథియొకటి యరమైలువఱకు విస్తరించియున్నది. ఈ శ్రేణి కిరువంకలను చావడులు గలవు. ఆకాలమున సీధిఫణిలోఁ బెక్కురకముల ముత్తెములు పచ్చలు కెంపులు నీలములు వజ్రములు మొదలగు రత్నములు రాసులు పోసియు, నమూల్యములగుదువ్వలువలు దొంతరులుగఁ బేర్చియు, నానావిధ ఫలావళులు గుట్టలుగఁ దోలియు, విక్రయించుచుండిరి. నేఁ డాయాపణములు పాడు పడినవి. నడుమనున్న బావి సేద్యమున కుపకరించుచున్నది. వెనుక నున్న మాతంగ పర్వత మీయచ్యుతరాయాలయమునకు మఱింత శోభ హెచ్చించుచునవచ్చును.

7. మాతంగ పర్వతము.

అచ్యుతరాయాలయము దక్షిణద్వారము మూలమున బయలుదేఱి యావలనున్న నటికాలుబాట నుండి మెట్ల బారిని మాతంగాచలముపై కిఁ, బోనలెను. విద్యానగర సందర్శనార్థమై వచ్చెడు ప్రతియాత్రికుఁడు, నీమాతంగ పర్వతాగ్రమువఱకు జాతెడు మెక్కవలసియున్నది. శిఖరభాగమున గోపుర సహితముగనున్న దేవమందిరమే మాతంగాలయము. దాని ప్రాకారద్వారము దక్షిణాభిముఖము. ఆవరణమునననేకమండపములుగలవు. గర్భాలయమున రామదేవవిగ్రహ మున్నది. అందొక స్త్రీదేవతా ప్రతిమయు నందులు మూఁడును గలవు. ఆలయపు రాతికంబములపైఁ గరశిల్పము కొంతగోచరించును. స్తంభములు పదునాల్గవ శతాబ్దమునఁ జేసినవి

యయియుండనోపు. ద్వారములు గూడ రమ్యమైన శిల్పచాతురి నొప్పెడిని. ఒక్కచోట బౌద్ధ సాంప్రదాయము ననుసరించి, పొట్టిబాహులవరుస తీర్పఁబడినది. ప్రకృత మీయాలయమున బైరాగులు వసించుచు రామార్చన సల్పుచున్నారు. వాలి వధానంతరము సుగ్రీవ పట్టాభిషేకోత్సవము ముగిసినపిమ్మట నాషాఢము మొదలు కార్తీకమాస పర్యంతము నాల్గునెలలు శత్రు-సైఁబడుటకు నుచిత సమయముకాదని తలంచి, శ్రీరాముఁడు కొంతకాల మిచ్చటను మఱికొంత కాలము మాల్యవంతాద్రియందును సీతావియోగదుఃఖ మనుభవించుచు, లక్ష్మణునితోఁగూడ వసించియుండెను.

ఈశైలాగ్రభాగము కన్నులకువిందుఁగూర్చునది. ఇది ఋష్యాశ్రమముగ నుండెననుటకు సంశయ లేశమును లేదు. దీనినంటి మాల్యవంత ఋశ్యమూక కాంచనాది గిరిశ్రేణు లున్నవి. ఇట్టి మనోజ్ఞ స్థలము దక్షిణ హిందూదేశమున మఱిలేదని యనేకుల మతము. మాతంగాద్రిపైని పృక్పథ మెంతయు రమణీయమైనది. అందు నిలుచుండి చుట్టును పాఱఁజూచినచోఁ బంపాస్వరూపమంతయుఁ ఒక్కఁగ లోచనగోచరమగును. దాని విశాలత గభీరత చూపఱుల మనఃపటలమున యాథార్థ్యమమునఁ జిత్రితముకానేర్చును. అనేకశతాబ్దము లీ పట్టణగౌరవముఁ గాపాడి, దాని కపారయశము నార్జించియుంచిన తుంగభద్రా స్రవంతి వెండితీగల బాగులవలెఁ

చెక్కఁబడినది. ఈమూఁడు విగ్రహములు నేకశిలయందే నిర్మింపఁబడినవి. వానిశిల్ప మద్భుతము. అసదృశ గుణాఢ్యుఁడైన శ్రీ రామచంద్రుని, నప్రతిమాన పతి భక్తిగల సీతామాతను, సర్వజన సంస్తుతి పాత్రుఁడైన సౌమిత్రిని దలంచినంతనే యెవ్వారికి భక్తిభావము జనింపకుండును? ఇందు నేఁటికిని బూజజరుగుచున్నది.

## 9. చక్రతీర్థము.

కోదండ రామాలయమునకుఁ జేరువ నుత్తరమునఁ బూర్వదిశగాఁ బ్రవహించు తుంగభద్రా నదీ భాగమునకే చక్రతీర్థమని పేరు. ఇచ్చటి బండలపై ననేకములగు శివలింగములును, వానికి సాగిలి పడిన భక్తుల చిత్రములును జెక్కఁబడినవి. తుంగభద్ర యిచ్చట నగాధమై కొంత విశాలమార్గమునఁ బ్రవహించును. ఉరవడియు నధికము. ఈభాగమున మొసళ్ళు సాయంసమయముల నదియొడ్డున నిసుక తిన్నెలపై విశ్రమించు నని వినికి. తుంగభద్ర యిందు వలగొని పాఱును; కనుకనే యీభాగము చక్రతీర్థమైన నొప్పెను. వర్షాకాలమున నిది దరులనొరసికొనుచు నవారిగఁ బ్రవహించును. ఈపరిశుద్ధజలము పవిత్రవంతమైన పానీయము. గంగోదకము స్నానమున కెట్లో తుంగభద్రాసలిలము పానమున కట్లు. 'గంగాస్నాన-తుంగాపాన' యను వినుచున్నాముగదా?

## 10. జైనాలయము.

ఇది మార్గమునకుఁ గుడివైపునఁ గలదు. ఆలయముపైకి సోపానములున్నవి. స్తంభములపై నిల్చిన మండపమును పరిహారియు దక్షిణభాగమున రెండంతస్థుల వేరొకమండపమును దీనికిఁ గలవు. వెలుపల నొకస్థూపమున్నది. ఆలయమున విష్ణులీలలు చిత్రింపఁబడినవి. ద్వారములందు లక్ష్మీ విగ్రహములుగలవు. గరుడ ప్రతిమలు ద్వారపార్శ్వస్థలమున నిల్పఁబడియున్నవి. ప్రాకారగోడలు గజచిత్రచిహ్నితములు.

## 11. సుగ్రీవుని గుహ.

జైనాలయమున కెదురుగ నెఱ్ఱమట్టి చాఱలు సున్నపుఁ బట్టెలు గుఱుతుగలది. సుగ్రీవుఁడు సీతయాభరణములు దాఁచియుంచిన స్థానము. సీతచరణములని చెప్పఁబడు పాదములు రెండు గుహాంతరమున నొక బండపైఁ జెక్కఁబడినవి. రావణుఁడామెను గొనిపోవునప్పుడీగుహాముఖమున సీత తనపైఁటచెఱఁ గిచ్చెనఁట. అచ్చటికి వారలందులకు గుఱుతుగ గుహాద్వారమున నొకచాఱ చూపుచున్నారు.

## 12. స్థిరమైన వంతెన.

సుగ్రీవునిగుహ కావల నదివచ్చును. జనులు నదిని సుకరముగ దాఁటుట కనుకూలముగ నది నిర్మింపఁబడి యుండును. నదికడ్డముగఁ బొడవునను నిలువు స్తంభములపై ఱాలబండలు మండపాకృతిని బఱుపఁ

నగరమునందలి సమస్తాలయములలో నిది సర్వోత్తమ-
మైనది. గుడి లోపలను వెలుపలను ౧౫౧౩ మొదలు
౧౫౬౮ వ సంవత్సరమువఱకుఁగల శిలాశాసనము
లిరువది మూఁడింటికిఁ దక్కువలేక యున్నవి. ఇందు
స్పష్టముగఁ దెలియవచ్చు కొన్ని శాసనములనుబట్టి,
కృష్ణదేవరాయఁ డీయాలయము ౧౫౧౩లో నిర్మించి
మాన్యక్షేత్రము లుంచియున్నట్లును, నాతని భార్యలిద్దఱు
న [illegible] వ్యాఖ్యానమంటపముఁగట్టించి, స్వర్ణకలశములఁ
జేయించి, యాలయమునకు సమర్పించి నట్లును గ్రహిం-
పవచ్చును. శ్రీకృష్ణదేవరాయని యనంతర మచ్యుతరా-
య సదాశివరాయుల కాలమునఁ గూడ నీయాలయము
నిర్మింపఁబడుచునే యుండెను; కాని యిది ముగియనేలేదు.
విగ్రహ ప్రతిష్ఠయు జరుగలేదు. ౧౫౬౫వ సంవత్సరము
విద్యానగర భానుఁ డస్తమించిన కారణమున నాలయ
నిర్మాణకైంకర్య మంతరించెను. ఈయాలయము బొం-
బయి రాష్ట్రములోని షోలాపురమునందలి పండరీపుర
నాథునకయి నిర్మింపఁబడినట్లును పాండురంగ విట్ఠలుఁ
డీయాలయముఁజూచి భయపడి, యంతటి వైభవ సమ-
న్వితమగు నిర్మాణమున వసించునర్హత తనకు లేదని
యటనుండి పూర్వ నివాసస్థానమునకుఁ దరలి పోయిన-
ట్లును వదంతి. గుడిపని నిలిచిపోవుట కిదియు నొక
హేతువుగ జనులు చెప్పుకొనుచున్నారు.

౨. ద్వారములు—ఆలయ ప్రాకారమునందలి

సింహద్వారములుమూఁడును ప్రకృతము శిథిలావస్థలో నున్నవి. తూర్పువాకిలి ప్రమాదకరస్థితిలో నుండుటచే ప్రభుత్వమువారు దానిని మూసియుంచిరి.

3. కల్యాణమండపము—అన్ని దేవాలయములకు వలె దీనికిఁ గూడ, అమ్మవారిగుడియు నితరములగు మండపములును నున్నవి. గర్భాలయము యొక్కయు పార్శ్వ మండపములయు శిల్పపుఁబనినిగూర్చి యెంత శ్లాఘించినను దీఱదు. చూపఱ కద్భుత ప్రమోద దాయకమగు కల్యాణ మండపము గర్భగృహమునకు ముందఱ నమూల్యరత్నభూషణ సదృశముగ నున్నది. మహమ్మదీయులిందుఁ జాలభాగము ఖిలము చేసిరి. ఈ మండపముఁ బ్రవేశించుటకుముందు ద్వారపార్శ్వముల యందు తొండములు వ్రేలఁగ గొట్టఁబడిన యేనుఁగులు రెండు కాన్పించును. మండపాంతరమున దేవతల వివాహాది కైంకర్యములు జరుపుట కనువగు నున్నత వేదిక గలదు. అమ్మవారిశాలయందును దదితరమందిరముల యందును గల కరశిల్ప మత్యద్భుత మైనదే యైనను, నీమండపమునందలి కార్యకౌశలము గమనించిన పిమ్మట మఱేది చూచుటకును దలఁపొప్పదు. దక్షిణ హిందూ దేశమున నీమండప మద్వితీయమైనది. అగాధములు నభేద్యములునగు శిలలలో నిర్మింపఁబడిన దీని యొక్కొక స్తంభమును బదునైదడుగుల యున్నతముగలది. అందుఁ బ్రతి స్తంభమునకును నడుమ గుండ్రనికంబ మొకటియు,

దాని చుట్టును బెక్కు చిన్నని స్తంభములును నున్నవి. ముత్తమున నొక్కొక్క పెద్ద స్తంభమునను బదునాలు చిన్నని స్తంభములు నిర్మింపఁబడినవి. ఈ చిన్నకంబముల నొక రాతిముక్కతో ధ్వనిచేసినచో నం దొక దాని కంటె వేఱొకటి నాదభేదమును బొందుచున్నది. ప్రతి స్తంభమునందును సింహములు గుఱ్ఱములు మొదలగు వివిధవిధ చిత్రములన్నియు నొంటి రాతిలోనే చెక్కఁబడినవి. 'ఆకాలపుశిల్పి నైపుణ్య మెంత యుత్కృష్ట దశనందవలెనో యంతయును బొందిన' దని దీనిఁ జూచిన ఫర్గూసన్ వ్రాసియున్నాఁడు. గోడలపై గుఱ్ఱములు బాతులు లోనగు చిత్రములుగలవు. మీఁదిభాగమున రామాయణపు బొమ్మలున్నవి. రాతికంబముల నొండొంటిని జేర్చి యమర్చుటలోఁ జూపిన చమత్కారకౌశల మెంతని కొనియాడఁ గలము. ఇందలి నిర్మాణ విధాన వైఖరి నింతక లక్షించిచూడ నిందొక్కొక భాగమును దొలుత నొకకొయ్యలో మచ్చుచేసి చూచుకొని పిమ్మట నావిధమున రాతిలోఁజేసి పొందించినట్లు తోఁచుచున్నది. దివ్వెలు మొదలగువాని నుంచుటకు గుడి కప్పుల చూరులనుండి రాతిగొలుసులు వ్రేలుచుండెననియు నారాధకులు వానికి దీపపుఁ గుప్పెలు తగిలించుచుండిరనియుఁ దెలిసెడిని. ఇపుడా గొలుసులగపడవు. ఇందలి చిత్రపుఁ బని సర్వవిధముల హాజార రామాలయమునందలి శిల్పకళను బోలియున్నది. హాజార రామా-

లయము నిదియు నేకసమయమున నిర్మింపఁబడిన వగుట, నీయాలయముల రెండింట నొక్కే చిత్రకారుఁడే తన శిల్పకళాప్రావీణ్యము వెలయించెననవచ్చును. పూర్వము ద్వారములు ధ్వజస్తంభములు లోనగువానికి స్వర్ణలేపనముగల రాగిరేకుల తొడుగుల యాచారమయి యుండెనది. ఈపద్ధతియే శ్రీశైలదేవాలయమునఁ గూడ ననుసరింపఁబడినది. ఇనుముగాని కొయ్యగాని యొక లోహశంకువుగాని యుపయోగింపక ప్రాచీనశిల్పాచార్యు లీయాలయమును నిర్మించినవిధానమున కెంతయు నబ్బురముగల్గుచున్నది. అపూర్వ శిల్పకళావైభవమున నిట్లు రాణించు దేవసదన మింకొకటి యెచ్చటను గనంబడదు. పదునాఱవశతాబ్దమున శిల్పకళావిజ్ఞాన మెంతటి మహోన్నతదశ వహించెనో కనుఁగొనుటకు కింతకంటె సుస్పష్టమగు సాక్ష్యము వేఱె యుండదు. నాఁడు దీనికి పలకలకును గంబములకును, బొమ్మలకును, పలురంగుల వన్నెలు వేసిన జాడ నేఁటికిని గానవచ్చుచున్నది. ఇట్లు బహువిధచిత్రవర్ణసంశోభితమై, దీపికా సహస్రములు నిగ్గులు గులుక, వాద్యఘోషములు భూనభోంతరాళమునఁ జెలంగ, నీయాలయము మహోన్నతవైభవము నందుచుండి యానాఁటి సాయంసమయము లెట్లుండినవో గదా!

౮. రాతితేరు—ఆవరణమునఁ జిన్నని రాతి తేరున్నది. దానిముందు ఖిలమైన రాతి యేనుఁగులు రెండు కన్పట్టును. రథముచుట్టును స్త్రీలు చిలుకలపైఁ

కూరుచుండి వాని నడిలించుచుఁ దన్మార్గమునఁ దేరులను నడపుచున్నట్లు చెక్కఁబడిన చిత్రములు ముద్దులు మూటఁ గట్టుచున్నవి. తురుష్కులు నిలువునదహించుటచే రథ మంతయుఁ జీలిపోయినది. కొయ్యతేరునకునలెనే దీనికిని నాల్గు గోళ్ళున్నవి. వానికి బలమైన రాతి యిరుసులు రెండు గలవు. గానులు నునుపు బాఱి తరణిబట్టిన దారు ఫలకములను బోలియున్నవి. ఈ చక్రములఁ ద్రిప్పుట వలనఁ బుణ్యముగలుగు ననునమ్మకము జనులలో నధికము. యాత్రాపరులు విరివిగ వీనినిఁద్రిప్పుచుండుటచేఁ గానోలు నిరుసులు చాలవఱకు నరిగిపోయినవి. రథము నకుఁదూర్పున ఱాతిబృందావన మొండు వెలయును.

ఆ యపు పూర్వద్వారమున కెదురుగ నిరువంకల చావడులుగల వీథియొకటి యున్నది. దాని కుత్తరదిశ నొక శివాలయమును దక్షిణదిక్కున నొక మండపమును గలవు. ఈత్రోవ కొంతవఱకుఁ దూర్పుదిశగా వెళ్ళి, కమలాపురమునుండి యానెగొందికిఁ బోవును మార్గముతోఁ జేరి, యుత్తరముఖముగాఁ దిరిగి తలారిగట్టుచేరును.

---

## పదవ ప్రకరణము.

---

### ఆనెగొంది మార్గము.

#### 1. ఋష్యుల సమాధులు.

తలారిగట్టున జనులు గంపవంటి యొక గుండ్రని

పుట్టిలో నదినిదాఁటి యానెగొందికిఁ బోవుచుందురు. ఈ గట్టునకుఁ దూర్పున నదిమోరనే ఋషులసమాధులు తొమ్మిది కైంకర్యవిశేషముఁబొందుచు సుస్థితిలోనున్నవి.

2. అభినవ మండపము.

సమాధుల యావరణము దాఁటినచో నావల నొక నూత్నసౌధము కాన్పించును. ఈవలి యానెగొంది ప్రభుఁడొకఁడు వేశ్యారతుఁడై తనప్రియాంగనలతోఁ బండుఁ గాలము పుచ్చుచుండెను. ఈచోటు విడిచిపోవ్వఁ - నున్న నెన్నియోపద్యానములు కలలలో రాజునకెవ్వరో బోధించుచుండిరి. రాజది లెక్కింపలేదు. ఒకనాఁడు తుంగభద్ర యుప్పొంగుచు పాఱుచుండ నాతఁడు తన కామినులతో నావలి కరిగుండ నానెగొందికిఁ బడవలలో వెడలెను. నదీమధ్యమునఁ బడవలు మునుఁగుటచేఁ దన వేశ్యకచెలులతో నాన్నృపుఁడు ఁలసమాధిని గాం- చెను. అభినవ మండపముఁగూర్చిన జనశ్రుతి యిది.

3. ఆనెగొంది,

ఋషుల సమాధుల ప్రాంతమున తుంగభద్ర బండలపైఁ బ్రవహించును. అచ్చట నది యంతలోఁ- తుగలది కాదు. ఈభాగమున వేసఁగిలో దేనిసాయము నక్కఱలేకయే దాఁటనగును. బండలపైఁ బ్రవాహ పాత్రములవలనఁ దొలువఁబడిన బిలము లసంఖ్యాకములుగ నున్నవి. ఈచిత్రములఁజూచు మనకు, గతకాల యశోరమను చేరుకొనుటకు వ్యక్తముసేయలేక శిథిలకాయము-

లతో నిలిచియున్న ప్రాకారములనుగడచి, నైజాము రాష్ట్రమునఁగల యానెగొంది ప్రవేశింపనగును. ఈ గ్రామము చాలఁ జిన్నది; కాని పంపాపట్టణమునకంటె మిక్కిలి పెద్దది. భాష తెనుఁగు. రాజకీయ వ్యవహార భాష యురుదు. ఈ పురమున శ్రీరంగనాథాలయమును, రాజమందిరమును, అంతఃపుర సౌధమును నున్నవి. కచేరితోఁ దపాలచావడి చేరియున్నది.

### 4. గవి రంగనాయకులు.

ఆనెగొందికిఁ దూర్పున నొక మైలుదూరమునందు మార్గమునకు వామపార్శ్వమునఁ బర్వతశ్రేణిలో నొక గొప్పగవికలదు. దీపపుఁగాంతిసాయమున నందుఁబ్రవేశించి, గుహాంతరమునన్న రెండు విగ్రహములఁగాననగును. అచ్చట వాలితపస్సు చేసెననియు రంగనాయకుఁడాతనిఁ బ్రత్యక్షమై యభీష్టసిద్ధి గూర్చెననియుఁ బ్రతీతి. ఈ గుహాబిలమునఁగల యొకదారి ప్రయాణికులఁ బర్వతమాలిక యావలిదరిఁ జేర్చునఁట. ఈ సొరంగమున నచ్చటచ్చట నెంపప్రోవు లగపడుచుండుటచే నిది ఘాతుకమృగములకావాసస్థలమేమో యని పలువురు శంకించి యందుఁజొరనొల్లరు. మేము చివరసారి వెళ్ళినపుడు గవికడ్డముగ నొకపెద్దగుండు దొరలిపడియున్నట్లు వినినందున దానిఁజూడఁ దటస్థింపలేదు.

### 5. కాశీతపస్థలము.

రంగనాయకులగవికిఁ దరువాత వనదుర్గమున-

నే మార్గమునకు దక్షిణపార్శ్వమున నొక బూడిదగుట్ట యగపడును. ఆప్రాంతవాసు లిది వాలిభస్మరాశి యని యందురు.

6. పంపాసరోవరము.

పిమ్మట నరమైలుగడచినచోఁ బంపాసరోవరము వచ్చును. దీనిచుట్టు శోకహారణము మొదలైన శైలములావరించి పచ్చనిచెట్టుచేమలతోఁ గూడియున్నవి. ఉదితరపార్శ్వముల వరిపైరులు చెఱకుఁదోఁటలు నరఁటితోఁటలు నేత్రరంజకములయి యొసఁగును. పంపాసరోవరము స్వతస్సిద్ధముగ నేర్పడిన గుంటనికాసారము. వేఁగికాలమున నందు నీరుండదు. జలము సమృద్ధిగానున్న దినములలో నీసరోవరము బిసప్రసూన వితానములచే విరాజిల్లుచు, నత్యంతశోభనప్రదమై నయనానందకరముగ నెలారును. తీరమున లక్ష్మీనిలయమున్నది. దానికిఁ బార్శ్వభాగములలో మండపములున్నవి. అందిపుడు బైరాగులు కాపుర మున్నారు.

పంపాసరోవరమువిడిచి నైరృతిదిశగా సమీపమార్గమునఁ గొలనికి రెండుమైళ్ళదవ్వున నున్న పంపాపురఁ జేరి, యచ్చటికి సుమారమి యొకక్రోశదూరమునఁ గల కమలాపురమునందలి బసకుఁగాని, కడలై రామపుర మార్గమున మహమ్మదీయసమాధుల మూలమునఁ బంపాపట్టణమునకు మూఁడుక్రోసులలోనున్న కమలాపురవు రైల్వే స్టేషనునకుఁగాని వెళ్ళవచ్చును.

ఆర్యులారా! విద్యానగర శిథిలములఁ గూర్చిన విషయ మింతటితో ముగిసినది. నగర నిర్మాతలు కారయితలు శిల్పులు ప్రభువులు మంత్రులు లోనగువారెటుల కాలధర్మము నొందిరో వారి కృత్యములుఁ గూడ నావిధమునఁ గాలగతిని మిగులఁజాలక పోయినవి. ఈ జీర్ణనగరమును సాకల్యముగఁ జూడవలయు ననినఁ గొన్ని వారములయిన నచ్చుండవలసి యున్నది. శిథిల నిర్మాణముల నావరించియుండు మట్టిదిబ్బలు చెట్లు పొదలు మున్నగు వానినిఁ దొలఁగించుచుకున్న, ప్రమాదకర స్థితిలో నున్న ప్రాచీననిర్మాణములను బాగుచేయుటకును బ్రభుత్వమువారు విశేషధనము వ్యయముచేసియున్నారు. ఈశిథిలముల కకారణముగ నెవ్వరయిన నపాయము గలిగింపవచ్చుననియు, దేవాలయములు మొదలగు మహా నిర్మాణములలో ధనముండునను నాసతో సామాన్య జనులు వానికిఁ జెఱుపుఁ గలిగింపవచ్చుననియుఁ దలఁచి దొరతనమువా రిటకు నచ్చటచ్చటఁ గావలివాండ్ర నుంచియుండిరి. ఇపు డార్కియాలాజికల్ సర్వేయుద్యోగీయులా నగరమున ఖిలములయిన స్థానము లివియివి యీ యాచోటనున్నవని నిరూపించుటకుఁ దగినపటములు సిద్ధము చేసి, శిథిలనిర్మాణముల ఛాయాచిత్రములనుగూడఁ దీసియున్నారు. జీర్ణనగరమున నాల్గుత్రోవలు కలియు తావులలో నెల్ల చెక్కమార్గికలుంచి, యా మార్గముల గమ్యస్థాన నామములను గుర్తించియున్నారు. ఈసాధన

సముదాయముతో నీ విద్యానగర చరిత్రముఁగూడ పంపా పురీక్షేత్ర యాత్రాపరుల ప్రయాణ సౌలభ్యమున కన్ని విధములఁదోడై, ఖిలభాగముల యథార్థతత్త్వము పథికుల హృదయక్షేత్రమునఁ బాదుకొల్పుట కమూల్యమైన యాధారమగునని విశ్వసించుచున్నాము.

7. శిథిలాలయములు - మారణకర్మములు *

ధనాపేక్షచే శిథిలములకు నష్టముగావించువారిలలోఁ బ్రముఖులు తైరహింసాస్థానమునుండి వచ్చు బైరాగులు. వీరు భూగర్భమునుండి లభించు ధనలక్ష్మికి నరబలులను విధిగ నొసఁగుచుండిరి. ౧౯౦౭ వ సంవత్సరమున పంపాక్షేత్రమునందలి యొక దేవాలయ గర్భగృహమున, శిరచ్ఛేదమొనర్పఁబడిన యొక మానవుని కళేబరము పడియుండెను. ఇది బైరాగుల ఘోరకృత్యమే యనుట కావంతయు సందియములేదు. నఱుకఁబడినతల ముఖము వికృతమొనర్పఁబడి, గర్భాలయద్వారపు పైభాగమున వ్రేలఁగట్టఁబడియుండెను. క్రిందఁబడియున్న మొండెమునకుఁజుట్టును మారణహోమమునకుఁ దగిన కూష్మాండపూవులు రెండునారికేళఖండములు బూడిద మున్నగు పూజాద్రవ్యములును నగ్గిపెట్టియుఁ బడియుండెను. మనపూర్వులుగావించిన శిల్పకార్యములఁగూర్చి కొంత సంతసించినను, మతవైషమ్య భావమునను ధనాశచేతను నాశ్రియాశలాపముల వినాశమొందించిన, మహమ్మదీ-

* Madras District Gazetteer - Bellary.

యులను హింసాబై రాగులను నెంతని నిందింతము !

8. ఉపసంహారము.

పదునాలుగవశతాబ్ద మధ్యమున నొకటితరువాత నొకటిగ నభేద్యములుగ బారులుతీర్చి నిర్మింపఁబడిన ప్రాకారకుడ్యము లీవిద్యాపురీమతల్లికి రత్నహారసదృశ-ములుగ నుండియున్నను, నేఁడవి భిన్నమైనవి. వాని నడుమనున్న లోయలలోను నిమ్నోన్నత భూములలోను సమతలములలోను నిర్మానుష్యములైనవీథులు, శిథిలము-లైన దేవాలయములు, నేలచదనములైన రాచనగళ్ళు, వెనుకటి చక్రవర్తుల విషాదాంతచరిత్రముఁ దెలుపలేక మూఁగలై నిలిచియున్నవి. ప్రపంచమున నద్వితీయమగు మహానగరమొండు రచించుటకై జీవితమే సమర్పించిన యాప్రభువరేణ్యులను, మరుస్థలమును నందనవన తుల్య-ముగ నొనర్చుటకై విశ్వప్రయత్నములఁగావించి వాంఛి-తార్థ సిద్ధినిబడసిన యాయపర భాగీరథులను, కర్ణాటీ-య వీణాగానరసము వెలయ, సంగీతసాహిత్య మాధురీ కలస్వనము దిక్కులఁబ్రతిధ్వనింప, బంగరు గజ్జియలు గలుగల్లునమ్రోయ, విశ్వసమ్మోహనకరమైన దృగ్గాల-మునఁ బ్రేక్షకప్రపంచము తన్మయత్వమునొందఁ, నాంధ్ర భారతీలలనామణిచే విద్యానగర మహాసభాంతరాళమునఁ జిందులుద్రొక్కించి వినోదించి, తన్నగరనామము సార్థ-కమునొందించిన యా యాంధ్రభారతీసేవానురక్తులను నేఁడు కానరారు. ఆవాగ్వధూటిని జిహ్వాగ్రమున ని-

ల్పికొని. గాంగఝరీవేగమున భావపరంపరల విరజిమ్ము-
చు, నవరసానుప్రాణితమును నవ్యాలంకారసంశోభితమును
నగు వివిధవిధ కావ్యప్రపంచ సృష్టిని క్షణక్షణమువెలయించి, లోకహృదయము సమాకర్షించిన యాకవిబ్రహ్మల భౌతికస్వరూపము లాకాననభూముల నెచ్చటలీనమైనవోగదా? సంకల్పసిద్ధులు నుదారచరితులు నగు, నా సామ్రాజ్యచక్రవర్తులయు, కవిచక్రవర్తులయు జాడ లిప్పుడించుకేనియుఁ దెలియరావు. వారి మహత్తర కైంకర్యకలాపములు నేఁడు స్వప్నగతవృత్తములయినవి; కాని నిర్జీవములయ్యు సజీవములుగ విలసిల్లెడు నాకీర్తికాయుల పవిత్రాస్థిరాసు లెప్పటికైన జిగురింపవచ్చునను నడియాసతో, వారి నిరతము దనగర్భమున నిడికొని పరిరక్షించుచున్న యాపేర్మిసుధాపవిత్ర శ్రీవిద్యారణ్య మాత యొక్కతయే, యసంస్కృతములయి నలువలం గులఁజెదరిన మలీమసచికురజాలముతో, మలినకాయముతోఁ, జాలిముసుఁగులని జీర్ణాంబరముతో, బక్కచిక్కిన మేనితో, విచారభరిత స్వభావసూచకమగు విషణ్ణవదనముతో, దైన్యదృష్టులతో, నేఁడు మనకుగోచరించుచున్నది. ఆతల్లి మనోదుఃఖానలమును డిపి, యామెసంకల్పానువునుజగుఫ్పఁజేయు, చల్లనిచన్నాగమ మిఁకేనాఁటికేని సంప్రాప్తించఁజెల్లునే!

ఇది ఉత్తరభాగము సమాప్తము.

---

# —•విశేష పద సూచిక•—

# INDEX.

# తప్పొప్పుల పట్టీ

| పుట. | పఙ్క్తి | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౩ | ౧౦ | నిలయమై | నిలయమైన |
| ౮ | ౧౯ | ఆంజనీపుత్రతను | అంజనపుత్రతను |
| ,, | ౨౦ | అగుపడు | అగపడు |
| ౧౭ | ౯ | భస్త్రిపటలము | భస్త్రిభూతము |
| ౬౯ | ౧౧ | యూనెగోం రాజా | యూనెగోందిరాజా |
| ,, | ౧౪ | వేదసూక్తి | సూక్తి |
| ౨౦ | ౧౧ | జటగికొవలెనని | జరగతీర వలయునని |
| ౨౨ | ౧౯ | జీవగ్రాహులుగ | జీవగ్రాహముగ |
| ౩౦ | ౪ | అభూతస్వ్య | అభూతస్య |
| ౩౫ | ౧౧ | సాత్కనము | సాత్కత |
| ,, | ౧౮ | అజేయుండు | అజయ్యుండు |
| ,, | ౨౧ | నీసామ్రాట్టు | నీసమ్రాట్టు |
| ౩౬ | ౪ | నా న | నాతని |
| ౩౮ | ౨౨ | నమ్రహో సామ్రాట్టు | నమ్రహో సమ్రాట్టు |
| ౪౩ | ౧౪ | మహాగణపతి స్తవము | మహాగణపతి స్తవము |
| ౪౪ | ౭ | మాధవ్యము | మాధవీయము |
| ౪౯ | ౧౫ | ఓఢ్రకళింగ దేశములను | ఉత్కళకళింగ దేశములను |
| ౫౦ | . | గ్రహించుటనువలె | గ్రహించుటవలె |
| ౫౫ | ౨౦ | నిస్పందియము | నిస్పందేహము |
| ౫౬ | ౧౨ | నొక్కమ్మ | నొక్కమ్మడి |
| ౫౭ | ౧౯ | దండవ్యా | దండవ్యామాన |
| ౬౭ | ౧౫ | బైననే | బైనే |
| ౬౯ | ౨౦ | సామ్రాజ్యముకు | సామ్రాజ్యమునకు |
| ౭౨ | ౮, ౭ | జీవగ్రాహులనుగ | జీవగ్రాహముగ |
| ౭౪ | ౭ | యూధము | బలము |

| పుట. | పఙ్క్తి | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౧౭౧ | ౧౯ | సేలకు | సేలను |
| ౧౭౪ | ౩ | నౌసఁరి, | నౌసఁరి, రాముఁడు |
| ౨౧౩ | ౨౨ | గృతశ్చయులైరి | గృతనిశ్చయులైరి |
| ౨౧౧ | ౧౯ | సోమాన్వయూాఢి | సోమాన్వయాబ్ధి |
| ౨౧౪ | ౧౨ | -హామస్నగరము | అహామదున్నగరము. |
| ౨౬౧ | ౧౮ | సామాౖట్టులు? | సమాౖట్టులు? |
| ౨౬౩ | ౨ | చరిౖతము | చరిత్రము |
| ౨౬౯ | ౮ | బూరిగ | బూ౨గ |
| ౨౮౪ | ౪ | కోౖములు | కోసులు |
| ౨౮౫ | ౧౮ | సాగినవి కావు | సాగినది కాదు |
| ౨౯౧ | ౧౧ | యుచ్ఛ్నుండి | యుచ్ఛ్రితినుండి |
| ౨౯౪ | ౧౧ | గాండ్లవా స్త్రీ | గాండ్లవారి స్త్రీ |
| ౨౯౫ | ౧౪ | ప్రధాసమార్గము | ప్రధానమార్గము |
| ౩౧౧ | ౨౨ | దాటిస | దాటిన |
| ౩౧౫ | ౨ | ము డినది. | ముండినది. |
| ౩౧౮ | ౧౧ | ధారణు యి | ధారణులయి |
| ౩౨౨ | ౮ | నిర్మి పఁ | నిర్మింపఁ |
| ౩౩౪ | ౪ | టంకశాల | టంకసాల |
| ౩౩౪ | ౧౧ | సంతతి రావరణము | సంతతి పురావరణము |
| ౩౪౨ | ౧౩ | విఘణివేదిక | విపణివేదిక |
| ౩౪౯ | ౧౨ | సస్యమృద్ధి | సస్యసమృద్ధి |
| ౩౬౧ | ౨౧ | నిలుపు | నిలువు |
| ౩౬౨ | ౮ | రాజులురాభా | రాజులాభార |
| ౩౬౩ | ౧ | సర్వోత్తమ | సర్వోత్తమ |
| ౩౬౪ | ౧౦ | గోలదపై | గోడలపై |
| ౩౬౬ | ౧౯ | సందుచుండి | సందుచుండిన |
| ౧౮౦ | ౨౨ | కమలాపురపు | నాగలాపురపు |

---